తృతీయ భాగం

అంఆ

# అమ్మ సచ్చరిత్ర



జిల్లెళ్ళమూడి అమ్మ

## ఎ. కుసుమా చక్రవర్తి ఎమ్.ఎ.,బి.ఇడి.

(రిటైర్డు) టీచర్ ఆంధ్రాయూనివర్శిటీ హైస్కూల్, విశాఖపట్టణం.




# AMMA SACHARITRA

(THIRD VOLUME)

అమ్మలకెల్ల అమ్మయగుఅమ్మవు నీవెయటంచు లోకమం
దమ్మలు అయ్యలున్ పలువురార్తిని నిన్ కనుగొంచు శంకలన్
ఇమ్మహి బాపికొంచు తమ ఇక్కటులెల్లను తీర్చికొంచు నీ
గుమ్మము చేరి అర్మిలి కూర్చి భజించెదరో పరాత్పరీ !

- శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావు

Writer

AYYAGARI KUSUMA CHAKRAVARTHY

VISAKHAPATNAM

మొదటి ముద్రణ

వేయిప్రతులు

2002 ఏప్రిల్ 23

అమ్మ జన్మదినోత్సవం, జిల్లెళ్ళమూడి



వెల రూ॥ 100/-

ప్రతులకు

**ఎ.ఎస్. చక్రవర్తి**

అశోక్ హౌస్,

4-45-1, పెదవాల్తేరు

విశాఖపట్నం - 530 017

ఫోన్ : 0891 - 530346

కవర్ పేజి

**సూర్యా ఆఫ్‌సెట్,** ద్వారకానగర్, విశాఖపట్నం.

D.T.P. & Text Printing :

**సత్యం** ఆఫ్‌సెట్ ఇంప్రింట్స్,

46-18-10, మండావారిపేట,

దొండపర్తి, విశాఖపట్నం - 16.

ఫోన్ : **0891 - 735878, 713440.**

# కృతి సమర్పణ



**అమ్మ నాన్నగారు**

సాక్షాత్తు రాజరాజేశ్వరీ స్వరూపమైన మాతృశ్రీ అనసూయ మహాదేవికి,
పరమశివుడైన శ్రీనాన్నగారు బ్రహ్మాండం నాగేశ్వరరావు గారికి
అమ్మ సచ్చరిత్ర ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములను
సభక్తి పూర్వకంగా సమర్పించుకుంటున్నాను.

అమ్మ చరణ సేవలో

**అయ్యగారి కుసుమా చక్రవర్తి**

# శుభాకాంక్షలు

కందుకూరి శివానందమూర్తి

విశాఖపట్టణమందు, మాతృశ్రీ పూజా సర్కిల్ అను సంస్థ మాతృశ్రీ జిల్లెళ్ళమూడి అమ్మ పాలరాతి విగ్రహమును ప్రతిష్ఠించి ఆయమ్మను ఆరాధించుచున్నారు. అమ్మ జీవితచరిత్ర, అమ్మబోధలస్మరణ, వాటి ప్రచారము శ్రద్ధాభక్తులతో వీరు నిర్వహించుచున్నారు. మిత్రులు శ్రీ అయ్యగారి ప్రసన్నకుమార్‌గారి ద్వారా శ్రీ ఎ.యస్. చక్రవర్తిగారి కుటుంబ పరిచయము కలుగుట, ఆనాడు అమ్మను గూర్చి ప్రస్తావించుట జరిగినది. అమ్మతో గల వ్యక్తిగత పరిచయము జ్ఞాపకము వచ్చినది. కొంత భాషణము జరిగినది. విశ్వచేతనను మాతృమూర్తిగా భావనచేసి అంతర్యాగ, బహిర్యాగ సమన్వితముగా మోక్షోపాయమును ఉపాసించు శాక్తమతము మనకున్నది. అందుగల విధానములు, అందు సంభవించు పరీక్షలు ఆ యుపాసనను బహుకష్టసాధ్యముగా చేసినవి. ద్వంద్వాతీతమగు సత్యమునుపాసించుట కష్టతరము. ప్రతి మానవునికిని అత్యంత ప్రీతికరమగు మాతృస్వరూపమును ఉపాసించుచో, అది సర్వజన సంసేవ్యమానమై సులభతరముకాగలదు. అట్టి ఆర్ద్రత కలిగిన హృదయము, భక్తితాత్పర్యములు లభించుచో అమ్మనుపాసించుటకు మంత్ర, తంత్ర, యోగములనావశ్యకములే కాగలవు. అందుకు సత్యము, ప్రత్యక్షము అగు జగన్మాతృమూర్తి అంశయొకటి లభించినచో అట్టి శ్రద్ధాభక్తులు కలిగిన సహృదయులకు అది కొంగు బంగారమే. అమ్మ సచ్చరిత్ర తృతీయ భాగమును వెలువరించుటలో శ్రీమతి కుసుమకుమారి కృతకృత్యురాలైంది.

'జిల్లెళ్ళమూడి అమ్మ' అనుపేర మనమెరిగిన ఈ అనసూయమ్మ త్రిమూర్తులను శిశువులనుగా చేసిన అనసూయాదేవి యవతారమే కావచ్చును. ఈ యమ్మ భక్తులను, ఉపాసకులకు శ్రీమాతయు, శ్రీ మహారాజ్ఞియు, గురుస్వరూపిణియు కాగలదనుట అతిశయోక్తి కానేరదు. ఈ భక్తజనులు భాగ్యవంతులు.

శ్రీ మాత్రేనమః

9-4-2002




మధుర స్మృతులు - ఆవిష్కరణ
శ్రీ కొండముదిరామకృష్ణ అన్నయ్య




అమ్మ సచ్చరిత్ర - ద్వితీయభాగం ఆవిష్కరణ
డా॥ ప్రసాదరాయ కులపతి, కుసుమా చక్రవర్తి,
శ్రీ బి. రామబ్రహ్మం గారు, ప్రెసిడెంట్ - శ్రీ విశ్వజననీ పరిషత్

మహాయోగి - మంత్రశాస్త్ర కళానిధి - కవికులఋషి

**డాక్టర్ ప్రసాదరాయకులపతి**
శ్రీనాథ పీఠాధ్యక్షులు, గుంటూరు

## ఆశీస్సు

ఎక్కడెక్కడ అత్యధికమైన విభూతి కనిపిస్తూ ఉంటుందో అది నా తేజస్సు యొక్క అంశ వలన సంభవించినదే అని భగవద్గీతలో కృష్ణుడు అర్జునునకు చెప్పాడు. సిద్ధులు, యోగులు, తపస్సులు ఆ కోవకు చెందినవారే. జిల్లెళ్ళమూడిలోని మాతృశ్రీ అనసూయాదేవిని ఆ విభూతి వ్యక్తిగా ఎందరో దర్శించారు. ఒక సత్యాన్ని స్థాపన చేయటానికి తార్కికులు ప్రత్యక్ష - అనుమాన - ఆప్తవాక్యాలను ప్రమాణాలుగా స్వీకరిస్తారు. ఈ మూడు మార్గాలలో విషయ సేకరణ చేసి శ్రీమతి కుసుమకుమారి ఈ గ్రంథ సంపుటాలను వెలయించారు. చాలా శ్రమకోర్చి ఓపికతో ఎందరెందరి అనుభవాలనో సేకరించి గ్రంథస్థం చేసి మరుగున పడిపోయిన ఎన్నో విశేషాలను అభిమానులకు పునస్మరణలోనికి తెచ్చారు. అమ్మ భౌతిక శరీరంతో ఉన్న రోజుల్లో ఆనాటి నా అనుభవాలను 'అంబికా సాహస్రి' అనే గ్రంథం ద్వారా తెలియజేసాను. అమ్మ పాంచభౌతిక దేహాన్ని విడిచిన తర్వాత కొన్ని సార్లు నాకు కలిగిన దర్శనానుభవాలను అప్పుడప్పుడు ఆయా సందర్భాలను అనుసరించి ప్రసంగవశాన పలికానుకూడా.

ఇటీవల అమ్మ పుట్టినరోజు వచ్చినపుడు అర్ధరాత్రి మంత్రమార్గాన్ననుసరించి అమ్మను అవాహన చేశాను. మూసిన కన్నుల ముందు చీకటి తెరలు చీల్చుకొని వెన్నెల వెలుగులో సాక్షాత్కరించి తన

సందేశాన్ని ఇచ్చింది. అయితే అప్పుడు జరిగిన ఒక విచిత్రం ఇప్పటికీ మనస్సులో మెదులుతున్నది. మా తమ్ముడు ఆంజనేయప్రసాద్ మనుమరాలు 'అలేఖ్య' సంవత్సరం బాలిక ఆ సమయంలో మేడ మీద నిద్రిస్తున్నది. ఆ బాలిక సూక్ష్మ శరీరం మేడమెట్లు దిగి క్రిందికి వచ్చి నా ధ్యాన మందిరంలో ప్రవేశించి అమ్మకు నమస్కరించింది. "నీవిక్కడకెందుకు వచ్చావు?" అని అడిగాను. "నేను అమ్మ భక్తురాలిని. మరణానంతరం ఇది అమ్మ భక్తుల కుటుంబం కావటం వల్ల నేను మళ్ళీ ఇక్కడ పుట్టాను. అమ్మ ఇక్కడకు రావటం నాకు తెలిసి దర్శనం చేసుకుని నమస్కరిద్దామని వచ్చాను" అన్నది. భౌతికంగా చూస్తే ఆ బాలికకు ఇంత ఆలోచించే శక్తి లేదు! కాని ఆమె సూక్ష్మ శరీరానికి తదాశ్రితమైన మనస్సుకు ఈ స్మృతి ఉన్నదన్నమాట. దివ్య భూమిక నుండి అమ్మ ఇలా సాధకులకు, భక్తులకు దర్శనం ఇవ్వటం అప్పుడప్పుడు జరుగుతూనే ఉన్నది. కనుక ఇప్పుడు కూడా ఆ "అనసూయాదేవి" ఆశ్రితకల్పవల్లిగా అలరారుతూనే ఉన్నది. అటువంటి అద్భుతమూర్తిని గురించిన ఈ గ్రంథం రచించిన శ్రీమతి కుసుమకుమారిని అభినందిస్తూ ఇది సహృదయులకు ప్రీతిపాత్రం కాగలదని విశ్వసిస్తున్నాను.

ప్రసాదరాయకులపతి



అమ్మ సమక్షంలో
అయ్యగారి రాధాకృష్ణ ఉపనయనం



చక్రవర్తి దంపతులు, అనూరాధలచే పూజ

అవధాన సరస్వతి, కవి పంచానన, **పేరాల భరతశర్మ**

పూర్వాధ్యక్షులు : విజయనగరం మహారాజ ప్రభుత్వ సంస్కృత కళాశాల
వ్యవస్థాపకులు : శ్రీ విశ్వనాథ సాహిత్యపీఠం

# ఇది అక్షరాలా అమ్మ వెన్నెల

ఇది అమ్మ సచ్చరిత్ర. అమ్మ ఎప్పుడూ 'సత్' పదార్థమే. 'సత్' యొక్క స్త్రీ రూపము అమ్మ. పుం రూపము అయ్య. సకల సృష్టికి మూలము జగన్మాతాపితరులు. ప్రతి ప్రాణిలోని ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు వారి అధీనమే. వారి ప్రసాదమే. 'సత్' - మిగిలినదంతా 'అసత్' - 'సత్' అనగా 'ఉన్నది'. అసత్ - లేనిది. శరీరములు అసత్. ప్రాణము - ఆత్మ - సత్ దాని చేత లేని జగత్తు ఉన్నదనిపిస్తుంది. ఆత్మ రూపమైన సత్పదార్థము లేకపోతే ఏ శరీరము శరీరము కాదు. నిర్జీవము. తన సత్స్వరూపముతో అమ్మ ఒక శరీరం ధరించి ఉన్నా ఆమె ఆ శరీరంతో జరిపిన లోకయాత్ర అంతా సత్ శక్తితోనే - సత్ - చైతన్యంతోనే. శరీరం పుట్ట - పుట్ట శిథిలమైనా అందులోని కుండలినీ - శక్తి - సత్ పదార్థాం - మృతి లేనిది అది అమృతమయం. ఉపాధి చేత ఆమె జిల్లెళ్ళమూడిలో ఆకారంతో కనిపించినా, ఇప్పుడా ఆకారం లేకపోయినా ఎప్పుడూ ఉన్నది - తత్ - త్వమ్ - అయం - వాడు, నీవు, ఈ నేను - అన్న వ్యవహారంలోని తత్త్వంలో ఉన్న 'నేను' "అన్నీ నేనే అనిపిస్తుంది".

నేనేనంటే యీ అనసూయనే కాదు అందరిలో వున్న నేను" అని అమ్మ (103 పే. 1వ భాగంలో) అనటం - ఇప్పటికే సత్యమే! 'సత్' భావమే సత్యము. అట్టి సత్యము 'అమ్మ' రూపంలో మన మధ్య గోచరించినప్పుడు మన జీవితాలతో ఆమెకు గల అనుబంధాల, అనురాగాల, ఆప్యాయతల చరిత్రయే "అమ్మ సచ్చరిత్ర".

ఆమె మహిమలు, ఆమె చర్యలు, ఆమె సూక్తులు ఒక వెలుగును ఒక సత్యమును, ఒక అమృతమును మనకు అందించినవి. అవి స్మరించుకొన్న కొలది మనకొక ఆత్మ విశ్వాసము, ధైర్యము, బలము చేకూరతాయి.

ఇది ఒక జాతికి, ఒక కులానికి, దేశానికీ, ప్రాంతానికీ పరిమితమైనది కాదు.

విశ్వమంతా నెలకొని ఉన్న సత్యము. సకల జీవరాసులలో సజీవంగా అనుక్షణం గోచరిస్తున్నది. ఇది నిరంతర, సనాతన నిశ్చల తత్త్వము.

దీని యొక్క అక్షర రూపమైన నిరూపణమే ఈ గ్రంథము యొక్క లక్ష్యము. మనకు సుబోధకంగా ఉండే రీతిలో ఆయా ఘట్టాలలో అమ్మ పలికిన పలుకులు, నవ్విన నవ్వులు, కురిపించిన కృపావర్షములు, చూపిన తార్కాణములు, జీవిత సత్యములు క్రోడీకరించి శ్రీమతి కుసుమాచక్రవర్తిగారు ఈ సచ్చరిత్ర సమకూర్చారు. ఇది ఒక ధారావాహిక – రెండు భాగాలు ఇంతకు ముందు వెలువడినవి. ఇప్పుడిది మూడవ భాగము. మరింక ఎన్ని భాగములైనా రావచ్చు. ఎన్ని వచ్చినా ఒక ప్రవాహము అలా ప్రవహిస్తున్నట్లే. ఈ సంపుటములన్నీ రేవులు. మన అవగాహనకు స్నాన ఘట్టాలు అనువుగా ఉండాలి గదా! అందుకే ఈ సంపుటాలలో భాష తీపితెనుగు తేటతేనెలా సాగింది. ఒక చల్లని తోటలో నుండి ప్రవహించే నదిలో స్నానం ఎంత సుఖంగా ఉంటుందో ఈ గ్రంథం చదవటం ఆరంభిస్తే చాలు పాఠకుడు అంత ఆనందిస్తాడు. ఎవరెవరో ఎందరెందరో అక్కయ్యలు, అన్నయ్యలు, మావయ్యలు, పిన్నులు, బాబాయిలు ఆ నదిలో అమ్మ ధ్యానంలో ధ్యాసలో మున్నుమునిగి తన్మయులైనారో వారిలో తానూ ఒక్కడైపోతాడు.

'అమ్మ సచ్చరిత్ర' కలిగించే అనుభూతి ఎదటనే వుండి ఆమె పలుకరిస్తున్నట్లే ఉంటుంది. ఆమె శరీరంతో కనిపించినా కనిపించకపోయినా ఆమె మాటలు గుండెను తాకుతూనే వుంటాయి. పండితుడూ పామరుడూ కూడ ఇవి ఏవో తాము ఎప్పుడో ఎక్కడో చెప్పుకున్న ముచ్చటలుగానే అనుకుంటాడు.

ఇంత భక్తితో అమ్మకు అక్షరసేవ చేస్తూ తన్ను తాను తరింపచేసుకుంటూ ఎందరో భక్తులను తరింపచేస్తున్న శ్రీమతి కుసుమకుమారిగారు ధన్యురాలు. ఆమె శ్రీవారు చక్రవర్తిగారు అమ్మకు అల్లారు ముద్దు బిడ్డ. ఆ తల్లి దయ ఆ దంపతుల జీవితాలలో వెన్నెలలు కాసింది. ఆ వెన్నెల వెలుగులే అక్షరములై "అమ్మ సచ్చరిత్ర"లో లీనమైనాయి.

1.6.2001





అమ్మ సన్నిధిలో
తలంబ్రాలు, బ్రహ్మముడి (అమ్మచే)
వరుడు: చి॥ అన్నంరాజు సీతారామారావు
వధువు : చి॥ల॥సౌ॥ అనూరాధ

# ఒక్కమాట

అన్నాప్రగడ లక్ష్మీనారాయణ

మాతృశ్రీ అనసూయాదేవి మహావిప్లవకారిణి. ఏ రంగంలోనైనా, విప్లవాత్మకమైన భావాలు వెల్లడించడం గాని, విప్లవాత్మకమైన మార్పులు తేవడంగాని తేలిక గావచ్చు. కాని ఆధ్యాత్మికరంగంలో విప్లవభావాలను వెల్లడించడాన్ని ఈ ప్రపంచం అంత తేలికగా ఆమోదించదు. దీనికి అనేక కారణాలున్నాయి. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు, మతసాంప్రదాయాలు, ఋషి సాంప్రదాయాలు ఎన్నో సిద్ధాంతాలు మరెన్నో పూర్వపక్షాలు మతాల శాఖలు అనే పేర్లుతో మన మనస్సులను దృక్పధాలను కొన్ని ఇనుప చట్రాలతో బిగించి వేసారు. అమలులో ఉన్న ఆధ్యాత్మిక సాంప్రదాయ పద్ధతుల నుండి, సిద్ధాంతాల నుండి ఎవరు ఎప్పుడు ఏ మాత్రం విభేదించినా, ఉరిమి చూడడం మనకు అలవాటు. మన నరనరాల్లో జీర్ణించుకొనిపోయాయి ఇటువంటి సనాతన సంప్రదాయాలు. ఈ ఉక్కు సంకెళ్ళను ఛేదించుకొని మాతృశ్రీ కొన్ని విప్లవాత్మకమైన భావాలను దేశం మీద వెదజల్లారు. పాత సిద్ధాంతాలను ప్రశ్నించారు.

సృష్టి అనేది పరిణామశీలము. సృష్టి సర్వమూ మార్పును అంగీకరించవలసిందే. అన్ని రంగాలలోనూ పురోగమనం అభివృద్ధి అనే పేరుతో కాలానుగుణమైన మార్పులను మనం అంగీకరించాం. అనేక రంగాలలో ముఖ్యంగా విజ్ఞాన రంగంలో, సాహిత్య రంగంలో, సాంస్కృతిక రంగంలో, సామాజిక రంగంలో కాలక్రమేణా అనేక మార్పులు చేర్పులూ వచ్చాయి. సైన్సులో కూడా పాత సిద్ధాంతాలలోను సనాతన విశ్వాసాలలోను కొన్ని తప్పుల తడకలనీ, తరువాత వచ్చిన శాస్త్రజ్ఞులు ఋజువు చేసారు. అదేవిధంగా అనేక రంగాలలో అనుకోని ఊహించని మార్పులు, చేర్పులూ చోటు చేసుకుంటూ వచ్చాయి. ఆధ్యాత్మికశాస్త్రం గూడా మహామహుల అనుభవాల క్రోడీకరణ మాత్రమే. "అనుభవాలు శాస్త్రాన్ని ఇస్తాయే గాని

శాస్త్రం అనుభవాన్ని ఇవ్వదు" అని అమ్మ చెప్పింది కదా! ఆధ్యాత్మికరంగంలో గూడా తరువాత వచ్చిన అనేకమంది మహామహులు తమ స్వీయ అనుభవాలు ప్రతిపాదించడం జరిగింది. వేద ఋషులతో సమానమైన ఆ మహామహుల అనుభవాలను కాదనటానికి, ఎవ్వరికీ సాధ్యం కాదు. కేవలం శాస్త్రపాండిత్యం గాక, అనుభవ జ్ఞానమే ఆధ్యాత్మిక విజ్ఞాన చరిత్రలో సమకాలిన విజ్ఞానాన్ని ప్రాతిపదికగా చేసుకొని, ఆధ్యాత్మిక పరిభాషను మార్చివేసింది.

కృతయుగంలో పతంజలి మహర్షి యోగసూత్రాలను రచించిన తరువాత యుగాల క్రమంలో యోగశాస్త్రంలో అనేక మార్పులు, చేర్పులూ వచ్చాయి. సైన్సు గూడా అభివృద్ధి చెందుతూ వచ్చింది. అన్ని శాస్త్రాల బాటలోనే ఆధ్యాత్మిక శాస్త్రం గూడా అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఈ శాస్త్రంలో గూడా అనేక మార్పులు చేర్పులూ వచ్చాయి. శంకర రామానుజ మధ్వాచార్యులు, క్రీస్తు, బుద్ధుడు, మహావీరుడు, రామకృష్ణ పరమహంస, తులసీదాస్, సూరదాస్, కృష్ణచైతన్య, రమణ మహర్షి, అరవిందయోగి ఆదిగా గల మహాత్ముల యోగానుభవాలను ప్రాతిపదికగా చేసుకొని, అనేక నూతన యోగీ సిద్ధాంతాలు, భక్తిమార్గాలు ప్రచారంలోనికి వచ్చాయి. ఈ నూతన మార్గాలన్నీ అశాస్త్రీయమైనవని, ఆచరణ యోగ్యం కాదనే ధైర్యం ఎవరికుంటుంది?

ఉపనిషద్ ఋషుల అనుభవాలను ఏమాత్రం తీసిపోని, తన స్వీయ అనుభవాలను, ప్రాతిపదికగా చేసుకొని మాతృశ్రీ అనసూయాదేవి కొన్ని కొత్త కొత్త ఆధ్యాత్మిక సిద్ధాంతాలకు శ్రీకారం చుట్టారు. వాటిని కాదనటానికి అంతంత మాత్రం వారెవ్వరికీ ధైర్యంచాలదు.

అలాగే అమ్మ పునర్జన్మల మీద, పాపపుణ్యాల మీద, సృష్టి రహస్యం మీద, వివాహ వ్యవస్థ మీద, సాధన ప్రక్రియ మీద, మానవత్వం మీద, సమాధిస్థితి మీద, మనస్సు స్వరూపం మీద, పూర్ణత్వం మీద, బ్రహ్మచర్యం మీద, మంత్రసిద్ధుల ప్రదర్శన మీద, ఇంకాఎన్నో, మరెన్నో, పేరుకుపోయిన పూర్వ విశ్వాసాల మీద, తన అనుభవాలను, అనేక భావాలను నిర్భయంగా నిర్మొహమాటంగా, నిర్ద్వంద్వంగా వెల్లడించారు.

అమ్మకు శాస్త్ర పరిచయం తక్కువగావటం, శాస్త్ర పరిభాష అబ్బకపోవటం మన అదృష్టం. స్వచ్ఛమైన ఆధ్యాత్మిక సత్యాలను, అంతకంటే స్వచ్ఛమైన తన స్వీయానుభవాలను అమ్మ మనకు అందించటానికి సాధ్యపడింది. అమ్మనుండి స్వచ్ఛమైన, కల్తీలేని ఆధ్యాత్మిక సత్యాలు, అంతకంటే స్వచ్ఛమైన అచ్చతెలుగులో మనందరికీ అంది పుచ్చుకున్నట్లు దొరికాయి. అమ్మకే గనుక శాస్త్ర పరిభాష అబ్బివుంటే "శాస్త్రజ్ఞానం బహుక్లేశం చిత్తభ్రమణ కారణ" అన్నట్లు యదార్థం. శాస్త్ర గుహాంతరాళాల్లో చిక్కుపడిపోయేదే! అనుభవాన్ని మాటల్లో చెప్పేటప్పటికి యదార్థం కొంత మరుగున పడుతుంది. ఇంకా శాస్త్ర పరిభాష గూడా తోడైతే వేరే చెప్పాలా! అమ్మను గురించి మన కెవ్వరికీ, మనలో ఎవ్వరికీ తెలియని అనేక విషయాలు కుసుమక్కయ్య సోదాహరణంగా, సుమనోజ్ఞంగా మన ముందు ఆవిష్కరింపచేసారు. అందుకు అమ్మ భక్తులు ఆమెకు ఎంతో కృతజ్ఞత తెలపాలి. ఈ రచన చదువుతుంటే, మనకు తెలియకుండానే మన మనస్సులోని సుతిమెత్తని పొరలు స్పందించే ఘట్టాలెన్నో ఇందులో ఉన్నాయి.

ఇది అమ్మ సచ్చరిత్ర. నిజమైన అమ్మ చరిత్ర. సత్ పదార్థపు చరిత్ర. అందులో ముచ్చటైన మూడవ భాగం చిటారు కొమ్మన చివరకు పండిన పండు అనుభవించమే మనందరివంతు. ఇటువంటి తీయటి రచనలు ఈ కలం నుండి ఇంకారావాలి. వస్తాయి. అస్తు

అన్నాప్రగడ లక్ష్మీనారాయణ M. Com A.P.E.S

**అన్నాప్రగడ లక్ష్మీనారాయణ,**
రీజనల్ జాయింట్ డైరెక్టర్ ఆఫ్ ఎడ్యుకేషన్ (రిటైర్డు),
29-27-15 సూర్యనారాయణ వీధి,
సూర్యారావు పేట, విజయవాడ - 2.



శ్రీ ఎ.యస్. చక్రవర్తి గారు
అనూరాధ, మాధవి, శ్రీచరణ్, గీత



ఫిబ్రవరి 17 శ్రీనాన్నగారి ఆరాధనోత్సవం
ధాన్యాభిషేకం - చక్రవర్తి దంపతులచే

# నా మాట

బ్రహ్మాండం రవీంద్రరావు

"అనుకోకుండా వైజాగ్ కుసుమక్కయ్య దగ్గర నుంచి ఒక ఉత్తరం వచ్చింది. అందులోని విషయం 'అమ్మసచ్చరిత్ర' తృతీయ భాగానికి ముందుమాట నేను వ్రాయాలని".

ఆశ్చర్యంగాను, కొంత విచిత్రంగాను అనిపించింది. నన్ను తెలిసిన వారందరికి తెలిసిన సత్యం ఇది. నేను ఎప్పుడూ రచనలు చేయలేదు. ఉపన్యాసాలు ఇవ్వలేదు.

కానీ ఇటీవల కాలంలో పూజ్య సోదరులు శ్రీ బులుసు సత్యనారాయణ శాస్త్రి గారు రచించిన "తెలుగులో మహావాక్యం" గ్రంథానికి ముందుమాట వ్రాయమని అడిగారు. మొదటిసారిగా ఆ సాహసం చేసాను. ఆ స్ఫూర్తితోనే అనుకుంటా కుసుమక్కయ్య తన గ్రంథానికి ముందుమాట వ్రాయమని అడిగింది. కుసుమక్కయ్య, చక్రవర్తిగారు చాలాకాలంగా జిల్లెళ్ళమూడి వస్తూ అమ్మతో, సంస్థలో వారందరితో అనుబంధం పెంచుకున్నవారే. మాతృశ్రీలో కుసుమక్కయ్య రచనలు చదువుతుండేవాడిని. తరువాత పుస్తకాలు కూడా ప్రచురించి నాకు ఇచ్చింది. వాటిని ఆమూలాగ్రం చదివాను. ఎంతో శ్రమ కోర్చి ఎందరో సోదర సోదరీమణులను స్వయంగా కలిసి వారి అనుభవాలను, వారు ఎవరి ప్రేరణ చేత ఎలా మొదటిసారి అమ్మను దర్శించుకున్నది తెలుసుకొని గ్రంథస్థం చేసి అమ్మ సచ్చరిత్ర రెండు భాగాలు ప్రచురించింది. ఇప్పుడు తృతీయ భాగం వస్తున్నది.

సహజంగా జిల్లెళ్ళమూడి వచ్చేవాళ్ళు అమ్మతో వారికున్న అనుభవాలను వెల్లడి చేయటానికి ఇష్టపడరు. కానీ కుసుమక్కయ్య అందరి దగ్గర నుంచీ

అనుభవాలను సేకరించిన విధానం మా అందరినీ ఆశ్చర్యపరిచింది. ఇది తెలుసుకున్న నాకు చాలా సంతోషం కలిగింది.

మాతృశ్రీ జీవితమహోదధిలో తరంగాలు మూడు భాగాలు కూడా అమ్మ బాల్యంలోని సంఘటనలకే పరిమితమైంది. తరువాత సంఘటనలు వెలుగులోకి రావలసినవి ఎన్నెన్నో వున్నాయి. అందులో కొన్ని సంఘటనలను, కొందరు సోదరసోదరీమణులకు అమ్మతో కల అనుబంధాన్ని సేకరించి మూడు భాగాలుగా ప్రచురించటంలో కుసుమక్కయ్య కృతకృత్యురాలైంది. అందుకు అందరూ ఋణపడే ఉంటారు. రాబోవు తరాలకు ఇది ఎంతో ఉపయెగపడుతుందని నా విశ్వాసం.

వ్రాయటం చేతగాని నాచేత ఈ నాలుగు మాటలూ వ్రాసే అవకాశం నాకు కల్పించిన సోదరి కుసుమకు అభినందనలు. అభివందనాలు తెలియచేస్తూ అమ్మకు నమస్కరిస్తూ విరమించుచున్నాను.

బ్రహ్మాండం రవీంద్రరావు



అమ్మ పూజ
పూజా సర్కిల్ సభ్యులు



విశాఖ అమ్మ మందిరంలో సంకీర్తన
పద్మావతక్కయ్య బృందంచే




# కుసుమతపస్సు



పురుషోత్తమ పుత్ర భార్గవ
పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్

అమ్మ 'తపనే తపస్సు' అన్నది. కుసుమ అమ్మ సచ్చరిత్ర వ్రాయటానికి, ప్రచురించటానికి ఎంత తపన పడ్డదో. అమ్మతో అనుబంధం ఉన్నవాళ్లు లక్షలు దాటారు. దేశవిదేశాలలో ఉన్నారు. నిజానికి సృష్టే అమ్మ కనుక సృష్టి మొత్తం అమ్మతో అనుబంధం ఉన్నదే. అయితే లౌకికంగా ఆలోచిస్తే అమ్మను చూచిన వారు లక్షలు దాటారు. అనుభవాలు పొందిన వారు కొన్ని వేలమందైనా ఉంటారు. వారి వారి అనుభవాలు వచ్చే తరాల వారికి అందించాలనే తపన కుసుమకు కలిగింది. అది ఆమెకు కలిగిందా? ఆ సంకల్పం అమ్మే ఇచ్చింది. అమ్మ భాషలోనే చెప్పాలంటే ఆ 'తరుణం' వచ్చింది. లేకపోతే కుసుమ మాత్రం తాను ఇంతింత గ్రంథాలు వ్రాస్తాననుకొన్నదా? ఆమెకే తెలియని విషయం. అవును మరి 'తరుణం అంటే తప్పించుకుందామన్నా తప్పనిది'. నేనూ అమ్మ చరిత్ర వంద పేజీలలో వ్రాయాలని ప్రయత్నిస్తున్నాను. వీలు పడిందా. లేదే! అమ్మ కరుణ లేదనుకునేదా! కాదే! తరుణం రాలేదు. కుసుమకు వచ్చింది. తప్పించుకోలేకపోయింది. కనుక ప్రయత్నం కూడా మనది కాదేమో! ప్రయత్నం వెనుక ప్రేరణ అర్థం కావటం లేదు. మన చేతులు వ్రాస్తున్నాయి. కనుక మనం వ్రాశామనుకుంటున్నాం. కాని చేతికి వ్రాయించే శక్తి గురించి ఆలోచించం. చేతులు ముడుచుకొని కూర్చుందామన్నా కూర్చోపటం కూడా మన చేతుల్లో లేదు. అందుకే అమ్మ "నీ చేతలు నీ చేతుల్లో లేవు" అన్నది.

సోదరి కుసుమ అమ్మ ఇచ్చిన అనుభూతులను మహిమలను కష్టపడి

ఊళ్ళుతిరిగి సోదరి సోదరుల నుండి సేకరించింది. ఇంకా చెయ్యవలసినంత చెయ్యలేకపోయాననే అనే బాధ కూడా ఉన్నది. కావచ్చు మహోదధిలో తరంగాలు ఒకటి వెంట ఒకటి వస్తూనే ఉంటాయి. అనిర్వచుడైన భగవంతుని నిర్వచించటానికి చూస్తున్నాం. అమ్మ కూడా "ఈ మహత్యాలతో నిలబడే నమ్మకం ఎంత కాలం ఉంటుంది నాన్నా!" అని అంటుంది అమ్మ. కాని విశ్వాసం బలంగా నిలవటానికి తొలిమెట్టు మహిమలతో అనిపిస్తుంది. ఏదో ఒక ఆకర్షణ లేకపోతే ఆ వ్యక్తి దగ్గరకు పోలేముకదా! సామాన్య మానవుని శక్తి వంద క్యాండిల్‌బల్బ్ అనుకుంటే ఒక యోగి శక్తి వెయ్యి కాండిల్‌బల్బ్‌గాను, ఒక అవతార వ్యక్తి దగ్గర ఎన్ని లక్షల కోట్ల రెట్లు వెలిగే కాంతి ఆకర్షణ ఉంటుందో చెప్పలేం. అందువల్లనే వారి వద్దకు జనం విరగబడుతుంటారు. దుర్నిరీక్ష్యమైన ఆ శక్తి దగ్గరకు పోవాలంటే వారి కరుణ కావాలి. అలా కరుణ పొందిన వ్యక్తి కుసుమ. కుసుమమీదే ఎందుకు కరుణ కలగాలి? అని మీరడగరాదు. ఎందుకంటే అమ్మ కరుణకు కారణం లేదు అకారణ కరుణామయి కదా! అమ్మ.

నమ్మకం విశ్వాసం నిలవాలంటే ఏదో ఒక విశేషమో, మహిమో కలగాలన్నాను కదా! ఒక చిన్న ఉదాహరణ చెపుతాను. ఒక కమ్యూనిష్టు పార్లమెంటు మెంబరు వీరమాచనేని ప్రసాదరావు అని ఉన్నాడు. వారి కొడుకుకు కోడలికి యాక్సిడెంట్ జరిగింది. కోడలికి మెదడు నరాలు దెబ్బతిని బ్రతుకదనుకున్నారు. ఆ సమయంలో ఎవరో మిత్రుడు వారికి అమ్మ కుంకుమ తీర్థము తెచ్చి ఇచ్చి ఆ కోడలికి ఇప్పించారు. ఆ తర్వాత అమ్మే వైద్యుడుగా రావటం శస్త్రచికిత్స చేయటం వారి మనోయవనికలో దర్శించారు. తరువాత అమ్మతో, శ్రీపాదవారితో కలసి సంభాషించి అమ్మ విశ్వజననీత్వాన్నీ, అఖండ చైతన్యదీప్తిని గుర్తించారు. సామ్యవాద మిత్రులు ఇట్లా చెడిపోయావేమిటి? అని ప్రశ్నిస్తే మూఢనమ్మకాలు ఎంత తప్పో, మూఢఅపనమ్మకాలు కూడా అంతే తప్పు. అని వారికి వివరించాడు. కనుక మహిమలు అనుభవాలు

ఇతరుల మనసుల మీద మంచి ముద్రవేస్తాయి. లేకపోతే సినిమాలలో నాటకాలల్లో సక్కుబాయి, సీత పడ్డ కష్టాలను చూచి మన కళ్ళవెంట నీళ్ళెందుకు రావాలి. నీకేమన్నా కష్టం వచ్చిందా? రాలేదే! అది అనుభూతి. ఆ అనుభూతిని పొందటానికి ఈలాటి గ్రంథాలు అవసరం ఉన్నది. సద్గ్రంథాలు మంచి మిత్రులు అని చెపుతారు. పెద్దలు. కొందరు తమకు ఏ కష్టం వచ్చినా, ఏ అనుమానం వచ్చినా రామాయణ, భాగవతాలు చదువుతుంటారు. మనశ్శాంతి పొందుతుంటారు. అనుమానాలు తీర్చుకుంటుంటారు.

అలాగే అమ్మ సచ్చరిత్ర చదివితే మీకు మనశ్శాంతి లభిస్తుంది. మనసు తేలిక పడుతుంది. చక్కని అనుభూతి నిలుస్తుంది. ఒక మంచి మిత్రుడుగా మీకు ఉపయోగపడుతుంది. అమ్మ సచ్చరిత్ర జగచ్చరిత్ర. జగచ్చరిత్రే అమ్మ సచ్చరిత్ర. జగత్తంటే సృష్టేకదా! సృష్టికి మూలమే కాదు అమ్మే సృష్టిగా పరిణామం చెందింది. అందుకే అమ్మ "సర్వం చైతన్యమే - జడం లేదు" అని చెప్పింది. "పరిణామమే కాని నాశనం లేదు" అని అన్నది.

ఈ గ్రంథంలో అమ్మ దగ్గరకు వచ్చిన వారి భక్తి ప్రపత్తులతోపాటు కొన్ని చారిత్రక సత్యాలు కూడా చోటు చేసుకున్నాయి. రిచర్డ్ అమెరికా నుండి వచ్చి అమ్మను చూచి ముగ్ధుడై అమ్మను గూర్చి ఆంగ్లభాషా పఠితల కోసం ఒక పెద్ద గ్రంథం వ్రాశాడు. దానికి 'మదర్ ఆఫ్ ఆల్' అని పేరు పెట్టాడు. భారతదేశంలో ఉండే సమయం పూర్తి అయినందు వల్ల మాతృదేశం వెళ్ళవలసి వచ్చింది. అమెరికాలో ప్రచురిస్తానన్నాడు ఆ గ్రంథాన్ని. అమ్మ రిచర్డ్ తొందరగా మళ్ళీ వచ్చేట్టు చూస్తానన్నది. అలాగే రప్పించింది. గ్రంథం ఈ దేశంలోనే ప్రచురింపబడింది. ఇక్కడే కాదు అమెరికాలో కూడా ఇంకా అనేక రసవత్తర ఘట్టాలను పొదవుకొని రీప్రింట్ అయింది.

మనం మరచినా అమ్మ మనల్ని మరవదు అనే విషయానికి ఉదాహరణగా విశాఖపట్టణ నివాసి శరభలింగం గారి కుటుంబంలో జరిగిన సన్నివేశాలు

స్పష్టమైన ఉదాహరణలు. అమ్మ నిదర్శనాలివ్వటమే కాక వారు భౌతికంగా చూడని హైమ కూడా దర్శనాలు ప్రసాదించటం ఆశ్చర్యం.

జేమ్స్ కాంపియన్ జిల్లెళ్ళమూడి సోదరులకు చిరపరిచితుడు. మైక్‌సెట్ పెడుతుంటే కరెంటు షాక్ కొట్టి పడిపోతూ 'అమ్మా' అని బిగ్గరగా కేక వేశాడు. అంతే జేమ్స్‌ను ఆ కరెంటు ఏమీ చేయలేకపోయింది. అలాగే ఒకసారి జీవితం మీద విసిగిన గుంటూరు వాసి రామరాజు కృష్ణమూర్తి కావాలని కరెంటు ప్లగ్‌లో తన చేతి వ్రేళ్ళు పెట్టాడు. షాక్ కొట్టి పడిపోయాడు. తర్వాత అమ్మ వద్దకు వస్తే అమ్మ జరిగిన సన్నివేశాన్నంతా వివరించి అలాటి పిచ్చి పనులు చేయవద్దని వారించింది. భక్తుల వెంట భగవంతుడు "గోవు వెంట తగులు కోడెభంగి" ఉంటాడుట.

గోపాలన్నయ్య జిల్లెళ్లమూడిసంస్థ సేవలో అమ్మ సేవలో పునీతమైన వ్యక్తి. అమ్మ గోపాలన్నయ్యతో నీవిక్కడ పనిచూసుకో నీ ఇంటి విషయం నేను చూచుకుంటాను అని హామీ ఇచ్చింది. అలాగే ఎన్నో యాక్సిడెంట్లయిన సందర్భాలలో కూడా అమ్మ అతన్ని రక్షించింది. నక్సలైట్లు పడ్డప్పుడు వాళ్ళు గోపాలన్నయ్యను శూలం పెట్టి పొడిచినా, రైలులో ప్రయాణం చేస్తున్నపుడు రైలు యాక్సిడెంట్ అయి పట్టాలు తప్పినా గోపాలన్నయ్య మాత్రం క్షేమంగా ఉండటం ఆయన అదృష్టం కాదు. అమ్మ రక్షణే.

అమ్మను పరీక్షించటానికి వచ్చే వారి సంఖ్య కూడా తక్కువేం కాదు. ఎవరికి ఏ రీతిలో వారి మనసుకు నచ్చేటట్లు సమాధానం చెప్పాలో అమ్మకు తెలుసు. ఒక దూదేకుల సాయిబు అన్నం పళ్ళెం తెచ్చినపుడల్లా అన్నంలో ఉమ్మేసేవాడు. అమ్మకు దురదగుండాకుతో పూజ చేసాడు. ఒకరోజు. పూజానంతరం లేవబోయాడు. లేవలేకపోయాడు. బుద్ధదిగింది. అమ్మ కరుణించి చీరాల డాక్టరుగారు దేనికో ఏ జబ్బుకో సంబంధించి తెచ్చిన మందుపొట్లాం ఆయన జేబులోనిది తెప్పించి వేసి తగ్గించింది. అమ్మ లీలలు అద్భుతాలు, ఆశ్చర్యకరాలు.

గ్రంథరచయిత సోదరి కుసుమ తెలుగు ఎం.ఎ. పాసుకావటమే ఒక ఆశ్చర్యకర సంఘటన. 'వివాహేచ విద్యనాశాయ' అని ఆర్యోక్తి. అలా కాకుండా వివాహమయిన పదిసంవత్సరాల తర్వాత పి.యు.సి నుండి మొదలుపెట్టి యం.ఎ. పరీక్షలు పాసయ్యేదాకా అమ్మ వెంటబడి చదివించింది. బి.యిడి., చదివించింది. ఉద్యోగం చేయించింది. కుటుంబానికి అవసరమైన సమయంలో భర్తకు చేదోడు వాదోడుగా ఉంచింది. అమ్మ అందుకే చెబుతుంటుంది. పనికి ఆడపని మగపని అని తేడాలేదు నాన్నా! అవసరమే అన్నిటికన్నా విలువైనది. పరిస్థితులే గురువు. అందువల్ల కుసుమ ఏంచేయాలో ముందే అమ్మ నిర్ణయించింది. అమ్మకు భూత భవిష్యద్వర్తమానాలన్నీ వర్తమానాలే కనుక అమ్మకు మన జీవితాలు తెరమీద కనిపించినట్లు కనిపిస్తాయి.

కుసుమ సోదరుడు అన్నంరాజుమురళి జీవితం చాలా విచిత్రమైన మలుపులు తిరిగినది. సమర్థుడు సాహసవంతుడైన కూడా త్రాగుడుకు బానిసై మంచి ఉద్యోగాన్ని వదిలేశాడు. అతని భార్యకు రెండవ కాన్పు తర్వాత జుట్టు పూర్తిగా ఊడిపోయింది. డాక్టర్లు తమ అశక్తతను వెలిబుచ్చారు. వెంకటరమణుడికి మ్రొక్కు తీర్చలేదని జుట్టు ఊడిపోయిందని శ్రీమతి బాధపడుతున్నది అని అమ్మకు చెప్పాడు. అమ్మ మ్రొక్కు తీర్చలేదని ఆడదాని జుట్టు తీసుకునేవాడు దేవుడెట్లా అవుతాడురా! అని ఆ అమ్మాయి తలను ప్రేమతో నిమిరింది. అ మర్నాటి నుండే జుట్టు రావటం మొదలైంది. మామూలుగా వచ్చింది. నీవే వెంకటరమణుడివి నీకే మ్రొక్కు తీరుస్తాము అన్నాడు మురళి. నీకా నమ్మకముంటే అలాగే అని మూడు కత్తెరలు వేసి మ్రొక్కు తీసుకుంది. అలా అమ్మ తన పట్ల విశ్వాసం కలవాళ్ల పట్ల కల్పవృక్షంగా కామధేనువుగా ఉన్న సంఘటనలెన్నో.

చక్రవర్తిగారికి వ్యాపారంలో మెళుకువలు, సలహాలు ఇచ్చి వ్యాపారాన్ని ఏ రకంగా చేసుకోవాలో, ఎలా అభివృద్ధి పరుచుకోవాలో తెలియచేసింది.

జీవితంలో ఎటువంటి విపత్కారపరిస్థితులలో కూడా వారు నిరాశకు, నిస్పృహకు లోనుకాకుండా కొండంత అండగా నిలచి వారి జీవితాలకు చక్కటి మార్గ నిర్దేశికత అయింది అమ్మ.

అమ్మతో అనుబంధం గల ఎందరి జీవితాలలోకో కుసుమ తొంగిచూచింది. వారి అంతరంగ తరంగాలను లోకానికి అందించింది. అమ్మ వద్దకు వచ్చినవారు అమ్మలో తమ ఇష్టదైవాన్ని చూశారు. అమ్మను అమ్మగా దర్శించినవారు, ఒక సమాజసేవామూర్తిగా చూచినవారు, విశ్వకుటుంబానికి బీజాలుగా వేసిన ప్రవక్తగా భావించిన వారూ లేకపోలేరు. ఆఖరికి సమసమాజ నిర్మాణమే మా ధ్యేయం అన్న కమ్యూనిష్టులు కూడా అమ్మ వద్దకు వచ్చిన తర్వాత అలవోకగా ఏ ప్రత్యేక ప్రయత్నము లేకుండా అమ్మ సాధిస్తున్న అద్భుత సోదర సోదరీ భావం, కులమత, వర్గ, వర్ణ విచక్షణ లేని సౌహార్ద్రం చూచి ఆశ్చర్యపోయి అవనత వదనులై ఆనందించారు. జిల్లెళ్లమూడి వచ్చిన వారికీ, రానివారికీ ఉన్న తేడాను కూడా వాళ్ళ ఇండ్లకు వెళ్ళినపుడు చూడవచ్చు. వచ్చినవారి ఇండ్లలో అమ్మ వేసిన ముద్రతో ఆదరణ ఆప్యాయతలకు కరిగిపోతాం. అలాంటి సన్నివేశాలెన్నో దర్శించవచ్చు ఈ గ్రంథంలో, వారి వారి జీవితాలను అమ్మ ఎట్లా తీర్చిదిద్దిందో చూడవచ్చు.

మహిమలను గూర్చే కుసుమ తన గ్రంథాలలో వివరించింది. కాని అమ్మ తాత్విక దృక్పథం వివరించలేదనే వారికి కూడా సమాధానాలు ఈ గ్రంథంలో లేకపోలేదు. అమ్మ వాక్యాలను ఉపనిషత్తులు గీత వంటి గ్రంథాలతో సమన్వయం చేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. కాకపోతే విశ్వాసం కలగటానికి, అని అనను కాని బలపడటానికి తొలి దినాలలో ఈ మహిమల ప్రాముఖ్యం ఎక్కువే. అయినా మానవులు ఎక్కువ భాగం నిదర్శనాలు కోరుకుంటారు. భక్తి వైపే మొగ్గు చూపుతారు. జ్ఞానచింతన వైపు చూసేవారు తక్కువే. ఏదైనా అమ్మ కలిగించాల్సిందే. ఆ విశ్వాసం కూడా అమ్మ ఇవ్వాల్సిందే.

ఈ పుస్తకం చదివిన వారికి, పారాయణ చేసిన వారికి కావలసినది అనే కంటే వారికి అవసరమైనది అమ్మ ఇస్తుంది. మీరు పూర్తిగా చదవండి–చదివించండి. ఇతరులకు కూడా వివరింపచేయండి. అమ్మ దృష్టిలో అందరూ సుగతిని పొందుతారు. కాస్తముందూ, వెనుకగా. మన దృష్టిలో అమ్మ వద్దకు వచ్చినవారు ముందుగా సుగతిని పొందుతారు. మిగతా వారికి కూడా ఆ అవకాశం కల్గించటానికి ఈ రచన, ఈ గ్రంథ పఠనం దోహదపడుతుంది.

అమ్మ సాహిత్యంతో జన్మరాహిత్యం కాదన్నది. కాని సాహిత్యం కూడా అమ్మ పాదాలపై పుష్పంగా సమర్పింపబడుతున్నది. ధన్యమేకదా! ఆ రకంగా సార్థకమైంది. ద్వంద్వాలున్నంత వరకు ఆరాధ్యము– ఆరాధన తప్పదు. అదే కుసుమచేస్తున్న పని. అక్షర సుమాలతో అర్చన ఇది. చక్రవర్తిగారు కుసుమను చెయ్యిపట్టుకొని ఏడడుగులో, ఏడులక్షల అడుగులో, ఏడేడు జన్మలో (ఉంటే) నడిపిస్తున్నా, ఇద్దరినీ కలిపి నడిపిస్తున్న శక్తి అమ్మదే – కుసుమకు ఆ విషయం తెలుసు. అందుకే కుసుమ తపస్సు ఫలించి 'అమ్మసచ్చరిత్ర' కల్పవృక్షానికి మరోమధురఫలం లభించింది. ఆస్వాదించండి – ఆనందించండి.



విశాఖ అమ్మ మందిరంలో
రవి అన్నయ్య - వైదేహిలచే అర్చన




విశాఖ అమ్మ మందిరం
పూజా సర్కిల్ సభ్యులు

ఈ పుస్తకం చదివిన వారికి, పారాయణ చేసిన వారికి కావలసినది అనే కంటే వారికి అవసరమైనది అమ్మ ఇస్తుంది. మీరు పూర్తిగా చదవండి–చదివించండి. ఇతరులకు కూడా వివరింపచేయండి. అమ్మ దృష్టిలో అందరూ సుగతిని పొందుతారు. కాస్తముందూ, వెనుకగా. మన దృష్టిలో అమ్మ వద్దకు వచ్చినవారు ముందుగా సుగతిని పొందుతారు. మిగతా వారికి కూడా ఆ అవకాశం కల్గించటానికి ఈ రచన, ఈ గ్రంథ పఠనం దోహదపడుతుంది.

అమ్మ సాహిత్యంతో జన్మరాహిత్యం కాదన్నది. కాని సాహిత్యం కూడా అమ్మ పాదాలపై పుష్పంగా సమర్పింపబడుతున్నది. ధన్యమేకదా! ఆ రకంగా సార్థకమైంది. ద్వంద్వాలున్నంత వరకు ఆరాధ్యము– ఆరాధన తప్పదు. అదే కుసుమచేస్తున్న పని. అక్షర సుమాలతో అర్చన ఇది. చక్రవర్తిగారు కుసుమను చెయ్యిపట్టుకొని ఏడడుగులో, ఏడులక్షల అడుగులో, ఏడేడు జన్మలో (ఉంటే) నడిపిస్తున్నా, ఇద్దరినీ కలిపి నడిపిస్తున్న శక్తి అమ్మదే – కుసుమకు ఆ విషయం తెలుసు. అందుకే కుసుమ తపస్సు ఫలించి 'అమ్మసచ్చరిత్ర' కల్పవృక్షానికి మరోమధురఫలం లభించింది. ఆస్వాదించండి – ఆనందించండి.

# విజ్ఞప్తి

అమ్మ చరిత్ర రాయవలసిన ఆవశ్యకత గురించి ముందు రెండు భాగాలలో వివరించటం జరిగింది. "చరిత్ర నిలుస్తుంది. ఈ నేను నిలవకపోవచ్చు, మీకు కనిపించకపోవచ్చు. తరతరాల మిగిలేది చరిత్రే గాని, నేను మిగలను. చరిత్రే శాశ్వతంగా, ఎల్లకాలం నిలుస్తుంది. ఈ నేను మాత్రం అన్ని నేనులూనేనైనా నేను" లో కలసిపోవచ్చు. కానీ చరిత్ర కలవదు. నా అది-నేనున్నప్పుడే లేదది- ఆదిగా వుంది. ఈ నేను ఆ ("అపరిమితమైననేననే") స్పృహతో వుంటుంది. ఆ కనపడుతున్న దానికి బద్ధంగా ఉన్నట్లు, పరిమితిగా ఉన్నట్లు కనపడుతుంది" అని చరిత్ర యొక్క ఆవశ్యకతను వివరించింది అమ్మ.

శిలలనే భావాన్ని శిల్పంగా మార్చేది సాహిత్యం. సాహిత్యం భావానికి రూపాంతరం. కనుక శిల్పంలాటి భావమే సాహిత్యమై, శిలగా వున్న వ్యక్తుల భావాలను ఈ సాహిత్యమే శిల్పంగా మారుస్తుంది. లక్ష్యాన్ని సాధించటానికి, కావలసిన రూపకల్పన చేసి లక్ష్యసాధనకు నడుంకట్టించే ప్రేరణ మహాత్ముల సాహిత్యంలో వుంది. అందుకే మహాత్ముల చరిత్రలు మానవుని ఉనికికి కరదీపికలు.

ఆయా కాలానుగుణంగా ఆదిశక్తియైన పరమేశ్వరి తన సృష్టి దారి తప్పి వక్రమార్గాన పయనిస్తున్న వేళ సరిదిద్ది, జాగ్రత్త పరిచి, యుగధర్మాన్ని కాపాడేందుకు ఆవిర్భవిస్తుందన్నది నిత్య సత్యం.

ఇందలి సంఘటనలు అయా వ్యక్తుల వద్ద నుంచీ స్వయంగా సేకరించినవి. పాత మాతృశ్రీ పత్రికల నుండి, శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య వ్రాసిన "మాతృసంహిత" నుండీ గ్రహింపబడినవి, కొన్నిచోట్ల మారిస్తే అందం చెడిపోతుందని వాటినే స్వీకరించడం జరిగింది.

వారి విలువైన సమయాన్ని వెచ్చించి వారి "శుభాశీస్సులను" అందించిన శ్రీ సద్గురు శివానందమూర్తి గారికి కైమోడ్పులను ఘటిస్తున్నాను.

కవికుల ఋషియై దేశ విదేశాలలో పేరు ప్రఖ్యాతులార్జించిన డా॥ ప్రసాదరాయకులపతిగారు "ఆశీస్సు"ల నందచేయటం నా పూర్వజన్మ సుకృతము వారికి హృదయపూర్వక నమస్కృతులను అర్పిస్తున్నాను.

బ్రహ్మశ్రీ పేరాల భరతశర్మగారు రాసిన "ఇది అక్షరాలా అమ్మ వెన్నెల" అన్న శీర్షిక శరన్నవరాత్రులలోని పున్నమి వెన్నెలలా చల్లదనంతో అలరించినది. వారికి నా మనఃపూర్వక నమఃసుమాంజలులు.

అమ్మను ఒక్కొక్కరు ఒక్కోకోణంలో దర్శిస్తారు. విప్లవ శంఖారావం పూరించిన అమ్మను "ఒక్కమాటలో" అమ్మను విశ్లేషించిన శ్రీ అన్నాప్రగడ లక్ష్మీనారాయణగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

నా మీద అభిమానంతో అడిగిన వెంటనే కాదనక 'నా మాట' రాసిన బ్రహ్మాండం రవీంద్రరావుకు నా ఆశీస్సులను అందచేస్తున్నాను.

ప్రతి విషయానికి తన అమూల్యమైన సలహాలను ఎప్పటికప్పుడు అందిస్తూ "కుసుమ తపస్సు" అన్న పీఠికనందించిన శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయ ప్రసాద్ అన్నయ్యకు సహస్రాధిక వందనాలు.

నాకు తగు రీతిలో ఎప్పటికప్పుడు తన సహాయసహకారాలందించటమే కాక గ్రంథమును ఎప్పటికప్పుడు విమర్శిస్తూ, సమీక్ష చేసిన శ్రీవారు ఎ.ఎస్. చక్రవర్తిగారికి త్రికరణ శుద్ధిగా సుమహారాన్ని అర్పిస్తున్నాను. పై వారి ఆశీస్సులు, విశ్లేషణలు ఈ గ్రంథానికి వన్నె తెచ్చాయనటంలో ఎటువంటి సందేహం లేదు.

విశాల హృదయంతో అమ్మ యందలి భక్తి ప్రపత్తులతో ముద్రణకు ఇతోధికంగా తోడ్పడిన **J. Ramesh Kumar** (Ashok Pharmaceuticals, Chennai) గారికి, సోదర సోదరీమణులకు నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

నా గ్రంథ సాపుపత్రిని తయారుచేయుటానికి సహకరించిన కుమారి

రామలక్ష్మికి, శ్రీమతి అనసూయకు, ఎప్పటికప్పుడు శ్రమకోర్చి ప్రూఫులు దిద్దిన మా కోడలు అయ్యగారి ఉమాదేవికి ఆశీస్సులు.

కవర్‌పేజీని సర్వాంగ సుందరంగా అందించిన "శ్రీ సూర్యా ఆఫ్‌సెట్" శ్రీ సూర్యంగారికి, సకాలంలో అతి ఆకర్షణీయంగా ముద్రించిన "సత్యం ఆఫ్‌సెట్ ఇంప్రింట్స్" అధినేత ఎమ్.కె. కుమార్‌గారికి, వారి సిబ్బందికి ప్రత్యేక ధన్యవాదాలు. ముఖ్యంగా పుస్తకం వెలువడటానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్న కుమారి డి. హిమబిందుకు నా దీవెనలను అందచేస్తున్నాను.

అమ్మ సచ్చరిత్ర ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగాలను వ్రాయటానికి ఉపకరణంగా నన్ను ఎన్నుకున్న అమ్మకు ఈ అక్షరపూజా పుష్పాలను సమర్పిస్తున్నాను.

అమ్మ చరణసేవలో

**అయ్యగారి కుసుమాచక్రవర్తి**

# అనుక్రమణిక

* * *

# అమ్మ



విశాఖమందిరం

# అమ్మ సచ్చరిత్ర

1940లో ఏవూరి కరణం ఆవూరిలోనే వుండాలని జి.ఒ వచ్చింది. అందువల్ల నాన్నగారి కుంటుంబం జిల్లెళ్ళమూడి తరలి వచ్చింది. అప్పుడు కరణం జీతం 7 రూపాయలు దానితో కుటుంబాన్ని నెట్టుకు రావాలి. వాళ్ళకు కావాల్సిన ధాన్యం వూళ్ళోవాళ్ళు ఇచ్చేవారు. నాన్నగారి తాతగారు శేషయ్యగారు వారి స్వగ్రామమైన రేటూరులో వుండేవారు.

శ్రీనాన్నగారు వాళ్ళు వెళ్ళేటప్పటికి అగ్రహారీకుల స్థలం వుంది కాని ఇల్లు కట్టించుకోవాలి. ఈలోగా ఖగ్గారామయ్య ముందు ఇంట్లో 2 గదులలో అమ్మా వాళ్ళు కాపురం వుండేటట్లు నిర్ణయమయింది. సుబ్బారావన్నయ్య 6 నెలల పిల్లవాడు, ఆ పిల్లవాడ్ని తీసుకొని అమ్మ బాపట్ల నుంచి గుర్రం బండిలో జిల్లెళ్ళమూడి వచ్చింది. ఆ ఇంట్లో నుంచీ చూస్తూ కొంత దూరంలో హనుమంతుని దేవాలయం కడితే బాగుంటుందన్నది అమ్మ. అది చాలా చిన్న కుగ్రామం. అక్కడ ఒక్క దేవాలయం కూడాలేదు. ఊళ్ళో వాళ్ళు ఈ మధ్యే రామాలయాన్ని అమ్మ ఆవరణకు ఎదురుగా కట్టటం జరిగింది. అక్కడ నిత్యం అమ్మ జీవిత చరిత్ర పారాయణ జరగటం విశేషం.

రేటూరులో 4 ఎకరాల భూమిలో రామయ్య వాళ్ళ వ్యవసాయం చేసి 2 పుట్ల ధాన్యం పండించి పాతర పోసారు. నాన్నగారికి ఇల్లు కట్టించి అందులో నాన్నగారి కుంటుంబాన్ని ప్రవేశపెట్టారు. అమ్మ మామూలు పల్లెటూరి స్త్రీల మాదిరిగా ఇల్లు అలుక్కోవటం, గొడ్లపాక శుభ్రం చేసుకోవటం, పిడకలు చేయటం, చెఱువుకు వెళ్ళి నీళ్ళు తేవటం, వంట చేసి నలుగురికి పెట్టటం చేసేది, ఎవరితోనూ మాట్లాడేది కాదు తన పని తాను చేసుకుపోయేది.

అమ్మ నిండుచూలాలుగా వున్నప్పుడు మరిడమ్మ తాతమ్మను సాయం

వుంచి కనకమ్మ బామ్మ, నాన్నగారు బాపట్ల వెళ్ళారు. ఆ తెల్లవారుఝామున అమ్మకు నొప్పులు ప్రారంభమైనాయి. పక్కనే వున్న రామయ్య భార్య వూళ్ళో వాళ్ళకు చెపితే వెంటనే నులకమంచం మీద అమ్మను పడుకో బెట్టి బాపట్లకు మోసుకు వెళ్ళారు. అక్కడ ఆసుపత్రిలో డాక్టరుకు చూపించారు. అంతా సవ్యంగానే వుంది. 11గం॥లోపు ప్రసవమౌతుందని చెప్పారు. డాక్టరు చెప్పినట్లుగానే జరిగింది.

ఖగ్గారామయ్య పొగాకు బేరన్లు రెండు కట్టించి ఒకటి నాన్నగారికి ఇచ్చాడు. రెండోది తను అట్టేబెట్టుకున్నాడు. రెండూ పక్కపక్కనే వుండేవి. అమ్మ పొగాకు బేరన్లో కూడా పనిచేసింది.

1956 నుంచి అమ్మ దైవత్వాన్ని గుర్తించి వూళ్ళ, సింగుపాలెం, బాపట్ల, రేటూరు, చీరాల నుంచి జనం రావటం ప్రారంభించారు. రామయ్య భార్య రక్తవిరోచనాలతో బాపట్ల ఆసుపత్రిలో చనిపోయింది. ఆ తరువాత కూతురు చనిపోయింది. అప్పుడు జిల్లెళ్ళమూడిలో మున్సబుగా చేసినతను 1800రూ॥ రెవెన్యు డబ్బు వాడేసాడు. అందుకని అతనిని ఆ పదవిలో నుంచి తీసివేసారు. వూళ్ళ మున్సబుగారే జిల్లెళ్ళమూడికి మున్సబుగా వున్నారు.

బాపట్ల నుంచీ వచ్చినాయన "మీలో ఎవరైనా మున్సబుగా అప్లికేషన్ పెట్టండి, మీరింతమంది వుండి వూళ్ళ మున్సబు రావాల్సిన పని ఏమిటి?" అని రామయ్య చేత అప్లికేషన్ పెట్టించాడు. ఒంగోలు రావల్సిందిగా కాగితం వచ్చింది, తనకేమి తెలియదు సరే ఎలాగా అని ఒంగోలు వెళ్ళాడు. "జమా బందీ అంటే ఏమిటి?" అని అడిగారు. "వచ్చిన సొమ్ము, ఖర్చు అయిన సొమ్ము" అని చెప్పాడు "ఆమాత్రం తెలుసు కదా!" అని అన్నారు.

అప్పటికి మూడు సం॥లుగా జిల్లెళ్ళమూడిలో పన్నులు కట్టించుకోలేదు. తాశీల్దారుగారు సిబ్బందితో వచ్చి రామయ్య మున్సబు పరీక్షరాయక ముందే

అతని చేతిలో ఆర్డరు పెట్టి జప్తు చేయవలసిన భూములున్నాయని చెప్పారు. పరీక్ష కూడా రాయకుండా నేనేమి చేయగలనని తన అశక్తతను తెలియచేసాడు. "అంతా కరణంగారు చూచుకుంటారు నీవు సంతకం చేయటమే" అన్నారు.

అమ్మకు కులమత భేదాలులేవు. నాన్నగారు కూడా వారందరిలో ఒకరిగా కలిసిమెలిసి వుండేవారని చెప్పారు. వ్యవసాయం చేసుకుంటూపొగాకు బేరన్‌లో పని చేసుకుంటూ మునసబు పరీక్ష పాస్ అవటం అంతా అమ్మదయ అని అతని విశ్వాసం. "లేకపోతే నేనేమిటి? పరీక్ష పాస్ అవటం ఏమిటి?" అని అన్నారు. అమ్మ మాతృశ్రీ విద్యాలయం పెట్టాలని అంటే తన మండువా ఇంటిని పక్క స్థలాన్ని ఇచ్చిన వదాన్యుడు.

+ + +

చాకలి పెద్దమ్మ తన చిన్న తనంలోనే జిల్లెళ్ళమూడి వచ్చింది. ఇప్పటికి 4 తరాల నుంచీ వాళ్ళు జిల్లెళ్ళమూడిలోనే వున్నారు. పెళ్ళి అయి వెళ్ళినా 18 సం॥లకే భర్త పెద్ద కొడుకు చనిపోవటంతో 2సం॥ల పిల్లవాడిని తీసుకొని పుట్టింటికి వచ్చింది. చిన్న వాడి పేరు శంకర్. రెండున్నర సంవత్సరాలప్పుడు కొబ్బరి ముక్క తీసుకున్నాడని యోగయ్య అన్నయ్య వాడి వీపుమీద రెండు చఱుపులు చరిచాడు, దానితో పిల్లవాడు నేలకు కరుచుకుపోయాడు. అంతా పిల్లవాడు చచ్చిపోయాడని కేకలు వేశారు. ఆ గుంపును తోసుకుంటూ పెద్దమ్మ వచ్చి "నా పెద్దకొడుకు, భర్త పోయినేను ఏడుస్తున్నాను. ఇప్పుడు ఈ పిల్లాడ్ని కుడా నాకు లేకుండా చేస్తావా?" అని రోదించింది.

అది విని అమ్మ "ఏమయింది?" అని అడిగింది. జరిగిన సంగతి అమ్మతో చెప్పారు. మాట పలుకు లేకుండా పడివున్న పిల్లవాడిని తన దగ్గరకు తీసుకు కొని వాడి వొళ్ళు నిమిరింది. దానితో వాడు తేరుకున్నాడు. జగన్మాతే వాడిని నిమరటం వాడు చేసుకున్న పుణ్యఫలమేకదా!

అధరాపరపు శేషగిరి రావన్నయ్య భార్య రాంబాయమ్మని అడిగి చాకలి పెద్దమ్మ సున్నం బుట్టలోకి తీసుకుంటోంది. ఇంతలో గజేంద్రమ్మక్కయ్య బుట్టలోని సున్నం పారవేసి కేకలు వేసింది, ఆ విషయం శేషగిరిరావన్నయ్యకు పెద్దమ్మ చెప్పింది. "నేను సున్నం తోలిస్తే నీకేందుకు బాధ. అది బట్టలు శుభ్రం చేయటానికి తీసుకుంటోంది కానీ, దాని ఇంటి గోడలు పెట్టుకోవటానికి కాదు కదా!" అని కేకలు వేసాడు.

డాక్టరు ఇనజతో పెద్దమ్మ ఒక మనిషి చనిపోతే "దేవుడు తీసుకువెళ్ళాడనరు, డాక్టరు ఒక ఇంజెక్షన్‌కు మరొకటి ఇచ్చారనో, ఇంజక్షన్ వల్ల రియాక్షన్ వచ్చిందనో, తేలో, పామో కుట్టిందనో ఆపరేషన్ సరిగా చేయలేదో అని అంటారు కాని దేవుని నిందించరని" అన్నది. అదేంకాదు ఆవిషయం అమ్మ దగ్గరే తేల్చుకుందామని ఇనజ ఫోర్సుగా వెళ్ళింది. అది చూచిన అమ్మ "ఏమే దేముడినే అంటారా?" అని అడగడంతో ఇనజ నిర్ఘాంతపోయింది. "మీవాదన అంతా నాకు తెల్సులేవే" అనేటప్పటికి అవాక్కు అయింది. ఎక్కడో వీరిద్దరూ వాదించుకున్న విషయం అమ్మ ముందే జరిగినట్లు చెప్పటం ఆశ్చర్యకరమే అయినా మన పిచ్చికాని, తనకు గోడలు అడ్డులేవని చెప్పనే చెప్పింది కదా!

పెద్దమ్మ తలుపు పక్కనే నుంచున్నది. అది చూచిన అమ్మ "ఏమే లోపలకురా అక్కడే ఎందుకు నిల్చుంటావు" అని పిలిచింది, బీద, గొప్ప, చిన్న, పెద్ద తారతమ్యాలు అమ్మకు లేవు కదా! ఎప్పుడైనా నిందలేనిదే బొందిపోదు. అని పెద్దలు అంటారు కదా! మృత్యుదేవత తనమీద నింద మోపుకోదు. పెద్దమ్మ కొడుకు శంకరం. ఎవరు జిల్లెళ్ళమూడి వెళ్ళినా చెఱువులో కలువలు, తామరలు తెచ్చి అమ్ముతుంటాడు. ఆ చెఱువులో అయిపోతే పక్కవూర్లకు వెళ్ళి కలువ పూలు, తామరపూలు తెచ్చి ఇస్తుంటాడు. మనం పిలవక పోయినా మననంటి పెట్టుకొనే అమ్మ వుంటుంది, అలాంటిది అమ్మ మీద పూర్తి విశ్వాసం వుంచిన వారిని అమ్మ ఎప్పుడూ కాచిరక్షిస్తూనే వుంటుందనటంలో ఎటువంటి సందేహంలేదు.

+ + +

అమ్మ అనుంగు బిడ్డలలో రాజుపాలెపు రామచంద్రరావుగారు ముఖ్యులు. వీరు మొదట చీరాలలో టీచర్‌గా పనిచేసి పేరాలలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసారు. దాదాపు 25సం॥ల కాలం అమ్మ జీవిత తరంగాలలో ఓలలాడిన వ్యక్తి. అమ్మ దగ్గర జరిగిన ప్రతి సంఘటన తన డైరీలలో నిక్షిప్తం చేశారు. సర్వవ్యాపిని అయిన అమ్మ అనంత తత్వం తెలియాలంటే ఆ డైరీలలోని విషయాలన్నీ వెలుగులోకి రావాలి. వీరు ఆనందాశ్రమంలో తీవ్రమైన యోగసాధన చేశారు. ఆ కాలంలో వారు తమ శరీరాన్ని కప్పుకున్న దుప్పటి తొలగిస్తే శరీరం బంగారు కాంతులీనుతూ వుండేది. కొన్ని కోట్ల శ్రీరామ మంత్రజపం చేసారు. ఆయన అన్వేషణ, ఆయన సాధన అమ్మ దర్శనంతో ఫలించాయని అన్నయ్య ప్రగాఢ విశ్వాసం.

వేటపాలెం రామచంద్రరావు అన్నయ్యను దక్షిణామూర్తి అన్నయ్య మన్నవలో జరిగిన సంఘటన గురించి అడిగాడు. "ఓమ్, ఐమ్, క్లీమ్, హ్రీం, శ్రీం, ఓమ్ అంటూ అమ్మ కూర్చున్న మేనాను మోసారుట. అప్పటి నుంచి ఆ మంత్రమే అమ్మ మంత్రమైనది" అని చెప్పారు. అమ్మ ఆలయంలో ప్రవేశించగానే మన్నవ గుడిలోని రాజ్యలక్ష్మి అమ్మవారి విగ్రహం దివ్యతేజో విరాజితయై ప్రకాశించటం వారంతా చూచారట. వారు ఎంతటి భాగ్యశాలురో కదా!

వేటపాలెంలో సారస్వత నికేతన గ్రంథాలయంలో వీరాశాస్త్రిగారితో పరిచయం ఏర్పడింది. భారతీయ వేదాంతాన్నే కాక వివిధ మతాలలోని గూఢత్వాన్ని, ఏకత్వాన్ని, కూడ అవగాహన చేసుకున్నారు. తమదైన గీటురాయి మీద అమ్మ ప్రతిమాటను తరచి చూచారు. అమ్మ మాటలు లేవు అమ్మ మాట ఒకటే అని అన్నయ్య నమ్మకం. "ఏమాటను తరచి చూచినా ఒకే సత్యదర్శనం చేయిస్తుందని" అంటాడు అన్నయ్య.

అమ్మ దగ్గర అన్నయ్యకు అనేక అనుభవాలున్నాయి. అనేక భక్తుల అనుభవాలను సేకరించారు. జిల్లెళ్ళమూడిలో డా॥పొట్లూరి సుబ్బారావుగారు, శ్రీ శేషగిరిరావుగారు, అమ్మ ఫోటోలు, సినిమాలు ముందు తరాలకోసం పదిలం చేశారు. కొండముది రామకృష్ణ అన్నయ్య అమ్మకు అమ్మ బిడ్డలకు వారధి అయ్యాడు. అమ్మ మాటలను అక్షరబద్ధం చేసింది రామచంద్రరావు అన్నయ్యే.

సాధారణంగా అమ్మను చూచినప్పుడు ఆ దివ్యమూర్తి సందర్శనంలోని ఆనందాన్ని తనివితీరా అనుభవించడంలో, ఆమాటల తీయదనాన్ని ఆస్వాదించడంలో నిమగ్నులౌతాం. తరువాత బయటకు వచ్చాక అమ్మ ఏమన్నది గుర్తుకురాదు. ఆ ఆనందాన్ని పొందుతూనే జాగ్రత్తగా ప్రతిక్షణం ఒక బంగారపు ముద్దవలె పదిలం చేసి పెట్టుకున్నాడు రామచంద్రరావు అన్నయ్య. ఈ అన్నయ్యకు ఇవ్వటమే కానీ తీసుకోవటం తెలియదు. కష్టాలనూ, సుఖాలనూ ఒకే విధంగా స్వీకరించిన స్థితప్రజ్ఞుడు.

జిల్లెళ్ళమూడి నుండి వస్తుంటే పాదంలో జపాన్ తుమ్మముల్లు విరిగి సెప్టిక్ అయింది. డాక్టర్ శ్రీధరరావుగారు ముల్లు చూట్టూ కొంత కట్ చేసి ముల్లు తీయటానికి ముందు మత్తు మందు ఇచ్చారు. కానీ మత్తు ఎక్కలేదు వారు కత్తిపెట్టినపుడు బాగా నొప్పి తెలిసింది, లోతుగా కోసినపుడు అబ్బా అబ్బా అన్నారు, దానికి డాక్టరుగారు నవ్వుతూ "అమ్మా అని ఒక్కసారి అయినా అనవా?" అని అడిగారు. దానికి అన్నయ్య "అమ్మా అనే పిలుపు దీనికి కాదు" అన్నారు నవ్వుతూ.

నవ్వుతూ అన్నా ఎంత నిజం! చిన్న చిన్న కష్టాలకూ నొప్పులకు దైవాన్ని వేడే మనం సాయిజ్యాన్ని అడుగుతున్నామా? అమ్మ సామీప్య, సారూప్య, సాయిజ్యాలను సంపూర్ణంగా పొందినవాడు రాజుపాలెం రామచంద్రరావు అన్నయ్య.

+ + +

నారపరాజు శ్రీధరరావుగారు చీరాలలో డాక్టరుగా ప్రాక్టీసు చేస్తున్నారు. మొదటిసారిగా అమ్మను దర్శించినప్పుడు అమ్మ ఒక విశిష్టమైన, అసాధారణమైన వ్యక్తిగా గోచరించింది. అమ్మ యొక్క తాత్వికచింతన కన్న లౌకిక చింతన యెక్కువగా ఆకట్టుకుంది. అప్పుడు శేషగిరిరావు అన్నయ్య అమ్మ సంస్థతో అనుబంధాన్ని పెంచుకున్న రోజులు. డాక్టరుగారికి రోగిగానే దర్శనమిచ్చి రోగిగానే ఉపాసించుకోమని చెప్పింది. "రోగికి వైద్యుడు నారాయణ స్వరూపుడైతే, వైద్యునికి రోగీ నారాయణస్వరూపుడే" అని తేట తెల్లంచేసింది.

మొదట్లో అమ్మను దర్శించినవారు అదృష్టవంతులు. రాత్రి తెల్లవార్లూ వారితో అనేక రకముల సంభాషణలను అమ్మ జరుపుచుండెడిది. అందులో కవులు, గాయకులు, పండితులు పాల్గొనేవారు. ఆ రోజుల్లో అమ్మ తన స్వహస్తములతో వారికి ప్రేమతో ముద్దలు నోటికి అందించేది. ఒకే చేయి అందరినోళ్ళల్లోకి వెళ్ళేది. నిరభ్యంతరమైన, నిర్ణిద్రమైన, ఆనంద రసానుభూతిని పొందేవారు. డాక్టరు శ్రీధరరావు గారు అమ్మకు వైద్యం చేయటానికి వెళ్ళినా, అక్కడ జరిగే కార్యకలాపములు వైద్యానికి భిన్నంగానే వుండేవి.

అక్కడ అందరికీ లభించింది అవ్యాజమైన అమ్మప్రేమ. స్వభావ సిద్ధంగా అమ్మ పిలిచే నాన్నా అనే మాట అందరినీ ఆనందరసంలో ముంచెత్తేది. అమ్మ జ్ఞాపకశక్తి అమోఘం. వేల మంది పేర్లు, వాళ్ళు వచ్చిన రోజు, వారు ధరించిన దుస్తులు, వారితో వచ్చిన వారి పేర్లు అమ్మ చెప్పేతీరుకు ఆశ్చర్యచకితులవుతాము. "కుల, మతాతీతమైన ప్రేమ, నిరవధికమైనప్రేమ, పశు పక్షాదులకు అన్వయించిన ప్రేమ, నిర్వచించటానికి వీలు లేనిది, వీలు కానిది అమ్మకు ఆహారం, నిద్రలతో పనిలేదు" అన్న గీతాచార్యుని వచనము అమ్మయందు అక్షరాలా నిజము.

అమ్మ యొక్క ఆనందతత్వం డాక్టరుగారిని ముగ్ధుని చేసింది. అమ్మ బిడ్డలను చూచుకొని ప్రతి నిమిషం ఆనందంతో పొంగిపోయేది. అమ్మ

ఆనందస్వరూపిణి. అమ్మ చుట్టూ పరిసరములు ఆనందంతో మునిగిపోయేవి. ఉఛ్వాసనిశ్వాసములు ఆనందంతో కూడియుండేవి. దేవుని లక్షణము ఏది అంటే ఆనందమని చెప్పవచ్చును. అట్టి అమ్మ ఆనందం అవధులు, పరిధులు లేనటువంటిది. బ్రహ్మానందమునకు ప్రతీకగా అమ్మను చెప్పవచ్చును.

అమ్మ గాంభీర్యం నిరవద్యం, నిరుపమానం, "ఆరంభ సదృశోదయః" "అఫలో దయ కర్మణామే" అని కాళిదాసు రఘువంశము వారి గురించి చెప్పినట్లు పనులు నెరవేరుదాక అమ్మ సంకల్పములు ఇతరులకు తెలిసేవి కావు. విద్యలందు ప్రవీణ. అమ్మ స్వయంగా చదువుకోకపోయినా, పరిసరములందు జరుగు విద్వద్గోష్ఠులన్నియూ అమ్మకు కరతలామలకములే. విద్యలన్ని వాటంతటవే అమ్మను చేరుకున్నాయా అనిపిస్తుంది.

వివాహమైన పది సంవత్సరముల తరువాత నేను పి.యు.సి. పరీక్షలు రాయటం జరిగింది. ఈయన స్నేహితులతో కలసి జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు "అమ్మాయి బి.ఎ. పరీక్షలు రాసిందా?" అని అడిగింది. "బి.ఎ. కాదమ్మా పి.యు.సి. పరీక్షలు రాసిందని" చెప్పారు. మళ్ళీ మూడు సంవత్సరాల తరువాత ఆ స్నేహితులతో కలసి జిల్లెళ్ళమూడి వెళ్ళిన్పుడు అమ్మ "అమ్మాయి ఎమ్.ఎ. అయిందా" అని అడిగింది. "బి.ఎ. పరీక్షలకు కట్టిందమ్మా" అన్నారు. ఆయన స్నేహితులకు చాలా ఆశ్చర్యమనిపించింది. "ఎంతమంది పరీక్షలు రాయటంలేదు. మీ ఆవిడగురించే అమ్మ అడుగుతోందని" అన్నారు. అమ్మ ఆశీస్సులు నాకున్నాయనుకొని ఎమ్.ఎ కి కూడా ప్రైవేట్‌గానే కట్టాను. ముందు మా నాన్న గారు "నా పిల్లల్లో డిగ్రీ హోల్డర్సు లేరనుకున్నారని" చదువు మొదలు పెట్టాను. ఆయన ఎమ్.ఎ,ఎల్.ఎల్.బి., లక్నో యూనివర్శిటీలో చదివారు. అమ్మ ప్రతీ నిముషం నాతోనే వుండి నాకు కావలసిన ప్రోత్సాహాన్ని కలుగజేసింది. బి.ఎ., అవ్వగానే ఒక సంవత్సరం ఆగితే కాని ఎమ్.ఎ. రాయకూడదని అన్నారు. అందుకని 1966 లో నేర్చుకున్న కటింగ్

ఎంబ్రాయిడరీ పరీక్షలకు 1975లో వెళ్ళాను. వాటిలో క్లాసు వచ్చింది. ఆ తరువాత ఎమ్.ఎ. మొదటి సంవత్సరం పరీక్షలు రాసేటప్పటికి మా పరిస్థితిలో అనూహ్యమైన మార్పులు సంభవించాయి.

దానితో ఉద్యోగం చేయటం తప్పనిసరి అయింది, ఆంధ్రాయూనివర్శిటీ హైస్కూలులో తెలుగు పోష్టుకు అప్లై చేసాను. బి.ఎ. స్పెషల్ తెలుగుతో పాస్ అయ్యాను. ఫరదర్ క్వాలిఫికేషన్స్ ఏమైనా వుంటే తెచ్చుకోమన్నారని కటింగ్ ఎంబ్రాయిడరీ డిప్లమో సర్టిఫికేట్సు రెండూ పట్టుకు వెళ్ళాను. వాటితో ఆ స్కూలులో క్రాఫ్టుటీచర్ ఉద్యోగం రావటం అమ్మ అనుగ్రహమే కారణం. సర్వాంతర్యామి అయిన అమ్మకు తెలియంది లేదు కదా! ముందు జరగబోయేది తెలుసు కనుకనే నన్ను అనుగ్రహించింది. పది సంవత్సరాలలో ఒక్కమారు కూడా చదువుతానని అనుకోలేదు. నేను ఎమ్.ఎ., బి.ఇడి., చేయగల్గటం నా దృష్టిలో అమ్మ అవ్యాజకరుణే కారణము. 23 1/2 సం॥లు ఉద్యోగం చేయటం, అత్యవసర పరిస్థితిలో కూడా ఎవరినీ దేహీ అని అడగవలసిన పనిలేకుండా చేసిన అమ్మకు నేను ఏమి ఇచ్చి ఋణం తీర్చుకోగలను.

అట్టి విద్యాప్రదాయిని అయిన అమ్మ విద్యా స్వరూపిణియే. "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అని కాళిదాసు ప్రవచించాడు. పూర్వ జన్మ పరజన్మ అమ్మ అధీనములైవున్నాయి. కావున విద్యామూర్తియై. సర్వస్వతియై విద్వత్సభలలో పాల్గొనుట ఆమెకు విలాసమైన క్రీడ.

"ఒక మారు వినినంత సకలమ్ము నెరిగెడు అకలంక శక్తి మా అమ్మకుంది"

అమ్మ లీలావినోదిని. ఆమె అనంతమైన లీలా విన్యాసాలలో ఎంత మందికో బాధ నివారణ చేసింది. డాక్టరు శ్రీధరరావుగారి భార్య గర్భస్రావముతో చాలా కాలము బాధపడింది. అమ్మతాకినమాత్రాన పూర్తిగా తగ్గి స్వస్థత కలిగింది.

డాక్టరుగారు చూడటానికి ముందే సర్వశ్రీ ప్రసాదరాయకులపతి, మిన్నికంటి గురునాథ శర్మ, యార్లగడ్డ రాఘవయ్యగారు, బృందావనం రంగాచార్యులుగారు, వాచస్పతిగారు ఎందరెందరో అమ్మను దర్శించారు. అమ్మలోని అలౌకికత్వమును, దేవీత్వమును నిరూపించి తరువాత రాబోవువారికి మార్గదర్శకులయ్యారు. వారు రాసిన గ్రంథములను డాక్టరు శ్రీధరరావుగారికి అమ్మ బహూకరించింది.

"యాసాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణః" అన్నట్లు అన్నయ్య అమ్మను చూచినంతనే కలము చేత బట్టి తెలుగులో కవిత వ్రాయసాగాడు. అది ఒక గొప్ప అనుభూతి. ఆంగ్లవిద్యలో మునిగితేలిన డాక్టరుగారికి తెలుగులో అందులోనూ శాస్త్రీయ కవిత రాయగల్గటం అమ్మ దర్శనభాషణల వల్ల ఆయనలో కవితాశక్తి ఆవిర్భవించింది. అమ్మ ఆయనకు గురువుగా వుండి, ఎనలేని ప్రేరణ కలుగచేసి కవితలను వ్రాయించింది.

సంస్కృతాంధ్రముల రెండింటిలోనూ పద్యరచనా నైపుణ్యమును ప్రసాదించిన అమ్మను గురువుగా హృదయ పద్మమున పదిల పరుచుకొని డాక్టరుగారు ఆరాధించుచున్నారు.

"గురుస్త్వం మాతర్మే సకల మపదేష్టుంచకుశలః" అని వ్రాసుకున్నారు.

అమ్మ సందేశాలతో ఆయనకు నచ్చినది "తృప్తే ముక్తి" అన్న ఆణిముత్యనామాత్యమును బోధించిన అనసూయ" మన అమ్మ.

"తృప్తి జెందని మనుజుడు సప్త దీపములనైన జక్కింబడునే" అని పోతనామాత్యుని ఉవాచ. తృప్తి జీవితానికి చుక్కాని వంటిది. అది వున్నవానికి సుగతికాక మరేముంటుంది?

"సర్వమానవులను నీ సోదరులుగా చూచుకో, నేను అమ్మను, మీరు నా బిడ్డలు"లని అమ్మ చెప్పింది. కాబట్టి మనందరం ఏకోదరులమే.

"ఆత్మవత్సర్వ భూతాని" అన్న ఆర్యోక్తిని అక్షరాలా క్రియారూపంగా జూపమని అమ్మ ఆశయము.

సర్వ జీవులకు, సర్వమానవులకు భూమిపై నివసించుటకు హక్కు పుట్టుకతోనే వస్తుంది. అందుకే అమ్మ తన ఇంటికి 'అందరిల్లు' అని నామకరణం చేసింది. ప్రపంచ శాంతికి దోహదము చేసి మానవులందరికీ శాశ్వత సుఖసంతోషములు కలుగునట్లు చేయుటే అమ్మ ఆశయము.

అమ్మ సూక్తులను చిలకపలుకులవలే వల్లెవేయడం కాక అవి ఆచరించినప్పుడే మనం అమ్మకు నిజమైన వారసులనిపించుకుంటాము. అమ్మ జీవిత మహోదధి నుండి వెలువడిన సూక్తి చింతామణులను మనకు శ్రేయస్సును కలిగించును. అంతులేని అమ్మ గురించి ఎంతైనా వ్రాయవచ్చు.

"అమ్మ పవిత్రనామము అహర్నిశలందు జపించుచుండి, నిత్యమ్ము సమస్త మానవుల దమ్ములుగా నెదలో దలంచి, హృద్యమ్ముగా బల్కుచుండి మన యందు ననీసూయను ధిక్కరించి, కార్యమ్ములు సేయుటమ్మ కిడునట్టి నిజంబుగు భక్తియేయగున్.

డాక్టరు శ్రీధరరావుగారు మనసా వాచా కర్మణా అమ్మను నమ్మిన వ్యక్తి. వారి అమ్మాయి శ్రీవల్లి. శ్రీ మల్లాప్రగడ శ్రీ రంగారావుగారి కుమారుడైన శ్రీమన్నారాయణ భార్య. శ్రీమన్నారాయణ జిల్లెళ్ళమూడిలో జరిగే అన్ని ఫంక్షన్సుకు వ్యాఖ్యాతగా వ్యవహరించి అలరించుతీరు అభినందనీయము. జిల్లెళ్ళమూడి ఓరియంటల్ కళాశాలలో లెక్చరర్‌గా పనిచేయుచున్నాడు.

+ + +

కొండపాటూరి బాల, గుంటూరు బ్రాడీపేటలోని పాండురంగ విద్యాలయం హెడ్‌మాష్టరు గారి భార్య, 1956 జూన్‌లో ప్రసవించి చీరాల ఆసుపత్రిలో ఉన్న సమయంలో పక్క బెడ్ మీద ఐ.ఎల్.టి.డి. లో పని చేసే

ఆయన భార్యను "మీ యింట్లో పురిటి స్నానం రోజే నామకరణం చేస్తారా?" అని బాలక్కయ్య అడిగింది. "21వ రోజున జిల్లెళ్ళమూడి కరణం గారి భార్యను పిలిచి, ఆమెకు పూజచేసి, ఆమెచేత పేరు పెట్టించుకుంటామని" చెప్పింది ఆమె.

అమ్మ తండ్రి సీతాపతి గారు, బాలక్కయ్య పినతల్లి మామగారు అన్నదమ్ముల పిల్లలు. అమ్మ అత్తగారైన కనకమ్మ బామ్మ మనుమలైన హైమను, రవిని వీరింటికి తీసుకువెళ్ళింది. "మా కోడలికి కడుపులో నొప్పి అన్నం తినదు. ఎప్పుడూ వైద్యం చేయిస్తూనేవున్నామని" బామ్మ చెప్పింది. అప్పటికి అమ్మ శక్తి ఎవరికీ అంతు బట్టలేదు. అమ్మను సర్వవ్యాధిప్రశమినిగా గుర్తించలేకపోయారు. ఆ తరువాత అమ్మ గురించి అందరూ అనుకునే మాటలు విని అమ్మ పినతల్లులిద్దరూ జిల్లెళ్ళమూడికి వెళ్ళారు. ఆరోజుల్లో అమ్మే వండి వడ్డించేది.

వాళ్ళు వెళ్తూ కొబ్బరికాయ తీసుకువెళ్ళారు. అమ్మ వాళ్ళనే కొబ్బరికాయ కొట్టమంది. అమ్మ వంట చేసే చోట ఒక కన్నంలో నాగేంద్రుడున్నాడని జీతగాడు చెప్పాడు. అమ్మ ఆ కొబ్బరి ముక్కలను అక్కడ పెట్టి ఇద్దరికీ ప్రసాదం యిచ్చింది. మన్నవ పిన్ని నోట్లో వేసుకుంది. రెండవ ఆమె చెంగున కట్టుకుంది. అది చూచి అమ్మ "దానికి విషమెక్క లేదు నేనూ తింటున్నానంది." ఆమె సిగ్గుపడి కొబ్బరి నోట్లో వేసుకుంది. ఆమెకు చాలా భయం. అమ్మ 'భయాపహ' అని రుజువు చేసుకుంది.

అమ్మను దర్శించుకోవటానికి వెళ్ళిన కొందరు అమ్మ పని అయి సబ్బుతో ముఖం కడుగుకుంటుంటే అమ్మగారు సబ్బుతో రుద్దుకుంటోందని మనసులో అనుకున్నారు. వెంటనే అమ్మ మట్టి తీసి రుద్దికుంది. దానిని చూచి ఆశ్చర్య చకితులైన వారితో అమ్మ "నాకు మట్టయినా, సబ్బయినా ఒకటే" అని తన సర్వసమాన స్థితిని తెలియచేసింది.

1960 లో అమ్మ జన్మదినానికి ఎడ్ల జతలు కట్టిన రథం మీద మన్నవ నుండి పొన్నూరు తిరు వీధుల వరకు ఊరేగించారు. అది విన్న బాలక్కయ్యకు ఎలాగైనా అమ్మ దర్శనం చేసుకోవాలన్న ఆరాటం కలిగింది. కాని అమ్మ దగ్గరకు వెళ్ళటానికి వీలుపడలేదు. సర్వాంతర్యామియైన అమ్మ దివ్యదర్శనాన్ని స్వప్నంలో బాలక్కయ్యకు ప్రసాదించింది.

ఆ తరువాత కొంత కాలానికి అమ్మ వచ్చిందని తెలిసి సర్వాలంకార భూషితగా, ముక్కున బులాకి పెట్టుకుని ఎంతో ఆకర్షణతో ఉన్న అమ్మను దర్శించుకుంది. అమ్మపాదాలకు తన శిరసు తగిలేలా నమస్కారం చేసుకుంది. అమ్మ తన రెండు పాదాలు తగిలించి హస్త మస్తక సంయోగంలా, పాదమస్తక సంయోగం ద్వారా అక్కయ్యను తృప్తి పరచింది. బ్రహ్మాండంగా పందిళ్ళు వేసి సహస్ర జన సందోహంలో అమ్మ సింహాసనాసీనయై అందరిపై తన కరుణాదృష్టిని కురిపించింది. ఆ సన్నివేశం బాల అక్కయ్య అంతరాత్మ భావవీచికలలో నిలిచిపోయింది. అప్పుడే అమ్మ మీద మొదటి పాట రాసింది.

ఆనాటి నుంచి ప్రతి నిమిషం అమ్మమాటే. పతి, సుత, హితలు, బంధువులుగాని, బయటవారుగాని అందరూ అమ్మ అన్న భావనతోనే బాలక్కయ్య అంతరంగం నిండిపోయింది. ఎంతసేపూ అమ్మ ధ్యానంలో వుందామనుకుంటే వీళ్ళు అభ్యంతర పెడుతున్నారని బాధ పడేది. ఒకమారు అమ్మ కలలో కనిపించి "పొంగలి చేసిన గిన్నె క్రింద కట్టె ముక్కవున్నదా?" అని హెచ్చరించింది. "అమ్మ ఇలా అడిగిందేమిటి?" అని ఎంతో ఆలోచించింది.

బాల అక్కయ్య మేనమామ భార్య సాధకురాలు. ఆమె దగ్గరకు వెళ్ళి ఈ సంగతి చెప్పింది. "రథసప్తమికి పాలు పొంగిస్తాము కదా!" అది అయివుంటుందని అన్నది ఆవిడ. ఆ తరువాత బాలక్కయ్య పూజ చేసుకున్నా, ధ్యానం చేసుకున్నా ఇంట్లో వాళ్ళు మందలించటం మానేశారు. అప్పటి నుంచి ఎన్నిమార్లు జిల్లెళ్ళమూడి వెళ్ళినా ఎవరూ అభ్యంతర పెట్టలేదు.

1961 లో బాలక్కయ్య రెండో అమ్మాయి పెళ్ళి విషయంలో తర్జన భర్జనలు జరుగుతున్నాయి. కలలో అమ్మ అక్కయ్య పక్కన కూర్చుని "నీ అనుమానాలు తీసి అవతల పెట్టు, నీవనుకున్నట్లుగా నీ తమ్ముడి తోనే పెళ్ళి జరుగుతుందని" చెప్పింది. అమ్మ దర్శనానికి వెళ్ళినప్పుడు అమ్మ పర్ణశాలలో పడుకొని వుంది. ఒక అన్నయ్య అమ్మ పాద సేవ చేస్తున్నాడు. ఇంతలో అమ్మ లేచి కూర్చుని "ఒంగోలు ఆమె కూతురువి కదూ, మనం చిదంబరరావు తాతగారింట్లో, భారతి అత్తయ్యతో ఆడుకున్నాము, అప్పుడు పూండ్ల అనసూయ కూడా ఉంది" అని గుర్తుచేసింది. దానితో తనకు చిన్నతనం నుంచి తెలిసిన ఆమే అమ్మ అన్న ఆనందంతో ఇద్దరి చూపులు కలసి కాలం నిలచిపోయింది. ఆ మధురానుభూతి అలా అక్కయ్య మనస్సులో హత్తుకుపోయింది.

అమ్మను చూడాలన్న కాంక్ష వ్యక్తపరచిన వారందరినీ జిల్లెళ్ళమూడి తీసుకు వెళ్ళేది. 1969 లో కారులో వెళ్ళారు. మధ్యాహ్నం 12 గం॥లకు ఎవరో పూజ చేసుకుంటున్నారు. మేము చేసుకుంటామంటే "ముందు భోజనం చేయమంది" అమ్మ. భోజనాలు అయ్యాక గోపాలన్నయ్య పిలిచి త్రిశతి నామాలు చెప్పి పూజ చేయించాడు. ఏపూవులు లేక కనకాంబరాలు తీసుకువెళ్ళింది. వాసన లేనివి అని బాధ పడుతూంటే అమ్మకు ఆ పూలంటే చాలా యిష్టమన్నారు. దానితో అక్కయ్య మనసు మధురోహలతో నిండిపోయింది.

అక్కయ్యకు మంత్రోపదేశం పొందాలని ఎంతో ఆశగా ఉండేది. అలా అనుకుంటూ పడుకున్నప్పుడు అమ్మ జిల్లెళ్ళమూడిలో చిన్న మంచం మీద ఉన్నట్లు బాలక్కయ్య అమ్మ చెంత కూర్చుని ఉన్నట్లు, ఎంతో కాలంగా ఉపదేశం కావాలని అనుకుంటున్నావు కదా! అని ముఖ్యమైన మూడు బీజాక్షరాలు చెప్పి బాలక్కయ్య చేత మూడు సార్లు అమ్మ అనిపించినట్లు, దానికి "అంగన్యాస కరన్యాసాలు కావాలి కదమ్మా!" అన్నది బాలక్కయ్య "అవి ఏమీ అవసరం లేదు ఆ బీజాక్షరాలనే మననం చేసుకోమన్నట్లుగా" కల వచ్చింది. ఇంత చిన్న మంత్రమా అన్న మానవ నైజంతో సంశయాత్మ అయింది బాలక్కయ్య.

గుడివాడ నుండి ఒక స్వాముల వారు బాలక్కయ్య వాళ్ళ బంధువుల ఇంటికి వచ్చారు. ఈ మంత్రం విషయం ఆయనకు చెప్పి తన అనుమానాన్ని వ్యక్తం చేసింది అక్కయ్య. అది విని ఆయన "అమ్మా, నీవు చాలా అదృష్టవంతురాలివి. అమ్మ సామాన్య మానవి కాదు సాక్షాత్తూ శ్రీచక్రనగర సామ్రాజ్ఞి అయిన రాజరాజేశ్వరి మీకు చెప్పిన మూడు బీజాక్షరాలు భువనేశ్వరీ మంత్రంలో ముఖ్యమైనవి. పూర్వజన్మ సుకృతం వల్ల స్వప్నదత్తమైనదని" తెలియ చేసారు. ఆ మూడు అక్షరాల మంత్రమే జీవనము, జీవితాధారము అయింది. అమ్మ కొండంత అండగా అక్కయ్య మనసులో నిలిచిపోయింది.

అక్కయ్య వాళ్ళ ఇంటి పక్కన యాదవులు వుండేవారు. ఆమెకు ముగ్గురు సంతానం కలిగినా ఒక్కరూ ప్రాణంతో బయట పడలేదు. ఆమెకు తీరని దుఃఖం కలిగింది. బాలక్కయ్య వాళ్ళింట్లో అమ్మ ఫోటో చూచి "ఆమె ఎవరూ?" అని అడిగింది. "ఆమె మా గురువు, దైవం, అన్నీ ఆమే" అని బాలక్కయ్య చెప్పింది. "నా బాధకు విమోచన మార్గం తెలియచేస్తారా?" అని ఆమె అడిగింది. "ఆమె ఏమీ చెప్పదు, కానీ ఆమెను నమ్మి కుంకుమ, తీర్థం తీసుకో నీకు మేలు కలుగుతుంది" అని అక్కయ్య ఆమెకు చెప్పి తృప్తి పరచింది.

యాదవులామె భర్త తాగుబోతు. "ఏ నిమిషాన ఏమౌతాడో నావారందరినీ వదులుకుని ప్రేమ వివాహం చేసుకుని వచ్చాను. పిల్లలు కూడా లేకపోతే "భవిష్యత్తు అంధకారమవుతుందని" ఆమె విలపించింది. "మళ్ళీ నెల తప్పినప్పుడు ఈసారైనా బిడ్డ దక్కేటట్లు చూడమని" అమ్మను ప్రార్థించింది. ఆమెకు "అమ్మ కుంకుమను నీళ్ళలో కలుపుకుని తాగమని చెప్పింది" బాలక్కయ్య.

ఇది జరిగిన పదిహేను రోజుల అనంతరం అక్కయ్యకు అమ్మ కలలో కనిపించి "ఈ మారు ఆడపిల్ల పుడుతుంది శారదమ్మ అని పేరు పెట్టుకోమని" చెప్పింది. ఆ తరువాత ఐదు నెలలకు బిడ్డను తీసుకువచ్చి చూపించింది ఆమె. ఆ తరువాత ఆరు నెలలకు వాళ్ళు అక్కడ నుండి వెళ్ళిపోయారు.

4సం॥లు గడచిన పిమ్మట ఆమె బాలక్కయ్యను కలసి "నా భర్త తాగుడుతోపోయాడు. నేను పూలు అమ్ముకుని పిల్లను చూచుకుని జీవిస్తున్నాను. అమ్మను, మిమ్మల్ని మర్చిపోలేనని" అక్కయ్యతో చెప్పింది.

ఇంట్లో చికాకుల వల్ల బాలక్కయ్య అంతరంగం అతలాకుతలం అయింది. అమ్మను చూడాలని, అమ్మ పాదాల దగ్గర వాలాలని. ఆమె అంతరాత్మ ఆతురత పడింది. కలలో అమ్మకు చెంపలు ఆనేట్లు నమస్కారం చేసుకుంది. అమ్మ ఎడమ పాదం వెచ్చగా కుడిపాదం చల్లగా తగిలింది. ఏమిటమ్మా ఇలా ఉన్నాయని అడిగింది. "అదే జీవితం శీతోష్ణ సుఖదుఃఖాల సంగమమే సంసారం, సంసారంలో నేనూ కొంతకాలం అనుభవించాను. మనం సంసారంలో వుండాలి కాని మనలో సంసారం వుండకూడదని" అమ్మ చెప్పింది. బాలక్కయ్యకు ఎక్కువగా పౌర్ణిమ రోజులలోనే దివ్యానుభూతులు కలిగేవి.

జమ్ముల పాలెం పెళ్ళికి వెళ్ళి అక్కడ నుంచి పెళ్ళికి వెళ్ళిన వారంతా అమ్మ దర్శనార్థం జిల్లెళ్ళమూడి వెళ్ళారు. పూజ చేసుకున్నాక అక్కయ్య దోసిలిపట్టింది. అమ్మ తన రెండు పాదాలను అక్కయ్య దోసిట్లో పెట్టింది. మిగిలిన వారు నమస్కరించినప్పుడు కాలు కదపను కూడా లేదు. అందులో ఒకరు అమ్మను "ఏదైనా మంత్రం ఉపదేశిస్తారా" అని అడిగారు. అమ్మ "నాకేమీ అటువంటి అలవాటు లేదమ్మా" అన్నది. అది విని బాలక్కయ్య "అమ్మా నువ్వు నాకు కలలో మంత్రోపదేశం చేశావు" అన్నది. అమ్మ "అదే మననం చేసుకో" అన్నది. ఆ సమయంలో అమ్మ ముఖమండలం వేయి చంద్రుల కాంతి విరజిమ్మింది. మిగిలిన వారంతా పాదాలు మాకు ఇవ్వలేదు మీకే ఇచ్చారేమిటని అసూయ చెందారు. ఎవరి పూర్వజన్మ సుకృతం వారిదే కదా!.

అక్కయ్యకు కలలో "గుంటూరు పండరీపురంకు అమ్మ వస్తోందని తెలిసి దొడ్లో పూలు కోసి దండ గుచ్చింది. అమ్మ దగ్గరకు వెళ్దామని తలుపుతీస్తే

అమ్మ కారు అక్కయ్య వాళ్ళ వాకిలి ముందు ఆగింది. అమ్మ కారులో నుండి దిగింది. వెంటనే తన చేతిలోని దండను అక్కయ్య అమ్మ మెడలో వేసింది. అమ్మ లోపలికి వచ్చి కూర్చుంది. అక్కయ్య అమ్మకు ఎదురుగా కూర్చుంది. అమ్మ దోసిలి పట్టమని కుంకుమ పోసింది. బొట్టు పెట్టుకోమంది. కుడిచేతిలో కుంకుమను ఎడం చేతిలోనొక్కి బొట్టు మూడు సార్లు పెట్టుకోమంది. "కుంకుమలో చమికీ నలుసులాంటిది చూపిస్తూ ఇదేనమ్మా! భగవంతుడు, అణువు నుండి మేరువంతుంటాడు అని శంకరాచార్యులుగా వున్నప్పుడు విభూతి పెట్టాను. అమ్మగా ఉన్నప్పుడు ఇప్పుడు కుంకుమ పెడుతున్నాను" అన్న వెంటనే మెలకువ వచ్చింది.

ఏదైన ప్రమాదం రాబోతున్నా తాను వున్నానని ధైర్యం చెప్పటానికి ఇలా వచ్చిందని అనుకుంది. అమ్మను అంతర్యాగంలో ఆరాధన చేస్తూనే వుంది. అక్కయ్య భయపడినట్లుగానే అన్నయ్యకు పక్షవాతం వచ్చి కాలు, చేయి, మాట పడిపోయింది. వైద్యం చేయించాక కాలు చెయ్యి స్వాధీనంలోకి వచ్చాయి. అమ్మ ధైర్యాకర్షిణిలా అక్కయ్యకు కావలసిన ధైర్యాన్ని ఇచ్చింది. బాలక్కయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళినపుడు అమ్మకు చీరె పెట్టుకుంది. ఆ తరువాత అన్నయ్యకు మాట వచ్చి మామూలు మనిషి అయ్యారు.

నందికేశ్వరుని నోము చేసుకుని అన్ని నైవేద్యాలు ఒక నెలలోనే అమ్మదయవల్ల చేసుకుంది. ఉద్యాపన అమ్మకే చేసుకోవాలని అమ్మ జన్మదినం నాడు పూజ చేసుకుని అమ్మకు వాయనమిచ్చింది. "ఇస్తినమ్మ వాయనం, పుచ్చుకొంటినమ్మ వాయనం" మూడు సార్లు అని తీసుకుంది అమ్మ. వాసిన కట్టిన గుడ్డ అన్నయ్య విప్పితే అందులో ఉడికించిన పొట్టు పెసరపప్పు నాకు ఇష్టమని రెండుమార్లు నోట్లో వేసుకుంది అమ్మ. అమ్మ ముఖారవిందం చింతామణి గృహంలో పంచప్రేతాసనాసీన, పంచ బ్రహ్మ స్వరూపిణి అయిన శ్రీచక్రాధినగర సామ్రాజ్ఞిలా కండ్లలో మెదిలింది.

హనుంబాబు కొడుకు ఏదో పని మీద గుంటూరు వెళ్ళాడు. ముఖాన పెద్ద బొట్టు పెట్టుకుని లోపలకు వస్తుంటే అతని ముఖంలో అమ్మ ముఖం ద్యోతకమైంది. అమ్మ వీడిలో కనిపించటమేమిటన్న భయం ఆందోళన. కుంకుమ పొట్లాలు దోసిట్లో పోసి పటిక బెల్లం ఇచ్చాడు. కుంకుమ పెట్టుకుని ప్రసాదం నోట్లో వేసుకున్నారు అన్నయ్య. రెండు రోజుల నుంచి నలతగా ఉంటోంది రాత్రి దీపం తీయమని రామ రామ, అనుకుంటూ పడుకున్నారు. అంతే అందనిలోకాలకు అమ్మ ఆయనను తీసుకువెళ్ళింది.

మనిషి మంచితనం మరణంతో తెలుస్తుందని అంటారు. ఏ భేషజాలకు, ఆడంబరాలకు పోక సాధు మార్గంలో జీవనయాత్ర సాగించిన వితరణశీలి అన్నయ్య.

పూర్వాచారం ప్రకారం అక్కయ్యకు బొట్టు, సూత్రం తొలగించారు. వాడి చేతనేను ముందుగా కుంకుమ పంపితే ఇలా ఎందుకు చేశావని అమ్మ నిలదీసినట్లు అమ్మ గంభీర స్వరం వినిపించింది. లోకం కోసం ఇలా చేసానని సమాధాన పరుచుకుంది అక్కయ్య.

నాలుగు నెలల తరువాత మార్గశిర పౌర్ణమి రాత్రి మరో ఇద్దరు సువాసినులను వెంట బెట్టుకొని వచ్చి బొట్టు పెట్టమన్నది అమ్మ. అక్కయ్య నిర్ఘాంతపడి అలా ఉండిపోయింది. అక్కయ్య చేతిలో కుంకుమ భరిణె అమ్మ తీసుకుని అక్కయ్య ముఖాన మూడు సార్లు బొట్టు పెట్టింది. ఆ తరువాత అక్కయ్య అమ్మకు, ఆ వచ్చిన వారికి బొట్టు పెట్టినట్లు" స్వప్నం వచ్చింది.

అక్కయ్య పెద్దమ్మాయి, పెద్దకోడలు బొట్టులేకుండా ఆమె ముఖం చూడలేకుండా వున్నామని స్టిక్కర్ పెట్టారు. "నీ అర్హత నీకు బోధపరచి నేను బొట్టు పెట్టినా నీవు ఇంకా అమాయకత్వంలోనే ఉన్నావా అంటున్నట్లుగా తోచి అప్పటి నుంచి మామూలుగా కుంకుమ పెట్టుకుంటున్నది.

అక్కయ్య తన అనుభవాలను బహిర్గతం చేయకూడదని తనలోనే నిక్షిప్తం చేసుకుంది. కానీ అనుభవజ్ఞులైన పెద్దలు ప్రచారం చేయాలని ఆజ్ఞాపించారు. అమ్మ ఇచ్చిన అనుగ్రహ భాగ్యంతో తనలో దాచుకున్న మధురానుభూతులను బహిర్గతం చేసేందుకే అమ్మ తనను జీవింప చేసిందని అక్కయ్య విశ్వాసం. ఆ విశ్వాసంతోనే అక్కయ్య ఇంకా ఇంకా అనుభవాలను బహిర్గతం చేయాలని అమ్మను మనసారా వేడుకుంటున్నాను.

+ + +

పోతుకూచి విద్యాసాగర్ అన్నయ్య, రాజ్యలక్ష్మమక్కయ్య జిల్లెళ్ళమూడి వచ్చేవారికి చిరపరిచితులు. మొదట అన్నయ్య వస్త్రవ్యాపారం చేసేవారు. అప్పు వసూలు నిమిత్తం జిల్లెళ్ళమూడి 1960సం॥లో వచ్చారు. ఆయన బాపట్లలో 5గం॥లకు స్టాండ్‌కు వచ్చినా బస్సు రాలేదు చేసేదేమిలేక 7 మైళ్ళు నడిచి జిల్లెళ్ళమూడి వచ్చారు. సాగర్‌గారు శ్రీనాన్నగారు బాల్యమిత్రులు, సహాధ్యాయులు. జిల్లెళ్ళమూడిలో నాన్నగారిది ఒక్కటే బ్రాహ్మణుల ఇల్లు. అందుకని నాన్నగారింట్లో ఆతిధ్యం తీసుకున్నారు. విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో కారంచేడు వారిచే జరుపబడుతున్న ఏకాహంలో అమ్మ నామం వినిపించింది.

అప్పటికి అమ్మ యందు భక్తి లేకపోయినా సంగీత ప్రియులగుటచే అమ్మ నామసంకీర్తనలో పాలుపంచుకున్నారు. నలుగురితో పాటు సాగర్‌గారు అమ్మ దగ్గరకు వెళ్ళారు. అమ్మ సాగర్ గారిని చూచి "నాన్నా! భోజనం చేశావా?" అని అడిగింది. "భోజనం చేసానని చెప్పి, సెలవిప్పించమన్నారు". ఈరోజు వుండి రేపు వెళ్ళమన్నది అమ్మ. అత్యవసరంగా వెళ్ళవలసిన పనివుందని చెప్పి బయలుదేరుతుండగా, "నాన్నా! వెళ్తావా?" అని ఆకాశంకేసి చూచింది అమ్మ. అంతకు ముందు వర్షం వచ్చే సూచన కూడా లేదు. కానీ అమ్మ చూపుతో మేఘుడికి ప్రేరణ కల్గిందో ఏమో ఉరుములు, మెరుపులతో

పెద్దవాన. "నాన్నా! ఇప్పటికీ వెళ్తావా?" అన్నది అమ్మ. సాగర్ గారి నేత్రాల నుండీ అశ్రువర్షం ప్రారంభమైంది. మేఘాలు, సాగర్ గారి నేత్రాలు పోటిపడి తీవ్రంగా ఒక అరగంట వర్షించి అలిసిపోయి ఆగిపోయాయి. మొదటిసారి తిరుపతి వెళ్ళినప్పుడు నడిచే ఏడుకొండలు ఎక్కి వెంకటరమణమూర్తి దర్శనం చేసుకున్నారు. ఈ జిల్లెళ్ళమూడి ప్రయాణంలో ఏడు మైళ్ళు ఏడుకొండలని, అమ్మ ఏడుకొండలవాడని అవగతమైంది. అది మొదలు అమ్మను వెంకటేశ్వరునిగా భావించి తిరుపతి మళ్ళీ వెళ్ళలేదు. మొదటిసారి జిల్లెళ్ళమూడి రావటం బాకీ వసూలుకే కాని భక్తితో కాదు.

బాపట్లకు వెళ్ళింది మొదలు ఇంట్లో అందర్నీ కూర్చుండబెట్టి అమ్మ గురించి ఎంతో ఆనందంతో ఆర్తితో తెలియచేసారు. ఆ క్షణం నుంచీ ఇంట్లో అంతా అమ్మమయమే. సాగర్ గారి చెవులలో అమ్మ నామమే మార్మోగింది. జిల్లెళ్ళమూడికి వెళ్ళాలని కుటుంబమంతా తపించింది. "తపనే తపస్సు" అంటుంది కదా! అమ్మ. వారి తపన గ్రహించి అమ్మ వారికి ఆ అవకాశాన్ని ప్రసాదించింది.

సాగర్ గారిని అంతా అన్నయ్యా! అని సంబోధిస్తుంటే తన చెల్లెలు శారద అన్న ఆమె చనిపోవటం వల్ల ఆ సంబోధనతో మురిసిపోయారు. ఆ పిలుపులో కృతిమత్వానికి తావులేదు. రాజ్యలక్ష్మిగారు చాలా ఆనందించింది. అంతా అమ్మ సన్నిధికి వెళ్ళారు. పిన్నా, పెద్దా తారతమ్యం లేకుండా అశ్రువులతో అమ్మ పాదాలకు అభిషేకం ేసారు. అమ్మ దగ్గరవున్న లక్ష్మీనారాయణ అన్నయ్య, రాఘవన్నయ్య పెద్ద వాళ్ళయితే ఆర్తితో ఏడుస్తారు. "ఎందుకమ్మా ఆ పిల్లలని అలా ఏడిపిస్తున్నావని అన్నారు. "అమ్మ నిర్లిప్తంగా నవ్వి ఊరుకుంది. అక్కడేవున్న రెడ్డిసుబ్బయ్య "చూడకుండా గిచ్చిఒదిలి పెట్టిందేమో" అన్నాడు. ఆ రోజుల్లో అమ్మ దగ్గరకు వచ్చే ప్రతి ఒక్కరూ ఏడ్చేవారు. ఏడుపనేది అత్యంత ఆత్మీయుల దగ్గర కానీ, భరించలేని సందర్శనంతో కానీ ఏడుపు వస్తుంది.

అందుకే రాఘవన్నయ్య "సతతభాష్పకణార్చనప్రియ" అని చిద్విలాసిని అన్న స్తోత్రంలో అమ్మను వర్ణించారు. అక్కడికి రానటువంటి జోత్స్న, సావిత్రి, రవిల గురించి అడిగింది. వాళ్ళకు ఆశ్చర్యానందాలు ముప్పిరిగొన్నవి. సాగర్ గారు తనకు ఇంత మంది పిల్లలని కాని, వాళ్ళపేర్లు కానీ చెప్పలేదు అయినా అమ్మకు తెలియంది ఏముంది కనుక.

ప్రతి కార్తీక పౌర్ణమికి అమ్మవాగుకు 6గం॥కు స్నానానికి వెళ్ళేది. వీళ్ళ కుటుంబం కోసం ఇంకా కొందరి కోసం అమ్మ వేచివుండటం చూస్తే ఆశ్చర్యమనిపించింది. "అందులో కొందరు అల్పులమైన మా కోసం నిరీక్షించావా అమ్మా!" అని అడిగారు అమ్మకు అల్పులని, అధికులని, ఇష్టులని, అయిష్టులని ఉండదు కదా!

అమ్మ బిడ్డలతో కలసి వాగులో స్నానం చేసి దధ్యోజనం పంచి జ్యోతులను నీటిలో వదిలింది. అంతా ప్రసాదం తింటున్నారు. అంతలో అమ్మవాగులోకి దిగింది. అమ్మ వచ్చిందన్న ఆనందంతో ఆ స్రవంతి పరవళ్ళు తొక్కుతూ ప్రవహించసాగింది. అమ్మ గంగా భవానితో మాట్లాడాలనేమో నీటిలో మునిగింది. అమ్మలోని అతిమానవత అర్థంకాక, కొద్ది నిమషాల వరకూ నిబ్బరంగావున్నా తరువాత అమ్మ కనిపించలేదన్న భీతి చిన్నపిల్లలకు, మొదలైంది. కొద్దిసేపు తరువాత అమ్మ జలకన్యలా దర్శనమిచ్చింది.

సాగర్ అన్నయ్య చెప్పటం వల్ల బీజప్రాయంగావున్న నమ్మకం ఈ సంఘటన సందర్శనంతో అంకురించింది. చిన్నపిల్ల అవటం వల్ల ఝాన్సీ అమ్మ అత్తగారైన బామ్మను "అమ్మకు ఈతవచ్చా?" అని అడిగింది. "లేదని చెప్పింది" బామ్మ. అసలు అమ్మ దేన్నైనా నేర్చుకోవటమేమిటి? అన్నీ అమ్మకు నేర్చిన విద్యలే. కాళిదాసు పార్వతిని వర్ణిస్తూ కుమారసంభవంలో "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా" అన్నట్లు అమ్మకు నేర్చుకోవాల్సిందంటూ ఏమీ వుండదు.

అంత ఉధృతంగా ప్రవహించే నీళ్ళలో మునిగి అంతకాలం వుండటమనేది సామాన్యులకు సాధ్యం కాదు. అందువల్లే అమ్మ అసామాన్య, మాన్య.

వేసవి సెలవులకు, సంక్రాంతి సెలవులకు మేనమామల ఇళ్ళకు వచ్చినట్లుగా అనేకులు జిల్లెళ్ళమూడి వచ్చేవారు. ఎన్ని రోజులున్నా ఎవరూ ఏమనకపోవటం, స్వతంత్రంగా ఉండగల్గటం వల్ల అమ్మ యొక్క అవ్యాజప్రేమ అర్ధమవుతుంది. ఆ తరువాత సాగర్ అన్నయ్య వాళ్ళ కుటుంబం కష్టాల కొలిమిలో కూరుకుపోయినప్పుడు అమ్మవారికి ఆశ్రయమిచ్చింది. బాపట్లలోవున్న వాళ్ళమేడ అమ్మవలసిన పరిస్థితి ఏర్పడింది.

కొన్నివేల సంఖ్యలో డబ్బు అవసరమైంది. "తెప్పలుగ చెఱువు నిండిన కప్పలు పదివేలుచేరు" అన్నట్లుగా బంధుమిత్రులంతా నిమ్మకు నీరెత్తినట్లు నిర్లిప్తంగా వూరుకున్నారు. సాగర్‌గారి తల్లి ఒకస్థాయిలో వున్నా కూడా వీళ్ళ కుటుంబాన్ని ఆదుకోవాలన్న ఆలోచనే ఆమెకు రాలేదు. అప్పుడు ఆపదలో ఉన్న బిడ్డడ్ని ఆదుకోవటం తల్లిగా తన కర్తవ్యమని తలచి అమ్మ తన ఒంటిమీద నగలు కొన్ని ఇచ్చి ఇబ్బందుల నుండీ ఇవతలబడు నాయనా!" అన్నది. లౌకికంగా ఏ సంబంధబాంధవ్యాలు లేని సాగర్ గారికి అమ్మ ఎందుకివ్వాలి? అదే అమ్మలోని మాతృత్వం. దానికి పరిధులు లేవని ఇటువంటి సంఘటనల వల్లే మనకు విదితమౌతుంది.

సాగర్ అన్నయ్య మాత్రం అయాచితంగా, అనాలోచితంగా, అప్రయత్నంగా వచ్చిన ధనాగమనాన్ని చూచి చకితులయ్యారు. ఆ సమయంలో అమ్మ వద్ద అధరాపరపు శేషగిరిరావన్నయ్య, వరఝా శివరామయ్యగారు మరికొందరు సోదరులు వున్నారు. వారు నోటమాటరాక అలాగే కూర్చున్నారు. సాగర్ అన్నయ్య ఆ నగలు తీసుకువెళ్ళి రాజ్యలక్ష్మక్కయ్యకు చూపించాడు. అమ్మంతట అమ్మ ఇచ్చినా తీసుకోకూడదని" అక్కయ్య అన్నది. తిరిగి తీసుకోవటానికి అమ్మ నిరాకరించింది. అవసరం గడుపుకురమ్మని ముందుకు

సాగిపొమ్మని మందలించింది. ఇటువంటి సంఘటనలను పరిశీలిస్తే మిగిలిన తల్లులు ప్రవర్తించే తీరు, అమ్మ అందరిపట్ల వ్యవహరించే తీరు వేరనిపిస్తుంది. నదీరా "తక్కిన వేల్పుల తీరు వేరు మా తల్లి తీరువేరు మొక్కిన వారికి మొక్కని వారికి మోక్షమిచ్చు తీరు" అని తల్లులే కాదు దేవతల తీరు కూడా వేరే అని రాశాడు.

సాగర్ అన్నయ్య అమ్మ నామసంకీర్తన అఖండంగా నిర్వర్తించి అమ్మలో ఐక్యం అయినారు. రాజ్యలక్ష్మి అక్కయ్య తనకంటూ ఒక స్థానాన్ని నిలబెట్టుకొని అక్కడ జరిగే పెళ్ళిళ్ళు, పేరంటాలు అన్నింట్లో పాల్గొనేది. కొమరువోలు సరోజినక్కయ్య కూడా అన్నింటికీ నడుంబిగించి నిలబడేది. అమ్మ సన్నిధిలో ఆనందాన్ని అనుభవించి ఆవలిగట్టుకు చేరుకున్నది అక్కయ్య. జోత్స్న డాక్టరుగా, రమణ, సావిత్రి, హైమ వారివారి కాపురాలు చేసుకుంటున్నారు. ఝాన్సీ మాతృశ్రీ ఓరియంటల్ కళాశాలలో రీడర్‌గా పనిచేస్తోంది. పోతుకూచి రవి, అమ్మ హృదయంలో ప్రత్యేకతను నిల్పుకున్న అమరజీవి.

+ + +

వఝా శివరామయ్యగారు అమ్మ అనుంగు బిడ్డలలో ఒకరు. వారి కుటుంబం అంతా అమ్మను అర్చించేవారే. ఆయన మొదటిసారి వాళ్ళ పెద్ద అబ్బాయిని తీసుకొని జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అమ్మ కాఫీ కొంచెం తాగి శివరామయ్య గారికి ఇచ్చింది. ఆయన ఆనందంతో స్వీకరించారు. పక్కనే కూర్చున్న ప్రసాద్‌కు ఎంగిలి అని అనిపించింది. అతనికీ అమ్మ అలాగే ఇచ్చింది. ఇచ్చింది అమ్మే అవటంతో ఏమీ అనలేక, ఇష్టం లేకపోయినా నాన్నగారే త్రాగిన తరువాత తాను కాదంటే భావ్యం కాదని ఎలాగో తాగాడు. ఆ తరువాత అమ్మ దగ్గరకు తరుచూ వెళ్ళేవాడు.

ప్రసాద్ కంటే రవి అన్నయ్య, బాబూరావు చిన్న వాళ్ళయినా జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు కలసి ఆడుకునేవారు. బాబూరావు శ్రీ అధరాపరపు

శేషగిరిరావన్నయ్యకు కుమారుడు. ప్రసాద్ 18 సంవత్సరాల వయస్సులోనే ఉద్యోగంలో చేరాడు. ప్రసాద్ తమ్ముడు మల్లు ఉద్యోగంలో చేరకముందు అమ్మవ్యాన్‌కు డ్రైవరుగా వుండి సేవ చేసుకున్నాడు. ప్రసాద్ సిగరెట్లు బాగా తాగేవాడు. అమ్మ దర్శనంకు వెళ్ళినప్పుడు తప్పించి మిగిలిన సమయాల్లో సిగిరెట్లు ఊదేసేవాడు.

ఆత్మ సాక్షాత్కారం అంటే ఏమిటో, దాన్ని సాధించటానికి చేయవలసిన మార్గాల గురించి అన్వేషిస్తుండేవాడు. 1966లో భరద్వాజ, ప్రసాద్ కలసి హైద్రాబాద్ నల్లకుంటలో వుండేవారు. తరచు భరద్వాజే వంట చేసేవాడు. వేదవ్యాస్ గారు భరద్వాజ అన్నగారు. ఆయన ఇల్లు కట్టించుకుంటున్నారు. అక్కడికి రాజుగారు తరచుగా వచ్చేవారు. ఆయనతో కలసి రమణ మహర్షి సాహిత్యాన్ని ఔపోసన పట్టాడు. భరద్వాజ షిర్డీసాయి భక్తుడు. ఒకరు వచ్చి సాయిబాబా భక్తుడ్ని అని బిక్ష వేయమని అడిగాడు. రెండు కాగితాలు తీసుకురమ్మని వాటిలో విభూది వేసి లోపల పెట్టి రమ్మన్నాడు. మళ్ళీ వచ్చి ఆ కాగితాలు తీసుకురమ్మన్నాడు. భరద్వాజ దాంట్లో చేమంతి పువ్వు, ప్రసాద్ దాంట్లో బియ్యంగా ఆ విభూది మారిపోయింది. ఆశ్చర్య జనితులయ్యారు. భరద్వాజ పూవును పూజలో పెట్టుకోమన్నాడు. ప్రసాద్‌ని ఏమైనా కోరిక వుంటే కోరుకొని ఒకరాగికాణి, బియ్యం బావిలో వేయమన్నాడు. ఆత్మసాక్షాత్కారాన్ని కోరుకున్నాడు ప్రసాద్.

"ఇంట్లో వాళ్ళు పెళ్ళికి తొందర చేయసాగారు. తనకు సన్యసించాలని కోరిక వుండటంతో శ్రీశైలం వెళ్ళాడు. కృష్ణాష్టమికి ముందు రోజు సప్తమినాడు అన్ని వదిలేసి కౌపీనం మాత్రం ధరించి కొండమీద తపస్సు చేయనారంభించాడు. 1963లో అమ్మ గోరు లోపల పెట్టి, చేయించిన తాయత్తును మాత్రం మొలలో కట్టుకున్నాడు. దాన్ని తీయటానికి మనస్సు ఒప్పుకోలేదు. ఎంత ప్రయత్నించినా ధ్యానం కుదరలేదు. అమ్మ దగ్గరే

ఎంతో హాయిగా, ఆనందంగా అనిపించి దాన్ని మించిన ఆత్మసాక్షాత్కారమేముందని" పించింది.

వెంటనే తెల్ల చొక్కా, లుంగీ ధరించాడు. ఇంటికి వెళ్ళాలన్నా చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు. ఏమి చేయాలో తోచక శ్రీశైలంలో తిరుగుతున్నాడు. ఒక గృహస్తు కృష్ణాష్టమికి బ్రాహ్మడికి భోజనం పెట్టాలంటూ అతన్ని తీసుకువెళ్ళి షడ్రసోపేతంగా భోజనం పెట్టి దక్షిణ తాంబూలం ఇచ్చాడు. దానితో తనకు కావల్సింది జిల్లెళ్ళమూడిలోనే ఉన్నదని తిరిగి అమ్మ దగ్గరకు వచ్చాడు. ప్రసాద్‌ను చూడగానే అమ్మ "తెల్ల గుడ్డల సన్యాసి వచ్చాడురా!" అని శేషగిరిరావన్నయ్యతో చెప్పింది. తాను సన్యసించటానికి నిశ్చయించుకొని వెళ్ళినట్లు ఎవరికీ చెప్పలేదు. అమ్మ సర్వజ్ఞ కదా! అమ్మకు తెలియనిదేముంటుంది? హైమ, ప్రసాద్ కూర్చుని వుండగా "వీడిని చూస్తే వేమన బొమ్మ గుర్తుకు వస్తుందని, వీడు బొమ్మ కాదు యోగి వేమనే" అని చెప్పింది అమ్మ.

ప్రసాద్ అమ్మ దగ్గరకు వెళ్ళి "నేను బాపట్ల వెళ్ళను. అక్కడికి వెళితే పెళ్ళి చేసుకోమని గొడవ చేస్తారు. చేసుకోనంటే అమ్మ ఏడుస్తుంది". అన్నాడు. అప్పుడు అమ్మే అతనికి డబ్బులిచ్చి హైద్రాబాద్ పంపించింది. వాళ్ళ నాన్నగారు వారం రోజుల తరువాత వెళ్ళి జిల్లెళ్ళమూడికి తీసుకువచ్చారు. అమ్మమాయావి. తనకు ఏమీ తెలియదంటూనే అవతలి వారి ఆలోచనలలో, నడవడికలో మార్పు తీసుకువస్తుంది. అందుకే వారం రోజులకు తను డబ్బులిచ్చి మరీ పంపించింది.

ఆ రోజుల్లో అమ్మ పూరిపాకలో వుండేది. అమ్మ గంధపు రంగుతో మెరిసిపోతుంది. కట్టుకున్న చీరె రంగు అమ్మ శరీరంపై ప్రతి ఫలించి వింత సోయగాలన్నీ కల్గిస్తోంది. నుదుట రూపాయికాసంత బొట్టుతో ముక్కుకుబులాకీతో, కాళ్ళకు బంగారు పట్టీలు కాలివ్రేళ్ళకు బంగారు మట్టెలతో

చిన్ననవారు మంచం మీద కూర్చున్న మనోహర మనోజ్ఞమూర్తి రూపుదాల్చి తన బిడ్డల రక్షణకై ఆ రూపంలో అవతరించిందనిపించింది. అరుణను చూచి మృదుమధుర స్వరంతో పలకరించి అరుణకు అవ్యక్తమైన ఆనందాన్ని కలుగచేసింది అమ్మ. తొలిచూపులోనే అమ్మ యందు విశ్వాసం అంకురించి అమ్మే సర్వస్వమనిపించింది.

అమ్మతో "నాకు ఇంకా చదువుకోవాలని ఉన్నదన్నది. దానికి అమ్మ 'పెద్దవాళ్ళ నిర్ణయం ప్రకారమే పెళ్ళి జరుగుతుందని" చెప్పింది. అమ్మ సర్వజ్ఞురాలు కనుకనే భవిషత్ వాణిని తెలియజేసింది. జిల్లెళ్ళమూడి వెళ్ళటానికి కారకులైన వఝా శివరామయ్యగారి జేష్ఠ కుమారునితో వివాహం నిశ్చయం చేసింది. పెళ్ళి కుదిరిన తరువాత ఒక రాత్రి అమ్మ శరీరం మీద గల వస్తువును శాశ్వతమైన తన చిహ్నంగా ప్రసాదిస్తే బాగుండునని తోచింది. అరుణకు మర్నాడే ఆమె మామగారైన వఝా శివరామయ్య గారు అమ్మ తన మెడలోని నల్లపూసలలోని కొన్ని పూసలు, బంగారుపూస ప్రసాదించిందని చెప్పారు. అరుణ ఆశ్చర్యానందాలలో ఓలలాడింది. "దైవం తలుస్తేనే నీవు తలుస్తావు" అన్న అమ్మ సూక్తికి నిదర్శనము? మరియు బిడ్డల అభిమతాలను ఈడేర్చే కల్పతరువు? అని అనిపించింది.

పెళ్ళి చూపులు ఏర్పాటు చేసారు. ప్రసాద్ చేసుకోనంటే "పోనీ ఒక్కమాటు పిల్లను చూడు నీకు ఇష్టమైతేనే పెళ్ళి చేసుకుందువు గాని అంటూ తన మేనకోడలు అరుణను చూపించింది. అమ్మ మాట తిరస్కరించలేక పెళ్ళి చూపులకు ఒప్పుకున్నాడు. పిల్ల నచ్చటం ఇద్దరూ కలసి అమ్మకు పూజచేసుకోవటం జరిగింది.

పెళ్ళికి జిల్లెళ్ళమూడికి తరలి వెళ్ళారు. అమ్మ సర్వాలంకార భూషితయై తెల్లని పట్టు చీరెలో దేదిప్యమానంగా వెలిగిపోతుంది. అమ్మ యొక్క దివ్యమంగళ స్వరూపాన్ని చూస్తూ మైమరచింది. ఆ పిమ్మట అమ్మ కట్టుకున్న చీరపైకి

మళ్ళీ దాని అందచందాలు చూచి ఎంత బాగుందో అనుకున్నది. ఆ చీరె అమ్మ తనకిస్తే బాగుండునన్న స్వార్థం తలెత్తింది. మర్నాడు అమ్మ అరుణను పెళ్ళి కూతుర్ని చేస్తూ ఆచీరెనే పెట్టింది. ఇది అమ్మ యొక్క అవ్యాజకరుణకు తార్కాణము. దానితో అకుంఠితమైన విశ్వాసం ఏర్పడినది.

వీళ్ళ పెళ్ళినాడే పోతుకూచి రవి ప్రాణోత్క్రమణ సమయం. అతను పెళ్ళి కూతుర్నీ, పెళ్ళి కొడుకుని పసుపు బట్టలతో చూడాలని కోరిక వెలిబుచ్చాడు. అతని కోరికను తీర్చటానికి అతని ప్రాణాన్ని నిలిపింది. వారి వివాహం అయిన తరువాత వారిద్దర్నీ చూచి రవి ఆనందించాడు. ఆ మరుక్షణమే అతని ప్రాణం అనంతవాయువులో కలసిపోయింది.

రవికి దహన సంస్కారాల నిమిత్తం అమ్మ శ్మశానవాటికకు వెళ్ళింది. తిరిగివచ్చి నేను స్నానంచేసి వస్తాను. బువ్వం బంతికి ఏర్పాటు చేయండి అని చెప్పిన స్థిత ప్రజ్ఞ అమ్మ. అమ్మ దృష్టిలో ఖేద మోదాలు రెండూ ఒక్కటే ద్వంద్వాతీతమైన అమ్మకు వీటితో పనేముంది? అటుపిమ్మట వైభవంగా బువ్వం బంతి జరిపించింది అమ్మ. "మీ పెళ్ళి జరిగినట్లు ఎవ్వరిదీ జరగలేదని" రామకృష్ణ అన్నయ్య అన్నాడు. అమ్మ సన్నిధిలో ఏ వేడుకైనా దివ్యంగా జరుగుతుంది. ఎందుకంటే అమ్మదివ్యాశీస్సులుంటాయి. జరిపేది అమ్మే అయినప్పుడు ఆనందానికి తప్ప వేరే దానికి ఆలోచనేముంటుంది. ఎవరు ఏ వేడుక అక్కడ జరిపించుకున్నా తమకే అమ్మ ప్రాముఖ్యత ఇచ్చిందనిపిస్తుంది.

శివరామయ్యగారు మరణించినప్పుడు అరుణ బాపట్లలో వుంది. ప్రసాద్‌కు వున్నట్లుండి మరణ భయం పట్టుకుంది. దానితో తిండికి నిద్రకూ దూరమయ్యాడు. ఆ భయం నుంచి మనస్సును మరల్చుకోలేకపోయాడు. అది చూచిన మల్లు భరించలేక అమ్మ దగ్గరకు వెళ్ళి "నాన్నగారిని పోగొట్టుకున్నాం. అన్నయ్య పరిస్థితి ఇలా వుందేమిటని" వ్యధచెందాడు. అమ్మ ఒక ఆపిల్ పండు, బురదగా వున్న తీర్థం పంపింది. అరుణ, మల్లు హైద్రాబాద్

వెళ్ళేటప్పటికి ఆ పండు కొంతభాగం కుళ్ళింది. ఆ తీర్థం దుర్వాసన వేయసాగింది. అలాంటిపండు, ఆ తీర్థం ససేమిరా తీసుకోనని ప్రసాద్ మంకుపట్టు పట్టాడు. అమ్మ స్వయంగా ఇచ్చింది కాబట్టి ఆ ప్రసాదం, తీర్థం తీసుకోవాల్సిందేనని మల్లు పట్టుబట్టాడు. అవి స్వీకరించిన తరువాత ఎటువంటి భయం రుగ్మత లేక హాయిగా వున్నాడు. ఎప్పుడైతే ప్రసాద్‌కు తగ్గిందో ఆ తీర్థం సువాసనలు వెదజల్లసాగింది. అతనిలోని భయాందోళనలు ఎంత ఎక్కువగా వున్నాయో వాటి ద్వారా తెలియబరిచింది. తగ్గిన వెంటనే ఆ తీర్థం సువాసనలు వెదజల్లటం అమ్మ యొక్క అనురాగానికి ప్రతీక.

ఆ తరువాత ప్రసాద్ అమ్మ దగ్గరకు వెళ్ళినప్పుడు "ఏ రోగం లేదు, భయం లేదని" వీపుమీద చరచి చెప్పింది. అసురసంధ్యవేళ అమ్మ చుట్టూ వీళ్ళంతా కూర్చుని వున్నారు. అమ్మవంక చూస్తుండగానే అమ్మ అదృశ్యమై శూన్యంగా తోచింది. వీళ్ళంతా నిర్ఘాంతపోయి, తర్కించుకుంటుండగా అమ్మ మామూలుగా కనిపించి అందర్నీ ఆశ్చర్యచకితులను చేసి ఆనందపరచింది.

+ + +

వరఘా మల్లికార్జున ప్రసాద్ వరఘా శివరామయ్య గారి కుమారుడు. "ఉద్యోగం రాక పూర్వం అక్కడ అమ్మ వుండమన్నది. నా మనస్సు చంచలమైనది. ఈ ఆడపిల్లల మధ్య వుండటం మర్యాదగా వుండదని" అన్నాడు. "ఈ జిల్లెళ్ళమూడిలో నీకు అటువంటి ఆలోచనలు ఏమీ రావు నాన్నా!" అన్నది అమ్మ. శివరామయ్య గారు మరణించిన తరువాత దుఃఖిస్తుంటే "నాన్నను చూపించలేను కానీ, నాన్నలా చూచుకుంటానని" అమ్మ చెప్పింది.

అమ్మ కాళ్ళు నొక్కమంది. కాళ్ళు నొక్కుతుంటే కాళ్ళంతా జుట్టు వుంది. వాళ్ళ నాన్న గారు కాళ్ళు పిండమనేవారు. అమ్మ అలాగే పిండమంది. కాండ్రించి ఉమ్మటంతో వాళ్ళ నాన్నగారిలా అనిపించి "నాన్నగారూ" అని పిల్చాడు "రూపం చూపించలేనన్నావుకానీ, రూపం చూపించావు కదమ్మా" అని పరవశించిపోయాడు.

"170 రూపాయలలో 40 రూపాయలు ఇంటి అద్దె మిగిలిన డబ్బుతో సంసారం ఎలా చేయాలని?" అమ్మ ఫోటోను బయటకు విసిరేసాడు. మల్లు స్నేహితుడు "ఆ ఫోటోను తీసుకువచ్చి అదేమిటి ఫోటో అలా పారవేశావేమని" అన్నాడు. ఎవరో స్నేహితుడు 60 రూపాయలు ఇవ్వాలని దానికి మరో నలభై కలిపి వందరూపాయలు మల్లూకి ఇచ్చాడు. ఆ తరువాత ఆ స్నేహితుని అడిగితే తాను తీసుకురాలేదన్నాడు. అమ్మే ఆ రూపంలో వచ్చి వుంటుందనుకున్నాడు.

మేము చాలా అవస్థల్లో వున్నప్పుడు చక్రవర్తిగారు తట్టుకోలేక ఫోటోలు తీసేసేవారు. అలా తీసినప్పుడల్లా, రామకృష్ణ అన్నయ్య, ప్రిన్సిపాల్ రాధాకృష్ణ శర్మగారు, భ్రమరాంబక్కయ్య మా అమ్మగారు ఇలా ఎవరో ఒకరు రావడంతో ఏమీ ఎరుగనట్లు ఆ ఫోటోలన్నీ సర్దిపెట్టేవారు.

అమ్మ పెద్ద కొడుకు సుబ్బారావన్నయ్య ప్రెస్ పెట్టాడు. దానికి చెక్ ఇస్తామన్నారు, గుంటూరు వెళ్ళి తీసుకురమ్మన్నాడు సుబ్బారావన్నయ్య. అమ్మకు నమస్కారం చేసుకొని బొట్టు పెట్టించుకొని 7వ మైలురాయి వద్దకు వెళ్ళి టైమ్ చూస్తే 11 గం॥లు అయింది. లారీ ఏదైనా వస్తుందేమోనని చూచిచూచి, చివరకు అమ్మ నామం పెద్దగా చేస్తూ వెళ్ళాడు. ఇంతలో ఎవరో వీపు మీద గట్టిగా చరిచారు. దానితో కాలు క్రిందపెట్టకుండా చూస్తే పెద్దపాము చరచరా పాకుతూ వెళ్ళింది. అమ్మ తన్ను రక్షించటానికే అలా చేసిందని మనస్ఫూర్తిగా నమస్కరించుకున్నాడు. ఇంతలో బస్సు వస్తే అందులో ఎక్కివెళ్ళాడు. ఆ బస్సు చెడిపోతే బాగుచేసి తీసుకువెళ్తున్నారు. పాసింజర్సు ఎవరూలేరు. మల్లూ ఇబ్బందికి లోను కాకుండా అమ్మే ఆ బస్సు వచ్చేటట్లు చేసింది.

వాళ్ళ బాబు పుట్టినప్పుడు లేబర్‌రూమ్‌లోకి పంపేటప్పుడు దిండు క్రింద అమ్మ ఫోటో పెట్టి పంపించాడు. దాన్ని అనుమతించనని డాక్టరు సుధాకిరణ్ చెప్పింది. "చచ్చి పోయినా సరే ఫోటో లేకుండా పంపించనని" అన్నాడు. చేసేదేమీ లేక డాక్టరు ఒప్పుకుంది.

డాక్టరు రూ. 1800/- అయిందని చెప్పి, మీరు ఇబ్బందుల్లో వున్నారు కాబట్టి తన ఖర్చుల నిమిత్తం రూ. 650/- ఇవ్వమంది. అమ్మ పెళ్ళికి ఇచ్చిన నల్లపూసలు అమ్మితే రూ. 650/- వచ్చాయి. డాక్టరు గారికి రూ. 500 ఇచ్చి ఖర్చులకు రూ. 100/- వుంచుకొని రూ. 50/- అత్తగారిని, మరదల్ని వాళ్ళను ఊరికి పంపించటానికి అట్టే పెట్టుకున్నాడు. మిగిలిన రూ. 150/- డాక్టరు మీకు ఫరవాలేదనుకున్నప్పుడు తెచ్చిఇవ్వమంది.

"పెళ్ళికి నీవు పెట్టిన గొలుసును అమ్మేసాను, నక్సలైట్లు వాళ్ళు కాదు నేనే అని" రాసాడు. బాబు పుట్టినప్పుడు శాంతి చేయించాలని అన్నారు. మల్లుకు వాటి మీద నమ్మకం లేక అమ్మతో చెప్పాడు. వెంటనే అమ్మ పాదుకలు తెప్పించి వాటిని తొడుక్కొని వాటికి తాను పూజ చేస్తూ, మల్లుని పూజ చేసుకోమంది. వాటిని తీసుకువెళ్ళి మీ ఇంట్లో పూజలో పెట్టుకోమన్నది. వాళ్ళ నాన్నగారి మాసికానికి కొబ్బరికాయ కొట్టాలని అమ్మ దగ్గరకు వచ్చాడు. అమ్మ వెంటనే కారెక్కమంది. బాపట్ల, అప్పికట్ల దాటిన తరువాత విజయవాడలో రైల్వే కాలనీలోని వారింట్లో స్నానం చేసి వచ్చి కొబ్బరికాయ కొట్టుకోమంది. "సరిగా వాళ్ళ నాన్న గారి మాసికం ఆ రోజు అయిందని" అమ్మ చెప్పింది.

ఉద్యోగరీత్యా విజయనగరం ఆర్.టి.సి.లో పనిచేస్తున్నాడు. భార్యసీత, వారికి లలిత అని ఒక కూతురు, ఒక బాబు వున్నారు. మొదట్నుంచీ అమ్మ యందు అనురక్తి మెండు. ఏగూటి చిలుక ఆగూటి పలుకు పలుకుతుందన్నట్లుగా పిల్లలకీ అమ్మ యందు భక్తి ఎక్కువ లలితకు వివాహమైన తరువాత అమ్మను ఈ విధంగా కొలుచుకోవటానికి వీలు వుంటుందో లేదో అనే బెంగ. అందుకని "నీవు అంటే ఇష్టమున్న సంబంధమే వచ్చేటట్లు చేయమని" అమ్మను కోరుకుంది. అమ్మ వాంచితార్థ ప్రదాయని కదా! అదే విధంగా అమ్మ పుట్టింటి వారైన మన్నవ భూషణంగారి అబ్బాయి కృష్ణసేన్‌తో వివాహం జరగటం అమ్మ కరుణకు నిదర్శనం.

హైద్రాబాద్‌కు పెళ్ళి చూపులకు వెళ్ళటానికి మంగళవారం బయలుదేరాల్సి వచ్చింది. మల్లుకు మంగళవారం పట్టింపు ఎక్కువ. ఏ పని చేయడు. అటువంటిది జీవితంలో అతి ముఖ్యమైన దానికే మంగళవారం ప్రయాణం కావాల్సి వచ్చిందని మధనపడ్డాడు. చివరకు చేసేదేమీ లేక విజయనగరం నుంచి ముందుగా విశాఖ అమ్మ మందిరంలో అమ్మను దర్శించుకొని వెళ్ళమని చెప్పాడు. అతని భార్య సీత కూతురు లలిత అలాగే అమ్మకు నమస్కరించుకుని వెళ్ళారు. ఎటువంటి ఒడిదుడుకులు, ఆటంకాలు లేకుండా పెళ్ళి జరగటం అమ్మ కరుణాకటాక్షాలే కారణం. కొడుకూ, కోడలు విశాఖపట్నంలో వుంటూ వారం వారం జరిగే పూజల్లో తరచూ పాల్గొంటున్నారు.

మల్లూ భార్య చికాకులకు తట్టుకోలేక అమ్మను తెగ తిట్టుకుంది. ప్రతి చిన్న విషయానికీ అలా బి.పి. తెచ్చుకోకూడదని చెప్పాడు. ప్రొద్దున్న లేచేటప్పటికి మూతి, చేయి, కాలు వంకరపోయాయి. అది చూచి మల్లూ కంగారుపడి అమ్మ కుంకుమ పెట్టి పక్కింటి ఆవిడ సాయంతో బట్టలు మార్పించి ఆసుపత్రికి తీసుకువెళ్ళాడు. వెంటనే మూడు ఇంజక్షన్స్ ఇచ్చారు. ఆ తరువాత ముద్దగా మాట వచ్చింది. మూడవ రోజు గోడ పట్టుకుని నడిచింది. మూడు వారాల తరువాత మామూలుగా నడవ గలిగింది. "నీవే తప్ప ఇతఃపరం లేదు అంటేనే చేస్తుంది అమ్మ" అని చెప్పాడు. సీతకు నయమైతే మండలదీక్ష సలిపి అమ్మకు మల్లూ తలనీలాలిస్తానని మొక్కుకున్నాడు.

సీత మామూలుగా నడవగలగటం చాలా ఆశ్చర్యకరమయిన విషయం. వాళ్ళ అమ్మాయి లలిత అమ్మకు పెరాలసిస్ వచ్చిందని చెప్పింది. అటువంటిది సీత విశాఖపట్టణంలో వున్న అమ్మ మందిరంకు రావడానికి అమ్మ యొక్క కరుణామృతవృష్టియే కారణం.

ఫిబ్రవరి 17 నాన్నగారి ఆరాధనోత్సవానికి మల్లూ వచ్చి దీక్షని విరమించి అమ్మకు తలనీలాలు సమర్పించి తన మొక్కును తీర్చుకున్నాడు. త్రికరణశుద్ధిగా అమ్మను నమ్మి అమ్మ ధ్యానమననాధులతో జీవనం సాగిస్తున్నాడు.

+ + +

సింగుపాలెం జానకి తొట్టెం పూడి రాఘవయ్య, సత్యవతమ్మ దంపతుల ప్రథమ పుత్రిక. జిల్లెళ్ళమూడిలో స్థిర నివాసమేర్పరుచుకున్న యార్లగడ్డ రాఘవయ్య గారు, భాస్కరన్నయ్యలతోపాటు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించి అమ్మ అనురాగ జలధిలో ఓలలాడిన అదృష్టవంతురాలు.

అందరింట్లో ఏపని చేయవలసి వచ్చినా అది ఆడపని, మొగపని అని తేడా లేకుండా చేసేది. పునాదులు తీయాల్సివచ్చిన నాట్లు, కోతలు, నూర్పిళ్ళు మొ॥ పొలం పనులను కూడా పవిత్ర ఆరాధనా భావంతో చేసేది. భగవంతునితో సామీప్యాన్ని ఏర్పరుచుకున్న ధన్యజీవి. అమ్మ జీవిత చరిత్ర, అమ్మ చెబుతుంటే రాయగల్గిన అదృష్టజీవి జానకి అక్కయ్య.

పదిపన్నెండు సం॥ల వయస్సు నుంచే అమ్మను సేవించుకుంది. తల్లిదండ్రులు వరుని కొరకు అన్వేషణ మొదలుపెట్టినప్పుడు అమ్మ కేశవన్నయ్య చేత జానకికి ఒక ఉత్తరం రాయించింది. సకల లక్షణ సంపన్నుడైన భర్త కావాలా? సకల దుర్లక్షణ సంపన్నుడు కావాలా? ఎలాంటి భర్త కావాలో కోరుకోమన్నది. దానికి జానకి జవాబుగా "అమ్మ ఎవరిని భర్తగా ప్రసాదిస్తే వారిని దైవంగా స్వీకరించటమే తన కర్తవ్యమని" చెప్పింది.

అక్కయ్య పెళ్లికి అమ్మ సింగుపాలెం వెళ్ళినప్పుడు ప్రతి ఇంటికీ వెళ్లి అందరికీ తన దర్శనభాగ్యాన్ని కలుగచేసి ఆరాధించుకునే అవకాశాన్నిచ్చింది. సింగుపాలెమే బృందావనంలా అమ్మ బృందావనంలోని కృష్ణుడిగా సంచరించింది. మరి జానకి బృందావనంలోని రాధిక అని అమ్మ భావనేమో. రాధభక్తిని గూర్చి చెపుతూ కృష్ణుని ఉఛ్వాస నిశ్వాసాలే రాధ అని చెప్పింది. వారి సంబంధం అద్వైతస్థితి వంటిది. అలాగే జానకికీ తనకు అంతటి అద్వైత సంబంధం వుందని అమ్మ మనకు తెలియచేసిందేమో.

జానకికి కూడా అమ్మను గూర్చిన నిరంతర చింతన ఉండేది. ఆ

ఆలోచనలతోనే జానకి భర్త సేవ, బిడ్డల సేవ, గొడ్లసేవ దేనిలోనైనా అమ్మనే దర్శించి అమ్మసేవగా భావించింది. జిల్లెళ్ళమూడి నుండి ఎవరు వెళ్ళినా వారి పట్ల ఆమె చూపే ఆదరణకు, ఆప్యాయతకు అవధులు లేవు.

తప్పుచేసినా మన్నించే క్షమాగుణం ఆదరించే అతి మానుషతత్వం ఒక్క అమ్మకే ఉందనుకునే వాళ్ళం. జానకిలో కూడా అలాంటి క్షమాగుణం ఓర్పుని నిబిడీకృతమై ఉండేది. శారీరకంగా, మానసికంగా తను ఎంత చిత్రవధకులోనైనా ముఖంపై చిరునవ్వు ఎప్పుడూ చిందులు తొక్కుతూనే వుండేది. ఆ కళ్ళలో, ఆ మాటలో, ఆ చేతలో, ఆమె ప్రతి కదలికలో ఏదో అనిర్వచనీయమైన ఆత్మీయతాభావం తొణికిసలాడుతుండేది.

అభిమానం, పట్టుదల తన రక్తంలో జీర్ణించుకుపోయాయి. ఎవరు చిన్న సాయం చేసినా జీవితాంతం గుర్తుపెట్టుకొని, తనలోని బాధను ఎవరికీ తెలియనిచ్చేదికాదు. తనకు అపకారం చేసిన వారిని క్షమించేది. ఒక ఆదర్శ గృహిణిగా, ఒక పతివ్రతగా, భర్తను సేవించింది. తల్లిగా తన బిడ్డలను పెంచి పెద్దచేసింది. భర్త అర్థాంతరంగా వదిలి వెళితే బరువు భాధ్యతలను మాటరాకుండా నెరవేర్చింది. వీటన్నింటినీ ఒక ధర్మంగా నిర్వర్తించింది. తామరాకుమీద నీటిబొట్టులా దేనికీ అంటకుండా వుండేది. వీటన్నింటినీ వదిలి పెట్టాల్సి వచ్చినప్పుడు కూడా ఎటువంటి సంకోచం, సంశయం లేకుండా నిశ్చలంగా, నిర్మలంగా, నిర్వికారంగా, నిర్మమకారంగా, నిస్సంగంగా వదిలి పెట్టింది.

అంత అనురాగమూర్తిలో ఇంత విరాగం మూర్తీభవించిందని ఎవరూ ఊహించలేదు. సర్వత్ర అనురాగమే విరాగం అన్నమాటను తల్లక్రిందులు చేసి విరాగినియైనది. నీ బాధ్యతలను పూర్తి చేశావు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మసేవలో కాలం వెళ్ళబుచ్చమని అడిగితే ఆ సమయం వచ్చినప్పుడు వస్తాను అనేది.

అమ్మసేవలో, అమ్మ ఒడిలో కన్నా, అమ్మలో కలిసిపోవటానికే ప్రాధాన్యతనిచ్చిన ధన్యజీవి జానకి. తన జీవితమంతా బాధలనే పూజా పుష్పాలతో బాధల భగవంతుడ్ని ఆరాధించి తన విశ్వాసాన్ని శ్వాసలో మిళితం చేసి ఆఖరి శ్వాసను అమ్మలో కలిపి, అమ్మలో కలిసిపోయిన ఆదర్శమూర్తి సింగుపాలెం జానకి.

+ + +

అమ్మ పెద్దకుమారుడు బ్రహ్మాండం సుబ్బారావు. "పది నెలలనాడే చాలా చురుకుగా మాటలు వచ్చాయని తన వయస్సు పిల్లల కంటే చాలా జ్ఞాపకశక్తి కలవాడు, తెలివిగలవాడు" అని అమ్మ చెప్పింది. 1962లో అమ్మ పుట్టినరోజు పండుగకు ఒక ప్రత్యేక సంచిక మాతృశ్రీ ప్రథమ సంచిక తేవాలన్న సంకల్పం కలిగింది. సుబ్బారావన్నయ్య పి.ఎస్.ఆర్. అన్నయ్య కలిసి గుంటూరులో సాహిత్యరంగంలో అప్పటికే స్థిరపడినవారు, అమ్మ వాత్సల్యాన్ని, ప్రేమామృతాన్ని గ్రోలినవారు వున్నారు. కనుక వారందరినీ రచనలు ఇవ్వవలసిందిగా కోరారు. అందరూ ఎంతో ఆనందంతో వ్రాసి ఇచ్చారు. ఆ విధంగా మాతృశ్రీ జన్మదిన సంచిక రావటానికి ఆద్యుడు సుబ్బారావన్నయ్యే.

గుంటూరులో జొన్నాభట్ల వెంకటరామయ్యగారి సహచర్యంలో చిన్నతనంలోనే రాజకీయాలలో ప్రవేశించినా, రాజకీయ దురంధరులైన నడింపల్లి నరసింహారావుగారు కోన ప్రభాకరరావు, కాసు వెంగళరెడ్డి వంటి ప్రముఖుల వాత్సల్యంతో రాటుదేలాడు. తన రాజకీయ జీవితాన్ని గ్రామ సర్పంచి వరకే పరిమితం చేశాడు.

జిల్లెళ్ళమూడికి వచ్చే యాత్రీకులు చాలా ఇబ్బందులు పడుతుండేవారు. కాలువలు దాటలేక, మోకాలు లోతు, మొలలోతు బురదలో కూరుకుపోతూ నడిచి వచ్చేవారు. పంచాయితీ బాధ్యతలు సర్పంచ్‌గా చిన్నవయస్సులోనే చేపట్టి చక్కటి తారురోడ్డు రావడానికి ఎంతో కృషి చేసాడు సుబ్బారావన్నయ్య.

అన్నయ్యకు నాటక రంగంలో కూడా అనుభవం ఉంది. చదువుకునే రోజుల్లోనే కొంపల్లి శేషుతోపాటు నాటకాలలో పాల్గొన్నాడు. జిల్లెళ్లమూడిలో మాతృశ్రీ క్రీడాసాంస్కృతిక సంస్థ నొకదానిని స్థాపించటానికి మూలకారకులలో ఒకడు. ఆ సంస్థ తరపున కొన్ని నాటకాలకు దర్శకత్వం వహించటమే కాక ఆ సంస్థకు ఆర్థిక పరిపుష్టిని కలిగించాడు సుబ్బారావన్నయ్య.

సుబ్బరావన్నయ్య స్నేహశీలి. అమ్మ కోసం వచ్చే వారిని ఎంతో ఆదరంగా పలకరించేవాడు. దానితో అన్నయ్యకు అనేకులు సన్నిహితులయ్యేవారు. హాస్యం అతని స్వభావం. నవ్వుతూ నవ్విస్తూ ఉండేవాడు. నలుగురిలో కలసిపోయేవాడు. జిల్లెళ్ళమూడికి పోస్టాఫీసు తేవడానికి అన్నయ్య ఎంతో శ్రమించాడు.

బయట ప్రపంచంలో పనులు చేయడానికి, చేయించడానికి వెళ్ళినప్పుడు అమ్మగారి కుమారుడిగా చెప్పుకునేవాడు కాదు. తన స్వశక్తితో ఆ పనులు పూర్తి చేసేవాడు. ఆ తరువాత సుబ్బారావన్నయ్య అమ్మగారి కుమారుడని తెలిసి అతని నిరాడంబరతకు అంతా ఆశ్చర్యపోయేవారు.

సుబ్బారావన్నయ్య నిగర్వి. శాంతస్వభావం కలవాడు. ఊరి సర్పంచ్ కాబట్టి తన వంతు కృషిగా ఊళ్ళోకి నీటి పంపులు వేయించడానికి, ఆర్.టి.సి బస్సులు వేయించటానికి ఎంతో కృషి చేసాడు. గోపాపురం మీదుగా రోడ్డు వేయించాలని జిల్లా పరిషత్తులో అంగీకారం తీసుకువచ్చాడు. అది కార్యరూపం దాల్చవలసి వుంది.

అనేక విధాలుగా జిల్లెళ్ళమూడి సర్వతోముఖాభివృద్ధికి సుబ్బారావన్నయ్య ఎంతో శ్రమించి, చాలా విజయాలు సాధించాడు. జిల్లెళ్ళమూడి చరిత్రలో సుబ్బారావన్నయ్యకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఊరి వారందరికీ సుబ్బారావన్నయ్య అంటే ఎనలేని అనురాగం, ఆత్మీయత పెనవేసుకున్నాయి.

పాపాల పాకలో, నీలోని నిజం, నా గోరు ఊడింది, పలుకవా, మమతల గర్భగుడి మొదలగునవి అన్నయ్య చేసిన సాహిత్య సేద్యంలోని మచ్చుతునకలు.

**మమతల గర్భగుడి :**

నిన్ను తెలిపే సాహిత్యం కన్నా
నీవు తెలిపే రాహిత్యం మిన్న
వద్దుతల్లీ వద్దు వద్దు
తీర్పు మోసే ఓర్పు వద్దు
కలదమ్మా కడలి పొంగుకు నింగి అవధి,
అవునమ్మా కరుణ పొంగుకు నీవె పరిధి
ఈ చరాచరంలో అజరామరంగా నీ పదప్రసక్తి
ఈ విశ్వంభరశక్తిగా
విజృంభిస్తే - విశ్వరూపం దాలిస్తే
నా మాటేమిటమ్మా? ఆనాడు
ఆశించిన ఆశయం నెరవేరకపోతే
ఊహించే ఊహలే ఊసాడకపోతే
నిస్తేజంగా, నిర్వీర్యంగా, నిద్రాణమైపోతే
ఎలాగూ...... ఉంది....... నీమమతల గర్భగుడి॥

అని మనందరికీ మార్గాన్ని సుగమం చేశాడు సుబ్బారావన్నయ్య.

+ + +

బ్రహ్మాండం రవీంద్రరావు అమ్మ గర్భవాసాన జన్మించిన కనిష్ఠ పుత్రుడు. అందరం అమ్మ పిల్లలమే కాబట్టి అక్కడి పిలుపు ప్రకారం రవి అన్నయ్య అనటమే అలవాటు (నా కంటే చిన్నవాడైనా)

1954లో రవి అన్నయ్యకు ఊహ తెలిసేనాటికి పూండ్ల నుండి

మాణిక్యమ్మగారు, యల్లమంద, రామస్వామి అనేవాళ్ళు అమ్మ వద్దకు శనివారం రాత్రి వచ్చి ఆదివారం జిల్లెళ్ళమూడిలో ఏకాహం చేసేవారు. అన్నయ్యకు ఊహ తెలిసినదాది మొదటిగా పూండ్ల నుంచి వచ్చిన వాళ్ళే అమ్మను అర్చించుకునేవారు.

ఆ రోజుల్లో అమ్మే వంట, వడ్డన చేస్తుండేది. ఒక రోజు అమ్మ కాఫీ కాప్పుతో బియ్యం కడిగి ఎసరులో పోసింది. ఆ రోజు ఇంట్లో వాళ్ళయితే ఏమీ, బయటవాళ్ళు కలిపి పదిమంది పైనే ఉన్నారు. చిన్నవాడైన రవి అన్నయ్యకు చాలా ఆశ్చర్యం కలిగింది. "నా ఒక్కడికే ఈ అన్నం సరిపోదు కదా! ఇంతమందికి ఎలా పెడ్తావమ్మా!" అని అడిగాడు. "నీకు కావల్సినంత నీవు తిను నాన్న! సరిపోవటం సంగతి నేను చూసుకుంటానని" అమ్మ అన్నయ్యతో చెప్పింది. అన్నయ్య కడుపునిండా తినటమే కాదు, ఆ పది మంది తృప్తిగా భోంచేసారు. ఆ కాఫీ కప్పుతో పెట్టిన బియ్యం ఇంతమందికి సరిపోవడం అనేది ఇప్పటికీ అన్నయ్యకు ఆశ్చర్యమే అనిపిస్తుంది.

దసరాల్లో అమ్మ అత్తగారైన కనకం బామ్మ అమ్మ చేత కలశం పెట్టి పూజ చేయించింది. అమ్మ రాజరాజేశ్వరీ అష్టకం చదువుతుండగా అన్నయ్య విన్నాడు. ఆ కంఠమాధుర్యం అనుభవించవలసిందే, విని ఆనందించవల్సిందే కాని మాటలతో వర్ణించశక్యం కానిది. ఆ రోజుల్లో రాజుబావ మంత్రపుష్పం చదివేవాడు. రాజుబావ రాసిన పాటలే "అనుభవసారం" అన్న పేరుతో మొదటసారిగా జనులకు అమ్మ గురించి, అమ్మ జీవితం గురించి ఆలోచించటానికి, అవలోకించటానికి సారధ్యం వహించాయనటంలో ఎటువంటి అతిశయోక్తి లేదు. రాజుబావ ఎక్కడో వున్న ఫోటోకు దండ వేసినా అది అమ్మ మెడను అలంకరించేది. దానిని నిర్ధారించుకోవటానికి, చీరాల డాక్టరుగారు మరికొంతమంది అన్నయ్యలు, ఒక మనిషిని జిల్లెళ్ళమూడి పంపి సరిగా 10 గం॥ల సమయంలో అమ్మ దగ్గర ఏం జరిగేది చెప్పమని

నిర్దేశించారు. చీరాలలో డాక్టరు గారింట్లో అమ్మ ఫోటోకు రాజుబావ చేత 10 గం॥లకు దండ వేయించారు. ఆ సమయంలో అమ్మ మెడలో దండలేలేవు. కానీ రాజబావ చీరాలలో అమ్మ ఫోటోకు దండవేసినప్పుడు అది అమ్మ మెడనలంకరించింది. అది విశేషమేకదా! రాజుబావ పూర్వపుణ్యఫలము. అంతగా అమ్మ జీవితంతో పెనవేసుకుపోయాడు రాజుబావ. (ఈయన గురించిన వివరణ ద్వితీయ భాగంలో వుంది)

శ్రీ నాన్నగారి తమ్ముడైన లోకనాథం బాబాయిగారు అప్పికట్లలో ఉండేవారు. అప్పుడు సుబ్బారావన్నయ్య రవి అన్నయ్య అప్పికట్లలో చదువుకునేవారు. అమ్మ జిల్లెళ్ళమూడి నుండి అప్పికట్లకు బయలుదేరింది. అమ్మతో పాటు రవి అన్నయ్య కూడా వున్నాడు. రెడ్డి సుబ్బయ్య కూడా వాళ్ళ వెంట వెళ్ళాడు. పంటకాలువ దాటాల్సివచ్చేటప్పటికి అమ్మను తాను ఎత్తుకొని దాటిస్తానని బలవంతం చేశాడు. "అమ్మ సరే" అన్నది. అమ్మను ఎత్తుకోవటానికి ప్రయత్నించాడు. అతని వల్ల కాలేదు, అమ్మను ఎత్తటం. 'ఏంటమ్మా! నిన్నెత్తడం ఎంతలే అనుకున్నాను. ఇంత బరువెక్కావేమిటి? నే నెత్తలేకపోతున్నానని" అమ్మతో అన్నాడు. అతను ఆజానుబాహువు మనిషి. "పొట్టిగా చిన్నగావున్న అమ్మను ఎత్తలేకపోతానా!" అని అనుకున్నాడు. చేసేదేమీ లేక అమ్మనే ప్రార్థించాడు. బ్రహ్మాండ భాండోదరియైన అమ్మను ఎత్తటం అంత తేలికైన విషయమా?

తేలికగానే ఎత్తుకొని దాటిస్తానన్నావుగా? అని అమ్మ నవ్వి ఇప్పుడు ప్రయత్నించి చూడు అని చెప్పింది. ఈసారి సుబ్బయ్య ఎత్తుకుంటే బెండు కన్నా తేలికగా, అవలీలగా ఎత్తుకొని దాటించాడు. అణిమ - గరిమ - లఘిమా- ప్రాకామ్యసిద్ధి వంటి అష్టసిద్ధులు విశ్వజననియైన అమ్మకు అవలీలగా వశమై ఉంటాయి. సృష్టేతానైనప్పుడు సృష్టిలోని వన్నీ అమ్మే కదా! అందుకే

అమ్మ "భాగ్యమునేనే, దారిద్ర్యం నేనే, శుద్ధం నేనే, అశుద్ధం కూడా నేనే" అని తెలియజేసింది.

ఆ రోజుల్లో అమ్మ ప్రసాదంగా అందరికీ పుట్టమన్నునే పెట్టేది. అది ఎంతో సువాసనలతో, మధురమైన రుచికలిగి ఉండేది. ఆప్పటి ఆ ప్రసాదం తిన్న వారెవ్వరూ ఆ రుచిని మర్చిపోజాలరు. కొమ్మురులో డాక్టరు సీతాచలం గారింట్లో ఒక మూల ఎలుక చచ్చిన వాసన వచ్చింది. ఎక్కడ వెతికినా చచ్చిన ఎలుక కన్పించలేదు. వాళ్ళంతా అమ్మ వచ్చిందని అన్నారు. ఈ వాసన వస్తే అమ్మ రావటమేమిటి? అని అన్నయ్య ఆశ్చర్యపోయాడు. ఇంకొంతసేపటికి కసవుపోసే డష్టుబిన్ సువాసనలను వెదజల్లింది. అప్పుడూ అమ్మ వచ్చిందన్నారు. "సుగంధంనేనే అయినప్పుడు దుర్గంధమూ నేనే" అని అమ్మ చెప్పిన మాట ఈ విధంగా ఋజువైంది. అమ్మ ఉన్నప్పుడు సువాసనలు వస్తే తన రాకకు గుర్తుగా తెలియజేసేది అనే వారు. విశ్వవ్యాప్తి చెందిన ఇప్పుడు కూడా అమ్మ గురించి ఆలోచనలు వచ్చినా, అమ్మ గురించి సంభాషించుకున్నా ఆ సువాసనలు రావటం చాలా మందికి అనుభవమే.

ఆ రోజుల్లో ఎవరన్నా బిచ్చగాడు వచ్చి అడిగితే లేదని కసిరి పో అని ఆ తర్వాత అమ్మ దర్శనంకు వెళితే అమ్మ ఆ ప్రస్థావన తెచ్చేది. అమ్మకు మనుష్యులే అవసరం లేదు జంతువులను కూడా ప్రేమగా చూడమనే అమ్మ జీవితం మనకు నేర్పుతున్నది. "నీ సందేశమేమిటమ్మ! అన్నవారితో "నా సందేశం నా జీవితమే దాని నుండి ఏ కొంచెం నేర్చుకో గలిగినా" అన్నది అమ్మ. షిర్డీబాబా శునకం రూపంలో రావటం, గండుచీమల రూపంలో రావటం సాయిసచ్చరిత్ర ద్వారా మనకు తెలుస్తూనే ఉంది. అలాగే అవతార పురుషులకు అవన్నీ సామాన్యమే అందుకనే అమ్మ ఏరూపంలో ఎలా వస్తుందో అన్న ఆలోచనతోనే బిచ్చగాళ్ళను కసరడం కాని, లేదు పొమ్మనటం కానీ సాధారణంగా అమ్మ పిల్లలెవ్వరూ చెయ్యరు.

జిల్లెళ్ళమూడిలో అమ్మవున్న పాకలో వెలుతురు కిరణాలు పడ్తుంటే, తాటాకులు సరిగా లేనందున ఆ రకంగా వుందని శ్రీ నాన్నగారు దట్టంగా పాకను కప్పించారు. అయినా కిరణాలు పడుతూనే ఉన్నాయి. ఎక్కడ నుంచి వస్తున్నాయా అని పరిశీలించి చూస్తే పగిలిపోయిన జాడీ నుండి ఆ కాంతి కిరణాలు వస్తున్నాయి. అందులో నాగేంద్రుడున్నాడని అందరూ తర్వాత గుర్తించారు. అది తర్వాత అమ్మ చిన్నప్పుడు పరిచయమై పండరీపురంలో తపస్సు చేసుకుంటున్న శ్యామల వద్దకు వెళ్లిందని చెప్పుకున్నారు.

1956లో అమ్మ సమాధిలోకి వెళ్ళింది. మూడురోజుల తరువాత గాని లేవలేదు. జబ్బు అని చికిత్సలు చేశారు. చివరికి చనిపోయిందని భావించారు. కాని తనంతట తానే నిద్రలో నుండి లేచినట్లుగా లేచింది. ఆ తరువాత అమ్మ శరీరం కాంతులను సంతరించుకుందని చెప్పారు. యోగానుభూతులు, యోగసిద్ధులు చుట్టూ ఉన్నవారికి తెలియనందున ఎంతో హడావిడి చేసారు. (షిర్డీబాబా కూడా మూడు రోజులు సమాధిలో వుండి వచ్చారని చరిత్ర మనకు తెలియచేస్తోంది కదా!)

రవి అన్నయ్య అమ్మ చేతి మీద తల పెట్టి పడుకొని నిద్రపోయేవాడు. కొంతసేపు తరువాత చూస్తే అమ్మ కనిపించేదికాదు. అదృశ్యమయ్యేది. బాపట్లకు వెళ్ళివచ్చేదని చెప్పుకునే వారు. తీరా తెల్లవారేటప్పటికి మళ్లీ అమ్మచేతిమీదే అన్నయ్య తల ఉండేది. ఈ విధంగా ఇక్కడ నుండీ అక్కడికీ, అక్కడ నుండీ ఇక్కడకు, ఒక్కోసారి రెండు ప్రదేశాల్లో ఉండడం సంభవించేది. "దానినే బహురూప సిద్ధి" అని శ్రీ పూర్ణానందస్వామి తెలియజేసారు. అన్నయ్యకు చిన్నతనంలో అమ్మను వదిలి ఉండలేని స్థితి ఉండేది. అమ్మ నుండీ దూరంగా ఉన్న అమ్మ మనల్ని ప్రతిక్షణం ఎక్కడెక్కడో మనం మాట్లాడుకున్న సంభాషణలను యథాతథంగా తన దగ్గరకు వెళ్ళినపుడు చెప్పేది.

వచ్చేటప్పుడు ఎటువంటి యాతనా లేకుండా హాయిగా ప్రయాణం చేసారు. అమ్మ చేసే వసతులు అలా వుంటాయి. ఇది ఒక్క రవి అన్నయ్యకే పరిమితం కాదు. అమ్మ బిడ్డలందరి జీవితాల్లో ఇటువంటి సంఘటనలు కోకొల్లలు. అలాగే ప్రతివారి జీవితంలో బహిర్గతం చేయగలిగినవి, చేయలేనివి కూడా ఎన్నెన్నో విషయాలు వున్నాయి. కరుణామయి అమ్మ ఎవరిని ఏవిధంగా చూస్తోందో ఎవరికి ఎటువంటి సదుపాయాలు కలుగచేస్తుందో అన్నది అనూహ్యం.

అమ్మ మనల్ని దగ్గరకు తీసినంతగా మనం అమ్మ దగ్గరకు పోలేకపోయామేమో! అనిపిస్తుంటుంది. అమ్మ తన విశ్వజనీనతను ఏనాడు ఏమరలేదు. అది తన తనూభవులైన అన్నయ్యలకు అడ్డు అనీ అనుకోలేదు. అమ్మను దైవంగా చూడాలి. చనువు ఇచ్చింది కదా అని తేలికగా చూడరాదనే సిద్ధాంతమే మొదటి నుంచి రవి అన్నయ్యది. అమ్మ అన్నయ్య ఇంటికి వెళ్ళినపుడు వాళ్ళకు ఎటువంటి అసౌకర్యం కలగకూడదని, అమ్మకు సౌకర్యం కలుగచేయలేకపోయామని వాళ్ళు దిగులు చెందకూడదని అమ్మే అన్నయ్య కోసం గాయత్రీ భవనంకు ఎదురుగా ఉన్న ఇంటిపై మొదటి అంతస్థు కట్టించింది. క్యూరింగ్ జరుగవలసినన్ని రోజులు పూర్తిగా జరగనే లేదు.

అమ్మ అన్నయ్య ఇంటికి వచ్చి నలభైరోజులు వున్నది. "నాకు మానసికంగా తన ఎడబాటను తట్టుకునే శక్తిని ఇవ్వటానికే నాచేత రోజూ కొత్త బట్టలు పెట్టించుకొని పూజ చేయించుకున్నది అమ్మ." అని తన విశ్వాసాన్ని తెలియచేసాడు అన్నయ్య.

శ్రీ ప్రసన్నాంజనేయశర్మగారు, శ్రీ కుమారశర్మగారు రుద్రం చెపుతుంటే రవి అన్నయ్య స్వయంగా 40 రోజులు అమ్మకు అభిషేకం చేసుకున్నాడు. తను చేసుకోవటం కాదు. అమ్మే ఆ అవకాశాన్ని కలుగచేసింది. ఇంట్లో అమ్మకు చేసుకొని, అనసూయేశ్వరాలయంలో పూజలు మండలం పాటు

చేసుకోగలగటం అన్నయ్య అదృష్టమే. మరి జగజ్జనని కడుపునే జన్మించిన అన్నయ్యకు ఆ అదృష్టం వరించటంలో ఆశ్చర్యం ఏముంటుంది?

పూర్వం అమ్మ స్నానం చేసిన నీళ్ళు పట్టుకొని ఆ నీటిని పవిత్రంగా భావించి స్నానం చేసేవాళ్ళు. ఆ విధంగా మళ్ళీ నలభై రోజులపాటు అన్నయ్యకు ఆ నీటితో స్నానం చేసే అవకాశం కలిగించింది అమ్మ. అమ్మ 40 రోజులు స్నానం చేసిన గదిని అన్నయ్య తన పూజా మందిరంగా మలుచుకున్నాడు. అమ్మ ఆలయంలో ప్రవేశించిన 11వ రోజున కిరీటం ధరించి శూలము కాంతి చక్రాదులతో అన్నయ్యకు దర్శనమిచ్చింది అమ్మ.

మధు అన్నయ్య సత్తెనపల్లిలో ఉద్యోగరీత్యా ఉన్న రోజులలో ఒకసారి రవి అన్నయ్య అక్కడకు వెళ్ళాడు. ఆ సమయంలో మానసిక ఒత్తిళ్ళకు లోనైయ్యాడు. మేడ మీద నుండి తాను దూకినట్లు అమ్మ తన రెండు చేతులతో అన్నయ్యను పట్టుకున్నట్లు కలవచ్చింది. ఆ తరువాత ఎన్నడూ అన్నయ్య అంత మానసిక వత్తిడులకు లోను కాలేదు. అవతార పురుషులు మన కర్మఫలాన్ని కలల రూపంలో తగ్గిస్తారని పెద్దలు చెప్తారు. చీరాల డాక్టరు గారికి, నాకు అలాగే మరెందరి జీవితాల్లో కూడా ఇంటువంటి అనుభవాలు చోటుచేసుకున్నాయి.

అమ్మే తన జీవితం నడిపిస్తున్నదని, అమ్మ నడిపించినట్లే నడుస్తున్నానని అన్నయ్య అంటాడు. చీరాల డాక్టరు పొట్లూరి సుబ్బారావుగారు "సర్కస్ కంపెనీ వాడు ఎట్లా ఆడమంటే అందులోని జంతువులు, మనుష్యులు ఆడినట్లు ఆ కంపెనీలో ఆడే బొమ్మలం మనం ఏపాత్రకు ఏపని నిర్దేశిస్తుందో అమ్మ ఇచ్ఛ" అని అంటారు.

"ఏ మూలో ఎవరికీ అందుబాటులో లేనిచోట, ఈ బాదరబందీలకు ఆవల ఉంటే బాగుండునని అప్పుడప్పుడు అనిపిస్తుందని" రవి అన్నయ్య

అంటాడు. కాని అమ్మ ఉండనివ్వదు. ఊరుకోదు, అమ్మ ఇచ్చిన శరీరం, అమ్మ ఇచ్చిన జీవితం, అమ్మకు అంకితమవ్వటం కంటే కావల్సిందేముంది?"

రవి అన్నయ్యకు అనుకూలవతియైన భార్య వైదేహి. "ఎందరురానీ, ఎప్పుడుగానీ ముందుగ విందులు చేయును జనని" అని నదీరా అన్నట్లుగా పేరుకు తగినట్లుగా అంత ఓర్పుగా చేసే వైదేహిని చూస్తే ఆశ్చర్యమనిపించక మానదు. అన్నయ్యకు ఇద్దరు మొగపిల్లలు. చైతన్య, శరత్‌లు. ఒక అమ్మాయి అనసూయ. ముగ్గురూ చదువుల్లో ముందుకుసాగుతూ ఎంతో ఆప్యాయతతో పలకరిస్తుంటారు. చెట్టు ఒకటి అయితే విత్తు మరొకటి అవుతుందా?

+ + +

అమ్మ పినతల్లి మతుకుమల్లి శేషమ్మగారు. ఆమె భర్త మతుకుమల్లి వెంకటనారాయణ గారు. వారి కుమారుడు శ్రీధరరావు గారు. అమ్మ కడుపుతో వున్నప్పుడు డాక్టరు చెకప్ కోసం చీరాల వెళ్ళింది. పినతల్లిగారింట్లో మంచం మీద పడుకుంది. అప్పుడు శ్రీధరరావు గారి వయస్సు 10 సం॥లు అమ్మ తన మంచం మీద పడుకుందన్న కోపంతో ఆ మంచాన్ని అమ్మపడుకొని వుండగానే ఎత్తేయ బోయారు. ఒరేయ్ ఎత్తకురా నాకు కొడుకు పుడ్తాడు. నీ కూతురిని చేసుకుంటానని చెప్పింది. ఆ రోజుల్లో ఈ స్కానింగ్‌లు అవీలేవు కదా! అవతారమూర్తియైన అమ్మకు తెలియంది ఏముంది?

ఇది జరిగిన ఎన్నో సం॥ ల అనంతరం బందర్లో ఉదయభీమరాజుగారి అమ్మాయి సరస్వతికి, అమ్మ బంధువుల అబ్బాయి అప్పారావు అన్నయ్యకు జరిగిన వివాహానికి అమ్మ వెళ్ళింది. వారి దొడ్లో అమ్మ తిరుగుతుండగా, శ్రీధరరావు అన్నయ్య భార్య నాగమణి అక్కయ్య అక్కడకు వెళ్ళింది. అక్కయ్యను చూడగానే అమ్మ నీకు ఆడపిల్లపుడ్తుంది దాన్ని మా సుబ్బారావుకు చేసుకుంటానని" చెప్పింది. పిల్లలు పుట్టకముందుగానే వాళ్ళ వివాహాన్ని అమ్మ ఖరారు చేసింది.

అమ్మ చెప్పినట్లుగానే ఆడపిల్ల పుట్టింది. ఆ పిల్లకు వాళ్ళమామ్మ పేరు శేషమ్మ అని పెట్టారు, వారింట్లో అమ్మ ఫోటో వుండేది, శేషుకు చిన్నపిల్లప్పటి నుంచీ ఆ ఫోటో అంటే మక్కువ ఎక్కువ, పక్కవారింట్లో పూలు దొంగతనంగా కోసుకువచ్చి మాసిన బట్టలపెట్టె వుంటే దాని మీద ఎక్కి అమ్మకు రోజు పూవులు పెడ్తుండేది. అప్పటికి శేషు అమ్మను చూడనేలేదు.

హైమక్కకు ప్రకృతి వైద్యం కోసం విజయవాడ పడమటలో వుంచారు. అక్కయ్యకు సాయంగా యోగయ్య అన్నయ్యను, రుక్మిణి అక్కయ్యను వుంచారు. అప్పట్లో శేషు వాళ్ళు విజయవాడలో వుండేవారు. హైమ వస్తోందని అప్పటికప్పుడు అరకేజి నెయ్యి, అరకేజి మినపప్పు తెప్పించి నేతి గారలు చేసింది నాగమణిక్కయ్య. హైమక్క శేషుని చూచి ఈ పిల్లను మన సుబ్బారావన్నయ్యకు చేసుకుంటే బాగుంటుందని యోగయ్య అన్నయ్య వాళ్ళతో అన్నది. అమ్మ అన్నది హైమక్కయ్య అనుకున్నది ఒకటే!

చుట్టాల ఇంటికి పెళ్ళికి వెళ్ళినప్పుడు అమ్మను చూచింది శేషు, అప్పటి నుంచి అమ్మ సన్నిధిలో వుండాలని వువ్విళ్ళూరింది, అందుకే దాన్ని నా దగ్గరవుంచమని ఒక సంవత్సరం అమ్మ శేషుని తన దగ్గర వుంచుకుంది. అప్పుడే మధు అన్నయ్య పెళ్ళి జరగటం ఆ సమయంలో శేషు రజస్వల అయింది. వాళ్ళనాన్నగారు పెళ్ళికి వచ్చి శేషుని ఇంటికి తీసుకువెళ్ళారు.

ఒక సంవత్సరం జరిగిన పిమ్మట 1969 మే 2వ తారీఖున రామకృష్ణ అన్నయ్యను శ్రీధరరావు గారింటికి పంపించి 5వ తా॥ వాళ్ళమ్మాయి శేషు పెళ్ళికి రమ్మని కబురు పంపింది. వారికేమి అర్థం కాలేదు 3 రోజులలో పెళ్ళి ఏమిటి? అని ఆశ్చర్యపోయారు. సరే అమ్మ మీద నమ్మకంతో వాళ్ళ కుంటుంబం పెళ్ళికి తరలి వచ్చింది వాళ్ళ తరుపున శుభలేఖలు కూడా వేయించలేదు.

అమ్మ రాత్రికి రాత్రి మాతృశ్రీ ప్రెస్‌లో శుభలేఖలు వేయించి పంచమంది.

అమ్మ చెప్పినట్లుగానే ఆడపిల్ల పుట్టింది. ఆ పిల్లకు వాళ్ళమామ్మ పేరు శేషమ్మ అని పెట్టారు, వారింట్లో అమ్మ ఫోటో వుండేది, శేషుకు చిన్నపిల్లప్పటి నుంచీ ఆ ఫోటో అంటే మక్కువ ఎక్కువ, పక్కవారింట్లో పూలు దొంగతనంగా కోసుకువచ్చి మాసిన బట్టలపెట్టె వుంటే దాని మీద ఎక్కి అమ్మకు రోజు పూవులు పెడ్తుండేది. అప్పటికి శేషు అమ్మను చూడనేలేదు.

హైమక్కకు ప్రకృతి వైద్యం కోసం విజయవాడ పడమటలో వుంచారు. అక్కయ్యకు సాయంగా యోగయ్య అన్నయ్యను, రుక్మిణి అక్కయ్యను వుంచారు. అప్పట్లో శేషు వాళ్ళు విజయవాడలో వుండేవారు. హైమ వస్తోందని అప్పటికప్పుడు అరకేజి నెయ్యి, అరకేజి మినపప్పు తెప్పించి నేతి గారలు చేసింది నాగమణిక్కయ్య. హైమక్క శేషుని చూచి ఈ పిల్లను మన సుబ్బారావన్నయ్యకు చేసుకుంటే బాగుంటుందని యోగయ్య అన్నయ్య వాళ్ళతో అన్నది. అమ్మ అన్నది హైమక్కయ్య అనుకున్నది ఒకటే!

చుట్టాల ఇంటికి పెళ్ళికి వెళ్ళినప్పుడు అమ్మను చూచింది శేషు, అప్పటి నుంచి అమ్మ సన్నిధిలో వుండాలని వువ్విళ్ళూరింది, అందుకే దాన్ని నా దగ్గరవుంచమని ఒక సంవత్సరం అమ్మ శేషుని తన దగ్గర వుంచుకుంది. అప్పుడే మధు అన్నయ్య పెళ్ళి జరగటం ఆ సమయంలో శేషు రజస్వల అయింది. వాళ్ళనాన్నగారు పెళ్ళికి వచ్చి శేషుని ఇంటికి తీసుకువెళ్ళారు.

ఒక సంవత్సరం జరిగిన పిమ్మట 1969 మే 2వ తారీఖున రామకృష్ణ అన్నయ్యను శ్రీధరరావు గారింటికి పంపించి 5వ తా॥ వాళ్ళమ్మాయి శేషు పెళ్ళికి రమ్మని కబురు పంపింది. వారికేమి అర్ధం కాలేదు 3 రోజులలో పెళ్ళి ఏమిటి? అని ఆశ్చర్యపోయారు. సరే అమ్మ మీద నమ్మకంతో వాళ్ళ కుంటుంబం పెళ్ళికి తరలి వచ్చింది వాళ్ళ తరుపున శుభలేఖలు కూడా వేయించలేదు.

అమ్మ రాత్రికి రాత్రి మాతృశ్రీ ప్రెస్‌లో శుభలేఖలు వేయించి పంచమంది.

టెలిగ్రాములు, ఫోన్లు, మనుషులను పంపించి అందరికీ సుబ్బారావన్నయ్య పెళ్ళి విషయం తెలియబరచింది. లక్ష్మణరావు గారికి భ్రమరాంబక్కయ్యకు మిగిలిన గుంటూరు వారికి మనిషిని పంపింది, అంతతొందర్లో ముహూర్తం నిర్ణయించినా కొన్ని వేలమంది పెళ్ళికి రావటం ఆశ్చర్యం.

పెళ్ళి అయిన మూడవ రోజున పెద్ద వరద వచ్చింది. పెళ్ళికి వేసిన తాటాకు పందిరికూలిపోయింది అమ్మ వెంటనే ఆ వరదలో పసుపు కుంకుమ, చీరజాకెట్టు గుడ్డ, పూలు మొ॥నవి వదిలిపెట్టి ఆ వెళ్ళు అన్నది. అమ్మ అట్లా అన్న వెంటనే, మాటవినే పిల్లలా ఆ వరద వెనక్కు తగ్గటం అనూహ్యం, ఆశ్చర్యం దీనివలన అమ్మకు ప్రకృతి మీద కల అధికారం అవగతమవుతుంది.

పెళ్ళి జరిగిన 4 సం॥లకు పెద్ద కూతురు హైమ పుట్టింది. తరువాత నాగేశ్వరి పుట్టింది. శేషుకు చిన్నతనంలోనే భర్త వియోగం సంభవించింది. పిల్లల ఆలనా పాలనా చూచుకుంటూ తన శేషజీవితాన్ని జిల్లెళ్ళమూడిలో గడుపుతోంది.

అనంత వరలక్ష్మక్కయ్య మరణించింది. ఆమె కూతురు సీత. నీఅన్నవాళ్ళెవరూ లేరు. మూగది. నా శేషు జిల్లెళ్ళమూడి రావటం తల్లి చనిపోయిన సీతకు వరం లాంటిది అనవచ్చు తనకు ఏమి తెలియకపోయినా, పట్టకపోయినా అన్నీ శేషు చూచుకోవటం నిజంగా సీత అదృష్టమే, అలాగే గుడిలో అర్చన చేసుకువచ్చిన పద్మావతిని తిన్నదీ లేనిదీ కనుక్కోవటం, ఆమె కావల్సినవి కనుక్కుని చేయటం పద్మావతక్కయ్య ఒంటరితనానికి ఒక్కింత ఊరడింపు.

+ + +

బి.జి.కె. శాస్త్రిగారు హైద్రాబాద్ నివాసి. మొదట ఆయన సిక్కింలో ఉద్యోగం చేసేవారు. ఆయన భార్య శ్రీమతి విజయకుమారి అమ్మను

మొదటిసారిగా నరసరావుపేటలో చూచారు. చీరాలలో అమ్మకు కిరీటం చేయించిన సందర్భంగా దంపతులు అమ్మను దర్శించారు. లలితాంబగారింట్లో పెండ్లికి వచ్చినప్పుడు అమ్మ ఆయన చేయిపుచ్చుకొని "ఎలా వున్నావు?" అని అడిగింది.

చీరాల స్కూలులో అమ్మ దర్శనమిస్తోందని వెళ్ళారు. ఎవరినీ లోపలకు రానీయటం లేదు. వీళ్ళు అరడజను బత్తాయిలు తీసుకువెళ్ళారు. అమ్మకు బత్తాయి రసం ఇవ్వాలని కార్యకర్తలు అనుకుంటుంటే వెంటనే ఆ అక్కయ్య ఇదే సందనుకొని లోపలికి వెళ్ళింది. అక్కడ అమ్మకు కిరీటం చేయించిన వాళ్ళు వుంటే వాళ్ళతోపాటు లోపలికి వెళ్ళి అమ్మకు విసరసాగింది. అన్నయ్య తిరిగి సిక్కిం వెళ్ళి 2 1/2 సం॥లు అక్కడ వున్నారు. కానీ ఆయన ధ్యాసంతా అమ్మమీదే వుండటంతో అమ్మను తలుచుకొని ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసారు.

తరువాత గుంటూరులో బ్యాంకు ఆఫ్ బరోడాలో చేరారు. దానితో ప్రతి ఆదివారం అమ్మ దర్శనం చేసుకొనేవారు. వాళ్ళ పాపకు అమ్మ ఫణి అని పేరు పెట్టింది. అమ్మ తలంటుకోవడానికి కుంకుళ్ళు లేవని అనుకుంటున్న సమయంలో వీళ్ళు కుంకుడుకాయలు, సెంటుసీసా తీసుకొనివెళ్ళారు.

"ఆత్మ సాక్షాత్కారం ఎలా వస్తుందమ్మా" అని అడిగారు అమ్మ వెంటనే అన్నయ్యను కావలించుకొని "నీకు వుందిగా నాన్నా" అన్నది ఎప్పటికైనా తనకు కలుగుతుందని ఆనందపడ్డారు. అక్కయ్యకు అమ్మ దగ్గర నుంచీ వెళ్ళాలని లేదు. 3 నెలల పిల్లను అత్త గారికి అప్పచెప్పి తాను అమ్మ దగ్గరే వుండాలనుకుంది. తలుపు దగ్గరే నిలుచుంది కాని ఎంతసేపటికి బయటకు రాలేదు. అమ్మ తలపైకి బాలింతరాలులాగా చెంగును వేసుకొని పాపను అడ్డాల్లోకి తీసుకొని జీపు దగ్గరకు వెళ్ళింది. దానితో అక్కయ్యకు బయటకు రాక తప్పలేదు. చేసేదేమీలేక పిల్లను తీసుకొని జీపు ఎక్కింది. ప్రతివారం

అన్నయ్య రాచర్ల లక్ష్మీనారాయణ అన్నయ్యతో కలిసి వచ్చేవాడు. అమ్మను చూచిన వెంటనే కన్నీళ్ళు ఎందుకు కారుస్తారో ఎనలైజ్ చేయాలనుకున్నాడు. ఇదే మన స్వస్థానం అనిపించింది. అమ్మ దగ్గరకు మనం వెళ్ళినప్పుడు, తప్పిపోయిన పిల్లవాడు తల్లిని చూచి పొందే ఆనందం మనకు కలగటంతో ఆనందభాష్పాలు వస్తాయని అనుకున్నాడు.

వాళ్ళ అమ్మాయికి చెవులో చీము వస్తోంది. ఎన్ని మందులు వాడినా తగ్గలేదు. అమ్మ దర్శనం చేసుకొని గుంటూరు వెళ్ళేటప్పటికి ఆచీము రావటం పూర్తిగా తగ్గిపోయింది. ఇంటికి వెళ్ళిన తరువాత అలసిపోవడంతో తలుపు వేసుకోకుండానే పడుకున్నారు. తెల్లవారి చూస్తే తలుపు లోపలి గడియవేసివుంది. అక్కయ్యను అడిగితే తాను వేయలేదంది. అపద్బాంధవి అమ్మ వుండగా మనకు చింత ఎందుకు?

అమ్మను లౌకిక వ్యవహారాల గురించి అడగబుద్ధి పుట్టలేదు. వేదాంత విషయాలు చర్చించటానికి సమయం సరిపోయేదికాదు. ఉదయం 10 గం॥లకు వచ్చి సాయంత్రం 4 గం॥లకు తిరుగు ప్రయాణం అయ్యేవారు. మొగపిల్లవాడు ఇంటర్ తప్పటంతో చాలా అప్‌సెట్ అయ్యాడు. అమ్మ దీవెనల ఫలితంగా తరువాత ఏ ఆటంకం లేకుండా చదువు సాగింది. అమెరికాలో బాగా సెటిల్ అయ్యాడు. నలుగురి ఆడపిల్లల పెళ్ళిళ్ళు ఎటువంటి ఆటంకాలు లేకుండా జరగటం అమ్మ అనుగ్రహమే కారణమని వారి విశ్వాసం.

+ + +

గుడిపూడి జనార్ధన శర్మగారు హైద్రాబాద్ నివాసి. జిల్లెళ్ళమూడిలో వుండే భ్రమరాంబక్కయ్య తమ్ముడు. ఆయన భార్యను మూడవకాన్పుకు ఆసుపత్రిలో చేర్పించారు. ఇంట్లో ఇద్దరు చిన్నపిల్లలు వీరిని సముదాయించి, మళ్ళీ ఆసుపత్రికి అక్కయ్యను చూడటానికి వెళ్ళాలి. ఇంట్లో ఎవరూ సాయంగా కూడా లేరు. అటువంటి పరిస్థితిలో అన్నయ్యకు విపరీతమైన జ్వరం వచ్చింది.

"ఏమిటమ్మా ఇలా చేసావని" అమ్మతో దెబ్బలాడారు. అమ్మ కుంకమ తీసుకొని నీళ్ళల్లో వేసుకొని తాగి నిద్రపోయారు. నిద్రనుంచి లేచి చూచుకుంటే జ్వరం మచ్చుకకైనా కనిపించలేదు. ఆపదుద్ధారణి అమ్మకు ఆర్తిగా నమస్కరించు కున్నారు అన్నయ్య.

వరంగల్‌లో వున్నప్పుడు ఎవరికి ఒంట్లో బాగా లేకపోయినా శ్రీ శివానందమూర్తిగారి దగ్గరకు వెళ్ళి ఆయన పూజ అయ్యేవరుకు వుండి విభూధి, తీర్థం తీసుకువచ్చి పిల్లలకు ఇచ్చేవారు. ఆయన చేత్తో ఇస్తే పూర్తిగా నయమవుతుందన్న నమ్మకం వుండేది. అలాగే శ్రీశివానందమూర్తి గారు దగ్గరకు వెళ్ళి కష్టసుఖాలు, ఇష్టాగోష్ఠి జరిపేవారు. శ్రీ శివానందమూర్తిగారు వేదవేదాంగ పారంగతులు. శివ ఉపాసకులు ఆయన మాట్లాడకపోయినా నిష్ఠగా ఆయన చేసే అభిషేకం నిశబ్దంగా కూర్చుని చాలా మంది తిలకించేవారు.

వాత్సల్య యాత్రలో అమ్మ వరంగల్ వెళ్ళినప్పుడు జనార్ధన శర్మగారికి వారింటికి అమ్మను ఆహ్వానించాలని మనస్సు తహతహ లాడినా తమ ఇల్లు చిన్నది. కాబట్టి అమ్మను ఇబ్బంది పెట్టిన వాళ్ళమవుతామని అనుకుని ఆ ఆలోచన విరమించుకున్నారు. అమ్మకు కావలసింది వారి ఆర్తి, ఆవేదనలే కాని, వారి ఆస్థిపాస్థులు, పెద్ద పెద్ద ఇళ్ళు, పొజిషన్లు కావు కదా! కొండూరి శేషయ్య లింగం గారింట్లో అమ్మ బసచేసింది. వీళ్ళ రెండో అబ్బాయికి అమ్మచేత అక్షరాభ్యాసం చేయించారు. అమ్మతో పాటు కరీంనగర్ వెళ్ళివచ్చారు.

రామకృష్ణ అన్నయ్య జనార్ధనరావు గారితో అమ్మ రేపు ప్రొద్దున మీ ఇంటికి వస్తుందని చెప్పాడు. దానితో ఆశ్చర్యపోవడం వాళ్ళవంతు అయింది. ఆయన భార్య విమలక్కయ్య వున్నంతలో ఇంటిని పదిమంది వచ్చినా సరిపోయేలా సర్దింది. ఉదయం వస్తానన్న అమ్మ సాయింత్రానికి వాళ్ళ ఇంటికి వేంచేసింది. అమ్మను ఆహ్వానించటానికి కారుదగ్గరకు అన్నయ్య, విమలక్కయ్య వచ్చేటప్పటికి ఇరుగు పొరుగువారితో వారిల్లు నిండిపోయింది. ఎలాగో దారి

చేసుకొని వెళ్ళి మూడో అబ్బాయికి అన్న ప్రాసన అమ్మచేత చేయించారు.

మొదటి బాబుకు అమ్మే జిల్లెళ్ళమూడిలో అన్నప్రాసన చేసింది. మొదటి బాబు శ్రీనివాస మూర్తి, రెండువవాడు నాగరాజు, మూడవవాడు రాధాకృష్ణ పెద్దవాడికి, చివరివాడికి, అన్నప్రాసనలు రెండవవాడికి అక్షరాభ్యాసం అమ్మ చేతిమీదగానే జరగటం విశేషం. ఆ సమయంలో ఎవరో అమ్మకు ఫోటో తీసారు. మీ బాబు అన్నప్రాసన ఫోటోలు అంటూ రెండు ఫోటోలు తెచ్చియిచ్చారు. అసలు ఫోటోలు ఎవరు తీసారో కూడా వీళ్ళకు తెలియదు. అమ్మ దయవల్ల పిల్లల ముగ్గురికీ మంచి చదువులు వచ్చి జీవితంలో సెటిల్ అయ్యారు.

లక్ష్మణరావు గారితో రామకృష్ణ అన్నయ్య "కరీంనగర్ టూర్‌లో మీరు లేరన్న లోటును మీ బావ మరిది తీర్చాడని" అన్నాడు. ఇప్పటికీ జిల్లెళ్ళమూడిలో ఏ ఫంక్షన్ జరిగినా తప్పక భార్యాభర్తలు వచ్చి ఆ వేడుకలో పాల్గొంటారు.

+ + +

రావినూతల సత్యనారాయణగారు అమ్మ అనుంగు బిడ్డడు. ఏది జరిగినా అమ్మదయే అన్న విశ్వాసం కలిగిన వారు. వారి అమ్మాయి హైమ నిజామాబాద్ కాలేజీలో చదువుతోంది. ఒక మాటు బస్సులో లైబ్రరీ బుక్కు మర్చిపోయింది. అది గ్రహించి చాలా ఆందోళన చెందింది. ఇది తెలిసిన ఒక స్నేహితురాలు లైబ్రరీ అధికారికి హైమ లైబ్రరీ బుక్స్ పారవేసిందని చెప్పింది.

హైమకు ఏమిచేయాలో తోచక అమ్మను ప్రార్థిస్తూ బస్సు తిరిగి అదే రూటులో వస్తుంది కదా! అని బస్సు కోసం రోడ్డు మీదే దిగులుగా నిలబడింది. ఈ లోగా బస్సు వచ్చింది. సరిగ్గా తను కూర్చున్నచోట ఒక పెద్ద ముత్తైదువ పెద్ద బొట్టు పెట్టుకున్న ఆమె హైమ చేతిలో ఆ పుస్తకాలను పెట్టింది. హైమకు అలివిమాలిన ఆనందంతో ఒడలు పులకరించింది. అవి తీసుకొని కాలేజీకి వచ్చింది. ఈలోగా లైబ్రరీ నుండి పిలుపువచ్చింది. వెంటనే హైమ వెళ్ళి

పుస్తకాలను ఇచ్చేయటంతో ఆ స్నేహితురాలు బిత్తర పోయింది. తనని ఆపద నుండీ కాపాటానికే అమ్మ ఆరూపంలో తనను ఆదుకుందని హైమ విశ్వాసం.

సత్యన్నారాయణ అన్నయ్య నిజామాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నప్పుడు హనుంబాబు గారు, ప్రిన్సిపాల్ మధుసూదనశర్మగారు నిజామాబాద్ వస్తామని ఉత్తరం రాసారు. వారిని ఇంటికి తీసుకురావటానికి బస్‌స్టాండుకు వెళ్ళారు. హనుంబాబు గారు, సత్యనారాయణగారిని చూచి "ఏమిటి ఇలా వచ్చారు?" అని అడిగారు. మీరు ఈ రోజు వస్తామని రాసారు కాదా! మిమ్మల్ని తీసుకువెళ్ళటానికి వచ్చానని చెప్పారు. మేము 12 వ తారీఖుకు వస్తామని రాశాము. గుంటూరులో తొందరగాపని అయిపోవడంతో అడ్రస్సుంది కదా! కనుక్కోవచ్చుని వచ్చామన్నారు. ఉదయం కూడా ఉత్తరం చూచాను. 11వతేదీ అని వున్నదని సత్యనారాయణగారు చెప్పారు. తీరా ఇంటికి వెళ్ళిచూస్తే ఉత్తరంలో 12 వతేదీ అనే వున్నది. సత్యనారాయణగారికి 11 వతేదీలా కన్పింప చేసి వారిని ఇబ్బంది నుండి కాపాడిన అమ్మకు అంజలి ఘటించారు.

"తమ బతుకు తాము బతకలేని బలహీనులు అనేకమంది ఉన్నారు. వారికి తోడ్పడింది. అది వారిపై జాలితో చేసే సహాయమని అనుకోక వారిని భగవత్ స్వరూపాలుగా భావించి సేవ చేయండి. కనిపించని దేమునిపై మనసు నిలవడంలేదని, ఏకాగ్రత కుదరటంలేదని బాధపడక మానవరూపంలో కనిపించే యీ దేవుళ్ళను ప్రేమతో ఆరాధించండి. ఆ సేవలో "కలిగే తృప్తే ముక్తి" అని అమ్మ సందేశం."

+ + +

కఠారు ప్రసాదరావు గారికి 40సం॥లు పూర్తి అయ్యే సమయంలో ఒక భోగి పండుగకు అమ్మ అన్నయ్యను దగ్గరకు తీసుకున్నది. అప్పటి వరకు ఆయన వెతుకుతున్న పరదేవతే అమ్మ రూపంలో లభ్యమైందనుకున్నాడు. అప్పటికి అన్నయ్య హృదయం సచ్చిదానందసదనమైంది. మనస్సు

ఆనందోత్సాహాలతో ఊగిసలాడింది. మనస్సుకు కొంత స్థిమితం చిక్కి శాంతత నొందింది. శ్రీ కాశీ కృష్ణమాచార్యులంతటి వారు అమ్మను "సాక్షాత్తూ రాజరాజేశ్వరి" అన్నారు.

సాక్షాత్ జగజ్జనని ఆశీర్వాదం ప్రత్యక్షంగా కల్గటం ఎవరికైనా మరపురాని అనుభూతియే. అమ్మ సూక్తులకు రమణమహర్షి ప్రవచనాలకు సామ్యం అంతటా ద్యోతకమవుతుంది. అమ్మను తానొక్కడే కాక దేశంలోని ప్రజలందరూ అర్చించాలని, ఆమె ఆశీస్సులు ప్రతి ఒక్కరూ అందుకోవాలన్న తపన కలవాడు. అప్పుడు దేశమే సుభిక్షమవుతుందని అన్నయ్య ఆకాంక్ష.

అన్ని మతాల్లోని ఏకత్వాన్ని వివేకంతో గుర్తించటమే హిందూమతంలోని గొప్పదనం. విభిన్న మతాలు పరస్పర విరుద్ధం కాదని, మతాలమధ్య పరస్పర వైరం లేదని శాశ్వతము, సనాతనము అయిన ఒక మతం యొక్క విభిన్న దృక్పథాలేనని హిందువులందరి ప్రగాఢ విశ్వాసం. ఏదో ఒక సిద్ధాంత ప్రాతిపదికగా కాని, ఊహల గారడీగా గానీ, అభిప్రాయాలను హిందువులు స్వీకరించరు. అదే విషయం మాతృశ్రీ అనసూయాదేవి సమక్షంలో మనకు అవగతమవుతుంది.

మహాశివరాత్రినాడు రుద్రాభిషేకం చేసుకుని అమ్మను శివునిగా ఆరాధిస్తారు. గోకులాష్టమినాడు కృష్ణునిగా, శ్రీరామనవమినాడు శ్రీరామునిగా, వైకుంఠ ఏకాదశినాడు శ్రీమన్నారాయణునిగా, వినాయక చవితినాడు గణపతిగా, నవరాత్రులలో మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళిగా అమ్మను పూజిస్తారు. ఇది దైవత్వంలో ఏకత్వాన్ని సూచిస్తోంది. చాలామందికి అమ్మ రాజరాజేశ్వరిగా, గాయత్రిగా, పార్వతిగా, సాయిబాబాగా, కుసుమ హరనాథులుగా దర్శనమిచ్చింది. ఈ దైవరూపాలన్నీ పరతత్వమైన అమ్మయొక్క వివిధావతార విశేషాలే. చీరాల ఆసుపత్రిలో మంచంలో వున్న రోగిని చూడటానికి వెళ్ళినపుడు అమ్మ ఆమెకు ఏసుక్రీస్తుని కన్న మరియమ్మగా దర్శనమిచ్చింది. అలాగే అమ్మ

దగ్గరకు వచ్చేవారిలో ఒక్క హిందువులేకాక, క్రైస్తవులు, మహమ్మదీయులు కూడా ఉండటం గమనార్హం.

ఎందరో భగవద్గీత చదివే మహమ్మదీయులు వున్నారు. భగవద్గీత సర్వకాల సర్వదేశాలకు అతీతమైన భగవద్వాణి. మన సమస్యలకు భగవద్గీతలో సమాధానం తప్పక దొరుకుతుంది. అందుకే అమ్మ మిగిలిన పండుగలతో సమానంగా రంజాన్‌కు సేమ్యా చేయించి ఖురాన్ పఠించమనటం, క్రిష్టమస్‌కు బైబిల్ చదివించటం, కొత్త సంవత్సరంకు రిబ్బన్ కట్‌చేసి కేకు, టీ, బిస్కట్లు అందరికీ ప్రసాదంగా పంచటం అమ్మ బిడ్డలందరికీ తెలిసిన విషయమే కదా! తనకంటూ, తనంటూ ఆచరించిన మతం లేదని "సర్వసమ్మతమే తన మతమని" అమ్మ నొక్కి వక్కాణించింది. పైగా పూజ తనకని కాక వారివారి ఇష్టదైవాలకు చేసుకుంటున్నారని, "నాలో మానవత్వాన్ని మీరు చూస్తున్నారు, మీలో నేను దైవత్వాన్ని చూస్తాను" అని అమ్మ చెప్పింది.

అన్ని మతాల వాళ్ళు, అన్ని కులాల వాళ్ళు ఒకే తల్లి బిడ్డలమన్న భావనతో అమ్మ నామ సంకీర్తనలో పాల్గొనటం విశేషం కదా! అందుకే జిల్లెళ్ళమూడి అన్ని నమ్మకాలకు, అన్ని మతాలకు కేంద్రమైంది.

సామాజిక, జాతీయ జీవన పరిధుల్లో అన్యోన్యతా రాహిత్యంతో పాటు, అస్తవ్యస్త పరిస్థితులు తాండవిస్తున్న ఈరోజుల్లో అన్ని కులాల వారిని, అన్ని తెగల వారిని అన్ని జాతుల వారిని ఒక సమరసమైన పరిపూర్ణ స్వరూపంగా మార్చే అతిలోకమూ, అతులితమూ అయిన మహత్తర మాధవత్వం ఏకీకరణ శక్తి అమ్మలో గోచరిస్తుంది.

+++

జనాభా సమస్యతో ప్రపంచం సతమతమవుతున్నది. కుటుంబ నియంత్రణ విధానాలను విరివిగా ప్రవేశపెడుతున్నారు. ఆ తరుణంలో ఒక విలేఖరి "బర్తు కంట్రోలు గురించి అమ్మను మీ అభిప్రాయమేమిటి?" అని

అడిగాడు. దానికి అమ్మ "బర్త్ కంట్రోలు కాదు నాయనా! భర్త కంట్రోలు అయితే సరిపోదా?" అన్నది. "ఇంత హాస్యంగా ఎలా మాట్లాడగలుగుతున్నారు" అని ఒకరు అమ్మను అడిగారు. "నా హాస్యంలో రహస్యం ఉన్నది నీ రహస్యమే నాహాస్యం" అని అన్నది.

అమ్మ జన్మ నక్షత్రం ఆశ్లేష, అమ్మ నివసించే గృహం అందరిల్లు. కావున అమ్మకు సంబంధించిన విషయములన్నీ 'అ' కారముతో ఆరంభమయ్యేవే. సర్వవేదోపనిషత్ సారమయినటువంటి శ్రీమద్భగవద్గీతలో పదవ అధ్యాయమైనటువంటి విభూతి యోగములోని ముప్పది మూడవ శ్లోకంలో "అక్షరాణాం అకారాస్మి" అంటూ శ్రీకృష్ణ పరమాత్మ తన వైభవాన్ని చాటి చెప్పాడు. అటువంటప్పుడు అకారమయమయిన అనసూయమ్మ ఆదిశక్తి అపర అవతారంగాక మరేమవుతుంది? అటువంటి అమ్మను ఆరాంధించటంలో కల ఆనందాన్ని ఏమని వర్ణించగలము.

హృదయమనే క్షేత్రంలో మంత్రం అనే విత్తనాన్ని సద్గురువు అనే తోటమాలి నాటాలి. మంత్రం మననం చేయటం వలన ప్రాపంచిక వాసనలు పోగోట్టు కోవటానికి మార్గం ఏర్పడుతుంది. దీనికి విధ్యంస పద్ధతి, విధాయక పద్ధతి అను రెండు పద్ధతులు వున్నాయి. విధ్వంసక పద్ధతి అంటే ఉన్న మాలిన్యాన్ని పోగొట్టాలి. గోడకు సున్నం కొట్టాలంటే, బూజులు దులిపి సున్నం వేస్తాం. విధాయక పద్ధతి అనగా పాత్రలకు కళాయి పెట్టేవాడు ముందు గిన్నెకున్న మకిలిని గీకి పోగొట్టి కళాయి పెడతాడు. ఉన్న మాలిన్యాన్ని పోగొట్టే శక్తి పద్మాలకుంటుంది. పద్మం బురదలో పుట్టినా దానికి ఆ బురద అంటదు. ఎండలో నడచిన వాడికి, తాపంగా ఉన్న వాడికి తామరాకు వేస్తే చల్లదనం కలుగుతుంది. తాపాన్ని పోగొట్టి శాంతిని కలిగించే గుణం పద్మానికి ఉంది. చంద్రుడు తాపాన్ని హరిస్తాడు, గంగ పాపాన్ని పోగొడుతుంది. ఈ రెండింటినీ ధరించిన పరమశివుని సేవిస్తే తాపం, పాపం రెండూ పోతాయి. మనస్సుకు శాంతి కావాలనుకున్న భక్తులు దేవి అనుగ్రహంకై తపిస్తారు.

మన భాగ్యవశాన ఆ పరమేశ్వరి జిల్లెళ్ళమూడి అమ్మగా మన కాలంలో అవతరించి పాపాలను, తాపాలను మన దరి చేరకుండా మన కవసరమైన శాంతిని కలుగ చేస్తోంది. శరీరాన్ని త్యజించే సమయంలో భగవన్నామాన్ని స్మరించాలి దానికి ఆ భగవతి కృప ఎంతో అవసరం. దేవి సందర్శనం చేసినపుడు పాదాల మీదే మన దృష్టి నిలపాలి. పాదాలకే నమస్కరించాలి. "గూఢ గుల్ఫా కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా" అన్న విధంగా అమ్మవారి పాదాలు మనలను ఉద్ధరిసాయి. అమ్మవారి పాదముల తరువాత ముఖాన్ని దర్శించమన్నారు శంకరాచార్యులు. "ఓ లలితా దేవి ఉదయాస్తమానాలు నీ నామాన్ని స్మరిస్తానని" ఆది శంకరులు మనకు ఆధ్యాత్మిక మార్గాన్ని ప్రసాదించారు.

మానవులంతా క్షరులం. అధిష్టానం మీరకుండా ఉండేది అక్షరం. ఆకారం లేని పరమేశ్వరి ఆకారంతో అవతరించింది. అనగా పుట్టుక లేని అమ్మవారు ఆవిర్భవించింది. అనగా కనిపించింది. భగవతి స్వరూపం ఛిద్రూపం. ఛిద్రూపాన్ని మనం గుర్తించలేం కనుక అమ్మవారే దేవతల మొర ఆలకించి అవతరించిందని లలితా సహస్రనామం విశద పరుస్తోంది.

మన అదృష్ట వశాత్తూ ఆ భగవతి మన కోసమే అవతరించింది. యజ్ఞం చేసేటపుడు అగ్నిహోత్రుని ద్వారా మనం సమర్పించుకునే హవిస్సులను అగ్నిహోత్రుని భార్య అయిన స్వాహా దేవి ద్వారా దేవతలకు అందిస్తున్నాము. అమ్మ దగ్గర మన ఆవేదన, ఆర్తులే అమ్మను కదిలించి మనకు యజ్ఞ ఫలాన్ని అందిస్తున్నాయి.

పితృదేవతలకు ఆబ్దీకం పెట్టాలన్నదానికి నవీన కాలంలో పితృదేవతలే వాటిని స్వీకరిస్తారా అనే అనుమానాన్ని వ్యక్తం చేస్తున్నారు. మనకు 365 రోజులైతే పితృదేవతలకు ఒక రోజు. స్వధాదేవి పితృదేవతలకు అందిస్తుంది. సాధారణంగా మానవులం తాత్కాలిక సుఖాలనే కోరుకుంటాం. అవి అందించే

స్వర్గం కోరకూడదు. పైకి వెళ్ళిన తరువాత తిరిగి రావటం ఉండని, అనగా మళ్ళీ జన్మ ఎత్తకుండా ముక్తిని పొందటానికే కృషి చేయాలి. దానికి మన అమ్మ లౌకిక విషయాల ద్వారా అలతి అలతి మాటలతో ఆధ్యాత్మికాన్ని తెలియచేస్తోంది. మనకు తెలియ కుండానే మనలో మార్పు కలిగించి మనలను మోక్షగాములుగా చేస్తోంది అమ్మ.

భవ సాగరాన్ని దాటటానికి ఈ కలియుగంలో నామ సంకీర్తన అన్న పడవను ఆశ్రయించాలి. అందుకే అమ్మ జిల్లెళ్ళమూడిలో అఖండ నామ సంకీర్తనను ఏర్పాటు చేసింది. జన్మవాసన, కర్మవాసన, భోగవాసనలను పోగొడుతుంది భగవన్నామం. భగవంతుని ప్రార్థించేటప్పుడు ముందు మనకు మంచి బుద్ధిని ప్రసాదించిన తరువాతే ఆ దేవ దేవుని ప్రవేశింపమని కోరుకోవాలి.

పద్మాసనంలో కూర్చుని ధ్యానం చేస్తే కుండలిని మూలాధారం నుండి బయలు దేరుతుంది. పిండాండంలోని కుండలినీ శక్తి మనలను అనుగ్రహిస్తుంది. ధ్యానం చేసేటప్పుడు కన్నులు మూసుకుని మనలోపల ఉన్నకాంతిని దర్శించటానికి ప్రయత్నించాలి. ఒకే శక్తి సృష్టి కార్యం జరిపేటప్పుడు బ్రహ్మ, పోషణ విష్ణుమూర్తి, లయకారకుడు శివుడుగా రూపాలు ధరించింది.

+ + +

తంగిరాల రాధ 21సం॥లు వయస్సులో అమ్మను మొదటిసారి 1961 జూన్‌లో దర్శించాడు. మొదట్నించీ దేముడి మీద, బాబాల మీద ఎటువంటి ఉద్దేశంలేదు. మొదటిసారి అమ్మ దగ్గరకు అయిష్టంగానే వెళ్ళాడు. అమ్మను దర్శించింది మొదలు అంతే అమ్మే అయింది. అతను నడిచే నడతలో చూచే చూపులో అంతా అమ్మమయమే. జిల్లెళ్ళమూడికి వెళ్ళి అమ్మ పాదాల దగ్గర కూర్చున్నప్పుడు, అమ్మ పక్కనే వున్న పూలను తీసుకొని, ఆ పూల రేకులను

తన పాదాల మీద వేసుకుంటూ అప్పుడప్పుడు రాధ అన్నయ్య వంక చూస్తూ ఆలోచనలోని నిమగ్నమైంది.

రాధ అన్నయ్య అమ్మతో "ఏం ఆలోచిస్తున్నావమ్మా?" అని అడిగాడు. అమ్మ అన్నయ్య వంక చూచి చిరునవ్వుతో అన్నయ్య వీపు మీద చేయివేసి మళ్ళీ ఆలోచనలో మునిగిపోయింది. అన్నయ్య "అమ్మా! నీ గురించి ఆలోచిస్తున్నావా?" అని అడిగాడు. 'కాదునాన్నా!' అని ఆవరణ నిర్వహించడానికి శేషగిరిరావు అన్నయ్యకు సాయంగా ఎవరైనా వుంటే బాగుంటుంది. అన్నయ్య మాత్రం ఎన్ని పనులు చూస్తాడు? చాలా అవస్థ పడ్తున్నాడని" చెప్పింది. రాధ అన్నయ్య ఆ మాటకు గట్టిగా నవ్వి, "నీ ఈ ఆలోచన చాలా బాగుందని" అమ్మను లోపలకు తీసుకువెళ్ళాడు. ఆ తరువాత హైద్రాబాద్ వెళ్ళి ఉద్యోగానికి రాజీనామా చేసి వారం రోజుల్లో జిల్లెళ్ళమూడికి వచ్చాడు. అమ్మ దగ్గరకు వెళ్ళి "ఉద్యోగం రిజైన్ చేసి వచ్చానమ్మా!" అని చెప్పాడు. "ఉద్యోగం ఎందుకు మానేశావు. మళ్ళీ ఉద్యోగం కావలసివస్తే రావద్దూ!" అన్నది అమ్మ. "ప్రస్తుతానికి ఆ ఆలోచన వద్దులేమ్మా!" ఏం చేయమంటావో చెప్పు అని అన్నాడు. దానికి అమ్మ "నీ ఇష్టం నాన్నా". నీకు ఏది హాయిగా వుంటే అది చేయమంది.

అలా పొలంకు వెళ్ళేటప్పటికి ఆవరణలోని పిల్లలంతా కుప్పనూర్పిళ్ళు చేస్తున్నారు. చాలా సరదాగా వుంది వాతావరణం. అందరూ అమ్మ నామం గానం చేస్తుంటే చాలా హాయిగా అనిపించింది. అక్కడే వున్న భాస్కరరావన్నయ్య దగ్గరికి వెళ్ళి "నేను కూడా చేయనా" అని అడిగాడు రాధ అన్నయ్య. వరిగడ్డితో పేని తాడు చేసిఇచ్చి ఎలా చేయాలో చూపించాడు. రాధ అన్నయ్య ప్రయత్నిస్తుంటే అంతా వింతగా, విచిత్రంగా చూసారు. కానీ కొద్దిసేపు ప్రయత్నించాక వీలుకుదిరింది. ఇంతలో అక్కడికి బుట్టలో పెట్టి భోజనం వచ్చింది. గోంగూర పచ్చడి, అన్నం, మజ్జిగ వాళ్ళు తింటూ అన్నయ్యకు

ముద్దలు కలిపి పెట్టారు. అవి చాలా రుచిగా వున్నాయి. వారితో పాటు కలిసి మెలసి పని చేయటం చాలా ఆనందమనిపించింది. వారితో పాటు సాయంత్రం 6గం॥ వరకూ పని చేసాడు.

ఆవరణలోకి వచ్చి కబుర్లు చెప్తున్నాడు. ఇంతలో అమ్మ దగ్గర నుంచీ కబురు వచ్చింది. అమ్మ అన్నయ్యతో "నాన్నా! పొలం వెళ్ళావుట కదా! కొత్త గడ్డి దురదలుగా వుంటుంది. వేన్నీళ్ళ స్నానం చేయమంది. స్నానాంతరం భోజనం చేసి అమ్మ దగ్గరకు వచ్చి పడుకున్నాడు.

ఆ పట్టు పట్టా రెండు సం॥ల కాలం అమ్మ సన్నిధిలో అనేక కార్యక్రమాలలో పాల్గొన్నాడు. ఆ ఆవరణలో చిన్నపనీ పెద్దపని అన్న తేడా వుండదు. అందర్నీ కంటికి రెప్పలా చూచుకునే అమ్మ సన్నిధానం ఆనందసంధాయకమే కదా! పొద్దున్న 5గం॥ నుంచీ రాత్రి 10గం॥ వరకు చెయ్యని పని అంటూ లేదు. అప్పుడే అందరిల్లు కట్టడం జరుగుతోంది. ఆవరణలో సున్నంగానుగ పెట్టారు. పోతుకూచి రవి రాత్రంతా గానుగ తోలేవాడు. పోతుకూచి రవి అమ్మే తాను, తానే అమ్మగా ఆవరణలో అన్ని పనుల్లో భాగం పంచుకొని అమ్మలో ఐక్యం అయ్యాడు. దత్తు అన్నయ్య పొలం పనులతో పాటు గానుగలో సున్నం తిరగేసే పని రాత్రంతా చేసేవాడు.

ఇటుకల బట్టీ కూడా పెట్టారు. అవి చేయటానికి వరిపొట్టు కాల్చి జమ్ములపాలెం నుంచీ తెల్లవారుఝామున దున్నల బండి కట్టుకొని 6 గం॥లుకు బండిపై తీసుకు వచ్చి ఆరు బస్తాలు నింపుకొని ఇటుకల బట్టీల దగ్గర అన్‌లోడ్‌మెంట్ చేసి ఆవరణలోకి వచ్చేటప్పటికి మధ్యాహ్నమయ్యేది. భోజనానంతరం 2 గం॥ బయలుదేరి రాత్రి 11 గం॥ రెండో బండి తెచ్చేవాడు.

రాధ, విద్యాసాగర్ గారి పిల్లలు రమణ, సావిత్రి, హైమా, మన్నవదత్తు, రాచర్ల శ్రీరామమూర్తి, భాస్కరన్నయ్య, నంబులు, అలివేలు మంగ, ఆమె చెల్లెలు

బాల, అమ్మమ్మ కూతుళ్ళు రాజ్యం. విద్యాధరి, కటిక హనుమయ్య 24 గం॥ ఆవరణలో రకరకాల పనులు చేసేవారు. ఆవరణ అంతా ఆనందమయం "అను దినమును నీ నామమును మా హృదయాంతరమున నిలుపుము తల్లీ" అని ఒకరంటే కోరస్‌లా "జయహో మాతాశ్రీ అనసూయ రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి" అని మిగిలిన వారు పాడేవారు. ఈ నామంతో జిల్లెళ్ళమూడి మారు మ్రోగిపోతుండేది.

రాధ అన్నయ్య ఉన్న సమయంలోనే జిల్లెళ్ళ మూడిలో సంస్కృత పాఠశాల ప్రారంభమయింది. హైమక్క, ఝాన్సీ, రమణ, మంగ, వసుంధర మొ॥వారంతా ఓరియంటల్ పాఠశాలలో విద్యార్థులు. అక్కడి పనులకు వీరి అవసరం ఎంతో వుండేది. ఈ విద్యార్థులు అవసరం అవటంతో రాధ అన్నయ్య పొలానికి తీసుకు వెళ్ళాటానికి వస్తే ఉపాధ్యాయులైన భద్రాద్రి తాతగారికి అన్నయ్యకు ఘర్షణ జరిగేది.

ఆ సంస్థలో పని చేయటానికి నిర్ణయించుకొని ఉద్యోగాలకు రాజీనామాలిచ్చినవారు, రాధ అన్నయ్య, దినకర్, అంజన్ ఇంకా అలా అమ్మ సేవ చేసుకోవాలనుకున్నవాళ్ళు అనేకులు జిల్లెళ్ళమూడిలో స్థిరనివాస మేర్పరచుకున్నారు. మన రోజులు బాగండకపోతేనో, మనలను ప్రక్షాళనం చేయటానికో అమ్మ అలా చేయిస్తుందనిపిస్తుంది. ఆ ప్రక్షాళనానంతరం అమ్మ వారికి తగిన విధంగా జీవితాలని మలచటం చూస్తే 'మహామాయ' అయిన అమ్మకు ఇది పెద్దపని కాకపోవచ్చు కాని ఆవిడ సన్నిధిలో గడపగల్గటం అదృష్టం. రాధ అన్నయ్యలా అమ్మ సన్నిధిలో వుండగలగటం పూర్వజన్మ సుకృతమే. అమ్మఒడిలో బిడ్డడయినాడు కనుకే అన్నయ్య బాధ్యతను అమ్మ తీసుకుంది. అమ్మ ఆలోచనలతో, అమ్మ స్మరణతో, అమ్మ చూపులోనే బ్రతుకుతున్నాడంటే అమ్మ కరుణకు అవధులు లేవు కదా! హైమ ఈ భూమి మీద నడయాడినప్పుడు వుండగల్గటం ఎంతో అదృష్టం అటువంటి అవకాశం లేని మా లాంటి వాళ్ళకు

అప్పటి వాళ్ళు చెప్పే అనుభూతులే ఆశాదీపాలు. హైమక్కను చూడకపోయినా తన గురించి విని ధన్యులమవుతాము.

తంగిరాల శాస్త్రి అన్నయ్య అమ్మ దగ్గర కూర్చుని పాత సంగతులను నెమరేసుకుంటున్నాడు, పోతుకూచి రవి జల ప్రమాదంలో చిక్కుకున్న విషయం వచ్చి "మునగండిరా! మునిగాక తీసి ఒడ్డున పడేస్తానని" అమ్మ చెప్పిందని మా మరిదిగారు కుటుంబరావు గారు చెప్పారు. మా బాబుకు మేజర్ యాక్సిడెంట్ అయి దిక్కుతోచని స్థితిలో కొట్టుమిట్టాడుతుంటే ఈ పై విషయం చెప్పారు. "అమ్మా! పూర్తిగా మునిగాం, తీసి ఒడ్డున పడేస్తావో, ముంచేస్తావో నీదే భారం" అని అమ్మనే ప్రార్థించాను. ట్రైయిన్ ఎడ్వర్డు "నిజమైన ప్రార్థన వల్ల భగవంతుడు మనకు సహకరించటమే కాక, ఒక్కొక్కప్పుడు యోగ్యతను మించి చేస్తాడు" అని అంటాడు. అది మావిషయంలో పూర్తిగా నిజమైంది. బాబు ఎట్టి అవకరం లేకుండా బయటపడటానికి అమ్మదయే కారణం.

తంగిరాల శాస్త్రి అన్నయ్య అమ్మతో గాయత్రీ జప విషయంలో తమ సందేహాన్ని అమ్మ వద్ద ప్రస్తావించాడు. "అమ్మా! ఈ రోజుల్లో అంతా కలుపుతున్నారు కదా! అలాంటప్పుడు జపం చేయచ్చా? అని అడిగాడు. దానికి అమ్మ ఆచారం అనేది ఆరోగ్యం కోసమే నాన్నా! ఆ సమయంలో విశ్రాంతి అవసరం కదా! వంట మీరు చేసుకుంటే అందులో కష్టం, సుఖం మీకు అర్థమవుతుంది. గాయత్రీ జప దీక్ష ఆడవాళ్ళూ తీసుకోవచ్చు. పంచభూతాలే గాయత్రీ. ఉఛ్వాస నిశ్వాసాలే గాయత్రి" అని విధి నిషేదాల పరమార్థాన్ని, గాయత్రీ స్వరూపాన్ని విశదీకరించింది అమ్మ.

+ + +

శ్రీ సత్యసాయిబాబాగారు రేపల్లె వచ్చినప్పుడు ఆయన్ని దర్శించి వస్తానని పూర్ణచంద్రరావు అమ్మను అడిగాడు. దానికి అమ్మ "వాడిని చూచి వచ్చాక ఏమన్నాడో" చెప్పమన్నది. పూర్ణచంద్రరావు చిన్నవాడవటంతో మెల్లిగా దూరి

బాబాగారి దగ్గరకు వెళ్ళాడు. ఆయనతో "నేను జిల్లెళ్ళమూడి అమ్మ దగ్గర వుంటాను మిమ్మల్ని దర్శించటానికి అమ్మ అనుమతి తీసుకువచ్చానని" చెప్పాడు. దానికి బాబాగారు "ఆమె నీకే కాదు. నాకూ అమ్మే. She is a mother of you and me అన్నారు. ఆయనకూ అమ్మే అయినప్పుడు నాకు ఇక్కడ పనేముందని తిరిగి వచ్చాడు."

దూదేకుల సాయిబు 4 గురు శిష్యులతో అమ్మను పరీక్షించాలని వచ్చాడు. అమ్మ అన్నం పెడితే అందులో ఉమ్మేసాడు. అతను పరీక్షలంటూ అమ్మను నానావిధాలుగా కష్ట పెట్టేవాడు. దానితో హైమక్క, పూర్ణచంద్రరావు వాడైనా వుండాలి, లేదా మేమైనా వుండాలని అమ్మతో చెప్పారు. దీపావళి పండుగనాడు అమ్మకు దురదగుండాకు పొడితో పూజ చేసాడు. పూజ అయిన తరువాత శిష్యులు లేచారు. కానీ గురువు గారికి వరిబీజం ఏర్పడింది. దానితో విపరీతమైన బాధతో ఎంతకూ లేవలేకపోయారు. చీరాల డాక్టరుగారి జేబులో మందు పొట్లం వుంటుంది. ఆయన చూడకుండా అది తెచ్చి ఆ సాయిబు నోట్లో ఆ మందు వేయమంది. ఆ మందు వేయడంతో మామూలు అయి తిరిగి మళ్ళీ చూడకుండా వెళ్ళిపోయాడు, "ఏం చేసావమ్మా?" అని అడిగితే డాక్టరుగారి జేబులో మందువాడి నోటిలో వేసాడు. దానితో వాడికి తగ్గిందని తనకు ఏమీ తెలియదని అమాయకతను నటించి మాయ తెరను కప్పింది. డాక్టరుగారికి విరోచనాలు అవుతున్నాయని ఆ మందు తెచ్చుకున్నారు. 'సర్వవ్యాది ప్రశమని' అయిన అమ్మకు మందుతో పనిఏముంది? మనలని మాయలో ముంచటానికి కాకపోతే.

+ + +

మాల కొండయ్య గుంటూరునివాసి. సోడాబండీ వేసేవాడు. కాకర్ల వెంకటస్వామి చేబ్రోలు నుంచీ బాపట్ల మీదుగా జిల్లెళ్ళమూడికి వెళ్ళవచ్చని చెప్పాడు. అప్పటికే అమ్మ గురించి విన్న కొండయ్యకు అమ్మను చూడాలన్న

ఆతురత అధికమైంది. ఎలా వెళ్ళాలో తెలిసింది కాబట్టి ఉదయం నిద్రలేవగానే పచ్చిగంగైనా ముట్టకుండా ఇంట్లో వారికి చెప్పి బయలుదేరాడు. మే నెల, అందులో గుంటూరు జిల్లాలో ప్రయాణం. చేబ్రోలు చేరి వాకబు చేస్తే కాలవగట్టు వెంబడి నడిచి వెళితే 16 మైళ్ళు వుంటుందన్నారు.

11గం॥ల వేళ కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా నడిచివెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు. అమ్మని చూడాలన్న ఆతురతతో ఏమీ లెక్కచేయకుండా 2గం॥ లకు అమ్మ సన్నిధికి చేరాడు. అతన్ని చూడగానే అమ్మ "ఏవూరు నాన్నా! నీది?" అని అడిగి "భోజనం చేసి రా నాన్నా!" అని చెప్పింది. అమ్మకు ఎప్పుడూ పిల్లల భోజనం గురించే కదా! ఆలోచన. సాయింత్రం 5గం॥ కు అమ్మ దగ్గరకు వెళ్ళాడు. బుట్టలతో గులాబులు, అరటిపళ్ళువున్నాయి. ఆ పూలన్నీ అమ్మపాదాల మీద గుమ్మరించారు. అందరికీ అరిటిపళ్ళు ప్రసాదంగా ఇచ్చింది అమ్మ.

అంతలో ఎవరోవచ్చి"చుట్టూకలరా వుంది. నీవు ఏమిపట్టనట్టుగా పడుకున్నావు, ఊరు తగలబడి పోతోందని" మొరపెట్టుకున్నారు. షిర్డీబాబా గోధుమలు విసిరి ఆ పిండిని వూరిపొలిమేరల్లో చల్లమన్నారు. అదేవిధంగా అమ్మ ఇంగువ బాగావేసి చారు పెట్టమన్నది. అమ్మ చెప్పింది చేయటమేకాని ఎందుకు? ఏమిటి? అని అడిగే పద్ధతేలేదు. ఆ తరువాత ఊళ్ళో కలరా తగ్గి పోయింది.

అమ్మ సన్నిధిలో కూర్చున్నవారిలో ఒకరు శ్రీ రామకృష్ణ పరమహంస, శారదాదేవిల గురించి అడిగారు. "ఆ దంపతులు అందరికీ ఆదర్శప్రాయులని" చెప్పింది అమ్మ. ఇంకొకరు చేతబడి గురించి అమ్మ అభిప్రాయాన్ని అడిగారు. "అవేమి లేవునాన్నా వాడి మనసే భయపెడుతుంది. మనస్సే దైవం ఆ మనస్సే దయ్యం కూడాను. భ్రాంతి తొలిగితే భయం వుండదని" తెలియచేసింది.

కొండయ్యతో ఆ రాత్రి ఒంటి గంటకు "ఇక్కడకు వచ్చి ఎందుకు ఏడుస్తున్నావు? అమ్మ దగ్గరకే వచ్చావు నాన్నా! ఉదయం పచ్చి మంచి నీళ్ళు కూడా తాగకుండా అంత ఎండలో తోవ అంతా పల్లేరు కాయలు, తుమ్మముళ్ళు, పాములు, కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా అంత దూరం నడిచి వచ్చావు, నీవు ఎంత బాధ పడ్డావో నాకు తెలుసురా!" అన్నది. దానితో ఆశ్చర్యపోవటం కొండయ్య వంతు అయింది. తాను ఎలా వచ్చిందీ ఎవరికి చెప్పలేదు, తాను వచ్చేటప్పుడు చూసిన వాళ్ళూలేరు. దానితో అమ్మ సర్వజ్ఞురాలని అవగతమైంది. తాను అంతమటుకు పడిన శ్రమను మర్చేపోయాడు.

"నీ గురించి నాకు అంతా తెలుసు, చాప తీసుకువెళ్ళి పడుకోనాన్నా" అన్నది. రాత్రి అతను పడుకున్న తరువాత త్రిశూలం పట్టుకొని పెద్ద బొట్టు పెట్టుకొని అమ్మ కొండయ్య దగ్గరకు వెళ్ళి బొట్టు పెట్టింది. అమ్మ దేదీప్యమానంగా వెలుగొందుతోంది. అన్నయ్యకు ఏమూల సంశయమున్నా దానితో పటాపంచలైంది. మొదటి చూపులోనే కొండయ్యకు అమ్మే సర్వస్వం అన్న నమ్మకం కలిగింది. అమ్మ ఫోటో ఒకటి కొనుక్కుని, మర్రి పూడి గుళ్ళ దగ్గరకు వచ్చే సరికి కాలువ దగ్గర పడ్డాడు. ఆపడటం అమ్మ ఒళ్ళోపడిన అనుభూతి కలిగింది.

అనాటి నుంచీ కూర్చున్నా నిల్చున్నా అమ్మ ధ్యాసే. అమ్మ జిల్లెళ్ళమూడి నుండి "ఒరే కొండయ్యారారా" అని రాత్రి 2 1/2 గంIIకు పిలిచేది, ఏ టెలీఫోన్లు లేని ఆ రోజుల్లో కొండయ్యకు ఆ పిలుపు వినిపించి సోడాబుడ్డీలు తీసుకు వెళ్ళేవాడు. కొండయ్యను చూచి "నిన్ను ఎవరు పిలిచారు, సూర్యనారాయణని పిలిచాను" అనేది.

ఒకమారు చాలా రోజుల అనంతరం వెళ్ళటం సంభవించింది." ఇంత కాలం రాకుండా ఎలా వున్నావురా?" అని అడిగింది. అమ్మ దర్శనానికి వెళ్తు ఆ రోజుల్లో కాబూలీ దానిమ్మపండు 14రూ పెట్టి కొని తీసుకువెళ్ళాడు. బాగా

డబ్బువున్న వాళ్ళే బేడా పెట్టి తెస్తుంటే నీవు ఇంత డబ్బు ఖర్చుపెట్టి ఎందుకు తెచ్చావని" దెబ్బలాడింది.

నేను 16 ఫలాల నోము గుమ్మడి పళ్ళు అమ్మకు చేసుకున్నాను. స్టోరులో వాటిని చూడగానే ఆఫీసులో అడిగితే 18 పళ్ళుకు 36రూ।। ఇమ్మన్నారు. ఆ సమయంలో మా ఆర్థిక పరిస్థితి బాగా లేదు అమ్మతో నోము తీర్చుకుంటానమ్మా! అన్నాను. పండు ఒక రూపాయ చొప్పున ఆఫీసులో కట్టు చాలు అన్నది. అదికాదమ్మా! నేను ఆఫీసులో అడగటం వాళ్ళు చెప్పటం అయింది ఫరవాలేదులేమ్మా" అన్నాను అమ్మ మన పరిస్థితుల గురించి ఎంతగా ఆలోచిస్తుందో ఈ సంఘటన వల్ల ద్యోతకమౌతోంది.

కుసుమకు నాలుగు చీరెలు ఇవ్వాలని వుంటుంది కానీ అంతా ఏ మనుకుంటారో అని ఆలోచించే మాతృత్వానికి అవధులు లేవనిపిస్తుంది. భ్రమరాంబక్కయ్యతో నీ తోడబుట్టిన అక్కచెల్లెళ్ళు లేరనుకుంటావుగా! కుసుమనే అలా చూచుకొని దాని కష్టసుఖాలలో పాలు పంచుకోమంది. అదే విధంగా ఆ దంపతులు ఈనాటికీ అప్యాయతానురాగాలను అందిస్తూనే వున్నారు. ఆ విధంగా ఎంతో సహాయ సహకారాలను మాకు అందించింది అమ్మ.

మొదటిసారి వెళ్ళినట్టుగానే సాధారణంగా మే నెలలోనే పిలిచేది కొండయ్యను. కొండయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళి కాలవకు స్నానానికి వెళ్ళాడు. "వాడేడిరా?" అని అమ్మ చాలా సార్లు అడిగింది. అమ్మ స్నానం చేసిన నీరు బక్కెట్లుతో పట్టి కొండయ్య కోసం వుంచారు. ఎవరి ఆరోగ్యం సరిగా లేకున్నా ఆ నీరుతో స్నానం చేస్తే పూర్తిగా కోలుకుంటారని నమ్మకం. మా బాబుకు ఉబ్బుకామెర్లు వస్తే ఆనీటితో స్నానం చేయించమని కొమరువోలు సరోజినక్కయ్య చెప్పింది. వాడికి కావలసిన పథ్యంపానం ఉషవదిన చేసిపెట్టింది. ఆ స్థలమహత్యమేమోకానీ ఎవ్వరూ దేనికీ కాదనటం ఎరుగం, పత్యం కూర లేదని ఎవరి దొడ్లోనో పొట్లకాయ తెచ్చి వండింది ఉషవదిన. మనవూళ్ళల్లో కారులో

వెడ్తూ చూస్తే ఎక్కించు కోవాల్సి వస్తుందనుకుంటారు. కానీ బాపట్ల నుంచీ ఎవరు జిల్లెళ్ళమూడి వెళ్తున్నా, ఎవరైనావున్నారా, జిల్లెళ్ళమూడి వచ్చేవారని అడగటం రివాజు.

అమ్మ ఎప్పుడు తలుచుకుంటే అప్పుడు అర్ధరాత్రి అయినా సరే కొండయ్యకు వినిపించటం, అన్నయ్య రావటం అది ఒక యోగం. జగన్మాత తలంపులోకి రావటమే అదృష్టం. కొండయ్య జిల్లెళ్ళమూడిలో వుండగా హైద్రాబాద్ నుంచీ అమ్మను దర్శించుకొవటానికి వచ్చిన అన్నయ్యలు కారులో రాత్రి 10గం॥కు బయలుదేరారు, "వీడు గుంటూరు నుంచీ వచ్చాడురా! వాడిని ఇంటి దగ్గర దింపి వెళ్ళమంది" అమ్మ. అమ్మ చెపితే ఇంక తిరుగేముంది. వాళ్ళు సోడా కొండయ్యను గుంటూరులో అతని ఇంటి దగ్గర దింపి వెళ్ళారు.

అమ్మ దగ్గర బెత్తం, శంఖం, చక్రం వున్నాయి. ఆ బెత్తంతో అతని శరీరంలో మూలాధార చక్రం నుంచీ వరుసగా షట్‌చక్రాలను చూపించి వివరించింది. ఎంతగా నమ్మినా మానవ మాత్రులం, మాయ కప్పేయటం సహజం. అదే విధంగా కొండయ్యకు "ఈ పట్టు చీరెలు, ఈ నగలు, పాదాలకు బంగారం పెట్టుకొని ఈ ఆర్భాటాలెందుకో "ఈమె అమ్మేమిటి?" అని అనిపించింది వెంటనే అమ్మ అలంకారాలు పట్టుచీరె విడిచి దిగంబరిగా దర్శన మొసగింది.

అమ్మ ఎప్పుడు పట్టు చీరెలు కట్టుకుంటుందనుకున్నవారితో "నాకు పట్టుచీరె అయినా, గోనెపట్టా అయినా ఒకటే, నీలాంటి బిడ్డ తెచ్చి ఇస్తే వాడ్ని తృప్తి పరచటం కోసం కట్టుకుంటున్నాను. బట్టలు విడిచివుండటానికి నాకేమి అభ్యంతరం లేదు నీవు చూడగలిగితే" అన్నది. ఆ అనుకున్న మానవుడు నిర్ఘాంత పోయాడు. అందుకే అమ్మ కొండయ్యకు ఆవిధంగా దర్శన మిచ్చింది, యోగేశ్వరేశ్వరి అయిన అమ్మకు అవి ఏవీలెఖ్ఖలోకి రావు, మానవమాత్రులమైన మనకు గాని మనని కూడా ఆస్థితికి తీసుకు వెళ్ళటానికే అమ్మ మనతో ఆడుతూ, పాడుతూ ఆధ్యాత్మికతను, యోగాన్ని, ధ్యానాన్ని అలవరచింది.

అమ్మ కుర్చీలో కూర్చుని వుండగా పాదాల దగ్గర కొండయ్య కూర్చున్నాడు, పక్కనే అతని గురువుగారు కూర్చున్నారు. అప్పటికే కొండయ్య ఆధ్యాత్మికంగా సాధనా మార్గంలో పయనిస్తున్నాడు. ఆ గురువుగారితో అమ్మ "వాడి సంగతి చూడమని" చెప్పింది. దానికి కొండయ్య "అంతానీవే అయినప్పుడు గురువు చేసేదేమున్నది, నువ్వే చూడమని" తన విశ్వాసాన్ని తెలియచేసాడు.

సాధారణంగా రాత్రి 1గం॥ తరవాతే అమ్మ కొండయ్యల వేదాంత గోష్ఠి జరిగేది. "సర్వత్రా ఉన్నది ఒకటే, నీ ఆత్మే సర్వత్రా నిండివుంది. జీవుడు దేముడు అవ్వాలంటే సత్త్వ, రజస్తమో గుణాలు మూడింటినీ దాటి గుణరహితుడు కావాలి. అప్పుడే అత్మ పరమాత్మతో కలుస్తుంది. వాడికి రూపం లేదు. పాత్ర ఇచ్చాను, నీ పాత్రను నీవు సరిగా పోషించుకో" అని అమ్మ కొండయ్యకు వివరించింది.

కొండయ్య వంద రూపాయలు పెట్టి అమ్మకు చీరె తెచ్చాడు, "నాన్నా! వాడు నిన్ను మోసం చేసాడురా! ఆ డబ్బుకు రెండు చీరెలు వస్తాయని చెప్పింది వెంటనే ఆ చీరెమార్చి రెండు గ్లాస్కో చీరెలు తీసుకువెళ్ళాడు. "ఆ చీరెలు ఎవ్వరికీ ఇవ్వను నేనే కట్టుకుంటానని" చెప్పింది అమ్మ. గుంటూరు వెళ్ళినప్పుడు అమ్మ వాళ్ళ ఇంటికి వెళ్ళింది. "మీ ఆవిడ లక్ష్మి టమేటా పప్పు చాలా బాగా చేసిందిరా" అని తిన్నది. "నాకు షోడాలు పట్టటం వచ్చు అని పట్టింది, అవతారమూర్తి అయిన అమ్మకు రానిదేముంది? అంతా అమ్మే అయినప్పుడు. వాళ్ళుపూరింట్లో వుండగా అమ్మవారింటికి వెళ్ళింది. ఆ తరువాతే డాబా ఇల్లు కట్టుకోవటం, ఒక పోర్షన్ అద్దెకు ఇవ్వటం జరిగింది. కొడుకు, కోడలు అనుకూలవతి యైన భార్య అమ్మే ఒన గూర్చిందని అతని విశ్వాసం.

అమ్మ అన్నయ్యకు మూడు ఇడ్లీలు తెప్పించి పెట్టింది. మూడు ఇడ్లీలు త్రిమూర్తులు, పైన నెయ్యి పరమాత్మ, నీవు తినవద్దు నేనే పెడ్తానంటూ నోరు తెరవమని తానే పెట్టింది. శ్వేత వర్ణం తేజస్సుకు ముఖ్యం. తెలుపు

శుద్ధస్ఫటికసంకాశం, నెయ్యి నేతి నేతి అనేది తీస్తే వున్నది తారకం, గాయత్రి, అమనస్కం అదే పరమాత్మ తత్వం. సాధన చేసిన వారికి లింగబేధము వుండదు.

మాఘ పౌర్ణమికి 600 మందికి అమ్మ మంత్రోపదేశం చేసింది, వర్గ, వర్ణ, కుల, మతబేధాలు లేకుండా అందరికీ మంత్రదీక్ష ఇచ్చింది. "కొండయ్య అప్పటికే ఆ మార్గంలో పయనిస్తున్నాడు. కాబట్టి అతనికి ఇవ్వలేదు. మిగిలిన వారితో మీరు దీక్ష పుచ్చుకొని, దీక్షగా మంత్రజపం అనుష్ఠించండి" అని చెప్పింది. కొండయ్యకు ఏ మంత్రదీక్ష అవసరం లేకుండానే ఎంతో ఉన్నతస్థితిలో వుంచింది అమ్మ. అది అతని అదృష్టం. అమ్మ "12 అంగుళాల రాయి, 9 అంగుళాల రాయి తెచ్చిపెట్టమని ఉత్తరం రాసి సుబ్బారావన్నయ్య చేతికి ఇచ్చి కొండయ్యకు పంపింది, అది చదవగానే కొండయ్యకు ఒళ్ళుఝల్లు మంది, ఫిరంగిపురం వెళ్ళి రెండురాళ్ళు మధ్యాహ్నం 12 గం॥ లకు తవ్వించాడు, నలుగురు కలిసి ఒకరాయిని ఎత్తలేక పోయారు, అమ్మ నెల తరువాత వుండదన్నాడు, "నీకేమైనా పిచ్చా అలా అంటావేమిటి?" అని అంతా కేకలు వేశారు. 12 అంగుళాల రాయిపీఠం క్రింద 9 అంగుళాల రాయి కాళ్ళ దగ్గరకు, తన ఇంటికి తెచ్చి ఈశాన్యమూల పెట్టించాడు. ఆ తరువాత వాటి మీద బీజాక్షరాలు చెక్కటానికి మద్రాసుకు పార్శిల్ చేసాడు.

రెండు సోడా సీసాలు కొత్తవి కొని అందులో సోడాలు పట్టి జిల్లెళ్ళమూడికి పట్టుకు వెళ్ళాడు. "కొండయ్య రాలేదా" అని అప్పటికే అమ్మ రెండు మూడు మార్లు అడిగింది. ఆ సోడాలు తీసుకు వెళ్ళి అమ్మ చిన్న కోడలు వైదేహికి ఇచ్చి హైమాలయంకు వెళ్ళాడు. కొండయ్యా అన్న అమ్మ పిలుపు విని పరుగు పరుగున వెళ్ళి షోడా కొట్టి వెండి గ్లాసులో పోసి అక్కడే వున్న ఒక అక్కయ్య చేత లోపలికి పంపించాడు. "నిన్ను ఎవరు తెమ్మన్నారని ఆ అక్కయ్యను కేకలేసింది" అమ్మ. వెంటనే కొండయ్య తీసుకు వెళ్ళి అమ్మకు ఇచ్చాడు. అమ్మ ఎంతో ఆతురతో ఆ సోడా తాగి కొండయ్యకు కొద్దిగా తీర్థంలా పోసింది.

అప్పుడు అమ్మ 9సం॥ ల పిల్లలాగా మెరిసిపోతూ కనిపించింది, వెంటనే 63 సం॥ల వయస్సులో ఉన్న అమ్మలా దర్శన మిచ్చింది, సాయత్రం 5గం॥ లకు రెండో సోడాకొట్టి అమ్మకు ఇచ్చాడు. మంచం మీద కూర్చున్న అమ్మ ఆ సోడాను ఒంటి మీద జల్లు కొని, కళ్ళుతుడుచుకొని, రెండు పాదాల బొటన వేళ్ళ మీద ధారగా పోసుకుంది. "గాస్ లేదేమిరా?" అని అడిగింది. "ఖాళీ సీసాలో గాస్ ఎక్కడ వుంటుందమ్మా" అన్నాడు. అమ్మ తన అవతార పరిసమాప్తిని తెలియచేసిందని" కొండయ్య భావించాడు.

"మూడు రోజులకు వెళ్ళిపోతాను నేను ఎప్పుడు పిలిస్తే అప్పుడు నీవురా నీవు పిలిచిన వెంటనే నేనూ వస్తానని" చెప్పింది. అప్పుడే కొండయ్యకు "ఆత్మ పరమాత్మలో కలిసిపోతుందన్న జ్ఞానోదయం" కలిగింది, జ్ఞానాగ్ని అజ్ఞానాంధకారాన్ని దహించివేస్తుంది. సత్యం అనంతం. గతజన్మల వాసనల ఫలితమే అమ్మ యొక్క సన్నిధి తనకు లభ్యమయిందన్న నమ్మకం గాఢంగా నాటుకుంది.

ఆత్మను యోగమాయ పై మార్గానికి తీసుకు వెళ్ళి పరమాత్మతో సంధానం చేస్తుంది. మూలమాయ క్రిందకు తోసేసి ప్రాపంచిక విషయాలలో మనిషి కూరుకు పోయేటట్లు చేస్తుంది. "ఎవరైతే నన్ను ధ్యానించి, సేవిస్తారో వాళ్ళకు అడ్డు పడకు. నీకు కావల్సినవి నేను ఇస్తాను కదా! నీకు ఇంకేం కావాలి, ఇది అంతా మాయ మోహం అనే భ్రాంతిలో ముంచేస్తుంది. మాయ ఎంతటివాడినైనా అడ్డు కట్ట వేస్తుంది" అని చెప్పింది అమ్మ.

అమ్మ సిద్ధి పొందిన అనంతరం కుడా అమ్మ సన్నిధిని అనుభవిస్తున్న భాగ్యశాలి కొండయ్య. 6 సం॥ లకు ముందు "ఇంకా ఎన్ని ఏళ్ళు ఈ పని చేస్తావు?" అని అమ్మ అడిగింది. ఆ తరువాతే గుండె నొప్పి రావటం జరిగింది. ఆ సోడా మిషన్‌ను వేరే వాళ్ళకు అమ్మేసాడు. అప్పటి నుంచీ భూమి, ఆకాశం అంతా అమ్మే ఆవరించి వున్నది. "పూజ ఒక తడవ చేయినాన్నా" అని

అడిగింది అమ్మ. అనునిత్యం అమ్మధ్యాసలో గడిపే కొండయ్య ఆధ్యాత్మిక స్థితి మనకందనంత ఎత్తులోవుంది అంతా అమ్మ మయమే. అమ్మను తలుచుకోగానే అమ్మను సాక్షాత్కరింప చేసుకునే వరం అమ్మ ఇవ్వనే ఇచ్చింది కదా! అంతటి ఉచ్చ స్థితిలో వుండగల్గటం అది అన్నయ్య చేసుకున్న పుణ్యఫలమే, ఆ స్థితిని అందుకోవాలంటే ఎన్ని జన్మలు ఎత్తాలో! అమ్మను తలుచుకోగానే ఆనంద పారవశ్యంలో మునిగిపోయే కొండయ్యను కలుసుకునే అవకాశాన్ని నాకు కలుగచేసింది అమ్మ.

"రామారావన్నయ్య వాళ్ళ అమ్మ అమ్మకు తలరుద్దుతుంటే వెంట్రుక కొక కన్నులా కన్పించి భయభ్రాంతురాలైంది. ఆమెను భయపడద్దని చెప్పి తన చేతి మీద అక్కయ్య చేయి పెట్టితల రుద్దుకుంది అమ్మ". అని కొండయ్య తెలియచేసాడు.

+ + +

కొందరుత్తములు నివురుగప్పిన నిప్పువలే, మసిగుడ్డ కట్టిన మాణిక్యం వలె ఆకులమాటున పిందెలవలె అతి గుప్తంగా జీవిస్తారు. జిల్లెళ్ళమూడి ఆవరణ అమ్మ అన్నట్లుగా చిన్న ప్రపంచమే. ప్రపంచంలో వుండే క్రూరమృగాలు, తోడేళ్ళు, సర్పాలు అన్నీ వున్నాయి. అక్కడా అన్ని రకాల, అన్ని గుణాల వ్యక్తులూ వున్నారు. అక్కడ దేవతలూ, రాక్షసులు వున్నారు. సర్వగుణ సంపన్నులు, రజుగుణాధికులు, తామసగుణ ప్రధానులు ఉండవచ్చును. అక్కడ రవ్వలూ. రాళ్ళు వుండవచ్చు. అక్కడ పండితులూ ఉన్నారు. పామరులూ ఉండవచ్చును. అక్కడ గులాబీల మధురపరిమళాలూ ఉన్నాయి. వాటిని ఆనుకునే పదునైన ముళ్ళు ఉండవచ్చును. అక్కడ వెన్నెల కురుస్తున్నది. ఎండకాస్తున్నాయి. అక్కడ ఆనందానికి తరుగులేదు. విషాదమూ తప్పదు.

అక్కడ దేవతలే ఉండాలనీ, వెన్నెలే కాయాలనీ, గులాబిలే పూయాలనీ అనుకోవటం అమాయకత్వమే అవుతుంది. కొందరుత్తములకు

జిల్లెళ్ళమూడిలోని దేవతలే దర్శనమిస్తారు. కొందరు విమర్శకులకు అన్ని లోపాలే కనిపిస్తాయి. కొందరు వివేకులు, మంచి చెడు కనిపించినా, మంచిని మాత్రమే గ్రహించి ఆనందిస్తారు.

ఆ విధంగా అక్కడ కనిపించే దేవతాస్వరూపుల్లో రావూరి నరసింహమూర్తిగారు ఒకరు. ఆయన ఉత్తమోత్తముడు. శ్రమను నమ్ముకున్న వ్యక్తి, వినయవంతుడు, సహన స్వభావం కలవాడు. మితభాషి, దయార్ద్ర హృదయుడు. కార్యదీక్షాపరుడు. నిరాడంబరంగా జీవించే భక్తి భావంతో కూడుకున్న వ్యక్తి. కాంతా, కాంచనల యందు వ్యామోహం లేని వాడు, అజాత శత్రువు నామయోగి, తపస్వీ, ఆ గడ్డ మీద అనేక మంది తపస్సు చేసారు, చేస్తున్నారు". అని అమ్మ చెప్పింది. అట్లే తపస్సు చేసేవారిలో ఆయన ఒకరు.

1960 సం॥లో జిల్లెళ్ళమూడిలో తొలిసారిగా అమ్మను దర్శించాడు. అప్పటినుండీ అమ్మ సేవకే అంకితమైనాడు. 1968 లో బాపట్లలో మాతృశ్రీ ప్రింటర్సు స్థాపించిన తరువాత నాలుగు సం॥లు అవిరామంగా ఒక యంత్రంలా పరిశ్రమించాడు.

జిల్లెళ్ళమూడిలో జరిగే అఖండ నామ మహాయజ్ఞంలో తానూ భాగస్వామి కావాలని అమ్మను అర్థించి అభీష్టసిద్ధిని పొందాడు. 1970 ఆగష్టు నుంచీ నామయజ్ఞంలో పాల్గొనటయే కాక ఆ మహాయజ్ఞానానికి ప్రధాన ఋత్విక అయినాడు. అమ్మ నామానికి తన జీవితాన్ని అర్పించడమేకాక ఆ మహామంత్రమే తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా పవిత్ర జీవనం గడిపాడు. అఖండ నామ సంకీర్తనలో ఎవరు తమ వంతు నామం చేయలేకపోయినా అది తన అదృష్టంగా భావించివారి వంతు నామ సంకీర్తన కూడా తానే పరమానందంగా చేసేవాడు.

అమ్మయందు ఎనలేని భక్తి విశ్వాసాలు కలిగినవాడు. అమ్మను తన ఇష్టదైవమైన శ్రీ కృష్ణ పరమాత్మగా భావించి ఆరాధించేవారు. అందకే అమ్మను పురుషోత్తమునిగా సంభావిస్తూ ఎల్లప్పుడూ "పరమాత్మ" అని మాత్రమే సంభోదించేవాడు.

అందుకే యార్లగడ్డ రాఘవయ్యగారు అమ్మ ఒక్కతే పురుషుడని, మిగిలినవారంతా గోపికలనే వర్ణించేవాడు. నేను అమ్మకు పసుపు తాంబూల ఉద్యాపనకు పళ్ళెం, చీరె తీసుకురమ్మని ఈయనకు చెప్పాను. అది మర్చిపోయి వచ్చారు. ఆ విషయమై చర్చించుకుంటుంటే "ఏమిటి నాన్నా?" అని అమ్మ ప్రశ్నించింది. "చీరె, పళ్ళెం మర్చిపోయానని కురుక్షేత్రం పెట్టిందమ్మా" అని చెప్పారు. దానికి అమ్మ దర్మక్షేత్రంలో వున్నావు నాన్నా! అని చెప్పి "ఆ కృష్ణ పరమాత్మను నేనే" అని తెలియజేసింది.

రావూరి నరసింహమూర్తిగారు ఏలూరు దగ్గర నడిపల్లికి వెళ్ళారు. ఆ వూరు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారి రెండవ కుమార్తె అత్తవారి ఊరు. వారి అల్లుడు దేవళరాజు ఆనందరావుగారు. వారింటికి వెళ్ళేటప్పటికి మధ్యాహ్నం మూడుగంటలు అయింది. ఆయన ఆశ్చర్యంతో, ఆనందంతో నరసింహమూర్తి అన్నయ్యను ఆహ్వానించారు.

అన్నయ్య జిల్లెళ్ళమూడి అమ్మ సన్నిధిలో వుంటున్నారని సరిగా తెలియదు విన్నారట. ఆయన అన్నయ్య యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాక, "ఈ ఉదయం నేను పూజ చేసుకుంటుండగా ఒక విచిత్రం జరిగింది. నేను పూజ చేసుకుంటున్నాను. నా పూజ పీఠంలో విగ్రహాలతోపాటు పార్వతి, లక్ష్మి మొదలగు ఫోటోలు ఉన్నాయి. జిల్లెళ్ళమూడి అమ్మ ఫోటో లేదు. నేను అమెను దర్శించలేదు. కానీ ఫోటో మాత్రం చూసాను. పూజ చేసుకుంటున్నప్పుడు అమ్మ కనిపించింది. ఈ ఫోటో నా పూజా పీఠంలోకి ఎలా వచ్చిందో అనుకున్నాను. ఎవరూ అలా పెట్టరే అని కళ్ళునులుముకొని

పరకాయించి చూడగా అది పార్వతీదేవి ఫోటో. నాకు అమ్మ దర్శనమిచ్చిన మూడుగంటలకు మీరు వచారు. నా పిల్లవాడు వస్తున్నాడని నాకు ముందుగా అమ్మ తలియచేయడమేమో ఇది" అన్నారు ఆనందరావుగారు.

నరసింహమూర్తి అన్నయ్యకు ఎనలేని ఆనందం కలిగింది. "ఏది ఎందుకు జరుగుతుందో మనం చెప్పలేము. మీ దంపతులులొకమారు వచ్చి అమ్మ దర్శనం చేయండి" అన్నాడు. అమ్మ నడిపల్లిలో ఉన్న తన పిల్లల కోసం ఆతురతపడుతున్నదేమో! ఏమి చెప్పగలం మనం.

నరసింహమూర్తిగారు 1974 ఆగష్టు 11వ తేదీన జిల్లెళ్ళమూడిలో గోకులాష్టమి జరుపబడిన సందర్భంలో అమ్మ కృష్ణ భగవానుడై, కిరీటధారియై దర్శనమిస్తున్న దివ్య క్షణాల్లో ఒక్క తాను మాత్రమే అమ్మకు పాదాభివందనం చేసుకోగలిగాడు.

నమస్కారం చేసుకొని నా నివేదిక వద్దకు వెళ్ళి ఆ రాత్రి నామం చేస్తూ చేస్తూ 12వ తేదీ హైమాలయ ప్రాంగణంలో సునాయాశంగా అమ్మలో ఐక్యమైన అదృష్టవంతుడు నరసింహమూర్తి అన్నయ్య.

49 సం॥లు నిందని యౌవ్వనంలోనే సేవతో, సాధనతో సర్వసద్గుణ సంపదతో సర్వేశ్వరి కృపావలంబంతో జీవిత గమ్యాన్ని చేరుకో గలిగిన పుణ్యాత్ముడు మనందరికి ఆదర్శమూర్తి.

+ + +

హైదరాబాద్ బి.హెచ్.ఇ.ఎల్‌లో పని చేసే సూర్యనారాయణ గారు అమ్మ గురించి, అమ్మ మహిమలను గురించి విన్నప్పటికీ ఆయనకు విశ్వాసం కలుగలేదు. కానీ ఒక స్నేహితుని ప్రోద్భలం వల్ల ఒక శనివారం నాడు అమ్మ దగ్గరకు వచ్చారు. ఆ రోజుల్లో టిఫెన్ గా పూరి కూర చేసుకొవటం మామూలు కుటుంబాల్లో చాలా తక్కువ. అమ్మలో ఏదైనా మహిమ అంటూ ఉంటే తనకు

పూరీ కూర చేయించి పెట్టాలని అనుకున్నారు. అప్పటికి అమ్మే వంట చేసేది. అంత రాత్రి పూట అమ్మ పూరీ కూరా చేసి పెట్టింది. అప్పుడు సూరన్నయ్యకు అమ్మ యందు విశ్వాసం కలిగింది. తన మనసులో దానినే అమ్మ నెరవేర్చింది కదా! అని అనుకున్నాడు.

హైమాలయంలో అభిషేకం చూస్తూ ఏమిటీ? ఉద్ధరిణతో చేస్తుంటే ఏం బాగుంటుంది! అభిషేకం అంటూ చేస్తే బిందెలతో చేయాలని అనుకున్నాడు. బస్తాల కొద్దీ పూలతో పూజ చేయాలని, ప్రసాదం దోసిళ్ళతో పంచాలని అనుకున్నాడు. కానీ ఆ విషయాన్ని మర్చిపోయాడు.

కొన్ని సంవత్సరముల తరువాత అమ్మ సూరన్నయ్యను హైమాలయంలో అభిషేకం చేసుకోమంది. తీరా హైమాలయంకు వెళ్ళేటప్పటికి బిందెలతో నీళ్ళు సిద్ధంగా ఉన్నాయి. మొత్తం అభిషేకం బిందెలతోనే చేయటం జరిగింది. అభిషేకం పూర్తియేటప్పటికి శోష వచ్చినంత పనయింది. కానీ అమ్మ అన్నయ్యను అంతటితో వదలి పెట్టలేదు. బస్తాల కొద్దీ పూలు తెప్పించి అవి అయ్యే వరకు పూజ చేయించింది. సాయంత్రం అన్నయ్యే గుండిగల కొద్దీ ప్రసాదం పంచేటట్లు చేసింది. ఉదయం నుంచి రాత్రి వరకు ఒక్క క్షణం కూడ విశ్రాంతి లేకుండా ఆయన కోరుకున్న విధంగా అన్నీ 'భారీ' గా చేయించింది. అప్పటికి అన్నయ్యకు పూర్వం తను అనుకున్న విషయం గుర్తుకు వచ్చి చెంపలు వాయించుకుని అమ్మ దగ్గర ఇంకెపుడూ ఇలాంటి కోరికలు కోరుకోకూడదనుకున్నాడు.

సూరన్నయ్య దంపతులు హైమాలయంలో అభిషేకాలు చేసుకునేవారు. అమ్మను అర్చించుకునే వారు. ఒకరోజు సూరన్నయ్య ఆఫీసుకు వెళ్ళిన తరువాత హైమక్క వారింటికి వెళ్ళి తలుపు తట్టింది. ఆయన భార్య తలుపు తీసింది. ఎదురుగా హైమక్క. ఎంతో ఆకర్షణతో ఉన్న హైమక్కను చూడగానే ఆదరంగా ఆహ్వానించింది అక్కయ్య. కొంత సేపు అయిన తర్వాత హైమక్క పాయసం

చేసి పెట్టమని అడిగింది. అక్కయ్య వెంటనే పాయసం చేసి హైమక్కకు యిచ్చింది. "నీవు కూడా తెచ్చుకోమని" అక్కయ్యతో చెప్పింది హైమక్క. ఇద్దరూ పాయసం తాగిన తరువాత తాను వెళతానని అన్నది. అన్నయ్య వచ్చే వేళయిందని అంతవరకు ఆగమన్నది అక్కయ్య. ఇప్పుడు టైమ్ లేదు మళ్ళీ వస్తానని వెళ్ళి పోయింది హైమక్క. అన్నయ్య భోజనానికి వచ్చినపుడు అక్కయ్య హైమ మనింటికి వచ్చిందని చెప్పింది. "నీమొహం హైమ రావటం ఏమిటి? హైమ మరణించింది కదా!" అని అన్నయ్య కసిరారు. హైమను చూచిన ఆనందంలో ఆమె చనిపోయిన విషయమే అక్కయ్యకు గుర్తు రాలేదు. ఆమె చిన్నబుచ్చుకుని హైమ, తాను తాగిన పాయసం కప్పులను సాక్ష్యంగా చూపించింది. దాని తో అన్నయ్యకు నమ్మక తప్పలేదు. సూరన్నయ్య భార్య ఎంతో ధన్యురాలు హైమను సశరీరంగా దర్శించు కోవటమే కాక స్వయంగా పాయసం చేసి పెట్టే భాగ్యం కలిగింది.

ఇంజనీరింగ్ మూడవ సం॥ చదువుతున్న ఒక సోదరుడు అమ్మతో " పునర్జన్మ గురించి ఏమంటారు?" అని ప్రశించారు. "దాన్ని గురించి నేను మాట్లాడను. ప్రస్తుతం నాకు జన్మల గురించి ఆలోచన లేదు. అన్నది" అమ్మ. "అయితే జన్మలు లేవంటారా?" అన్నాడు. "నా దృష్టిలో లేవు. ఈ జన్మలోనే ఎదురుగా ఉన్నదాని గురించే అర్థం కావటం లేదు. ఇంకా జన్మల దాకా ఎందుకు?" అని అతన్నే ప్రశ్నించింది అమ్మ.

"ఈ జన్మలో ఏదో పాపం చేస్తే వచ్చే జన్మలో అనుభవించాలనే భయం కొద్దేగా వీటి గురించి ఆలోచన, పోనీ జన్మలు ఉన్నాయనుకుందాం. ఉన్నాయనుకుంటే పాపం చేయకుండా వుంటాడా? మంచి పనులే చేస్తాడా? జన్మలే లేవు అనుకుంటే నిర్భయంగా పాపం చేయగలడా? నీకు పాపం లేదంటాను, ఏది జరిగినా నా బాధ్యత అని కత్తి యిచ్చి ఒక పది మందిని చంపి రమ్మంటే నువ్వు చంపగలవా? చంపలేవు పాపం లేదన్నా నువ్వు

చంపలేవు. ఏదీ నీవు చేయలేనప్పుడు, ఏదో ఒక శక్తి నిన్ను నడుపుతున్నప్పుడు ఇంకా జన్మల గురించి ఆలోచన దేనికి?" అన్నది అమ్మ.

పెద్ద మరుపే మరణం. "చిన్న చిన్న మరుపులు మార్పులు, నిత్యం జరుగుతూనే వున్నాయి. నిజానికి జన్మ పరంపరకు ఏక జన్మ అయిన దానికి పెద్ద బేధం లేదు. ఏక జన్మలోనే అనేక జన్మలున్నాయి. పుట్టినదాది అమ్మ, నాన్న, అక్క అన్న సర్వస్వంగా వుంటారు. అప్పుడు భర్త పిల్లల గురించిన యోచన కలుగదు. వివాహం అయిన తరువాత పూర్తిగా మన కుటుంబంతో తాదాత్మ్యం చెందుతాం. అదే విధంగా ఈ జీవితంలోనే అనేక జన్మలు జరుగుతున్నాయి అని తెలియచేసింది అమ్మ.

"సృష్టికి నాశనం లేదా?" అని అడిగాడు అతను. "నా దృష్టిలో సృష్టికి రూపాంతరం తప్ప నాశనం లేదు." మీరు ఇక్కడే వుండ దల్చుకున్నారా? జీవితాంతం అని అడిగాడు. "ఎప్పుడు ఏది జరిగితే అది అనుభవించటమే నాకు తెలుసు" అన్నది అమ్మ. మీరు యిచ్చే సందేశం ఏమిటి?" "ఏది జరిగినా ఎవరు ఏది చేసినా మనం కాదు చేసేది. మనని నడిపించే శక్తి మరొకటి ఉన్నదను కోవటమే" అదే నా సందేశం అన్నది అమ్మ. రిక్త హస్తాలతో వచ్చిన వారికి అమ్మ ప్రసాదాలతో వారి చేతులు నింపేసింది అమ్మ. అందులో ఒకరు ఏదో అనబోయారు. వాళ్ళ ఉద్దేశం గ్రహించి "ఇచ్చేదంతా నేనే నాయనా ఎక్కడైనా మీరు వెళ్ళి భోజనం చేయండి" అన్నది.

పునర్జన్మ గురించి అడిగిన వారికి జన్మ పరంపరల గురించి, పోతుకూచి రవి మరణం విషయం చెబుతూ మరణం అనేది ఒక మార్పు మాత్రమే అన్నది అమ్మ. ప్రతి క్షణమూ శరీరంలోని కణాలు పుడుతూ, నశిస్తూ, పెరుగుతూ, మారుతూనే వున్నాయి. ఈ క్షణం ఉండే శరీరానికి యింకో క్షణం ఉండే శరీరానికి మార్పు వున్నది. మనస్సు విషయంలో ఇప్పుడు వుండే ఆలోచనలు ఇంకో క్షణానికి వుండవు. ఇప్పుడు వుండే చిత్తవృత్తి యింకోసారికి వుండదు. మార్పు అనేది ఎప్పుడూ జరుగుతూనే వుంటుంది.

+ + +

ఆర్ సుదర్శనం గారు రాజమండ్రి నుంచి అమ్మను దర్శించుకోటానికి వచ్చేవారు. ఆయన భార్య వసుంధర. 1968 కి పూర్వం నుంచీ అమ్మను సేవించుకున్న పుణ్యాత్ములు.

ఆర్.సుదర్శనంగారి ఆధ్యాత్మిక ప్రయాణంలో పసితనం వంటి దశలో అమ్మ 1966-71 సం॥లో ఆయన చెయ్యి పుచ్చుకొని ఎక్కవలసిన మెట్లెక్కించి, సాక్షాత్కార దేవాలయ ద్వారం ముందు వదిలిపెట్టి, ప్రవేశానికి అర్హుణ్ణి చేసి తరింపచేశారు. అమ్మ ఋణం ఏనాటికీ తీర్చలేనిది. సాక్షాత్కారం గురించి అమ్మను అడిగినప్పుడు, అమ్మ ఆయన్ని చివరి పర్యాయం కలుసుకున్నప్పుడు, అమ్మ ఆయన చేయిపుచ్చుకొని 'కరావలంబనమే' అంటూ ఆ తరుణం తప్పక వస్తుందని హామీ ఇచ్చింది. దానికి అనుగుణంగా 1972లో ఆలయ ప్రవేశం లభించి 1979లో ఆయనకు సాక్షాత్కారమూ అనుగ్రహిపబడి ధన్యులయ్యారు.

అమ్మ ఒడిలో, బడిలో ఆయన నేర్చుకున్న పాఠాలు గ్రహించి, ఆకళింపు చేసుకున్న విషయాలు మరి ఏ ఇతర గ్రంథాల్లో గాని, బోధనల్లోగానీ లభించేవి కావు. అమ్మ ప్రేమామృతంలో రంగరించిన జ్ఞానం, దాన్నే ఆ అన్నయ్యకు ఒక అనుభూతిగా అమ్మ ప్రసాదించింది.

మామూలు స్థాయిలో అమ్మగా అన్నం పెట్టి, వసతి చూపించి, చల్లని మాటలు చెప్పే అమ్మ ఆప్యాయతల్లో వారి కుటుంబానికి ఎంతో ఆనందాన్ని కలుగచేసింది. అదివారి జీవితాల్లో మరుపురాని మధురానుభూతులు. లౌకికంగానేకాక వారిని ఆధ్యాత్మిక శిఖరాలకు తీసుకుపోయింది అమ్మ. అది మాటలకు అందనిది భాషకు లొంగనిది. ఆయన, ఆయన సతీమణి ఆర్ వసుంధరగారు మాతృశ్రీలో వ్యాసాలను అతిరమణీయంగా రాసారు. అవి చదివిన వారికి, వారెవరో తెలియకపోయినా, గౌరవ భావం జనించటంలో ఆశ్చర్యం లేదు అలాగే మాతృశ్రీలో అనేక మంది రాసినవి చదివి వారెవరో తెలియకపోయినా అమ్మ బిడ్డలందరం సహోదరులం అనేటువంటి వాత్సల్యభావం ఏర్పడుతుంది.

అమ్మ "వసుంధరా నీవెందుకు ఏడుస్తావని వీళ్ళందరూ నన్ను అడుగుతున్నారు. ఎందుకో చెప్పు" అన్నది అమ్మ నవ్వుతూ. ఆ అక్కయ్యకు ఏమని చెప్పాలో తెలియలేదు. అనుభూతి అన్నది మాటలలో చెప్పటం అసాధ్యమైన పని. ఆమెలో ఇదమిత్థమని నిర్ణయించలేని ఒక దివ్యానుభూతి 'సచ్చిదానందం' అన్న పదం దగ్గర నిలిచింది. అదే అనుభూతిగా మనస్సులో నిలిచిపోయింది. ఆ పదం చిన్ని కృష్ణునిలా అక్కయ్య మనసులో నాట్యం చేసింది. "అనుభూతిని నిర్వచించటం సాధ్యం కాదు" అని అనుకున్నది.

అక్కయ్య ఎప్పుడూ అమ్మ దగ్గరే వుంది కానీ బాహ్యంగా అమ్మను మూడు మార్లే దర్శించుకుంది. మూడు సార్లు ఒక ఉద్రిక్తత కన్నీటి రూపంలో వెలికి వచ్చింది. అందుకనే అందరూ అక్కయ్య అమ్మ దగ్గరకు వచ్చిన ప్రతిసారి ఎందుకు ఏడుస్తోందని అమ్మతో అన్నారు. అమ్మ అడిగేసరికి "ఈ ఉద్రిక్తత స్వభావమేమిటి? దాని మూలమేమిటని" తనని తాను ప్రశ్నించుకుంది ఆ అక్కయ్య.

ఏకాగ్రత కుదరక చెదిరిపోయిన మనసులోని బాధ అమ్మని చూడగానే కట్టలు తెంచుకుని ప్రవాహంలా వచ్చింది. అక్కయ్య అప్పటికి అమ్మతో చెప్పింది లేదు. రెండవమారు అమ్మను చూచినప్పుడు నిష్కారణంగా ఏడుపు వచ్చింది. అక్కయ్య మనసు ఒక అనురాగ జలధియై ఉప్పొంగి పోయింది. ఆ స్థితిలో అక్కయ్య మనసులో మెదిలిన ప్రశ్నలు రెండు. అమ్మ ఎవరు? నేనెవరు? అని. నిజానికి అవి ప్రశ్నలు కావు. సమాధానం కోరినవి అంతకంటే కావు. ఒక అలౌకికమైన ఆనందస్థితిలోని మనసు యొక్క బాహ్య ప్రవర్తన ఆ కన్నీరు.

అమ్మ దగ్గరకు వెళుతున్నా మన్న ఆనంద హేలలో తిరిగి రావటం అన్న గుర్తింపు వుండదు. వెళుతున్నామనే కానీ మూడవ మారు వెళ్ళినప్పుడు అక్కయ్య పరిస్థితి పుట్టింటికి వెళుతున్న ఆడపిల్ల లాగా ఉంది. తిరిగి వచ్చేటప్పుడు అమ్మ దగ్గరనుండి వెళ్ళిపోతున్నాననే బాధతో ఏడుపు వచ్చింది.

బాహ్యంగా మూడు పర్యాయాల్లో నూ అక్కయ్య మనః స్థితి ఒకే విధంగా వుంది. కృష్ణుని కోసం వెతికి వెతికి వేసారిన రాధకు తన హృదయంలోనే వేణు గానం చేస్తూ, నాట్యం చేస్తూ, చిలిపి నవ్వుతో కనిపించాడు, ఆ మాయలమారి. దానితో రాధకు కన్నీరు వెల్లువలై పారింది. అది ఇంత సేపు కన్పించకుండా ఉన్నందుకు కోపమా? ఎడబాటును ఓర్వలేని బాధా? ఇప్పటికైనా కనిపించాడు కదా అన్న ఆనందమా? మళ్ళీ కనిపించ కుండా పోతాడేమో నన్న భయమా? రాధ కన్నీటి వెనుక వున్న భావమేది? ఒక్కొక్క సారి ఒక్కొక్కలా అనిపించినా రాధ మనః స్థితి ఒక్కటే. అది ఒక ప్రేమ భావం. రాధకూ రాధలోని శాశ్వత సత్యమైన కృష్ణునికి మధ్యన వున్న సంబంధం. రాధ రూపం. కృష్ణుడు భావం. రాధ జీవితం, కృష్ణుడు పరమాత్మ. "నేను నా కనిపించే భాగాన్ని. అమ్మ నా పూర్ణత్వం. నేను వసుంధరని. అమ్మ నాలోని సత్యం. ఎడబాటే కన్నీరు." ఇదే ఆర్. సుందరం గారి భార్య వసుంధరక్కయ్య భావన.

+ + +

కటికి కోటేశ్వరరావు అన్నయ్య అమ్మను దర్శించిన నాటి నుంచీ భక్తి విశ్వాసాలతో అమ్మను సేవించుకున్నారు. జిల్లెళ్ళమూడిలో వ్యవసాయంచేస్తూ అమ్మ దగ్గర వుండిపోయారు. వారి అబ్బాయికి అమ్మ తన సన్నిధిలోనే వివాహం చేసింది. అమ్మకు పదిపుట్ల కుంకుమతో పూజ చేసారు. 5,6 గం॥లు కదలకుండా కూర్చోవటం అందులో కుంకుమతో అర్చన చేయించుకోవటం మానవమాత్రులవల్ల అయ్యేపని కాదు. 1973 వరకు జిల్లెళ్ళమూడిలోనే వున్నారు. ఆ తరువాత కూడా అన్ని పంక్షన్స్‌కు తప్పనిసరిగా హాజరయ్యే వాళ్ళు. అమ్మను అమ్మగానే కొలవటం వాళ్ళకు ఇష్టంగా వుండేది. అమ్మను మరి ఏ ఇతర దేవతలతోనూ పోల్చటానికి మనస్సు ఒప్పేది కాదు.

అమ్మ దగ్గర లభ్యమయిన మాతృప్రేమ మరెక్కడ కనపడదని, ఎక్కడ దొరకదని వారి విశ్వాసం. అమ్మ దగ్గర దిగులుగా కూర్చున్నాడు. అమ్మ

అన్నయ్యతో "నీ బాధ ఏమిటి?" అని అడిగింది. హనుమయ్యను చూపించి "వీడి గురించే నా బాధ" అన్నాడు. "వాడికేం నాన్నా వాడి గురించి నీవు బాధపడనవసరం లేదు. వాడికి ఏలోటూ వుండదని అమ్మ చెప్పింది". కోటేశ్వరావన్నయ్యకు చాలా సుస్తీ చేసింది. "నాన్న గేదె ఈనింది. మాయ వేయలేదన్నాడు." "గేదెమాయ వేయటం నేను దాటి పోవటం ఒకే మాటు జరుగుతుందని" అన్నారు.

"నాయనా! రామానన్ను నీలో చేర్చుకోవయ్యా అని ప్రార్థించారు!" అలాగే వెళ్ళిపోయారు. ఆ తరువాత ఆయన భార్యకు ఆపరేషన్ చేయాలని అన్నారు. అమ్మ అనుజ్ఞపొంది వస్తానని ఆమె కుమారుడు కటికి హనుమయ్య జిల్లెళ్ళమూడి వచ్చాడు. ఏది జరిగినా అమ్మకు విన్నవించుకోవటం వారికి అలవాటు. తల్లి పడే బాధ చూడలేక అంతపెద్ద వయస్సులో ఆపరేషన్ చేస్తే తట్టుకుంటుందో లేదో అనే సంధిగ్ధంలో అమ్మ దగ్గరకు వెళ్ళాడు. తల్లి పడ్తున్న బాధ చూడలేకుండా వున్నానని అమ్మతో చెప్పి అమ్మ దగ్గర ప్రసాదం తీసుకు వెళ్ళాడు. హనుమయ్య వాళ్ళ అమ్మను ముక్కోటినాడు తనలో ఐక్యం చేసుకుంది అమ్మ.

హనుమయ్యకు ఒంట్లో బాగాలేనప్పుడు "నా తండ్రిని, తల్లిని నీలో చేర్చుచున్నట్లుగా నన్ను నీలో చేర్చుకోవాలీ" అని అమ్మను ప్రార్థించాడు. "నీవు వెళ్ళి అమ్మను వేడుకుని రా" అని భార్యకు చెప్పాడు. "అమ్మవాడికేం ఫరవాలేదని" ప్రసాదం ఇచ్చి పంపించింది. కోటేశ్వరావన్నయ్యతో చెప్పినట్లుగా ఈనాటికీ తిండికి, గుడ్డకు లోటు లేకుండా అమ్మ చూస్తోందని ఎంతో విశ్వాసంతో తెలియజేసాడు.

జీవితంలో చిన్నతనం అంతా జిల్లెళ్ళమూడిలో జరిగిందని మళ్ళీ ఎప్పటికీ అమ్మ సన్నిధిలో వుండే అవకాశం కలుగచేస్తుందోనని అన్నాడు. ఆరోజుల్లోనే అమ్మ దగ్గరకు రోజుకు 200 మందికి తక్కువ లేకుండా వచ్చేవారని చెప్పాడు. ఆషాడశుద్ధపంచమికి శ్రీశైలంలో పూజ చేయించటానికి వెళితే భ్రమరాంబ

స్థానంలో అమ్మనే దర్శించాడు. కాళహస్తిలో జ్ఞాన ప్రసూనాంబలో కూడా అమ్మ కనిపించింది. కాశీలో అన్నపూర్ణ విగ్రహం చాలా బాగుంది. అచ్చం అమ్మలా వుందనుకున్నాడు. దీనివల్ల సర్వదేవతాస్వరూపం అమ్మే అన్నది విశదమయిందని" ఎంతో ఆనందంతో చెప్పాడు.

అమ్మకు విజయదశమికి కలువ పూలతో పూజచేసేవాడు. అమ్మ ఆలయ ప్రవేశం చేసాక విజయదశమికి ఇంట్లో పూజలు చేయించి పొంగలి చేయటానికి బెల్లం జీడిపప్పు, యాలుకులు తెచ్చి పొంగలి తయారుచేసి అమ్మకు పూజ చేసుకున్నారు. సరుకులు తెచ్చిన ఇంగ్లీషు కాగితంలో అమ్మ ఫోటో వుందని వాళ్ళబాబు చూపించాడు. అది చూడగానే "నిన్ను వదలను నాన్న! నీ వెంటే వుంటానని" అమ్మ సూచించిందని అనిపించింది.

చీరాలలో వున్న గ్రంథాలయ అధికారిని హనుమయ్య జిల్లెళ్ళమూడికి రమ్మని పిలిచాడు. అమ్మ సిద్ధిపొందిన అనంతరం ఆయన జిల్లెళ్ళమూడికి రాలేదు. విశ్వజనని పత్రికరావటంతో జిల్లెళ్ళమూడిలో జరిగే అన్ని కార్యక్రమాలు తెలుస్తున్నాయి కదా అని అన్నాడు ఆయన. దానికి హనుమయ్య మీరు రానన్నా అమ్మ తీసుకువెళ్ళాలనుకుంటే ఏంచేస్తారని అడిగాడు. "అమ్మ ఉద్దేశం అదే అయితే దానికి తిరుగేముంటుందని" అన్నారు. హనుమయ్య వాళ్ళ పెళ్ళిరోజుకు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను అర్చించుకున్నారు. కొడుకు అమెరికాలో వున్నాడు.

+ + +

ఏకా ఆంజనేయులు గారు గుంటూరు వాస్తవ్యులు. వారు వ్యాపారస్తులు. వారు, వారి కుటుంబ సభ్యులు తరచు అమ్మదగ్గరకు వెళ్ళేవారు. ఆయన వితరణశీలి. ఎన్నో సంస్థలకు అధ్యక్షులుగా ఉండి వాటిని ఎంతో ఉన్నత స్థాయికి తీసుకువెళ్ళారు. బీదవారికి, ఆపదలో ఉన్నవారికి ఎన్నో విధాల సహాయ సహకారాలు అందించిన వ్యక్తి. వారి పెద్దఅబ్బాయి పుండరీకాక్షరావుగారు, చిన్నఅబ్బాయి రాజేశ్వరరావు అమ్మను సర్వాత్మనా నమ్మినవారు. వారి కుటుంబంలోని వారందరికీ అమ్మ ఆరాధ్యదైవం.

ఆంజనేయులుగారి పెద్దకుమారుడు కోడలు సత్యవతి జీవితంలో ఎన్నెన్నో ఆటుపోట్లను తిన్నారు. అమ్మ వారి కుటుంబాన్ని తన సన్నిధిలో ఉంచుకొని ఎంతో ధైర్యాన్ని, స్థైర్యాన్ని, కలుగచేసింది. పుండరీకాక్షరావుగారు మాపెదనాన్న గారైన శ్రీ అన్నంరాజు సీతాపతిరావు గారి అల్లుడు. బావగారికి మొదట్లో చాలా కోపం ఉండేదని చెప్పుకునేవారు మా చిన్నతనంలో. ఎటువంటి వారిలోనైనా మార్పు తీసుకు వస్తుంది అమ్మసన్నిధి. ఆ ఆవరణలో చిన్నపని పెద్దపని అని తేడాలేకుండా ఆయన పాలు పంచుకునేవారు.

అన్నపూర్ణాలయంలో వాడేసిన విస్తళ్ళు చాలా ఎక్కువ అయిపోయి, దుర్వాసన కూడా రావటం మొదలు పెట్టింది. కానీ సంస్థలో ఆవిషయాన్ని ఎవరూ పట్టించుకోలేదు. మా బావగారు రెండెడ్ల బండి తెప్పించి స్వయంగా ఆ ఎంగిలి ఆకులను ఆ బండిలో పడవేసి ఊరికి దూరంగా తీసుకుని వెళ్ళి మంట పెట్టారు. లక్షాధికారైనా ఇసుమంతైనా భేషజం, గర్వం లేకుండా ఆయన చేసిన పనికి అంతా నిర్ఘాంత పోయారు. అమ్మతో ఈవిషయం చెబితే "వాడేది చేసినా మనస్సు పెట్టి తనది, తన బాధ్యత అని చేస్తాడు నాన్నా" అన్నది.

ఆయన బస్సులో గుంటూరు వెళుతుంటే అమ్మ కూలింగ్ గ్లాసులున్న కళ్ళద్దాలు పెట్టుకున్నట్లు కనిపించింది. "అమ్మ కూలింగ్ గ్లాసులు పెట్టుకుందా!" అని ఆశ్చర్యపోయారు. అదే విధంగా అమ్మ రెండు మూడు మార్లు కనిపించింది. తీరా యింటికి వచ్చి చూసుకుంటే విదేశాల్లో కొన్న ఖరీదైన ఆయన కళ్ళద్దాలు బస్సులో మర్చిపోయారు. అమ్మ అంతగా తనకు విశదపరచినా అర్థం చేసుకోలేక పోయానని బాధపడ్డారు. ఇప్పటికీ అమ్మ పిల్లలెందరెందరికో ఇటువంటి విషయాలు అనుభవైక వేద్యమే.

బావగారిని "ఏకా" అని ఇంటిపేరుతో సంస్థలో పిలిచేవారు. హైమ ఏకాహం జరుగుతోంది. బావగారి చేయి విరిగినందున కట్టు వేసుకున్నారు.

హైమ నామం చెబుతూ భజన చేస్తుంటే కట్టు అడ్డంగా ఉన్నదని ఊడదీసేసారు. ఆ విషయం అక్కడి వారు అమ్మతో చెప్పారు. "వాడు ఏకా కదా? వాడి బోన్ ఏకమైంది" అని అమ్మ తన హాస్యధోరణిలో చెప్పి అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేసింది.

ఏకా గారి పెద్దబ్బాయి అంజన్‌కుమార్ ఆత్రేయ. వాళ్ళ అత్తయ్య కుమారుడు అంజుర్, టాటామోహన్, ఇంకొక స్నేహితుడు నలుగురు కలసి మొదటిసారిగా అమ్మ దర్శనంకు వెళ్ళారు. సూదంటురాయిలా అమ్మసన్నిధి అంజన్‌ని ఆకర్షించింది. తరచూ అమ్మ దర్శనం చేసుకునేవాడు.

విజయదశమికి అమ్మకు పూజచేసుకోవాలని అనుకున్నాడు. ముందురోజు సాయింత్రంకు హైద్రాబాద్ నుంచి విజయవాడ చేరి అక్కడ నుంచి గుంటూరులో చీరాల బస్సు వెళ్ళిపోతుండగా విపరీతమైన గాలి, వర్షంలో తడుస్తూ పరిగెత్తాడు. ఆబస్సు డ్రైవర్ వచ్చేది ఆత్రేయలా వున్నాడని బస్సు ఆపాడు తన స్నేహితుడే ఆబస్సులో వుండటం అమ్మ దయే అనుకున్నాడు అంజన్. రాత్రి 11గం॥ బాపట్లలో గడియారం స్థంబం దగ్గర దిగి ప్రెస్‌కు వెళ్ళాడు. అక్కడ ఒక రిక్షావాడ్ని అడిగితే ఇంత చీకట్లో ఈ వర్షంలో ఎలా వస్తామండి అన్నాడు. విజయదశమి సూర్యోదయం నుంచీ మర్నాటి వరకు ఎక్కడికీ కదలకుండా షిర్డీబాబా పూజచేసుకోవటం అలవాటు. అమ్మ దగ్గరికి ఉదయం కల్లా చేరాలన్న తపనతో ఆ వర్షంలో రుమాలు తలకు కట్టుకొని పాడుకుంటూ బయలుదేరాడు

జమ్ములపాలెం దాటి 7వ మైలురాయి దగ్గరకు వచ్చాడు. సరిగా అప్పుడే జిల్లెళ్ళమూడిలో లైట్లు ఆరిపోయాయి. జిల్లెళ్ళమూడికి వెళ్ళే రోడ్డుమీద కాలుమోపగానే లోపలికి దిగిపోయి చెప్పురాలేదు. కాలులో తుమ్మముల్లు గుచ్చుకుంది, అడుగు తీసి అడుగువేస్తుంటే వంద ట్యూబులైట్ల వెలుగులో ముందు తోవలో నీరు ఎటు ప్రవహిస్తోందో కనిపించింది. మొదటి వరదాటగానే

డ్రైన్‌లో నీరు కూడా ఎదురు ప్రవహిస్తోంది రెండవ వర వరకూ ఆ ప్రవాహంలో ఎటుపోవాలో తెలియక! బాబా ప్రతి సం॥ విజయదశమికి నీకు పూజచేసుకునేవాడిని, నీవే కదా! ఈమె దగ్గరకు పంపించావు. ఈమెకే శక్తి వుంటే, ఈవరదలో దాటితే ఆమెకు పూజచేసుకుంటాను లేదా ఆమెలో కలిసిపోతానని అనుకుంటూ లైట్లు రావటంతో వాటివంక చూస్తూ నిల్చున్నాడు.

బాబా, అమ్మా అని కాళ్ళు రెండూ రాయి మీద పెట్టేటప్పటికి సరిగా బ్యాంకు దగ్గర వున్నాడు. సూర్యోదయంలోగానే అమ్మను చేరుకున్నానన్న ఆనందంతో పడిపోయాడు. వెనక్కి తిరిగి చూచుకుంటే అంత వర్షంలో ఆ వరదను దాటుకొని ఎలా వచ్చానా అని భయం, ఆశ్చర్యం కలిగాయి "ఎవరది?" అని నాన్నగారు అడిగారు. అంజన్‌ని, "బాపట్ల నుంచి నడిచి వచ్చాను" "ఈత వచ్చిన వాళ్ళకూడా వరల దగ్గర దాటలేక తిరిగి వచ్చారు. నీవు ఎలా వచ్చావు? నీమూలాన మీ అమ్మగారికి చెడ్డపేరురాదా?" అని కేకలు వేసారు. "వినవలసినవారు విన్నారు రావలసినవాడిని వచ్చానని" చెప్పాడు. విజయదశమి పూజకు రాచర్ల లక్ష్మినారాయణ అన్నయ్య, అంజన్ నాన్నగారు ఏక పుండరీగారు ఏర్పాట్లు చేస్తూ మెరుపులు టార్చిలైట్ వెలిగి ఆరినట్లుగా వస్తున్నాయని అనుకున్నారు. అంజన్ ఆ మెరుపుల సాయంతోనే వరలు దాటుకుని వచ్చానన్నాడు. అమ్మ కోసం తెచ్చిన చీరెకు బురద అంటిందని బాధపడ్తుంటే అమ్మ వసుంధరక్కయ్యను పిలిచి "ఈ చీరె ఉతికి ఆరేయించు రేపు ఆ చీరె కట్టుకుంటానని" చెప్పింది.

అంజన్‌ను చూడగానే అమ్మ "ఎందుకురా అంత సాహసం చేశావు? భారం అంతా నామీద పెట్టావు కదా! ఒకటే కాళ్ళు నొప్పులు" అని అన్నది. దానితో తెల్లబోయాడు. నిజమే కదా! "బతికి ఉంటే అమ్మ దర్శనం చేసుకుంటాను లేకపోతే అమ్మలో కలసిపోదామని అనుకున్నాడుగా" పూర్తిగా అమ్మను నమ్మినపుడు మరి మన బాధ్యత అమ్మ ఎందుకు తీసుకోదు? ఆ నమ్మకం మనలో కలగాలి, అది కలిగించ వలసిందీ అమ్మే కదా!

విజయదశమినాడు అమ్మకు మొదటి పూజ శేషయ్యలింగంగారు ఎన్నోరకాల పూలతో గజమాలలతో పూజచేసుకున్నారు. అంజన్‌కు తన దగ్గరవున్న వాడిపోయిన దండ వేయటానికి మనస్కరించక కొబ్బరికాయ కొట్టి దణ్ణం పెట్టుకుందామని అనుకున్నాడు. లక్ష్మీనారాయణ అన్నయ్య దసరాలు అయిపోయాయి కదా! మిగిలిన పూలు గులాబీలు, లిల్లీలు, తమలపాకులు అన్నీ ఇచ్చాడు. అన్నయ్య నామాలు చదువుతుంటే అన్ని పూలతో పూజచేయకల్గటం అమ్మ తనకు ఇచ్చిన అవకాశంగా భావించాడు. కొబ్బరికాయ కొట్టేటప్పుడు అన్ని పూలున్నాయి కదా! పాదనమస్కారంకు వీలవదేమో అని అనుకున్నాడు. కానీ ఆశ్చర్యం అంజన్ మనసు గ్రహించి అమ్మ తన పాదాలను పూలమీద పెట్టుకుంది. పూలదండ వాడిపోయిందనుకుంటే అన్ని దండలూ తీసి ఆ వాడిన దండనే వేయించుకుంది.

ఆ రాత్రి మొదటి వర దగ్గర డ్రమ్ములకు తాళ్ళుకట్టి గజ ఈతగాళ్ళు వుండి దాటిస్తున్నారు. అంతదాకా వెళ్ళాక అమ్మ రమ్మంటోందని చెప్పారు. తీరా అది దాటుకుని అమ్మ దగ్గరకు వెళితే నీకు కాఫీ ఇవ్వలేదని పిల్చాను అన్నది. వసుంధరక్కయ్యను బట్టలు తెమ్మంది. బట్టలు లేవమ్మా అంటే పండుగనాడు బట్టలు లేక పోవటమేమిటి? పట్టుచీరెవుంది కదా! అది బట్ట కాదా! అని ఆ చీరెను విప్పి అంజన్‌కు కప్పింది. కాఫీవంకతో పిలిపించి బట్టల ద్వారా తన అనుగ్రహాన్ని అంజన్‌కు అందించింది అమ్మ.

అమ్మని అంజన్ బామ్మ అని పిలిచేవాడు. వాళ్ళ బామ్మ ఆదిలక్ష్మిగారు అమ్మలావుంటారని అనుకునేవారు. బాబా "నీవు నాకు తండ్రివి, నీ తల్లి అమ్మ కాబట్టి అమ్మ నాకు బామ్మే అవుతుందని" అనుకునేవాడు.

అమ్మ దగ్గర రవిఅన్నయ్య, అంజన్, మధుఅన్నయ్య, సత్యం కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. ఈలోగా అన్నంరాజు రామకృష్ణఅన్నయ్య కారు తీసుకుని వచ్చాడు. మెల్లిగా అంతా కలసి అమ్మను కారులో

ప్రయాణించటానికి ఒప్పించారు. మనం అనుకుంటాం కానీ "దైవం తలుస్తేనే తానుతలుస్తాడని" అమ్మ చెప్పినట్లుగా తన ఉద్దేశాన్ని వారి ద్వారా వ్యక్తం చేయించింది అమ్మ. తీరా మెట్లదాకా వచ్చాక వసుంధర అక్కయ్య అంజన్‌ని పిలిచి అమ్మకు అవసరమైన వస్తువులు ఒక సంచిలో వేసి యిచ్చింది. అది చూచి "ఇప్పుడు నీవు లేడీ అటెండెంట్ అయ్యావన్నమాట" అన్నది అమ్మ.

బాపట్ల వెళ్ళి అక్కడ నుంచి కొమ్మూరు డాక్టరుగారైన సీతాచలం గారింటికి వెళ్ళింది అమ్మ. అమ్మను చూడగానే ఆయన పరుగు పరుగున బయటకు వెళ్ళారు. "మొదటిసారి వాళ్ళ యింటికి వచ్చినప్పుడూ యింతేరా!" అన్నది అమ్మ. అక్కడి వాళ్ళందరికీ ఆశ్చర్యమనిపించింది. తీరా ఆయన అమ్మకు కొబ్బరికాయ తీసుకు రావడానికి వెళ్ళారు. దసరాల్లో అమ్మ వారింటికి వెళ్ళినప్పుడు అమ్మకు ముద్రలు వచ్చాయి. వాటిని చీరాల డాక్టరుగారు ఫోటోలు తీశారు. అందులో మూడు ఫోటోలు అమ్మ అంజన్‌కి ఇచ్చి దాచమంది.

అక్కడ నుంచి కాకుమాను వెళ్ళమంది. కారులో ఉన్న వీళ్ళంతా సత్యంగారింటికి వెళితే పకోడీలో, కారప్పూసో, జంతికలో, చేగోడీలో తినవచ్చని అనుకున్నారు, పైగా అందరికీ బాగా ఆకలిగా ఉంది. వీళ్ళు సత్యంగారింటికి వెళ్ళేటప్పటికి ఆయన భోషాణంలో వెతుకుతున్నారు. సాయంత్రం మనవలు వస్తే అన్నీ పొట్లాలు కట్టియిచ్చాను అని పటికబెల్లం మాత్రమే ఉందనీ తలా గుప్పెడు పెట్టాడు. అది చూచి అమ్మ పకపకా నవ్వింది. "ఎందుకమ్మా నవ్వుతున్నావు?" అని అడిగారు. పకోడీలో, జంతికలో తిందామనుకున్నారు కదా! అంటూ అమ్మ వీరిని ఆటపట్టించింది.

అంజన్ పెళ్ళికి ముహూర్తాలు కూడా పెట్టుకున్నాక పెళ్ళి ఆగిపోయింది. అంజన్ అమ్మ దగ్గరకు వెళ్ళి "అమ్మా నీఇష్టం వచ్చినప్పుడు, నీఇష్టం వచ్చిన పిల్లతో పెళ్ళి చెయ్యమని" చెప్పాడు. "వాడు భారం అంతా నామీదే పెట్టాడురా" అని రామకృష్ణ అన్నయ్యతో అమ్మ చెప్పింది. ఇంతలో అమ్మమ్మ తన చెల్లెలి

కూతురు ఉందని, అమ్మ దగ్గర పెళ్ళి చూపులు ఏర్పాటు చేస్తానని అన్నది. దానికి అమ్మ "అన్నంరాజు రామకృష్ణ కూతురు శేషుని నరసింహారావు మామయ్య పెళ్ళి చేసుకున్నాడు కదా నీవూ నరసింహారావు మామయ్య ఇద్దరూ అన్నదమ్ముల వరసకదా! ఆ అమ్మాయి నరసింహారావుకు చెల్లెలు వరస అయినప్పుడు ఎలా కుదురుతుంది రా!" అన్నది అమ్మ. దానికి ఏకాగారు "అంతా నీఇష్టమమ్మా, నీవు ఏం చేయమంటే అది చెస్తానని" అన్నారు. కానీ అంజన్‌కు అమ్మ అంతగా విడమర్చి చెప్తుంటే ఈసంబంధం అమ్మకు ఇష్టం లేదని అనిపించింది.

అంజన్ అమ్మతో "నీవు ఏపిల్లను చేసుకోమంటే ఆ పిల్లనే చేసుకుంటాను" అన్నాడు. అమ్మ "అలాకాదు నాన్నా నీవు పిల్లను సెలెక్టు చేసుకురా, పెళ్ళి నాసన్నిధిలో జరిపిస్తా"నని అన్నది. అలాగే నరసాపురం సంబంధం ఖాయం చేసుకున్నారు. అమ్మ సన్నిధిలో వివాహం వైభవంగా జరిగింది.

తన పెళ్ళికి హైమక్కను రమ్మని మరిమరీ వేడుకున్నాడు. అంజన్ వాళ్ళ చిన్న అత్తయ్య పెళ్ళి, భోజనాలు అయిన పిమ్మట హైమాలయం దగ్గర పడుకుంది. హైమక్క ఆవిడను లేపి అంజన్ కోరినట్లుగా పెళ్ళికి వచ్చి భోజనం చేసి వెళుతున్నానని చెప్పమంది. ఆవిడ హడావిడిగా లేచి చూచేటప్పటికి హైమక్క వెళ్ళిపోతూ కన్పించింది. ఆవిషయం తెలిసిన అంజన్ "నిజమే! నేను హైమక్కను పెళ్ళికి రమ్మని కోరుకున్నాను, కానీ నాకు కనిపించమని అడగలేదు కదా"! అని హైమక్క పెళ్ళికి వచ్చిందని అమితానంద భరితుడయ్యాడు.

ఆగష్టు 4న అంజన్ వివాహం అయింది. మొదటి వెడ్డింగ్ యానివర్సిరీకి అమ్మకు ఫోను చేయాలనుకున్నాడు. చెఋవు నంబరుకు డయల్ చేస్తే చాలా డిస్టబెన్సు వచ్చింది. రామకృష్ణ అన్నయ్య ఫోను తీశాడు, అమ్మ దీవెనల కోసం ఫోను చేశానని చెప్పాడు అంజన్. అమ్మ తలంటుకుంటోంది యిప్పుడు రావడం కుదరదని అన్నయ్య చెప్పాడు. మళ్ళీ అన్నయ్యే అంజన్ ఆర్తిని

శ్రీబెవరవీరభద్రరావుగారు ఎడ్వకేట్. ఇండియన్ బుద్ధిష్టు పత్రికకు ఎడిటర్‌గా వున్నారు. ప్రస్తుతం విశాఖపట్టణంలోని పురుషోత్తమపుర నివాసి. ఆయన ఉద్యోగరీత్యా గుంటూరు జిల్లాకు బదిలీ మీద వెళ్ళారు. ఆరోజుల్లో ఆయనకు దివ్యశక్తుల మీద, కారణజన్మల మీద నమ్మకంలేదు. మిత్రులు ఎన్నిసార్లు జిల్లెళ్ళమూడి వెళ్దామని కోరినా బుద్ధిపుట్టలేదు. ఆయన ఉద్యోగరీత్యా జిల్లా అంతా పర్యటించవలసివచ్చేది.

ఖాదీ కమీషన్‌లో పనిచేసే స్నేహితుడు బెంగుళూరు నుండీ గుంటూరుకు ట్రాన్స్‌ఫర్ మీద రావటం జరిగింది. ఆయున పేరు శ్రీఅంగర సూర్యనారాయణరావు. చిత్తూరుజిల్లా జన్మస్థలం. వీరిద్దరూ బహుసన్నిహితులు. 16సం॥ల తరువాత మళ్ళీకలవటం సంభవించింది. సూర్యనారాయణగారు తన స్వంత ఖర్చుల మీద వీరభద్రరావుగారి దంపతులను జిల్లెళ్ళమూడికి తీసుకువెళ్తానని కోరాడు. ఇటువంటి విషయాల్లో నమ్మకం లేదని ఖరాఖండిగా చెప్పారు. కానీ సమయం దొరికినప్పుడల్లా సూర్యనారాయణగారు పదేపదే రమ్మని వాళ్ళను కోరుతూనేవున్నాడు. ఆయన పోరు పడలేక "అసలు మీకు అమ్మమీద ఎలా విశ్వాసం కుదిరిందని" ప్రశ్నించారు వీరభద్రరావుగారు.

దానికి సూర్యనారాయణగారు "ఒక లాయరు మిత్రుడు తనతో రేపు ఆదివారం జిల్లెళ్ళమూడి దాటి మరియొకవూరిలో కమీషనర్‌గా వెళ్తున్నానని తానువచ్చేవరకు సూర్యనారాయణగారు జిల్లెళ్ళమూడి అమ్మ ఆశ్రమంలో వుండచ్చునని చెప్పారు. సరే ఆయనమాట కాదనలేక అక్కడికి వెళ్ళారు. కౌంటర్‌లో విదేశీయులు అమ్మ పుస్తకాలు అమ్ముతున్నారు. ఆయనకు కావలసిన పుస్తకాలన్నీ ఎంచుకొన్నారు. తీరా డబ్బులు చూస్తే వాటికి సరిపడా డబ్బులు లేవు అందుకని తనమిత్రుడు వచ్చిన తరువాత పుస్తకాలను తీసుకుంటానని ప్రక్కనపెట్టమన్నారు. టైం ప్రకారం పుస్తక విక్రయశాల మూసివేస్తాము. ఈలోగా మీదగ్గర ఉన్న పైకంకు సరిపడా పుస్తకాలను తీసుకోండి అని చెప్పారు, షాపు

కట్టేవరకూ మిత్రుడు కోసం చూద్దామనుకున్నారు. సమయం గడిచిపోతోన్నకొద్దీ ఆయనలో ఆతృత పెరుగుతోంది. కావలసిన పుస్తకాలను కొనలేక పోతునానన్న దిగులు మనస్సంతా ఆక్రమించింది.

మరికొన్ని నిమషాల్లో షాపు మూసేస్తారనగా మేడపై నుండీ ఒక అన్నయ్య వచ్చి "సూర్యనారాయణ అన్నయ్యకు కావలసిన పుస్తకాలు ఇచ్చి, అతను ఇచ్చిన డబ్బులు తీసుకోని, అతన్ని నాదగ్గరకు పంపమని" అమ్మ చెప్పిందని తెలియచేసాడు. ఎంచిపెట్టుకున్న పుస్తకాలు తీసుకొని మేడపైకి వెళ్ళి అమ్మను దర్శించాడు, ఎంతో ప్రేమగా అమ్మ ఆయన్ని కుశలప్రశ్నలు వేసింది. ఆయనకు కొత్తగా అనిపించలేదు, అంతకు ముందు అమ్మను దర్శించనేలేదు. ఆయన ఉనికి ఎవరికీ అంతమటుకు తెలియపరచలేదు. మరి అమ్మ తనపేరుతో సహా చెప్పటమేకాక, తానుపుస్తకాలు ఎంచుకొని సరిపడా డబ్బులేక తీసుకోకపోవటం అమ్మకు ఎలా తెలిసింది. సర్వం అమ్మేనన్న విశ్వాసం ఆయనలో ప్రబలింది. "పుస్తకాల గురించిన నా తపనే అమ్మను కదలించి నాకు ఈవిధమైన అనుభవాన్ని కలుగచేసిందని" వీరభద్రరావుగారితో చెప్పాడు.

అది విన్న తరువాత వీరభద్రరావుగారు కాదనలేక వారితో కలిసి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అమ్మ దర్శనానికి సమయం వుందని తెలిసి పుస్తకాలు చూస్తున్నారు. అక్కడ వాలంటీర్లుగా ముగ్గురు విదేశీయులు వున్నారు. అందులో ఒక మహిళ కూడా వుంది. ఆమె లండన్ విశ్వవిద్యాలయంలో జర్నలిజం చదివింది. ఆమెను వీరభద్రరావుగారి భార్య పద్మావతి "మీకు తెలుగు భాషవచ్చా?" అని అడిగింది. దానికి ఆమె "రాదు" అని బదులుచెప్పింది. "అమ్మకు ఇంగ్లీషువచ్చా" అని తిరిగి ప్రశ్నించింది. దానికామె నవ్వుతూ ఇంగ్లీషులోనే "అమ్మకు ఇంగ్లీషు రాదు, కానీ తల్లేపిల్లలకు అర్థమయ్యే భాష ఒకటుంది అది వచ్చు" అని చెప్పింది. అదివిన్న వీళ్ళకు అలవిమాలిన ఆశ్చర్యం ఆనందం కలిగాయి. అమ్మ యొక్క జగన్మాతృత్వానికి పులకించిపోయారు.

అమ్మదర్శనం కోసం ఆతృతగా, ఉత్కంఠతో ఎదురుచూస్తున్నారు. ఇంతలో అమ్మ వచ్చి కుర్చీలో ఆసీనురాలైంది. అందరూ నమస్కరించారు. అమ్మ తన చల్లని దృక్కులను బిడ్డలందరిపై ప్రసరించింది. మెల్లగా ఒక్కొక్కరు నమస్కారం చేసి, అమ్మ చేతుల మీదగా ప్రసాదం తీసుకుంటున్నారు. వీరభద్రరావుగారు అమ్మ ముఖంవంక చూచారు, ఏమాత్రం మర్మం లేని ముఖం ఆచూపులో నిర్మాల్యం, అమాయకత, ఏవేవో లోకాలను దర్శింప చేసే మార్దవం, గంభీరత కనిపించింది, అప్పుడే జన్మించిన పసిగుడ్డులో సయితం మర్మం కనిపిస్తుందేమోకాని ఈ అమ్మచూపుల్లో అది ఏమీలేదు. ఇంతటి అనురాగమూర్తి, వాత్సల్యప్రదాయిని అయిన అమ్మను తెలిసీ, తెలియని స్థితిలో విమర్శించినందుకు ఆయన పశ్చాత్తాపంతో కన్నీళ్ళు కార్చారు, తన తప్పిదానికి మన్నించమని మనస్సులోనే వేడుకున్నారు.

వరుసగా ఒక్కొక్కరూ దర్శనం చేసుకుంటున్నారు. అన్నయ్య అమ్మపాదాల వద్దకువెళ్ళగానే దీవించి, ప్రసాదాలను ఇచ్చింది. అమ్మ ఎదైనా పట్టుకెళ్ళిన వారికే కాక, రిక్తహస్తాలతో వచ్చినవారికి కూడా ఒకేరీతిని అమ్మ ప్రసాదం పంచింది. మధ్యాహ్నం 12గం॥ దాటింది ఒక కుటుంబం వచ్చి వెనుకగా కూర్చున్నారు, అమ్మవారిని ఆప్యాయంగా చూచి "నాన్నా! ముందు మీరు వెళ్ళి స్నానపానాలు గావించిసేదతీరండి. ఎప్పుడనగా బయలుదేరారో మధ్యలో కారు రిపేరు అయింది కదా"! అని అమ్మ చెప్పింది. అది విన్న అన్నయ్యకు నోటమాటరాలేదు. అమ్మ యొక్క అవ్యాజ ప్రేమకు ముగ్ధుడయ్యాడు కన్నులు అశ్రుపూరితాలయినాయి. దర్శనానంతరం అమ్మలోపలికి వెళ్తూ అందర్నీ భోజనాలకు వెళ్ళమని" చెప్పింది. ఆమాట ఎవరికివారికే ప్రత్యేకించి అమ్మ చెప్పినట్లుగా అనుభూతి కలిగింది.

అన్నపూర్ణాలయంలో అందరూ ఒకేపంక్తిలో భోజనానికి కూర్చోవటం చూసిన అన్నయ్యకు ఆశ్చర్యమనిపించింది. అమ్మ ఇంటిని ఆశ్రమం అనదు.

"అందరిల్లు" అని వ్యవహరిస్తుంది. అక్కడ ఓరియంటల్ కాలేజీలో ఉచితంగా విద్యనేర్పుతారు. నివాసానికి గదులకు ఏమీ చార్జిచేయరు. ఎక్కడా ఇటువంటి పద్ధతిని చూడని ఆయనకు వింత లోకంలో వున్నట్లుగా భావన కలిగింది. ఆవిద్యార్థులకు మూడుపూటలా భోజనం అన్నపూర్ణాలయంలో అందరితో కలిపే పెద్తారు. ఆయన పక్కన 18,19సం॥ యువకుడు కూర్చున్నాడు ఆయన లౌకికదృష్టితో వున్నాడు కదా! "నీవు ఏం చేస్తున్నావని అడిగాడు. "ఇంటర్మీడియట్ చదువుతున్నానని" అతడు బదులు చెప్పాడు. "ఈవయస్సులో నీకు ఈవేదాంతం ఈనమ్మకాలు ఏమిటి?" అని వ్యంగ్యంగా ప్రశ్నించాడు. దానికి అతను "మాది పక్కనే వున్న కాకుమాను. ఒకసారి నాతండ్రికి అనారోగ్యంతో అవసానదశ ప్రాప్తించింది. అందరూ మాతండ్రిపై ఆశ వదులుకొని ఘల్లున ఏడుస్తున్నారు, అంతలో గజేంద్రుని రక్షించటానికి వచ్చిన విష్ణుమూర్తిలా అమ్మ కారులో నుంచీ దిగి తిన్నగా మా నాన్న దగ్గరకు వచ్చి "ఏమయింది నీకు, ఏమీలేదు, లేచికూర్చో" అనిచెప్పి బాతురూమ్‌లో నీళ్ళు పెట్టించుకొని స్నానం చేసిబయటకు వచ్చేటప్పటికి మా నాన్నా లేచి కూర్చున్నాడు. అంతమటుకు అవసానదశ సంప్రాప్తించిన ఆయన హాయిగాలేచి కూర్చోవటం అమ్మ దయకాక మరి ఏమిటి? ఆవిధంగా మాతండ్రికి గండం తప్పించి దీర్ఘాయష్షు ప్రసాదించింది. అందుకే సమయం సందర్భం దొరికినప్పుడు అమ్మ దర్శనానికి వచ్చి వెళ్తుంటానని తెలియచేసాడు. దీనితో ఆయనకు మరోకనువిప్పు కలిగింది.

అమ్మను కొంతైనా అర్థం చేసుకొనటానికి ఇదొక ప్రబలసాక్ష్యాం అమ్మ "నాకుశిష్యులెవరు లేరు. మీరంతా శిశువులే" అని అంటుంది, ఈఅనుభవాలు అన్నయ్యను ఎంతగానో ప్రభావితం చేసాయి, అట్టి మధురస్మృతులను కలుగచేసిన అమ్మ కరుణామృతదృష్టికి హృదయపూర్వక నమఃసుమాంజలులు సమర్పిస్తూ అనుక్షణం అమ్మ జ్ఞాపకాలతోతృప్తిగా జీవనయానం సాగిస్తున్న అన్నయ్య ధీశాలి.

+ + +

అన్నాప్రగాడ లక్ష్మీనారాయణగారు రాజోలు కాలేజీలో ప్రిన్సిపాల్‌గా పనిచేసారు. అన్నయ్య తరచూ అమ్మ దర్శనం చేసుకునేవారు. అనేక వేదాంతగోష్ఠులను సలిపేవారు. అమ్మ "ఈ పొట్ట మాతృత్వానికి చిహ్నం" అనేది. మానవతా లక్షణాలన్నీ మాతృత్వంలో అంతర్భాగంగా ఉంటాయి. సహజంగా మానవత్వ లక్షణాలన్నీ మాతృత్వంలో ప్రస్ఫుటంగా ప్రతిఫలిస్తూంటాయి. అందుకే విశ్వజనని సంసారం విశ్వసంసారమే. "నా సంసారానికి మొదలు చివర అక్కరలేదు, నా సంసారం మీ సంసారాల్లాంటిది కాదు నాది విశ్వసంసారం" అని చెప్పేది అమ్మ. "మిమ్మల్నందరినీ చూస్తుంటే నేను మీ అందరినీ కని మీమీ అమ్మలకు పెంపుడిచ్చాననిపిస్తుంది" అని అంటుంది అమ్మ. మనం అంతా ప్రపంచంలో ఏభాగంలో నివసిస్తున్నా ఆమె సంతానమే. ఆమె సంసారంలో అంతర్భాగంగానే ఉంటున్నాము.

"తల్లికి బిడ్డలుగా ఉండటానికి ఏ అర్హతలు, అధికారాలు అవసరం లేదు. తన కుమారుడెంత చెడ్డవాడైనా వాడిమీద ప్రేమతరిగి పోతుందా? పైగా తన సంతానంలో నష్టజాతకుడెవరైనా ఉంటే వారి మీద మమకారం ఎక్కువగా వుంటుంది" అన్నది అమ్మ.

దేవ్యాపరాధస్తోత్రంలో "కు పుత్రోజాయే తక్వే బిదపి కుమాతా నభవతి" అని చెప్పినట్లుగా తల్లిపై ప్రేమలేని బిడ్డ ఉండవచ్చుగాని బిడ్డలపైన వాత్సల్యం లేని తల్లి ఎక్కడా ఉండదు. ఒక ఆర్తుడు "అమ్మా నీవే రక్షించాలి తప్పదు" అని అన్నప్పుడు అమ్మ "తల్లికి తప్పదు కాదు నాన్నా! తల్లికి తప్పే కనిపించదు" అన్నది.

అమ్మను చూడవచ్చిన వారంతా అమ్మ సన్నిధిలో కృత్తికా నక్షత్రంలాగా అమ్మ చుట్టూ కూర్చొని కబుర్లు చెప్పుకోవడం అక్కడి అలవాటు ఒకరు అమ్మతో "పీఠాధిపతులు గానీ మరే స్వాములవారు గానీ ఇలా దగ్గరగా రానీరమ్మా, మీరేమిటి ఇలా ఉన్నారు?" అని అడిగారు. దానికి అమ్మ వారు అలా

ఉండటం ధర్మం, నేనిలా ఉండటం ధర్మం బిడ్డలను శుభ్రపరచవలసిన బాధ్యత నాది శుచిగా కనపడిన వాళ్ళనే దగ్గరకు తీసుకునే హక్కు వాళ్ళది" అని చెప్పింది.

దీనివల్ల మాతృత్వం గురుత్వం కంటే ఎంతో గొప్పదని తెలుస్తోంది. తల్లి, తండ్రి, గురువు అనే లోకోక్తిలో ప్రధమస్థానం తల్లిదే కదా! ఇక తల్లే గురువుగా ఉంటే లేదా గురువే తల్లి రూపంలో ఉంటే వేరే చెప్పాల్సింది ఏముంటుంది.?

అమ్మ ఒకనొక సందర్భంలో "నీవు ఖూనీ చేసినా నాబిడ్డవే. నీవేం చేసినా నాఒడిలో స్థానం వుంటుంది. నీచర్యలకు బాధ్యత నీకు ప్రేరణ యిచ్చే శక్తిది కానీ నీదేమీ కాదన్నది". ఈవిధంగా పుణ్యం సంపాదించామని రొమ్ములు విరుచుకు తిరిగే వారిని, పాపం చేసామని క్రుంగిపోయే వారిని సమాన దృష్టితో చూడటం మాతృత్వానికి, మమతకు మాయని నిదర్శం, అన్నిరంగాల్లోలాగే ఈవిధానాన్ని "ఆధ్యాత్మిక సోషలిజం" అని చెప్పవచ్చును.

అసలు పాపం చేయని మానవుడంటూ లేడు. అలాగే చేసిన పాపాలకు పశ్చాత్తాప పడనివాడు లేడు. అమ్మ చెప్పినట్లు పాపపుణ్యాలు ఆచరించినా, అది మనను నడిపించే శక్తి చేతనే కదా! అందరికంటే తక్కువ మార్కులు వచ్చిన వారిని చేర్చుకోవటానికి తమిళనాడులో ప్రత్యేకించి కాలేజీ పెట్టారని వార్త. అమ్మ కూడా సంఘ బహిష్కృతులను, అతిపాపులను, అతి దుష్టులను, అసమర్థులను తన ఒడిలోకి తీసుకుని తరింపచేయటానికి అవతరించింది. వాస్తవానికి నాస్తికుడూ ఆస్తికుడే. ఆస్తికుడు భగవంతుని శక్తిలో విశ్వాసం ఉంచుతాడు, నాస్తికుడు తన శక్తి మీద విశ్వాసంతో ప్రవర్తిస్తాడు. శక్తిని ఏపేరుతో పిలిచినా ఉన్నదంతా ఒకేప్రేరణ కదా! ఇక నాస్తికుడెవరు? ఆస్తికుడెవరు?" అన్నది అమ్మ.

ఎన్నిలోపాలున్నా, ఎన్ని తాపాలున్నా మానవుణ్ణి మానవునిగా గుర్తించటం

మన ఆధ్యాత్మిక శాస్త్రానికి అవసరం. ఈ అవసరం తీర్చటానికి మన సాంప్రదాయ ఆధ్యాత్మిక వాదనలో వుండే ఈలోపాన్ని సవరించటానికి అమ్మ ఈ పుడమిపై అవతరించిందనిపిస్తుంది.

కృతయుగంలోని మానవులకంటే కలియుగంలోని మానవుని దినచర్య లోపభూయిష్టంగా కనిపించవచ్చు. అంతమాత్రాన ఆధ్యాత్మిక మార్గానికి పనికిరాడు అనటం సబబుకాదు. లోపాలున్నందువల్లే మానవుడయ్యాడు. వేదాంత శాస్త్రమైనా, ఆధ్యాత్మిక విద్యలైనా తాము ఉద్ధరించవలసింది మానవుడ్నే కదా.

దానవుణ్ణి మానవుడిగా, ఆపై మానవుడిని మాధవుడిగా తయారు చేయటమే మతాలన్నింటికీ పరమావధి. మతమైనా, మంత్రమైనా మానవుణ్ణి ఉద్ధరించటానికి వచ్చినవే. ఆ ధ్యేయాన్ని మరచిపోయి, కేవలం వాటికొరకే అవి సృష్టింపబడినాయని భావిస్తే అవేమీ లేకుండా వుండటమే ఉత్తమము.

అమ్మ విధానం, సూక్తులు ఆధ్యాత్మిక రంగంలో విప్లవాత్మక ధృక్పదాన్ని సూచిస్తాయి. ఇటు ఆధునిక శాస్త్రపరిజ్ఞానానికి, అటు అధునాతన మానవుని ఆధ్యాత్మిక అవసరాలకూ వారధిగా, సారధిగా అమ్మ సిద్ధాంతాలు పనిచేస్తాయి.

మానవునికి, మానవత్వపు విలువలకూ ఎంతో ప్రాధాన్యతనిచ్చి కేవలం మానవుణ్ణి ప్రాతిపదికగా తీసుకుని నిర్మించిన మతమే అమ్మకు సమ్మతం. ఆమె మతమూ, మంత్రమూ విశ్వజనీనమైన మానవత్వమే. అందుకే అమ్మ విశ్వజననిగా అలరారుతోంది "అందరికీ సుగతే" అన్న అమ్మ సూక్తిలో ఉండే ఆ నవతే మానవత.

+ + +

అమ్మ ఆవరణలో వుండే లలితాంబగారి తల్లికి జ్వరం వచ్చి తగ్గింది. ఆమె తల్లికి జిల్లెళ్ళమూడి విడచి వెళ్ళాలని లేదు. ఆ విషయం తెలుసుకున్న

బెండపూడి అక్కిరాజుగారి అన్న గారి కోడలు బెండపూడి రుక్మిణక్కయ్య అమ్మతో "ఆమెకు నీదగ్గరే వుండాలన్న కోరిక వుందమ్మా! ఆవిడ వుంటే ఎవరు చూస్తారన్న సమస్య ఏముంది? మేమంతాలేమా? నేను చేస్తాను నాకు వదిలేయండి" అని చెప్పింది.

సాధారణంగా ఎవరి ఇళ్ళలో అయినా పెద్దవాళ్ళుంటే వారికి పరిచర్యలు చేయటానికి కన్నపిల్లలే బాధపడతారు కానీ లలితాంబగారి తల్లి ఎవరు? రుక్మిణక్కయ్య ఎవరు? ఆమెకు సేవ చేయటానికి ముందుకు రావటం చాలా ఆశ్చర్యకరమైన విషయం. అదే అమ్మ సన్నిధిలోని గొప్పదనం.

దాదాపు 5 సంవత్సరాలుగా హరిదాసుగారి భార్య కృష్ణవేణక్కయ్య మంచంలోనే వున్నా మనుష్యులను పెట్టి జిల్లెళ్ళమూడిలో ఆమెకు సేవ చేయించే విధానం చూస్తుంటే ఎంతటి వారికైనా ఆశ్చర్యమనిపించక మానదు. ఆమె మంచంలోవున్నా అతి శుభ్రంగా కడిగిన ముత్యంలా వుంచటం విశేషం. అదే అమ్మ యొక్క అపార కరుణకు నిదర్శనం. ఆమెను చూచి, "అక్కయ్యా డబ్బు, పిల్లలు ఉన్నాకూడా ఈరకంగా జరగటం అనూహ్యం. అలాంటిది డబ్బులేకపోయినా నీకు జరుగుతున్నా విధానం చూస్తుంటే ఆనందమనిపిస్తోంది. నీవు అమ్మకు చేసుకున్న సేవల ఫలితమే ఇది. ఇంక నీకు జన్మలేకుండా చేయటానికి, జన్మపరంపరల వలయంలో చిక్కకుండా వుండటానికి అమ్మ నీప్రారబ్ధాన్ని ఇక్కడే తుడిచి పెట్టి నీకు ముక్తిని ప్రసాదించాలనుకుంది" అన్నాను. "నిజమేనమ్మా! అమ్మ దయకు అవధులే లేవు. అమ్మ జ్ఞాపకాలతోనే రోజులు వెళ్ళదీస్తున్నాను'' అని పరవశంతో చెప్పడం చూస్తే ఎవరికైనా ఆశ్చర్యమనిపిస్తుంది.

ఒక అన్నయ్య అమ్మకు నమస్కారం చేసుకుని "నా జీవితంలో ఏమైనా దిద్దుకోవలసిన విషయాలు వుంటే చెప్పమని, మనస్సుకు శాంతిగా, శరీరం ఆరోగ్యవంతంగా హాయిగా వుండాలంటే ఏమి చేయాలి?" అని అడిగాడు.

దానికి అమ్మ " నీజీవితంలో వచ్చే కష్ట సుఖాలన్నీ ఎవరో ఒకరు ఇస్తున్నారనుకో, అది దేవుడను, అమ్మ అను, ఏదో అదృశ్య శక్తి అను, ఎద్దైనా అను, అన్నీ అదే చేయిస్తుందనుకో. దారినపోతూ ఎవరైనా ఒక రాయి వేసినా ఆశక్తే చేయించిందనుకొని పోతూవుండు ఇది ఆచరణలోకి వచ్చిన తరువాత మాట్లాడుదాము" అని జవాబిచ్చింది.

ఆ జవాబు అతనేకాక మనందరం ఆచరణలో పెట్టగలగాలి. అమ్మ ఏది మాట్లాడినా వారివారి పరిస్థితులను బట్టి వాటిని వారం అన్వయించుకునేటట్లు చేయగల శక్తి వున్నది కాబట్టి అమ్మ చెప్పినట్లుగా మనం ఆచరించిననాడు మన జన్మధన్యమైనట్లే.

+ + +

శ్రీ ఎ.వి.వి. ప్రసాదరావుగారు విశాఖపట్టణం పోస్టుమాష్టరుగా పనిచేసారు. ప్రసాదరావుగారు అమ్మ దర్శనార్థమై జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అమ్మ సమక్షంలో శ్రీ చక్రవర్తిగారు, శ్రీ ఎ.వి.ఎల్. నరసింహారావుగారు, శ్రీ ఎ.వి.వి. ప్రసాదరావుగారు కూర్చుని వున్నారు. నరసింహారావుగారు మొదటిసారి అమ్మను హైద్రాబాద్‌లో దర్శించారు. వీరి ముగ్గురి ఇంటిపేరు అయ్యగారి అని గోత్రం కౌండిన్యస గోత్రమే అని అమ్మ తెలియచేసింది. ఒకేవూరులో వుంటున్నా. ఒకే ఇంటిపేరైనా అమ్మ పరిచయం చేసే వరకూ వీళ్ళకు ఆ విషయం తెలియదు. ఎవ్వరూ "అమ్మా! మా ఇంటి పేరు ఇది అని చెప్పిందీ లేదు." సర్వాంతర్యామియైన అమ్మకు తెలియంది లేదు కదా!

మెహర్‌బాబా ఫోటో జిల్లెళ్ళమూడిలో అమ్మ గదిలో వుంది. ప్రసాదరావుగారు ముందు నుంచీ మెహర్‌బాబా భక్తులు. బాబాగారికి లలితా సహస్రనామం, మార్కండేయుని సప్తపది అన్న అమిత ఇష్టం. పదిమంది దేవతలో గంగాదేవిని కూడా స్తుతించేవారు. అదే ఇప్పటి గంగానది. ప్రథమ దర్శనంలోనే ప్రసాదరావుగారికి శ్రీ సూక్తసహితంగా లలితా నామార్చన చేసుకునే అవకాశాన్ని కలుగచేసింది అమ్మ.

ఆయన్ని అమ్మ ఉపకరణంగా ఎంచుకొన్నది. అనేకులకు అవసరమైన సమయంలో సహాయసహకారాలను ఆయన ద్వారా అందించింది. శుక్రవారం పూజాస్కీములో అనేక మందిని చేర్పించారు. అలాగే ధాన్యాభిషేకానికి అనేకమంది పాల్గొనునట్లు చేసారు. నిరంతరం అమ్మ నామస్మరణతో వచ్చిన వారందరికీ తగు రీతిని సలహాసంప్రదింపులను అందచేసేవారు.

ఆయన 1979 జనవరిలో దక్షిణదేశ యాత్ర చేసి వస్తూ తిరుగు ప్రయాణంలో అమ్మను దర్శించుకున్నారు. అమ్మను చూచిన మరుక్షణమే అమ్మ రాజరాజేశ్వరిగా భాసించింది. బంగారపు వన్నెతో మెరిసిపోతూ అమ్మ కట్టుకున్న చీరె యొక్క నెమలికఠం రంగు గదంతా పరుచుకున్నట్లుగా దృశ్యమానమైంది. అమ్మను దర్శించగానే ఆయన ఆధ్యాత్మిక ఆనందసాగరంలో మునకలు వేసినట్లుగా అనుభవం కలిగింది.

అమ్మ దివ్యపాదారవిందాలకు క్షీరాభిషేకం చేసుకుని, తిరుపతి వెంకటరమణమూర్తి గర్భగుడిలో అమ్మను పాదాల దర్శించానని అమ్మతో చెప్పారు. దానికి అమ్మ "ఆది శంకరులు ఆ సేతు హిమాచలం పర్యటించింది ఆపాద సందర్శనం కొరకేనని" తెలియచేసింది.

ఆయన 8 సం॥ల పిల్లవాడుగా ఉన్నప్పటి నుంచీ సాధనామార్గంలో పయనిస్తున్నారు. పోస్టల్ డిపార్టుమెంట్‌లో పనిచేస్తున్నప్పుడు అనేకమంది గురువులను, ఉపాసకులను దర్శించారు. "చాలామంది సమస్యలను తన ద్వారా అమ్మ పరిష్కార మార్గం చూచించిందని" తెలియచేసారు.

అమ్మ సమక్షంలో ఒకమారు అమ్మ ఆయనే వుండటం సంభవించింది. "అమ్మా! నీవే శ్రీమాతవు కదా!" అని అడిగారు. దానికి అమ్మ నవ్వి తల ఊపింది. అప్పుడు అమ్మ చుట్టూ వెలుగులు చిమ్ముతూ కాంతి వలయం ఏర్పడింది. దాని నుండీ మధురమైన నాదం వినిపించింది. అన్ని రూపాలు,

గుణాలు, నామాలు వాడివే కాబట్టి రూపరహితుడు, గుణరహితుడు, నామరహితుడు అదే అమ్మ అని ఆయన విశ్వాసం.

అమ్మ పరాశక్తి, అమ్మ శారీరకంగా లేకపోయినా ఆవిడతో తాను తాదాత్మ్యం చెందటం సంభవిస్తుందని తెలియచేసారు. అమ్మ "మదర్ ఆఫ్ ఆల్". అని అమ్మే దైవం అనీ, అమ్మను మించిన శక్తి వేరే లేదని, అమ్మే పిల్లలు, పిల్లలే అమ్మ అని తన విశ్వాసాన్ని వివరించారు.

ఆయన విశాఖమాతృశ్రీ అధ్యయన పరిషత్తుకు అధ్యక్షులుగా తన సేవలు అందచేసారు. ఆరోగ్యం సహకరించినందున ఇప్పుడు ఇంట్లోనే వుండి అమ్మ ధ్యాన మననాలతో జీవితాన్ని గడుపుతున్న పుణ్యశీలి.

+ + +

విశాఖపట్టణంలో శ్రీ గంటి వెంకట్రావుగారు సెంట్రల్ ఎక్సైజ్ & కష్టమ్సులో ఆఫీసర్‌గా ఉన్నారు. పోష్టుమాస్టరుగారైన శ్రీ ఎ.వి.వి. ప్రసాదరావుగారు అమ్మ భక్తులు. వారి దగ్గరకు వచ్చిన ఎందరెందరినో అమ్మ దర్శనం చేసుకోమని చెప్పేవారు. ఆయన ఇంటికి జిల్లెళ్ళమూడి నుండీ రామకృష్ణ అన్నయ్య, గోపాలన్నయ్య, పన్నాల రాధాకృష్ణశర్మగారు వచ్చిన సమయంలో గంటి వెంకట్రావుగారు పోష్టుమాష్టరుగారింటికి వెళ్ళారు.

ఆయన అమ్మ గురించి తెలియచేసి, వారిని పరిచయం చేసి జిల్లెళ్లమూడి వెళ్ళి అమ్మ దర్శనం చేసుకోమని మరీమరీ చెప్పారు. మార్చిలో బడ్జెట్ గురించి వెంకట్రావుగారు గుంటూరు వెళ్తూ భార్యకు జిల్లెళ్ళమూడి వెళ్దామని చెప్పారు. దానికి వరలక్ష్మక్కయ్య ఎలా కుదురుతుంది? రెండో పిల్ల రమణి పురుడు అయి ఇంట్లో వున్నదని చెప్పింది. దానికి వాళ్ళ పెద్ద అమ్మాయి చిట్టితల్లి "ఇంట్లో నేను చూచుకుంటాను. నీవు వెళ్ళి అమ్మను దర్శించుకొని రమ్మని" తల్లిని ప్రోత్సహించింది. గుంటూరు వెళ్ళాక "మీకు చాలా ఆచారం కదా! అమ్మ దగ్గర కులమతాల పట్టింపులేదు. అందరికీ ఏకపంక్తిని భోజనాలు

పెడ్తారని" తెలియచేసారు. ఏకాదశి ఉపవాసాలు అలవాటే కదా! ఒక్కపూట తినకపోతే ఏమవుతుంది? అమ్మను దర్శించుకోవటానికి ఏ పట్టింపు వుండదు. సాక్షాత్తు రాజరాజేశ్వరీ అవతారమని అందరూ చెప్తున్నారు కదా! వెళ్ళాలని నిశ్చయించుకుంది అక్కయ్య.

అక్కయ్య అమ్మ దర్శనానికి వెళ్ళింది. అమ్మ రెండు అరిటిపళ్ళు ఇచ్చింది. "అందరినీ భోజనం చేసి రమ్మని" చెప్పింది అమ్మ. "ఆ ప్రసాదం తనకు చాలనీ, అన్నయ్యను భోజనం చేసి రమ్మని" వరలక్ష్మక్కయ్య అన్నది. అన్నయ్య భోజనానికి వెళ్తుండగా అమ్మ పిలుస్తున్నదని చెప్పారు. అక్కయ్యకు అమ్మ ఎందుకు వెనక్కి పిలుస్తున్నారని అనుకుంది. ఈ లోగా అమ్మ "మీకు అన్నం ఇక్కడే పెడ్తాను" అన్నది. అది విన్న అక్కయ్య అన్నం ఎవరు తెస్తారో తన ఆచారం మంటగలుస్తుందేమోనన్న భయం కలిగింది. అమ్మ సాయమ్మగార్ని పిలిచి అన్నం తీసుకురమ్మన్నది. సాయమ్మగారు పూర్తి ఆచారవంతురాలు. దానితో అక్కయ్య మనస్సు కుదుటబడింది.

అమ్మ అన్నం కలిపి ముద్దలు పెట్టింది. అది యాలకులు, పచ్చకర్పూరం వేసినట్లుగా సువాసనలు వచ్చాయి. అక్కయ్య ఆశ్చర్యపోయింది. అక్కయ్య తినటానికి హడావిడి పడుతుంటే మెల్లిగా తినమ్మా అన్నది. గిన్నెడు నెయ్యిపోసి కలుపుతూ అక్కయ్యను చూస్తున్నది అమ్మ. వెంటనే వరలక్ష్మక్కయ్యకు తనకు వాళ్ళ అమ్మ ఎక్కువ నెయ్యివేసి కలిపిపెట్టటం గుర్తువచ్చింది. "మా అమ్మలాగా కలిపావమ్మా" అన్నది. "అమ్మనే కదమ్మ!" అన్నది.

అమ్మ రాజరాజేశ్వరీ అవతారమంటారు కదా అని రాజరాజేశ్వరీ అష్టకం చదివింది అక్కయ్య. అమ్మ తెల్లని జరీచీరెతో మెరిసిపోతూ కనిపించింది. ఆ చీరెలో అమ్మ ఎంత బాగున్నదో అని అనుకుంది. అక్కయ్య తిరిగి వచ్చేటప్పుడు ఆ తెల్లచీరె అమ్మ ఇచ్చింది. "ఎందుకమ్మా?" అన్నది. ప్రసాదంగా తీసుకోమని, చీరె కొంగుపట్టమని చేతులనిండుగా పొట్లాలు తీసి మూడుమాట్లు పోసింది. అక్కయ్య ఆ రెండు అరిటి పళ్ళూ పిల్లలకు ప్రసాదంగా తీసుకువెళ్దామనుకుంది.

అమ్మ వసుంధరక్కయ్యతో ఒక పెడ అరిటిపళ్ళు పెద్ద లడ్డూ తెప్పించి పిల్లలకు ఇవ్వమంది.

రెండవమారు వెళ్ళినప్పుడు అమ్మ దగ్గర అంతా, ఒడుగులు చేసుకుంటారని తెలిసి వాళ్ళ అబ్బాయికి అమ్మ చేతి మీదుగా వొడుగు చేయించాలని అనుకుంది. ఆ మాటే అమ్మతో అంటే మే 5న చేసుకోమని చెప్పింది. అమ్మ సర్వసాధారణంగా పిల్లల ఒడుగులు, పెళ్ళి మే 5న చేసుకోమంటుంది. కళ్యాణకారిణి అయిన అమ్మ కళ్యాణ దినమది.

శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారిచేత శుభలేఖ రాయించి అనకాపల్లిలో ఉన్న వాళ్ళనాన్నగారికి చూపించింది. ఈ ముహూర్తం ఎవరు పెట్టారు? చతుర్దశి, అమావాస్య ముందు ఎలా చేస్తావని కేకలేసారు. అమ్మ చెప్పింది కాబట్టి ఆ ప్రకారమే చేస్తాను. కావాలంటే ఒడుగు అయ్యే వరకూ అనకాపల్లి రావటం మానేస్తానని అక్కయ్య చెప్పింది. తనకు అంతధైర్యం, తెగువ కూడా అమ్మే కలుగు చేసిందని అక్కయ్య విశ్వాసం.

వాళ్ల మూడో అమ్మాయి జయకు భ్రమరాబక్కయ్య ఒక సంబంధం చెప్పింది. వాళ్ళ శాఖ కాదు కాబట్టి తాను శాఖా భేదానికి ఒప్పుకోనని తెగేసి చెప్పింది. భ్రమరాంబక్కయ్య వాళ్ళు ఎన్నో విధాల చెప్పిచూసారు. కాని అక్కయ్య మొండిగా చేయనని చెప్పింది. అమ్మ అడిగినా సరే" అన్నది. అమ్మకు ఆరోగ్యం సరిగాలేక హైద్రాబాద్‌లో వున్నప్పుడు వరలక్ష్మక్కయ్య అమ్మ దర్శనానికి వెళ్ళింది. అమ్మ "అక్కయ్యను ఆ వివాహము చేయమని" చెప్పింది. "వాళ్ల శాఖ వేరు, మా శాఖ వేరు అందువల్ల ఒప్పుకోలేనని" చెప్పింది. ఒడుగు అప్పుడు ఎట్లా అయితే వాళ్ళ వాళ్ళందరికీ అక్కడే చేస్తానని చెప్పిందో అమ్మతో కూడా పెళ్ళి చేయనని అలాగే అంత పట్టుదలగా చెప్పింది. ఇప్పుడు ఆలోచిస్తే అమ్మే తన చేత అలా చెప్పించిందేమోనని అనిపిస్తుందని అంటుంది.

వాళ్ళ నాలుగో అమ్మాయి తళుకు. వాళ్ల అబ్బాయి విస్సుకు అమ్మ ఆశీస్సులు మెండుగా వున్నాయి. తళుకుకు అమ్మ యందు అపారమైన విశ్వాసం.

అభిమానం. వెంకట్రావుగారి తమ్ముడి కొడుకు కాళీప్రసాద్‌కు అమ్మ యందు అనురక్తి ఎక్కువ. అమ్మ సంస్థకు ఏవిధంగా తోడ్పడగలమా, అమ్మ ఆశయాలను ఏరకంగా ఆమలుపరచాలా అన్న తపన కలవాడు. హైద్రాబాద్ సేవాసమితిలో చురుకుగా పాల్గొంటాడు.

బ్రహ్మశ్రీ పేరాల భరతశర్మగారు సంస్కృతాంధ్ర భాషల యందు మంచి పాండిత్యం కలవారు. "కాదంబరీ రసజ్ఞత" మొదలైన అనేక గ్రంథాలను రచించారు. సంస్కృతాంధ్ర భాషలలో ఎన్నెన్నో అష్టావధానాలు నిర్వహించిన ప్రజ్ఞాశాలి. కవి సామ్రాట్ శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి శిష్యులు.

బ్రహ్మశ్రీ పేరాల భరతశర్మగారు వాత్సల్యయాత్రలో అమ్మ కడప వెళ్ళినప్పుడు మొదటిసారిగా దర్శించారు. ఆ రోజు పత్రికా విలేఖరులకు అమ్మ దర్శనమిస్తోంది. అమ్మ శర్మగారిని పలకరించింది. విలేఖరులతోపాటు కూర్చోమన్నది. ఆయన విలేఖరి కాదమ్మా! అని ఒకరు అన్నారు. "కాదునాన్నా! అక్కడా, ఇక్కడా కూడా కూర్చుంటాడని" అమ్మ చెప్పింది.

అమ్మను దర్శించగానే కన్నతల్లిని చూసిన ఆనందాన్ని అనుభవించారు. ఆయన తల్లిని తల్లిగా కాక ఒక దైవంలా చూచుకునేవారు. నలుగురు అన్నదమ్ముల్లో ఆఖరివాడవటం తండ్రి చనిపోయిన తరువాత తల్లికి బాగా చేరువైనారు. ఇప్పటికి పున్నమినాటి చంద్రుడ్ని చూస్తే తన తల్లే కనిపిస్తుందని చెప్పారు. తన తల్లి దగ్గర పొందే అనురాగాన్నే వారు అమ్మదగ్గర చవిచూచారు. మాతృత్వాన్ని నిర్వచించటానికి మాటలు చాలవు. ఆయన తన తల్లి మరణించినప్పుడు "మాతృజ్యోత్స" అన్న పద్యాలను రచించారు. వారి తల్లివైశాఖ పూర్ణిమనాడు జన్మించింది. ఆ రోజు చంద్రుని వెన్నెలకు ఎటువంటి మబ్బులు అడ్డురావు. దానినే అందులో వారు వర్ణించారు.

1983లో అవధానంచేయటం కొరకు అమ్మవారిని పిలిపించింది. అమ్మ దర్శనమైన తరువాత ఇడ్లీలో నెయ్యి వేసి పచ్చడి అద్ది ఆ భార్యభర్తలకు వాళ్ళ

అమ్మాయికీ పెట్టి తాను త్రేన్చింది. మన కడుపు నింపి తాను త్రేన్చటం అమ్మకు అలవాటే కదా! అది చూచిన ఒక అన్నయ్య "ఎన్ని తపంబులు చేసెనో ఈ చిరుపాపడు" అన్న భాగవతంలోని పద్యాన్ని చదివారు.

అమ్మ దగ్గర కూర్చున్నప్పుడు తనకు, భార్యకు ఆరోగ్యం సరిగాలేదని మనసులో అనుకున్నారు. "మీ ఆరోగ్యం బాగుంటుంది నాన్నా!" అని అమ్మ చెప్పింది. ఆ తరువాతే ఏ మందువాడకుండానే ఆయన కడుపులో బాధ తగ్గిపోయింది. గుంటూరులో అవధానం వుందని అమ్మకు చెప్పటానికి ముందు సంకోచించినా, అమ్మకు చెప్పుకోపోతే ఎవరికి చెప్పుకుంటామని అమ్మదగ్గర ప్రసాదం తీసుకొని గుంటూరు వెళ్ళారు. మర్నాడు మళ్ళీ జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మకు పాదపూజ చేసుకోమని కొబ్బరికాయలు, పూలు, పళ్ళు ఇచ్చారు. అమ్మ ముందు బట్టలు పెట్టి, అవి కట్టుకు వచ్చి వారిని అర్చించుకోమన్నది. బట్టలు కట్టుకుంటుండగా ఆయన భార్య అమ్మలా కనిపించింది. ఇది ఏమిటి ఆ చీరెను అమ్మ మా ఆవిడకు ఇచ్చింది కదా!" అని అనుకున్నారు. ఆ చీరెను ఎన్నో సంవత్సరాలు వాడినా కలరు తగ్గటం కాని, మెరుపు పోవటం గానీ జరగలేదు. అటువంటి చీరె కొనుక్కోవాలని ఎంతోమంది ప్రయత్నించినా దొరకలేదు.

అమ్మ దగ్గర అవధానం చేయటానికి కూర్చున్నారు. ఆ సభలో అనేక మంది విద్వాంసులు, పండితులు వున్నారు. గొంతు బాగాలేక దగ్గు ఎక్కువగా వస్తూ కళ్ళెతో గొంతు చుట్టుకుపోతుంది. తీరా అవధానం మొదలుపెట్టే సమయానికి గొంతు సరి అయింది. అవధానం రసవత్తరంగా సాగింది. అంతసేపు అమ్మ దగ్గుతో, విపరీతమైన కళ్ళెతో బాధపడింది. అది చూచిన శ్రీ భరతశర్మగారు "నా గొంతులోని బాధను కళ్ళెను నీవు తీసుకొని, నీ గొంతులోని మాధుర్యంతో నా గొంతు నింపేశావమ్మా" అని అర్థం వచ్చేటట్లుగా అమ్మ దగ్గర పద్యం చెప్పారు. ఆయన అమ్మను తల్చుకోగా వారి కన్నతల్లి వారి స్మృతిపథంలోకి వచ్చి గొంతు బొంగురుపోయింది.

శ్రీ భరతశర్మగారు అమ్మ భక్తులు. బులుసు సత్యన్నారాయణ అన్నయ్యకు బజారులో భరతశర్మగారు కనిపించారు. అన్నయ్య తాను అమ్మ దర్శనార్థం జిల్లెళ్ళమూడి వెళ్తున్నానని వారితో చెప్పాడు. వారు వెంటనే "అమ్మకు నా నమస్కారములు చెప్పండి" అన్నారు. జిల్లెళ్ళమూడి వెళ్ళి శాస్త్రి అన్నయ్య అమ్మకు పాదపూజ చేసుకున్నాడు. కానీ భరతశర్మగారి నమస్కారాలు అమ్మకు అందివ్వలేదు.

అమ్మ భోజనం చేసి రమ్మని సంజ్ఞ చేసింది. అక్కడి నుంచీ వాత్సల్యాలయంకు వెళ్ళి భోజనం చేసి ప్రయాణ బడలిక వల్ల నిద్రపోయారు. సాయంత్రం మెలుకువ వచ్చాక భరతశర్మగారి నమస్కారములందచేయాలన్న ఉద్దేశంతో పైకి వెళ్ళి "పేరాల భరతశర్మగారు అడిగానని చెప్పమన్నారమ్మా" అని చెప్పారు.

అది విన్న అమ్మ అన్నయ్యకేసి ఉరిమినట్లుగా 'ఆ' అన్నది. దానితో అన్నయ్య వెంటనే చెంపలు వేసుకొని "అమ్మా! పొరపాటు చెప్పానమ్మా. భరతశర్మగారు నమస్కారాలు చెప్పమన్నారని" భయంతో వణికిపోతూ చెప్పారు. ఆ క్షణంలో అన్నయ్య మనస్సు కుంచించుకుపోయింది. అమ్మ "ఊ" అని ప్రసన్న దృక్కులు ప్రసరించింది. ఇంక ఆ పైఅంతస్తులో వుండలేక క్రిందకు వచ్చేసారు.

క్రిందకు వెళ్ళి గోపాలరావుగారితో జరిగిన సంఘటన తెలియచేసారు. అది విన్న ఆయన "శాస్త్రిగారు! మీరు అమ్మ ఏదైనా అద్భుతం చేస్తే చూడాలని కానీ, అద్భుతం యొక్క అనుభవం కావాలని కానీ కోరుకున్నారా?" అని అడిగారు.

ఏమో! అనుకున్నానేమో, గుర్తులేదు. నా అంతరంగంలో ఏదైనా అట్టి కోరిక ఎప్పుడైనా ఉద్భవించిందేమో" అన్నారు.

"అందుకే మీ జిజ్ఞాస తీర్చడానికి అమ్మ ఈ అనుభవాన్ని మీకు ఇచ్చింది.

దీని వల్ల అమ్మ యొక్క సర్వాంతర్యామిత్వం మీకు తేటతెల్లమౌతుంది" అని గోపాలరావుగారు అన్నారు. "నేను చూడదలిస్తే ఈ గది గోడలు అడ్డుకావు" అన్న అమ్మ మాట గుర్తుకు వచ్చింది. కాకినాడలో శ్రీ భరతశర్మగారింటికి వెళ్ళి జరిగిన సంఘటన తెలియచేసాడు. అది విన్న భరతశర్మగారు అవాక్కు అయినారు.

అమ్మ! దయాకదంబ! సరసాంతరభావరసావలంబ, మా
యమ్మ! జిల్లెళ్ళమూడియె కదమ్మ కదంబవనమ్మునేడు మా
యమ్మలగన్నయమ్మకనులారగ గాంచెడు భాగ్యమబ్బెలే
వమ్మ! కృపం కనుంగొనగదమ్మ! మదంబ! కరావలంబవై ।

అమ్మ దయారసంబును పుక్కిటి బంటిగా గ్రోలిన వారు పేరాల భరతశర్మగారు. ఆ ఆనందంతో అమ్మ మీద అనేక పద్యాలు వ్రాసారు.

+ + +

కవిరాయుని కామేశ్వరరావుగారు విశాఖపట్టణంలో ఆంధ్రా యూనివర్శిటిలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు ఆ కుటుంబం కెనడాలో ఉండి వచ్చారు. గంటి వెంకట్రావు గారింట్లో డాబా మీద కట్టించడానికి సివిల్ ఇంజనీర్ అయిన కామేశ్వర రావుగారిని పిలిచారు. వారింట్లో అమ్మ ఫోటో చూచిన మరుక్షణం నుంచి "నాలో నాకే తెలియని మార్పు గోచరించింది. అమ్మకు నమస్కారములంద చేయమన్నారు" కామేశ్వరరావుగారు "మీరు చెప్పినప్పుడే అమ్మకు ఆ నమస్కారము లందు తాయని నమ్మకంగా చెప్పారు" గంటి వెంకట్రావుగారు వారి నమ్మకం చూచి కామేశ్వరరావు గారు విస్మయ చకితులయ్యారు అమ్మ ఫోటో యిస్తే దాన్ని ఎంతో ఆర్ద్రతతో స్వీకరించారు.

కోటి నామ పారాయణకు కుటుంబంతో విశాఖపట్టణం నుంచి వస్తున్న అమ్మ బిడ్డలందరితో కలసి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అమ్మని చూడగానే ఆయనకు అపరిమిత ఆనందం కలిగింది పూవు కంటే మార్దవంగా వున్న అమ్మను చూచిన

మరుక్షణం నుంచి విపరీతమైన కన్నీరు వాగులా ప్రవహించింది. అమ్మకు నమస్కారం చేసుకుని యాభైరూపాయలు యిచ్చారు. " నాకెందుకునాన్నా! ఆఫీసులో యివ్వు ఏ ఖర్చు కయినా వస్తుందని" అమ్మ చెప్పింది.

ఏనుగు పాదంలో అన్ని పాదాలు ఇమిడినట్లు సర్వదేవతలు అమ్మలోనే వున్నట్లుగా దృశ్య మానమైంది. అమ్మ దగ్గర వున్నపుడు ఆలోచనలన్నీ శూన్యం. ఎటువంటి వికారాలు లేకుండా ఎన్ని గంటలయినా కూర్చోవాలనిపించేది. ఆ స్థానాన్ని వదలి రాలేనంతగా అమ్మ దగ్గర మనసు లయమైపోయింది. ఉద్యోగ, కుటుంబ బాధ్యతల వల్ల వదలి రాక తప్పదు కదా!

జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను దర్శించుకుని విశాఖ వచ్చారు. కానీ అమ్మను వదలి వుండలేక మర్నాడే బయలుదేరి జిల్లెళ్ళమూడి వెళ్ళారు అమ్మతో "నిన్ను చూడాలనిపించి వెంటనే తిరిగి వచ్చానమ్మా" అన్నారు. "కాదు నాన్నా నిన్ను చూడాలని నాకు అనిపించే మళ్ళీ రప్పించుకున్నాను" అని అమ్మ అన్నది. ఆమాట విన్న అన్నయ్య మనసు ఆనంద డోలికలలో వూగినంత హాయిగా అనిపించింది. అమ్మ దగ్గరకు వెళుతూ బంగినపల్లి మామిడిపళ్ళు తీసుకువెళ్లారు. పక్కనే వున్న అయ్యగారి నరసింహరావు గారితో "మామిడి పండు కన్నా తీయనైన మనసురా వీడిది" అని అమ్మ చెప్పింది. అమ్మనోటి నుంచి మన గురించి ఒక్క మాట వచ్చినా మనకు ఏనుగెక్కినంత సంబరం కలుగుతుంది

అమ్మను చూచిన క్షణం నుంచీ మరో దేవుని చూడటం కానీ తలవటం గానీ జరుగలేదు. అంతకు ముందు ప్రతి శనివారం విశాఖలో కొండమీద వున్న వెంకట రమణమూర్తి కోవెలకు సకుటుంబంగా వెళ్ళేవారు. ఒకసారి ఆ పూజారిగారు కనిపించి ఇటు రావటమే మానివేశారేమిటి? అని ప్రశ్నించారు "అమ్మను చూచిన నాటినుంచి ఎవరినీ చూడాలని కానీ, ఎవరినీ పూజించాలని కానీ అనిపించటం" లేదని చెప్పారు.

కెనడా నుంచి తిరిగి వచ్చాక తిరుపతిలో కళ్యాణం జరిపించే మొక్కు తీర్చుకోవటానికి వెళ్ళారు. అక్కడ ఆ కళ్యాణం హడావిడి తిలకించిన అన్నయ్యకు "అక్కడ అమ్మ ఆదరించి అందరికీ అన్నం పెడ్తుంటే ఇక్కడ ఈ కళ్యాణం పేరిట డబ్బు ఖర్చు పెట్టటం అనవసరమేమో" అనిపించింది.

వరంగల్ నుంచి అమ్మ దగ్గరకు తరచూ వచ్చే సమ్మక్క అనే అక్కయ్య అమ్మ దగ్గరకు వచ్చి"తిరుపతి వెళ్ళి వెంకటరమణమూర్తిని అర్చించుకు వస్తానని" చెప్పింది. అమ్మ "సరే" నన్నది తిరుపతి వెళ్ళి వేంకటేశ్వరుని దర్శనానికి వెళితే అక్కడ అమ్మ దర్శన మిచ్చింది. వెంటనే ఆ సంభారాలన్నీ తీసుకుని సమ్మక్క జిల్లెళ్ళమూడి వచ్చింది. ఒక్కొక్క నామానికి ఒక్కొక్క చీర చొప్పున 108 చీరెలతో అమ్మకు అష్టోత్తర పూజ చేపుకుంది. అమ్మ ఏమీ ఎరుగనట్లు "ఏమే తిరుపతి వెళ్ళి తిరిగి వచ్చావేమిటి?" అని ప్రశ్నించింది. తిరుపతిలో నీవే కనిపించావు. కరచరణాదులతో మా ఎదురుగా వున్న నిన్ను వదలి ఎక్కడో వున్న శిలావిగ్రహానికి అర్చన చేయటానికి మనసు ఒప్పక తిరిగి వచ్చేశాను అన్నది. అక్కయ్య పూజ అయిన వెంటనే ఆ చీరెలను అక్కడికి వచ్చిన వారికి, సంస్థలో వున్న వారికి పంచేసింది అమ్మ.

ఒకసారి ఒక ముసలామె అమ్మ దర్శనార్థం వచ్చింది. అమ్మ ఆమె యోగ క్షేమాలన్నింటినీ కనుక్కుని వసుంధరక్కయ్యను ఒక చీరె తెచ్చి పెట్టమంది. లోపలికి వెళ్ళిన అక్కయ్య బయటకు వచ్చి చీరలు లేవని చెప్పింది బీరువాలో వున్న చీర తీసుకురమ్మంది అమ్మ. "నీవు స్నానం చేస్తే మార్చటానికి ఆ చీరె వుంచానమ్మా" అన్నది వసుంధరక్కయ్య. రావలసిన సమయమొస్తే అవే వస్తాయి అని ఆ పట్టుచీరె తెప్పించి ఆ ముసలామెకు కప్పింది అప్పుడు ఆమె ముఖం ఆనంద జ్యోత్స్నలతో వెల్లి విరిసింది. ఆ ఆనందాన్ని వీక్షిసున్న అమ్మ ముఖం వేయిసూర్యుల కాంతితో ప్రకాశించింది.

ఇంతలో గుంటూరు నుంచి పూజ చేసుకోవటానికి ఇద్దరు అక్కయ్యలు

వచ్చారు. పూజ చేసుకుని అమ్మకు చీరెలు పెట్టారు వాళ్ళు. సాధారణంగా ఆ చీరెలను అమ్మ పూజ చేసుకున్న వారికే తిరిగి ఇచ్చేస్తుంది. అలాగే వారికి యివ్వబోతే వారు " నీవు కట్టుకోవాలని తెచ్చామమ్మా!" అని తీసుకోవటానికి నిరాకరించారు. వెంటనే అమ్మ వసుంధరక్కయ్య వంక నవ్వుతూ చూచింది. ప్రక్కనే వున్న మా అందరికీ ఆ దృశ్యం చూచేటప్పటికి అమ్మ అనురాగానికి అవధులంటూ వుండవు కదా! అని అనిపించింది.

కామేశ్వరరావుగారి భార్య శ్రీమతి రాధ. మొదటిసారి అమ్మ దర్శనానికి వెళ్ళినప్పుడు మనస్ఫూర్తిగా ప్రార్థిస్తే తక్షణమే అమ్మ దర్శన భాగ్యం ఎక్కడైనా సరే లభ్యమవుతుందని దత్తు అన్నయ్య చెప్పాడు. నాసిక్ వెళ్ళినప్పుడు దత్తు అన్నయ్య చెప్పినట్లుగా "అమ్మ ఇక్కడ దర్శన మిస్తుందా?" అన్న చిలిపి ఊహ తలెత్తింది. నాసిక్ నుంచీ పంచవటి చూడటానికని ఆటో కోసం నిలబడ్డారు. గులాబీరంగు చీరె కట్టుకొని పెద్దబొట్టు పెట్టుకొని ఒక చేతిలో బట్టలమూట, మరొక చేతిలో కఱ్ఱ పట్టుకొని హడావిడిగా ఒకామె వీరి దగ్గరకు పరుగుపరుగున వస్తోంది. అలా పరిగెడుతోంది ఆమె పిచ్చిదేమో అనుకున్నారు.

వీళ్ళ దగ్గరకు వచ్చిన వెంటనే రాధగారి భుజానికి వున్న ప్లాస్కులాగుతూ "కుచ్ పైసాదేంగే చార్ అణాదేంగే" అంటూ ఆటోలో కూర్చున్న రాధగారి చేయి పట్టుకు లాగింది. ఆమె చేతిలో చిల్లర డబ్బులు పెట్టారు. తీరా అమ్మే ఆ రూపంలో వీళ్ళ శంకను దూరం చేయటానికి వచ్చిందేమో అన్న ఊహ వాళ్ళకు తట్టింది. వెంటనే తిరిగి చూస్తే ఆమె అదృశ్యమైంది. తన కోరిక మన్నించి అమ్మే ఆ రూపంలో వచ్చిందంటుదన్న నిర్ణయానికి వచ్చి సంతృప్తి చెందారు.

జిల్లెళ్ళమూడికి వెళ్ళినప్పుడు ఆ విషయాన్ని అమ్మ దగ్గర ప్రస్తావించారు. పక్కనే ఉన్న ఢిల్లీ ఉషక్కయ్య "ఇలాంటివి దాచుకుంటే ఎలా? అందరికీ తెలియచేయాలని" అన్నది. అది విని అమ్మ చిరునవ్వుతో ఏమీ మాట్లాడకుండా

లోపలికి వెళ్ళింది. కామేశ్వరరావుగారు వాళ్ళ ఇంటిప్లాను తీసుకువెళ్ళి అమ్మకు చూపిస్తే, అటు తిరిగి పడుకుంది. తరువాత "ఎక్కడైనా స్థలం తీసుకోనాన్నా!" అన్నది అమ్మ.

స్టేట్‌బ్యాంకు క్వార్టర్సు భీమిలిలో కట్టినప్పుడు వాళ్ళు డబ్బులిస్తామంటే, డబ్బు వద్దు స్థలం వుంటే ఇమ్మన్నారు. వాళ్ళు 1/2 ఎకరం స్థలం ఇవ్వటం జరిగింది. ఆ తరువాత వేరే ప్లాను తీసుకువెళ్ళి అమ్మకు చూపించారు. "నాన్నా పైన కూడా వేయరా" అన్నది అమ్మ. మొదటి దానికి "మొగుడు లేడు కడదానికి కళ్యాణం" అని మనస్సులో అనుకొని "క్రిందవేయటానికే డబ్బు లేదమ్మా" అన్నారు. "యూనివర్శిటీ అప్పు ఇస్తుందిగా?" అన్నది. "స్కూటర్ లోన్ వుందమ్మా. అది తీరితే కాని ఇవ్వరు" అన్నారు. కానీ అమ్మ నోటి వెంట వచ్చింది కదా అని లోన్‌కు అప్లై చేసారు. ఈయనకు ముందుగా లోన్ పెట్టినవాళ్ళు డ్రాప్ అవ్వటంతో పాతలోను రూ.1600/- లు కడితే రూ.25000/- ఇచ్చారు.

యూనివర్సిటీ వాళ్ళు ఇచ్చిన 25వేలు, ఆయన దగ్గర 25వేలు కలిపి ఇల్లు ప్రారంభించారు. ఈ లోగా సింమెంట్, ఇనుము, కలప వాళ్ళు పై అంతస్థుకు కూడా కలిపి తీసుకోండి అని ఆఫర్ చేసారు. ఈ రోజుల్లో డబ్బు పెడితే కాని ఏవస్తువు బయటకు రాదు కదా! అటువంటిది అమ్మ దయవల్ల ఇల్లు పూర్తి అయిందని వాళ్ళ విశ్వాసం. అమ్మ ముందుగా స్థలం కొనునాన్నా అన్నది కదా! దాని అవసరం ఇప్పుడు ఏర్పడింది. భీమిలీ లోని స్థలం అమ్మి వాళ్ళకు డబ్బు కట్టేశారు.

అమ్మకు బంగారు పట్టీలు చేయించాలన్న సంకల్పం కామేశ్వరరావుగారికి కలిగింది. అప్పట్లో ఆయన జీతం నెలకు రూ.4000/- మాత్రమే. అందుకోసం అమ్మ పెట్టుకునే పట్టీలు తీసుకువచ్చి నెల రోజులు వాళ్ళ ఇంట్లో వుంచటం జరిగింది. ఆయన చేసిన కాంట్రాక్టులో రూ.10,600/- వచ్చింది. అమ్మ

వారికి కాబట్టి మజూరీ తీసుకోనని మంగళగిరి కొత్త అబ్బాయి గారు చెప్పారు. పట్టీలు తూకం వేస్తే బంగారంకు సరిగా రూ. 10,600/- అయింది. పట్టీలకు సరిపడా డబ్బు అమ్మే తెచ్చుకుందని ఆయన పూర్తి విశ్వాసం.

వజ్రోత్సవాలప్పుడు పెద్ద కొడుకు సుబ్బారావు ఇంట్లో వుంది అమ్మ. వీళ్ళు పట్టీలు పట్టుకు వెళ్ళారు. కాళ్ళకు నువ్వే పెట్టుకో నాన్నా! అని రెండు పాదాలు ముందుకు చాచింది. వాళ్ళు ఆపాదాలకు అభిషేకం చేసుకొని, తుడిచి స్వయంగా అలంకరింప చేసారు. ఆ విధంగా జరుపుకోటానికైనా అవకాశం అమ్మే ఇవ్వాలికదా! అమ్మ సిద్ధి పొందినప్పుడు ఆ పట్టీలు, ఇంజనీర్ తాతయ్యగారిచ్చిన గాజులతోనే అమ్మ సమాధి అయింది.

వైజాగ్ వాళ్ళంతా కలిసి అమ్మ పుట్టిన రోజు వేడుకలకు వెళ్ళాం. రాధకు విపరీతమైన ఆయాసం. అది చూచిన మాకు ఆవిడ బతికి బట్టకడుతుందన్న నమ్మకం కలగలేదు. శ్రీమాతా బిల్డంగ్‌కు వెళ్ళిన వెంటనే "రాధ గారు ఎవరు" అంటూ ఒక స్టూడెంట్ వచ్చి రాధనే అడిగింది. "నేనే" అని చెప్పింది. అమ్మ మీకు కాఫీ పంపించారని చెప్పింది. అది విన్న రాధ మనస్సు ఆనందంతో పరవళ్ళు తొక్కింది. అతి కష్టం మీద స్నానం చేసి అమ్మ దర్శనానికి వెళ్ళింది. "ఎందుకమ్మా! అంత కష్టపడి వచ్చావు. ఇంకెక్కడికీ వెళ్ళక ఇక్కడే వుండమన్నది" అమ్మ.

"శ్రీమాతా" అని వైజాగ్ వాళ్ళు కట్టించిన బిల్డింగ్‌కు పేరు పెట్టింది అమ్మ. లలితా సహస్రనామాలలో మొదటి నామమైన శ్రీ మాతా బిల్డింగ్ కడ్తున్నప్పుడు పదిరోజులుందామని వెళ్ళినవాళ్ళు నెల రోజులున్నారు. రాధ ఆయాసానికిక మందులు పని చేయవురా ! అన్నది అమ్మ. అదే మాటను డాక్టర్లు అంతకు ముందే చెప్పారు. "కోడి గుడ్డు తీసుకోమని" అమ్మ చెప్పింది. రాధకు విపరీతమైన ఆచారం. గుడ్డు అంటేనే పడదు. దానితో అయిష్టంగా ముఖం పెట్టింది. అది చూచిన అమ్మ "నన్ను తలుచుకొని మందుగా తాగమ్మా!

అని మొదటిసారిగా నాటు గుడ్డు తెప్పించి స్వయంగా తానే రాధనోట్లో పోసింది. ఆ నెల రోజుల్లో రాధ ఆరోగ్యం కుదుటపడింది. మళ్ళ ఎటువంటి కంప్లైయింట్ లేకుండా హాయిగా ఉండకల్గటం అమ్మ అనుగ్రహ ప్రభావమే.

ఇంజనీరింగ్ అయిన వాళ్ల అబ్బాయి రామకృష్ణ మయామి ఫ్లారిడా యూనివర్సిటీకి అప్లికేషన్ పెట్టి దాని గురించి మర్చిపోయాడు. ఆ యూనివర్శిటీ వాళ్ళే ఇతన్ని కాంటాక్టు చేసి రమ్మన్నారు. రెండు సెమిష్టర్లు రాసాక ఉద్యోగం ఇంటర్వ్యూ లేకుండానే వచ్చింది. అందులో వుండగానే యూనివర్సిటీ వాళ్ళు మిగిలిన సెమిష్టర్లు కంప్లీటు చేసుకోవటానికి పర్మిషన్ ఇచ్చారు. సాధారణంగా అక్కడ పూర్తి డిగ్రీ వుంటే కానీ ఉద్యోగం రాదు. కానీ అతనికి అటు చదువు ఇటు ఉద్యోగం రెంటిని సమకూర్చిన అమ్మ వరప్రదాయిని.

వీసాకు ప్రయత్నం చేస్తే మొదటి రోజు ఇవ్వలేదు. రెండోరోజు "భారం నీదే నమ్మా! అని నమస్కారం చేసుకొని ఏం చేయదల్చుకున్నావో" అని వెళ్ళారు. "నిన్న వచ్చావు కదా!" అని అక్కడి వాళ్ళు అన్నారు. 'అవును' అని చెప్పాడు. "మీ నాన్నగారు ఏంచేస్తుంటారని" అడిగారు. "ఆంధ్రాయూనివర్సిటీ సివిల్ ఇంజనీరింగ్ విభాగంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారని" చెప్పాడు. ముందురోజు లేదన్న వ్యక్తే ఎటువంటి అడ్డంకీ చెప్పకుండా వీసా ఇచ్చాడు. మరి ఏ శక్తి అడ్డుపడి ఇప్పించిందో దేముడికే ఎరుక. "ఆ దేముడే" మన అమ్మ.

కామేశ్వరరావు గారు అమ్మతో "నిన్ను తల్చుకున్నప్పుడల్లా నాకు కన్నీళ్ళు రావాలని" అడిగారు. అమ్మది 'సరే' మంత్రం కదా! ఇప్పటికీ ఆయన జ్ఞాపకాలలో అమ్మ నడయాడినప్పుడల్లా, కన్నులు అశృవులతో నిండిపోవటం చూచిన ఎవరైనా ఆశ్చర్య పడకమానరు అంత ప్రొఫెసర్ ఏమిటి? ఈ రకంగా కన్నీరు కార్చటమేమిటి? అని ప్రతి నిమిషం అమ్మ దయకు తార్కణమే అన్న నమ్మకం ఆ దంపతులకు. పార్వతీపురంలో ఒక కాలేజీ, హాస్టల్సు కట్టిస్తున్నారు ప్రతి నిమిషం అమ్మే చూచుకుంటుందన్న విశ్వాసంతోనే అంత పెద్ద వెంచర్ తీసుకున్నారు.

\+ + +

సరస్వతి అక్కయ్య అప్పారావన్నయ్య విశాఖ నివాసులు. జిల్లెళ్ళమూడమ్మ రాజరాజేశ్వరీ అవతారమే అని అందరూ చెప్పుకున్నది విన్నది మొదలు ఎలాగైనా అమ్మను చూడాలన్న తపన సరస్వతక్కయ్యకు ఎక్కువైంది. అవతారమూర్తులైన రాముడిని, కృష్ణుడిని చూడలేక పోయినా కలియుగంలో రాజరాజేశ్వరీ అవతారమైన అమ్మను చూడలేకపోతే జన్మ వృధా అని భావించింది. ఇంక ఒక్క రోజు కూడా ఆగలేకపోయింది. విజయదశమి మర్నాడు చింతపల్లి నుండి తెల్లవారు ఝూమున బస్సులో బయలుదేరింది అక్కయ్య. తపన ఇంట్లోవారికి చెప్పకుండా, చంటిపిల్లవాడ్ని కూడా వదిలేసి మరీ వెళ్ళేవరకు చేరింది. బస్సు ముందు త్రిశూలం పట్టుకొని, జుట్టు విరబోసుకుని అమ్మ నడుస్తూ కనిపించింది.

విజయవాడలో బాపట్లకు వెళ్ళే రైలును తోటివాళ్ళు ఎక్కించారు. మాతృశ్రీ ప్రెస్‌కు వెళ్ళింది. వాళ్ళ ప్రెస్‌లో తన చేతి సంచి పెట్టుకుని పైకి వెళ్ళి పడుకుంది. ఆ రాత్రి 11గం|| లకు మట్టెలు, గజ్జెలు చప్పుడు వినిపించింది. తీరా లేచి చూస్తే ఎవ్వరూ కనిపించలేదు. అవతారమూర్తియైన అమ్మ ఎక్కడైనా కనిపించగలదు. ఎక్కడికైనా వెళ్ళగలదని అనుకుంది.

మర్నాడు ప్రొద్దున వ్యానుకు బయలుదేరింది. పక్కనే జిల్లెళ్ళమూడిలో పూలు అమ్ముకునే అమ్మాయి కూర్చుని అమ్మ గురించి ఎన్నెన్నో విశేషాలు తెలియచేసింది. దానితో అక్కయ్య తాపత్రయం ఇంకా ఇనుమడించింది. అమ్మ దర్శనం ఇస్తారన్న గంటమ్రోగగానే మొదటి వరుసలో కూర్చుంది. సర్వాలంకార భూషితయై కంచి పట్టుచీరెతో అమ్మ దర్శనమైంది. అమ్మను చూడగానే ఒళ్ళు పులకరించి కళ్ళనీళ్ళు జాలువారాయి.

అమ్మకోసం పసుపుకొమ్ములు, తేనె, జాకెట్టుగుడ్డ పట్టుకు వెళ్ళింది. ఆ తేనె అమ్మ చేతిలో వేసుకుని రుచి చూచింది. ఇలాంటి తేనె ఇంతమటుకు తినలేదని అమ్మ అనటంతో సరస్వతక్కయ్య పరవశురాలైంది. వెంటనే

అక్కయ్యకు కుచేలుని అటుకులు తిన్న కృష్ణపరమాత్మ జ్ఞప్తికి వచ్చాడు. అక్కయ్య రెండు రోజులుంది. అమ్మ అక్కయ్యను రమ్మని కబురు చేసింది. అక్కయ్య పాలగ్లాసుతో వెళ్ళింది. అప్పటికే అమ్మ పాలు తాగుతోంది. అందులోని పాలు కొన్ని అక్కయ్య తీసుకుని వెళ్ళిన గ్లాసులో పోసి తాగమంది. మహాప్రసాదంగా భావించి అక్కయ్య వాటిని తాగింది.

"అమ్మా నిన్ను చూడాలన్న తపనతో ఇంట్లో చెప్పకుండా చంటిపిల్లవాడ్ని కూడా వదలి వచ్చాను. ఇంక వెళ్తానమ్మా"! అన్నది. "హైమ పుట్టినరోజు పదిరోజులలో వుంది. దానికి ఇంట్లోచెప్పి, చంటిపిల్లవాడ్ని తీసుకురామ్మా" అన్నది అమ్మ. వసుంధరక్కయ్య చేత చీర తెప్పించి పెట్టి, తనమెడలో దండ, తనచేతి రెండు గాజులు యిచ్చింది, తెల్లచీర మీ పెద్దమ్మాయికి యివ్వు రెండవ అమ్మాయి చీరలు కడుతుందా అని కనుక్కొని మరో చీరయిచ్చింది. అక్కయ్యకు తెల్ల చీరెలంటే తగని మక్కువ. దానితో ఆచీర తను వుంచుకుని అమ్మయిచ్చిన చీరను వాళ్ళ పెద్దమ్మాయికి ఇద్దామనుకుంది. వెంటనే అది గ్రహించిన అమ్మ "తెల్లచీర పెద్దమ్మాయికే యివ్వు అది మారుతుంది" అని చెప్పింది.

పుట్టింటికి వచ్చిన ఆడపిల్లకు చీరసారె పెట్టినట్లు పెట్టి అక్కయ్యను పంపించింది అమ్మ. అక్కయ్య ఒకచేతి సంచితోనే వెళ్ళింది అందుకని అమ్మ తను పెట్టినవి పెట్టుకునేందుకు తనదిండు గలీబు యిచ్చింది.

హైదరాబాద్ నుంచి వాళ్ళ అన్నయ్య రమ్మని ఫోన్ చేశాడు. చంటి పిల్లవాడ్ని తీసుకుని హైదరాబాద్ వెళ్ళి ఒక్కరోజులోనే తిరిగి జిల్లెళ్ళమూడికి వచ్చింది. వాళ్ళ అన్నయ్య బావామరిదికి పెళ్ళి అయి 15సం॥లు అయినా పిల్లలు లేనందున వాళ్ళను అక్కయ్య అమ్మ దర్శనానికి తీసుకువెళ్ళింది. అమ్మను దర్శించి వాళ్ళు చీరాల వెళ్ళిపోయారు. చీరాల వెళ్ళిన తరువాత ఆవిడ నెలతప్పటం బాబు పుట్టటం జరిగింది. వాళ్ళకు అమ్మయందు ఎనలేని గురి

కుదిరింది. ఆపట్టు 21రోజులు అమ్మ దగ్గర వుంది. సంధ్యావందనం చేస్తుండగా వాళ్ళబ్బాయి జనార్థన్, వసుంధరక్కయ్య చెల్లెలు అమ్మాజీ ఆడుకుంటున్నారు. పిల్లవాడు పడిపోయాడు, అక్కయ్య కూర్చున్న చోటునుంచి కదలకుండా సంధ్యావందనం చేస్తోంది. అమ్మ కుర్చీలో నుంచి లేచి పిల్లవాడ్ని తీసుకుని నెత్తురు కడిగి తన ఒళ్ళో కూర్చోబెట్టుకుంది. "నాన్నా అమ్మను కొడదామా!" అని అమ్మ అడిగింది. వాడు అమ్మను కొట్టద్దన్నాడు." మీ అమ్మను కొడితే దేవతలు దిగివస్తారని" అన్నది.

అమ్మ అక్కయ్య కుటుంబ విషయాలు అడిగి తెలుసుకుని వస్తున్న డబ్బు సరిపోతోందా? నీకు ఏంకావాలి? అని రెట్టించి అడిగింది. పిల్లల పెళ్ళిళ్ళు చెయ్యాలమ్మా అన్నది. అమ్మ దయవల్ల 6నెలల్లో ముగ్గురి కూతుళ్ళ పెళ్ళిళ్ళూ జరిగాయి. ప్రకాశరావుగారు చింతపల్లి నుంచి అమ్మ దగ్గరకు వెళ్ళి సరస్వతక్కయ్య రాలేదమ్మా! అన్నాడు. దానికి అమ్మ "కూతుళ్ళ పెళ్ళిళ్ళు అయినాయి కదా ఇంక ఎందుకు వస్తుంది" అన్నది. కానీ తనదగ్గరకు రప్పించుకోవలసింది అమ్మేకదా! అమ్మకు తెలియదా?

అమ్మ సన్నిధిలో 21రోజులుండటం అక్కయ్య దృష్టిలో మహాయోగం. అమ్మ "హాయిగా ఇక్కడే వుండు" అన్నది. అది కార్తీకమాసం. సుప్రభాత, సంధ్యావందనాలు, పూజలతో ఆ 21రోజులు గడిచాయి. ఒకరోజు సుశీలక్కయ్య అమ్మకు స్నానం చేయిస్తూ సరస్వతక్కయ్యను పిలిచి అమ్మకు నీళ్ళు పోసుకో అని చెప్పింది. మూడు బిందెల నీళ్ళతో అమ్మను అభిషేకించుకున్న ధన్యాత్మురాలు. తనపై అమ్మకు గల పరిపూర్ణమైన అనుగ్రహంగా భావిస్తుంది అక్కయ్య. ఆసమయంలో మూడు రోజులు అమ్మ బట్టలు ఉతికే అదృష్టం అమ్మ అక్కయ్యకు ప్రసాదించింది.

విశాఖ నుంచి అమ్మ దగ్గరకు వెళ్ళిన ప్రతివారింటికీ వెళ్ళి అమ్మ అనుగ్రహభాషణముల గురించి తెలుసుకుని ఆనందపడేది సరస్వతక్కయ్య.

గంటి వెంకట్రావుగారింటికి వెళ్ళినపుడు అమ్మ గురించి చెబుతూ రోజుకు 11సార్లు లలితాసహస్రనామ పారాయణ అమ్మ చేయమందని చెప్పారు. అప్పటినుంచి అక్కయ్య కూడా రోజుకి 11సార్లు చొప్పన 40 రోజులు మండలదీక్ష తీసుకుని ఎంతో నిష్ఠగా చేసింది. భ్రమరాంబక్కయ్య చేత పట్టుచీర, జాకెట్టు, కుంకుమ ప్రసాదం అమ్మ అక్కయ్యకు పంపించి తన యొక్క వాత్సల్య సుధను అక్కయ్యపై కురిపించింది.

నిండుపౌర్ణమినాడు పండు వెన్నెలలో ఆదిదంపతులైన అమ్మ నాన్నగార్లకు సరస్వతక్కయ్య దంపతులు పూజ చేసుకున్నారు. శ్రీసూక్త సహిత అంబికా ష్టోత్తరం చేసుకున్నారు. ఆ తరువాత రాధన్నయ్య అమ్మ కథను శ్రావ్యంగా గానం చేశాడు. అమ్మ కూడా అంతసేపు ఆనందంగా అందరికీ దర్శన మొసగింది. మళ్ళీ 4సం॥ల అనంతరం అమ్మ దగ్గరకు వెళ్ళింది. అమ్మ దగ్గర కూర్చుంటే తన పాదాల దగ్గరకు రమ్మని అమ్మ ఎడంకాలు అక్కయ్య శిరస్సు మీద పెడ్తూ "నీవేమీ బాధపడవద్దు. నేను నీతోవుంటాను, నీవు నాలోనే వుంటావని" చెప్పింది. పూజానంతరం అక్కయ్య తాంబూలంలో 11రూపాయలు పెట్టి ఇచ్చింది. అది రామకృష్ణ అన్నయ్యకు ఇచ్చి "నా ఎకౌంటులో వేయినాన్నా" అని ఇచ్చింది.

చివరిసారిగా 'మే'నెలలో అమ్మను భౌతికంగా దర్శించుకుంది. అప్పుడు అమ్మ తాను వాడుతున్న పాదుకలను అక్కయ్యకు ప్రసాదించి అక్కయ్యను పొదివిపట్టుకుని భాష్పధారలు వర్షించు చుండగా పమిట నిండుగా కప్పుకుని అరుణ నయనాలతో అమ్మ అక్కయ్యకు వీడ్కోలు పలికింది.

జన్మజన్మల సుకృతం ఒక్కసారిగా ఫలించి అవతారమూర్తి యైన అమ్మ దర్శన స్పర్శాదులతో పునీతులై జీవితాంతమూ ఆమధుర స్మృతులను నెమరు వేసుకుంటూ హాయిగా గడిపి సునాయాసంగా అమ్మలో కలసిపోవాలనే అక్కయ్య చిన్ని కోరికను అమ్మ మన్నించి అనుగ్రహిస్తుందని అక్కయ్య ప్రగాఢ విశ్వాసం.

+ + +

చాగంటి శరభలింగం గారు విశాఖ వాసులు. హిందూస్థాన్ జింక్‌లో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర:గా పనిచేసారు. శ్రావణ శుక్రవారం నాడు ఆయన స్నేహితులు ఐ.రామకృష్ణ గారు 'డివైన్ మదర్' అంటూ జిల్లెళ్ళమూడి అమ్మ గురించి, చెప్పి మీరు తప్పక అమ్మను దర్శించుకోమని మరీ మరీ చెప్పారు. ఆరోజు శరభలింగం గారి భార్య సువర్చల మధ్యాహ్నాం పడుకున్నప్పుడు 10 సం॥ల పిల్ల పట్టుపరికిణీ కట్టుకొని సర్వాభరణాలు ధరించి, పెద్ద బొట్టుపెట్టుకుని మీ ఇంటికి వచ్చానని కలలో" చెప్పింది. ఆ విషయం అత్తగారితో చెపితే "శ్రావణ శుక్రవారం పూజ చేసుకున్నావు కదా! ఆ ఆలోచనతో వున్నందున అలా వచ్చి వుంటుందని" అన్నారు.

రామకృష్ణ మరీ మరీ చెప్పాడని శెలవు పెట్టుకు వెళ్దామని ఎంత ప్రయత్నించినా కుదరలేదు. ఒక రోజు ఉదయం నిద్ర లేవగానే 5 సం॥ల వాళ్ళ అమ్మాయి 'ఇందూ' మీరు జిల్లెళ్ళమూడి ఎందుకు వెళ్ళలేదని" ప్రశ్నించటంతో ఆశ్చర్యపోయారు. చిన్నపిల్లవునీకెందుకు? అన్నా మళ్ళీ మళ్ళీ ఆ విషయమే రెట్టించింది. దానితో వారు ఆలోచనలో పడ్డారు.

ఆఫీసుకు వెళ్ళిన తరువాత వాళ్ళ ఆఫీసరు పిలిచి నాగపూర్ వెళ్ళి ఆఫీసు పనిచేసుకురమ్మన్నారు. అంతకు ముందు ఎంతో మంది వెళ్ళినా జరగనిది తను వెళితే అవుతుందా! అన్న అనుమానం వచ్చింది. అమ్మ గుర్తుకు వచ్చింది. నాగపూర్:లో పని అవ్వగానే జిల్లెళ్ళమూడి వస్తానని అనుకున్నారు. అదేమి చిత్రమో? ఆయన వెళ్ళిన వెంటనే పని సజావుగా జరిగిపోయింది.

నాగపూర్ నుంచీ వచ్చిన వెంటనే జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అక్కడ సువర్చల గారికి అమ్మ పది సం॥ల పిల్ల మాదిరిగా కనిపించింది. అమ్మ ఆమెతో "మీ ఇంటికి ఆగష్టులోనే వచ్చానని" చెప్పింది. రెండు నెలలు ముందుగానే తమ ఇంటికి వచ్చినా తెలుసుకోలేకపోయామని దిగులు పడింది. అమ్మకు నమస్కారం చేసుకుంటూ మనస్సులో ఏదో ఒక విషయమై మదన

పడింది. వెంటనే దానికి తగిన జవాబు స్ఫురించింది. దానితో ఆమెకు అమ్మ యందు ఎనలేని నమ్మకం కుదిరింది.

వెంకటరమణమూర్తి ఫోటో పట్టుకొని ఇద్దరు చిన్నపిల్లలతో ఒక అమ్మాయి "తిరుపతి వెళ్తున్నాం. జోగి దండుకుందుకు వచ్చానని" శరభలింగం గారితో చెప్పింది. ఆయన ఐదు రూపాయలు ఇచ్చారు. అన్ని ఇళ్ళకు వెళ్ళను. 25 రూ॥ ఇవ్వమని అడిగింది. "మాకు తోచింది ఇస్తాము కాని ఇంత అని ఏముందని" అన్నారు. అయిన వాళ్ళింటికే వెళ్తాను. అయిన వాళ్ళనే గుర్తుపట్టలేరా? అన్నది. "నీవు ఎవరితాలూకు?" అని అడిగారు. సుబ్బారావు చెల్లెల్ని నన్నే గుర్తు పట్టలేదా?" అన్నది. క్వార్టర్సులో ఎవరైనా ఎమో అనుకొని 25/- ఇచ్చారు. అమ్మ పెద్ద కుమారుడు శ్రీబ్రహ్మాండం సుబ్బారావు గుర్తుకు రావటంతో ఒకవేళ హైమక్క అయి వుంటుందన్న అనుమానమొచ్చి ఆ ప్రక్క వాళ్ళనీ, ఈ పక్కవాళ్ళని అడిగారు. అలాంటివారు ఎవరూ రాలేదని" అన్నారు. వెంటనే స్కూటర్ వేసుకొని 4 వీధులు తిరిగారు. ఎక్కడా ఎవ్వరూ కనిపించలేదు. హైమక్కే వారి ఇంటికి వచ్చి దర్శనమిచ్చిందని పరమానంద భరితులయ్యారు.

తిరుపతి వెళ్ళినప్పుడు వాళ్ళ అమ్మాయి ఇందూకు విమాన వెంకటేశ్వర్లుని చూపించటానికి వెళ్ళారు. అక్కడ ఒక పెద్ద ముత్తైదువు కూర్చుని వుంది. "ఎక్కడ నుంచీ వచ్చారమ్మా?" అని అడిగారు. "అజ్మీరు, త్రివేణీ సంగమం, కుంభమేళా అన్ని యాత్రలు చేసి తిరుపతి వచ్చాను" అని చెప్పింది. "మీకు జిల్లెళ్ళమూడి అమ్మ తెలుసా? అక్కడికి ఎప్పుడైనా వెళ్ళారా?" అని అడిగారు. "శ్రీబ్రహ్మాండం నాగేశ్వరరావు గారికి అన్నం పెట్టింది నేనే, నన్నే గుర్తుపట్టలేదా? అని అన్నది ఆమె. వెంటనే ఆయనకు గుర్తురాలేదు. వయస్సు, బొట్టు మాత్రం అమ్మవి లాగానే వున్నాయి. "నాకు కొంత డబ్బు అవసరం, ఇమ్మని" అడిగింది. 100 రూ. ఇచ్చి సరిపోతుందా? అని అడిగారు. "సరిపోవటానికి అంతేముంది. సరిపెట్టుకోవటమే" అని లోగడ జిల్లెళ్ళమూడి అమ్మ పలికిన

పలుకులనే పలికింది. దానితో ఆ స్త్రీమూర్తి అమ్మే అని అమ్మ తదనంతరం తనకు దర్శనమిచ్చిందని మురిసిపోయారు శరభలింగం గారు.

రాత్రి 10 గం॥లు అవుతోంది. తలుపులు వేసేస్తారు కదా! అన్నారు. "నాకు తలుపులు అడ్డు కావు నాన్నా! అని ఆయనకు పాపకు బొట్టుపెట్టి అక్షింతలు వేసి, మీ ఆవిడకు స్నానం అయ్యాక వేయమని అక్షింతలు ఇచ్చింది."

జిల్లెళ్ళమూడిలో శ్రీమాతా బిల్డింగ్ నుంచీ అమ్మ దర్శనానికి వెళ్తూ సువర్చనల గారు లెక్చరర్స్ క్వార్టర్సుకు మధ్యలో మెట్లు కట్టి వుండటం చూచి "క్వార్టర్స్ అందమేపోయిందని" అనుకున్నారు. అమ్మ దగ్గర కూర్చున్నప్పుడు శరభలింగం గార్ని చూస్తూ "నీలాంటి ఇంజనీర్లు చెపితేనే మధ్యలో మెట్లు పెట్టించాం నాన్నా! నేనేమీ ఇంజనీర్‌ను కాదు కదా! నాకు తెలియటానికి" అన్నది. ఆమాటతో సువర్చల గారికి దిమ్మ తిరిగిపోయింది. తన మనస్సులో మాట గ్రహించి అమ్మ జవాబు ఇచ్చిన తీరుకు ముగ్ధురాలైంది. ఏమిటి? ఈ అమ్మ మనస్సులో దూరి చూడగలదని, అమ్మ సర్వాంతర్యామి అని, అమ్మ కానిది ఏదీ లేదని ఆమెకు విశ్వాసం కుదిరింది.

వాళ్ళ అబ్బాయికి కాలేజీలో సీటు గురించి మల్లగుల్లాలు పడ్తున్నారు. ఆమె బాధపడ్తుంటే అమ్మ కలలో కనిపించి "ప్రదక్షణాలు చేయమంది. అలాగే ప్రదక్షణాలు చేసారు. వాళ్ళ బాబుకు అమ్మ అనుగ్రహం వల్ల సీటు వచ్చింది. సీటు వచ్చిన సందర్భంగా గుళ్ళల్లో కొబ్బరికాయలు కొట్టాలని ముందుగా లలిత కోవెలకు వెళ్ళారు. పూజారి నిర్మాల్యం తొలగిస్తుంటే ఒక ప్రక్కగా నిలబడ్డారు. అలా వూరికే నుంచోకపోతే ప్రదక్షణాలు చేయరాదా? అని ఎవరో అన్నారు. వీళ్ళ తెల్లబోయిచూస్తుంటే "నేనుగా అనలేదు ఏదో దివ్య శక్తి నాచేత అలా పలికించిందని" అన్నారు. దానితో వీళ్ళు జిల్లెళ్ళమూడి అమ్మే అలా పలికించి వుంటుందని" అన్నారు. పని జరిగినా ప్రదక్షణాలు మానవద్దని అమ్మ ఆదేశించింది అని అనుకున్నారు. కుంభాభిషేకంకు జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడూ హైమాలయంలో ప్రదక్షిణాలు చేసారు.

అమెరికాలో ఉన్న వాళ్ళ ఇందూకు అమ్మ కనిపించి "నా ఫోటో ఏదే" అని అడిగింది. మనం మరిచినా తాను మరువద్దు మనల్ని మంచి పంథాలో అమ్మే నడిపిస్తుంది. శరభలింగం గారు ఇల్లు కట్టించాలనుకున్నప్పుడు అనేక ఆటంకాలు ఎదురైనాయి. చేతిలో డబ్బు వుండి శెలవు పెట్టుకున్నా ఏ పని సక్రమంగా జరుగక అనుకున్న దానికంటే చాలా ఆలస్యమవుతోంది. దాని గురించి మదన పడ్తుంటే వారి అత్తయ్య, మావయ్య కల్లోకనిపించి "సుందరాకాండ పారాయణ చేస్తే అన్ని ఆటంకాలు తీరుతాయని" చెప్పారు. నవంబరు 30 వ తే॥ తెల్లవారు ఝామున మొదలు పెట్టి ఉదయం 8.30 ని॥లకు 34 సర్గలు, మధ్యాహ్నం 17 సర్గలు రాత్రి 17 సర్గలు మొత్తం 68 సర్గలు అమ్మను తలుచుకొని ఒక్కరోజులోనే పూర్తి చేసి అమ్మకే అర్పించారు.

ఆ తరువాత ఎట్టి ఆటంకం లేక ఇంటి పనిచురుకుగా సాగుతోంది. శ్లాబ్ వేయటానికి సిమెంట్ రానందున ఆఫీసు పనిమీద హైద్రాబాద్ వెళ్ళారు. అక్కడ ఒకామె ఈయన్ని చూచి పకపకా నవ్వటం మొదలుపెట్టింది. ఈయన ఆశ్చర్యంతో తలమునకయ్యారు. "ఏరా నన్ను పోల్చుకోలేదా?" అన్నది ఆమె "అమ్మను పోల్చుకోకపోవటమేమిటని అసంకల్పితంగా ఆయన నోట వచ్చింది." "గుడి కట్టించావు ఇంటికి శ్లాబ్ వేశావు కదా!" అన్నది ఆమె. ఇంకా శ్లాబ్ వేయలేదమ్మా" అన్నారు. శ్లాబ్ పూర్తి అవుతోందని, పూర్వంలా జిల్లెళ్ళమూడి రావటం లేదేమని అడిగి, అమ్మకు, ఆయనకు మధ్య జరిగిన విషయాల గురించి చెప్పేటప్పటికి అవాక్కు అయ్యారు.

శుక్రవారం వైజాగ్ వచ్చే వరకూ ఇంటికి శ్లాబ్ వేసిన విషయం ఆయనకు తెలియదు. కానీ అమ్మ ఆమె ద్వారా శ్లాబ్ వేసిన రోజే తెలియచేసింది. ఆయా తరుణాల్లో ఆయా పనులు చేయించటమే 'కరుణ' అని అమ్మ అంటుంది కదా! అమ్మ కరుణ ఏ రూపంలో అనుగ్రహింపబడుతోందో మనకు తెలియదు ఆ దంపతులు మనసా, వాచా కర్మణా, అమ్మను అర్చించుకుంటున్నారు.

ప్రతి నిమిషం అమ్మ మనల్ని కనిపెట్టుకు వుంటుందని వారి విశ్వాసం. జాస్‌గుడాలో చేస్తున్న ఆయన తిరిగి వైజాగ్ చేరటం అమ్మ దయే కారణం. అమ్మ కార్యకలాపాలలో ఎక్కువగా పాల్గొనాలనే ఆకాంక్ష వున్న వ్యక్తులు. దీనిని అమ్మ సఫలీకృతం చేస్తుందని వారి విశ్వాసం.

+ + +

గురు భాగవతుల సన్యాసిరావుగారు విశాఖ నివాసి. ఆయన హైదరాబాద్ హోటల్ లో ఉండగా అమ్మ దర్శన మొసగింది. ఈమె ఎవరో ఏమిటోలే అని ఆ విషయాన్ని అంతటితో వదిలేసారు. విశాఖలో పోస్టుమాష్టరుగా చేస్తున్న ఎ.వి.వి ప్రసాదరావు గారి దగ్గరకు వెళ్తుండే వారు. ఆయన సన్యాసిరావు గారిని అమ్మ దగ్గరకు వెళ్ళమన్నారు. ఆ రోజుల్లో మాష్టారుగారు ఎందరినో అమ్మ దర్శనం చేసుకోమనేవారు. శుక్రవారం పూజ స్కీములో పలువురిని చేర్పించారు. సన్యాసిరావు గారికి ఒక ఉత్తరం యిచ్చి రామకృష్ణ అన్నయ్యకు ఇమ్మన్నారు.

రామకృష్ణ అన్నయ్య ఆయనకు ఉండటానికి వసతి కల్పించి అమ్మ దగ్గరకు తీసుకు వెళ్ళాడు. అమ్మ పసుపు పచ్చని కంచి పట్టు చీరలో మధుర మనోహర మనోజ్ఞంగా పచ్చగా వెలిగిపోతూ దర్శన మిచ్చింది. అమ్మను చూచిన తక్షణమే ఆశ్చర్యపోయాడు. ఎన్నో సం॥ ల క్రితం హైదారాబాద్ హోటల్‌లో దర్శన మిచ్చిన మహనీయమూర్తి తన కనుల ముందు ప్రత్యక్షమయ్యేటప్పటికి మనసు మూగబోయింది. అమ్మకు నమస్కరించగా కరెంటు షాకు కొట్టినట్లయి తనలో తనకే తెలియని మార్పు చోటు చేసుకుంది. అమ్మ సన్నిధిలో అనిర్వచనీయమైన శాంతినీ, హాయినీ, పుక్కిటి బంటిగా అందుకుని విశాఖకు తిరిగి వచ్చాడు.

అప్పటి నుంచి ప్రతి సంవత్సరమూ అమ్మను దర్శించుకునే వాడు. కేశవన్నయ్య విశాఖ రావటంతో అమ్మను గురించిన కార్యక్రమాలలో ఎంతో ఆసక్తిగా అన్నయ్య పాలుపంచుకునేవాడు. రాను రాను అమ్మతో సాన్నిహిత్యం

పెరిగి తరచూ జిల్లెళ్ళమూడి వెళ్ళేవాడు. సన్యాసరావు అన్నయ్య విశాఖకు వస్తూంటే ఫిలింబాక్సు యిప్పించి అందరికీ చూపించమని అమ్మ ఆదేశించింది. అదే విధంగా అనేక చోట్ల అమ్మ సినిమా వేయించటం జరిగింది.

అంతవరకూ తాను ఒక్కడే అమ్మ దగ్గరకు వెళ్ళేవాడు. ఒక సంవత్సరం సంక్రాంతికి కుటుంబం అంతా అమ్మ దగ్గరకు వెళ్ళారు. అమ్మ చేతులతో భోగి పళ్ళు పోయించుకునే భాగ్యం వారికి కలిగింది. పండుగ నాడు అమ్మ సమక్షంలో కూర్చుని వుండగా అన్నయ్యతో అమ్మ "ఒరే నాన్నా నీకు ఒక పని చెబుతాను చేస్తావా"? అని అడిగింది. "నీవు పని చెబితే చేయక పోవటమా? అదేమిటో చెప్పమ్మా" అని ఆతురతగా అడిగాడు. "ఆ పని చేయాలంటే మూడు, నాలుగు నెలలకు తక్కువ కాకుండా ఇక్కడ ఉండి పోవాలి అని ముఖ ద్వారం నిర్మించాలని చూచాయగా తెలియచేసి దానికి ఎస్టిమేషన్ వేసి తీసుకు రమ్మని చెప్పింది. నీకు సాయంగా శ్యామ్ ఉంటాడని, డబ్బు అందగానే కబురు చేస్తానన్నది" అమ్మ.

లక్ష్మీనారాయణ అన్నయ్య డబ్బులు తీసుకుని రాగానే అన్నయ్యకు కబురు పెట్టింది. అమ్మ రమ్మని కబురు చేయగానే అమ్మ మీద అపారమైన భక్తితో సెలవు చీటీ వ్రాసి యిచ్చి జిల్లెళ్ళమూడి వెళ్ళిపోయాడు. ఏ లీవో, ఎక్కడికి వెళుతున్నాడో కూడా అందులో వ్రాయలేదు. ఆ వెళ్ళడం నాలుగు నెలలూ జిల్లెళ్ళమూడిలో ఉండి పోయాడు. అన్నయ్య అమ్మతో "నేను పని దగ్గర వుండి చేయిస్తాను కానీ డబ్బు వ్యవహారం వేరెవరికైనా అప్ప చెప్పమన్నాడు. అన్నయ్యను పని చేయించేటట్లు చూడమని, శ్యామ్‌ని డబ్బు విషయం చూడమన్నది" అమ్మ. ఆర్చి ప్రారంభోత్సవానికి అన్నయ్య కుటుంబాన్ని పిలిపించమంది అమ్మ. వాళ్ళు వస్తారో రారో ఎందుకులే అమ్మా అని సందిగ్ధంగా అన్నాడు. పోష్టుగోపాల్ తమ్ముడి ద్వారా డబ్బు పంపి వాళ్ళు ఆ ఫంక్షన్‌కు వచ్చేటట్లు చేసిన కారుణ్య మూర్తి అమ్మ.

అన్నయ్యతో అమ్మ "నాకు ఐస్‌క్రీం తినాలని ఉందిరా" అన్నది ఆయన ఆఫీసు పని మీద హైదరాబాద్ వెళ్ళినప్పుడు దాస్ ప్రకాశ్‌లో ఐస్‌క్రీం కొని దాని కొరకు ఫ్లాస్క్ కొని అందులో ఐస్‌క్రీం పెట్టి జిల్లెళ్ళమూడికి తీసుకుని వచ్చాడు. దానిని అమ్మ ఎంతో ఆప్యాయంగా కొంచెం తిని మిగిలింది పిల్లలకు పెట్టమంది. ఐస్‌క్రీం తినాలనే కోరిక అమ్మ వెళ్ళబుచ్చటం అంటే అమ్మ అన్నయ్యను అనుగ్రహించినట్లే కదా!

ఆర్చి కట్టించే పని పూర్తి అయిన తరువాత అన్నయ్య ఆఫీసుకు వెళ్ళాడు. అన్నయ్య ఊడా ఆఫీసులో పని చేసేవాడు. "ఏమయ్యా ఇన్నాళ్లూ ఎక్కడికి వెళ్ళావు?" అని వాళ్ళ ఆఫీసరు అడిగాడు. జిల్లెళ్ళమూడికి పని మీద వెళ్ళానని చెబితే ఆయన ఏమీ అనకుండా లీవు రాసి తీసుకునిరా శాంక్షన్ చేస్తాననటం అమ్మ యొక్క అవ్యాజ ప్రేమకు తార్కాణం.

అమ్మ సిద్ధి పొందటానికి సరిగా వారం రోజుల ముందు అన్నయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళటం జరిగింది. దర్శనానికి వెళ్ళినప్పుడే "అమ్మ ఇంత నీరసంగా వుందేమిటి?" అని అనుకున్నాడు. అమ్మ రామకృష్ణ అన్నయ్యను పిలిచి "వాడు వెళ్ళి పోతున్నాడురా! వాడికి మామిడి పండు యివ్వాలని ఉంది" అన్నది. రామకృష్ణ అన్నయ్య ఇంకా పండని మామిడి కాయను తెచ్చియిస్తే "వాడికి నేను ఆఖరి సారిగా పండు యివ్వాలనుకుంటే పచ్చికాయ తెచ్చి యిచ్చావని" అన్నయ్యను కేకలేసింది. "పోనీలే నాన్నా దాన్నే జాగ్రత్తగా వుంచుకుని పండిన తరువాత తినమన్నది" అమ్మ సన్యాసిరావు అన్నయ్యతో.

వాసవీ కళ్యాణ మండపంలో దుర్గాష్టమికి అఖండ లలితా నామార్చన ర్యక్రమం కొరకు వంట చేయటానికి గాడి పోయ్యి ఎలా వెలిగించాలో తెలియక మల్లగుల్లాలు పడుతున్నారు. ఈలోగా "కర్పూరంతో వెలిగించండి నాన్నా!" అన్నట్లుగా తోచింది. దానితో గాడి పోయ్యి వెలిగించారు కానీ ఆ కర్పూరం

అక్కడికి ఎలా వచ్చిందో అనూహ్యం. 1958 లో అన్నపూర్ణాలయం ప్రారంభోత్సవం నాడు కర్పూరం తోనే అమ్మ గాడి పొయ్యి వెలిగించింది. తీరా వంట చేయటానికి నీళ్ళులేవు. పంపుల్లో నీళ్ళు రావటం లేదు ఎలాగా అని శ్యామ్ అన్నయ్య, సన్యాసిరావు అన్నయ్య తర్జన భర్జన పడుతుంటే తెల్లటి వస్త్రాలు ధరించిన వ్యక్తి వచ్చి పంపులు విప్పి వెళుతూ వీళ్ళకు దృశ్యమానమైంది. ఎవరిని అడిగినా ఆమె ఎవరో మాకు తెలియదు, మేమెవరం విప్పలేదు అన్నారు. వాళ్ళ ఆదుర్దాను తగ్గించి స్థిమిత పరచటానికి అమ్మే అక్కడికి విచ్చేసి వుంటుంది. అని చెప్పారు ఆ కళ్యాణమండపం వాళ్ళు.

కేశవన్నయ్య విశాఖ నుంచి బదిలీ అయి వెళ్ళిన సంవత్సరం దుర్గాష్టమి కార్యక్రమం కావేరీ కళ్యాణమండపంలో జరిగింది. వంటకాలు, ప్రసాదాలు చాలా వుండటంతో ఆ కళ్యాణ మండపం చుట్టూ ఫ్లాట్సు కడుతున్న కూలీ లందరికీ పంచాము. వారు తిన్నంతతిని కారియర్లలో కూడా పెట్టుకున్నారు. అదేమి మాయో! ఎంత తీస్తున్నా తరగకుండా వస్తూనే ఉన్నాయి పదార్థాలు మధ్యాహ్నం పంచటం మొదలు పెట్టిన మేము సాయంత్రమైనా ఆ ప్రసాదాలు తరగక పోవటంతో అమ్మకు నమస్కరించుకుని ఆపాత్రలతోనే వారికి యిచ్చి ప్రసాదాలను తీసుకుని ఖాళీ చేసి ఇమ్మనాల్సిన పరిస్థితి వచ్చింది. ప్రసాదాలను అక్షయం చేయ గలదన్న విషయాన్ని అమ్మ అక్కడ నిర్ధారణ చేసింది.

వీలైనంత ఎక్కువ కాలం జిల్లెళ్ళమూడిలోనే గడుపుతూ అక్కడి కార్యక్రమాలకు చేదోడుగా వుంటూన్నాడు అన్నయ్య. పిల్లలందరూ బాగా వృద్ధిలోకి వచ్చారు. ఆ విధంగా ఆ జగన్మాత ఏర్పరచిన బాటలో నడుస్తూ తనకు చేతనైన సేవ చేసుకుంటున్న ధన్య జీవి అన్నయ్య.

+ + +

పశ్చిమ గోదావరి జిల్లా కొయ్యలగూడెం దగ్గర జగన్నాథపురం నివాసి అయిన శ్రీరాములు గారు తరచూ జిల్లెళ్ళమూడి వెళ్ళేవారు. ఆయన కుమారుడు

జగన్నాథం. అతనికి ఊహ తెలిసిన నాటి నుంచి అమ్మను గురించి తెలుసు. ఇంట్లో అమ్మ ఫోటో, మాతృశ్రీ పత్రికలు ఉండేవి. వాళ్ళ నాన్నగారు అన్నపూర్ణాలయంకు చందాలు పోగు చేసి తరచూ పంపించేవారు. జగన్నాథం 6వ తరగతి చదువుతున్నప్పుడు స్వర్ణోత్సవాల సందర్భంగా వెదురు, తాటాకు కొనుగోలు చేయటానికి రామకృష్ణ అన్నయ్య జగన్నాథపురం వెళ్ళారు. అన్నయ్య జగన్నాథాన్ని జిలెళ్ళమూడి వస్తావా? అని అడిగారు. అదే అమ్మ తనకు పంపిన ఆహ్వానమని చిన్నతనంలో తెలియకపోయినా అదే యిప్పుడు తన జీవితగతినే మార్చివేసిన సంఘటన అది అని అతని నమ్మకం.

మొదటి నుంచి సాధు సన్యాసులు వారింటికి వచ్చినపుడు వారిని భక్తి శ్రద్ధలతో కొలిచేవాడు. చదువు మీద మాత్రం తగినంత శ్రద్ధ ఉండేది కాదు. శ్రీరాములు గారు జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు అప్పటి ప్రిన్సిపల్ అయిన శ్రీ విఠాలరామచంద్రమూర్తి గారు "మీ పిల్లలలో ఒకరిని మా కళాశాలలో చేర్పించండి" అని అడిగారు. అది తెలిసిన జగన్నాథం ఇంటరు మొదటి సంవత్సరం చదువుతున్నా కూడా అమ్మ దగ్గర చదవాలనే కుతూహలంతో ఎగిరి గంతేసి ఒప్పుకున్నాడు.

జగన్నాథాన్ని తీసుకుని కాలేజీలో చేర్చటానికి వాళ్ళ మూడవ అన్నగారు జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అక్కడ వర్షం, బురదమయం, కానీ అక్కడి వాతావరణం, ఆ ప్రశాంతత, అమ్మ ఒడిలో చేరబోతున్నానన్న ఉత్సాహం అతనికి చిరాకు తెప్పించ లేదు. మొదటి నుంచి సంస్కృతం లేనందున ఆ క్లాసులో కూర్చున్నా ఏమీ అవగతం కాలేదు. దానితో తెలుగులోకి మారాలనుకున్నాడు. అమ్మ సంకల్పం వేరుగా ఉన్నందున ప్రిన్సిపాల్ గారిని ఎన్ని మార్లు అడిగినా అతన్ని ప్రోత్సహించి మొదటి సంవత్సరం మళ్ళీ చదవమన్నారు.

మొదటి సంవత్సరమే రెండుమార్లు చదువవలసి రావటంతో అశ్రద్ధ, దుడుకు స్వభావం, ఉపాధ్యాయులను ఎదిరించటం, సినిమాలు చూడటం,

పనికిరాని చెత్త పుస్తకాలు చదవటం మొదలైంది. చదువు వినా అన్యకార్య నిమగ్నుడైనాడు. రమణ మహర్షి "అవతార మూర్తులు మనలో ఉన్న, మనకే తెలియని కుసంస్కారాలను బయటకులాగి తరువాతే శుద్ధి చేస్తారు" అంటారు. కొత్త రోడ్డు వేయాలంటే" పాత రోడ్డును తవ్వాలి కదా అలా దాదాపు ఒకటిన్నర సంవత్సరం విచ్చలవిడిగా తిరిగాడు. "మీరు బురద పూసుకు వచ్చినా శుభ్రపరచ వలసిన బాధ్యత నాదే" అన్నది అమ్మ. "తల్లికి తప్పే కనిపించదు" అన్న అమ్మ మాట జగన్నాధం విషయంలో సార్థకమైంది. అతనిలో వున్న దుడుకు స్వభావాన్ని, ఉపాధ్యాయులంటే గౌరవం లేనితనాన్ని, విచ్చలవిడితనాన్ని అమ్మ భరించింది. కొద్ది కాలంలోనే అతన్ని సానబెట్టి వజ్రం వలె మెరిసేటట్లు శుభ్రపరచింది.

అతని సహాధ్యాయులు కృష్ణకిషోర్, భవానిశంకరశర్మ, భాస్కరశర్మ అతనికి చదువులో ఎంతో సహాయం చేసేవారు. అతని అవస్థను గమనించి ప్రిన్సిపాల్ గారు, మాతృశ్రీ సంస్కృత పాఠశాల హెడ్ మాష్టారు గారైన సముద్రాల రామకృష్ణాచార్యులు గారికి అప్పచెప్పారు. కృష్ణకిషోర్ రోజూ సుప్రభాతంకు వెళ్ళేవాడు. రెండవ సంవత్సరం పరిక్షలు వ్రాసి యింటికి వెళ్ళేసరికి అమ్మ సిద్ధిపొందిందన్న వార్త విని అవాక్కయినాడు.

ఇంట్లోకి కూడా వెళ్ళకుండా అమ్మ పార్థివ శరీరాన్ని దర్శించటానికి తిరిగి జిల్లెళ్ళమూడికి చేరాడు. ఆనాటి బాధ వర్ణనాతీతం. ఎవరిని పలకరించినా కన్నీరు ఏరులై పారుతోంది. అంతా మూగరోదనే. పోతు కూచి రవి "అమ్మ లేని జిల్లెళ్ళమూడి రాముడు లేని అయోధ్యలా" వుందని అనేవాడు. ఆనాటి పరిస్థితి సరిగా అలాగే ఉంది.

వజ్రోత్సవాలలో అందరూ ఎంత ఆనందాన్ని అనుభవించారో అంతకు పది రెట్లు విషాదభరితులమయ్యారు. అమ్మ అవతారం చాలించేముందు సంస్థలో ఉన్న ప్రతి యింటికీ వెళ్ళి వారందరినీ ఆనంద పరచింది. అమ్మ

వారింటికి వచ్చిందన్న ఆనందం ప్రతి ఒక్కరి అనుభవంలోకి తెచ్చింది అమ్మ. దానిలో భాగంగానే విద్యార్థుల వసతి గృహాలకూ వెళ్ళి వారందరినీ తరింప చేసింది. విద్యార్థులంతా ఎంతో ఉత్సాహంగా రంగురంగుల కాగితాలతో అలంకరించి అమ్మకు స్వాగతం పలికారు. అక్కడ జరిగే వినాయక చవితి ప్రతి విద్యార్థికి మరచిపోలేని అనుభూతి. విద్యాప్రదాయిని అయిన అమ్మ స్వహస్తాలతో "అంఆ" అని వ్రాసి రెండు బహుమతులను ప్రసాదించింది. అతి తక్కువ పర్సంటేజితో బి.ఎ. అయిందనిపించాడు జగన్నాథం.

జిల్లెళ్ళమూడిలో ఉన్న సమయంలో చదువూ సంస్కారాలతో పాటు సేవాభావాన్ని కూడా పెంపొందింప చేసింది అమ్మ. అమ్మ పథంలో అతని తొలి అడుగులు ప్రారంభించబడ్డాయి. చదువుతున్న కాలంలోనే మాతృశ్రీ పబ్లికేషన్స్‌లో ఏలూరు వాస్తవ్యులైన రిటైర్డు టీచర్ శ్రీ రామకృష్ణ గారికి చేదోడు వాదోడుగా ఉండేవాడు. జిల్లెళ్ళమూడిలో తయారైన పూజ, అర్చన అనే అగరుబత్తులను మాతృశ్రీ పబ్లికేషన్సులో పెట్టి అమ్ముతుండేవాడు. అక్కడ జరిగే ప్రతి కార్యక్రమంతో మిగిలిన విద్యార్థులతో పాటు శ్రద్ధగా పాల్గొనే వాడు. సీనియర్స్ ప్రారంభించిన తోట పనిని తన క్లాసు విద్యార్థులతో కలసి రామకార్యం లోని చిన్న కోతుల్లాగా అమ్మ స్మరణతో, అమ్మ స్మృతులతో కాలేజీ స్థలంలో చెరువు గట్లు పైన మిరప, బెండ, వంగ, టమోటా, సొర పాదులు పెట్టి అన్నపూర్ణాలయానికి కావలసిన కూరలను పండించేవాడు. రెండు మూడు సొర పాదులే అసంఖ్యాకమైన కాయలను కాసి వాటి ఋణం తీర్చుకున్నాయనిపించింది. అమ్మ యొక్క అవ్యాజకరుణలో ఇలాంటివన్నీ సహజమే. అవతారమూర్తుల సన్నిధిలో ప్రతిఫలం ఎప్పుడూ విశేషంగానే ఉంటుందని ఋజువైంది.

జిల్లెళ్ళమూడిలో కోటి లలితా కుంకుమార్చన, కోటి బిల్వార్చన ఒక్క రోజులోనే జరగటం విశేషం. మండలం పాటు జరిగిన లలితా సహస్రం

ఖడ్గమాల, త్రిశతి, శ్రీసూక్త, కనకధారాస్తవం పూజలకు, ప్రతి సోమ, శుక్రవారాల్లో జరిగే లలితా లక్షనామార్చనకు క్రమం తప్పకుండా హాజరయ్యేవాడు. అక్కడ జరిగే విశేష కార్యక్రమాలలో షామియానాలు వేయటం దగ్గర నుంచీ, స్టేజి డెకరేషన్ వడ్డనల వరకు తన తోటి సోదరులతో పాటు అత్యంత శ్రద్ధాభక్తులతో చేసేవాడు. ఆనాటి సేవే ఈనాడు తనను గౌరవ ప్రదమైన స్థితికి తీసుకుని వచ్చిందని జగన్నాధం విశ్వాసం.

అమ్మ దేహధారిణి గా వున్న కాలంలో ఉదయం సాయంత్రం దర్శనం చేసుకునే వాడు. అమ్మ చిరుదరహాసంతో పలకరించే విధానం ఇప్పటికీ అతనికి అనుభవైకవేద్యమే. అదే మహాభాగ్యంగా తలుస్తాడు. కాలువ నిండా నీరున్నా తాగాలంటే రేవు కావాలన్న అమ్మమాట ప్రకారం ఆగడ్డ మీద 6 సంవత్సరాల కాలం ఉన్నా పొరలు కప్పిన కళ్ళకు ఆ రేవు కన్పించలేదు. "పాయసమ్మున దర్వికి రుచి తెలియ పనియేమి కరుణామయి" అని యాంత్రికంగా సంధ్యావందనం చేశామే కానీ నిజంగానే పాయసంలో గరిట మాదిరి జీవించామని అనిపిస్తోందని వేదన చెందాడు.

ఎన్నో మార్లు అమ్మ "ఈస్థలంలో ఎందరెందరో ఋషులు తపస్సు చేసుకున్నారు, చేసుకుంటున్నారని" చెప్పింది. చిన్నతనం వల్ల, అజ్ఞానం వల్ల ఆ విషయాన్ని గ్రహించ లేక పోయాడు. "మీలో తప్పులు ఎంచటం మొదలు పెడితే ఏ ఒక్కరూ ఏడవ మైలు దాటిరారు అని అమ్మ చెప్పింది. అచ్చటి పచ్చడి మెతుకులైనా భరద్వాజ విందుకన్నా గొప్పవి. "అచ్చట చిగురు కొమ్మైనా చేవ గలదే" అని అల్లసాని పెద్దనామాత్యులన్నట్లు అమ్మ కరుణకు అచటి ప్రాణులన్నీ నోచుకున్నవే. అమ్మ సచ్చరిత్ర రెండవ భాగంలో వచ్చిన అమ్మ భక్తులెందరితోనో పరిచయం ఉన్నది. "వారితో ఎంతో సన్నిహితత్వం ఉన్నా, వారితో ఎంతో సమయం గడిపినా ఏరోజూ అమ్మతో వారికి గల అనుభవాన్ని పంచుకోలేని తన దురదృష్టాన్ని తలచుకుంటూ బాధపడే కంటే, ఈ బాధ అనే

పశ్చాత్తాపం ఈ శిలకు కలిగిందంటే అదీ అమ్మ సన్నిధి ప్రభావమే కదా!" అని అన్నాడు.

అతనికి పునర్జన్మ నిచ్చిన స్థలం జిల్లెళ్ళమూడి కానీ ఆ పురిటి నొప్పులన్నీ అమ్మే భరించింది. అతని పాత వాసనలన్నీ పటాపంచలు చేసి పులు కడిగిన ముత్యంలా తయారు చేసింది. అమ్మ కృపా కటాక్షము వల్ల అతని ప్రయాణం పునః ప్రారంభింపబడింది. బెంగుళూరులో హిందూసేవా ప్రతిష్టానం వారి సంస్కృత ప్రచారంలో చేరి కర్ణాటకలో పలు ప్రదేశాలు తిరిగాడు.

ఎమ్.ఎ. చదవటానికి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అప్లికేషన్ పెట్టుకున్నాడు. అప్పటి రిజిస్ట్రారు శ్రీ మద్ది గోపాలకృష్ణా రెడ్డి గారు అమ్మ భక్తులు, అమ్మను దర్శించిన వారు. "జిల్లెళ్ళమూడి విద్యార్థివి కాబట్టి నీకు చదువుకోవటానికి అవకాశం కల్పిస్తాను. నీవు ఎమ్.ఎ. లో గోల్డుమెడల్ సంపాదిస్తావా?" అని ఆయన అడిగారు. అమ్మ కృప వల్ల తప్పక సంపాదిస్తానని చెప్పాడు. అదే విధంగా అహోరాత్రులు కష్టపడి చదివి గోల్డుమెడల్ పొందాడు. దానిని శ్రీ గోపాల కృష్ణారెడ్డి గారికి చూపించాడు. ఆయన చాలా సంతోషించి యిలాగే పురోభివృద్ధి పొందాలని ఆశీర్వదించారు.

విశాఖపట్టణంలో అధ్యయన పరిషత్ కార్యక్రమాలలో పాలు పంచుకోవాలని ఉన్నా వారి ఎవరితో పరిచయం లేనందున ఊరుకున్నాడు. వారి తాతగారు శ్రీ కులుకుమూరి తమ్మరాజు గారు, వారి శ్రీమతి ప్రోత్సాహంతో విశాఖలో ఉన్న జిల్లెళ్ళమూడి విద్యార్థులంతా కలసి పూజ చేసుకున్నారు. ఆనాటి పూజకు అధ్యయన పరిషత్ నుండి అక్కయ్యలు, అన్నయ్యలు కూడా వేంచేసారు. అక్కడే కుసుమ అక్కయ్య అందరి అడ్రసులు తీసుకుని అమ్మ పూజలు ఎప్పుడు, ఎక్కడ జరిగేదీ ప్రతివారం కార్డు ద్వారా తెలియచేసే వారు. విద్యార్థులంతా అత్యంత భక్తి శ్రద్ధలతో అమ్మ పూజలకు హాజరయ్యేవారు. ఆ పూజా సమయంలో జిల్లెళ్ళమూడిలో అమ్మ సన్నిధిలో ఉన్నామన్న భావన అందరిలో కలిగేది.

జగన్నాధం ఎమ్.ఎ. అయిన తరువాత పార్టుటైము జాబ్ చేస్తూ ఎమ్.ఫిల్ లో చేరాడు. జిల్లెళ్ళమూడి పూర్వ విద్యార్థుల సమావేశాలు దసరాపూజలలో సముద్ర తీరాన గల శ్రీ శాంతి ఆశ్రమంలో అత్యంత వైభవోపేతంగా జరిగాయి.

అధ్యయన పరిషత్ ప్రెసిడెంటు గారైన శ్రీ ఎ.వి.వి. ప్రసాదరావు గారు అతనిని చూడగానే నీకోసమే ఎదురు చూస్తున్నానని, ఆ రోజు తెల్లవారు ఝామున అమ్మ తనతో మాట్లాడి "మార్చిలో ఉద్యోగం వస్తుందని చెప్పమన్నదని" తెలియజేసారు. ఆ విషయం విన్న వెంటనే ఆనందపడినా "టీచర్ పోస్టుకు బి.ఇడి లేదు, లెక్చరర్ పోస్టులకు బాన్ ఉన్నదని" మాష్టారు గారికి చెప్పాడు. "అమ్మ చెప్పింది కాబట్టి తప్పక ఉద్యోగం వస్తుందని అమ్మపై నమ్మకం ఉంచుకోమని" అమ్మ కుంకుమ ప్రసాదం యిచ్చారు.

వారం రోజుల్లోనే ఆంధ్రప్రదేశ్ కాలేజీ సర్వీస్ కమీషన్ వారు 5 సంస్కృత పోస్టులకు నోటిఫికేషన్ జారీ చేశారు. ఆ విషయం మాష్టారు గారికి చెబితే అమ్మను ధ్యానించి పరీక్షకు బాగా ప్రిపేరవ్వమన్నారు. అమ్మ దయ వల్ల పరీక్ష బాగా వ్రాశాడు. ఫలితాలు తొందరలోనే వచ్చాయి. 18 మందిని ఇంటర్వ్యూకు పిలిస్తే అందులో 10 మంది జిల్లెళ్ళమూడి విద్యార్థులే సెలక్టు అయ్యారు. తీరా జగన్నాధం ఇంటర్వ్యూకు వెళ్ళే సమయానికి అతని ఎమ్.ఫిల్ ఫలితాలు రాలేదు. ఆ సమయంలో శ్రీ ఎల్.ఎ. రవిబాబు గారు, శ్రీ హనుమంతరావు గారు చాలా సహాయం చేశారు. హైదరాబాద్ ఇంటర్వ్యూకు వెళితే 5 పోస్టులకు ముగ్గురు జిల్లెళ్ళమూడి విద్యార్థులే సెలక్టు అవటం గమనార్హం. అతని ఆనందానికి అవధులు లేవు.

శ్రీ మాష్టారు గారి ద్వారా అమ్మ చెప్పినట్లుగానే మార్చి 11వ తేదీన హిందూపూర్ ఎ.పి.ఆర్.జూనియర్ కాలేజిలో లెక్చరర్ గా చేరాడు. అన్నింటి కంటే విచిత్రం ఏమిటంటే వీళ్ళకు పోస్టులు వచ్చిన తరువాత ఎ.పి.సి.ఎస్ కమిటి రద్దయింది. అమ్మ కరుణకు హద్దులు లేవని మరోసారి ఋజువైంది.

ఉద్యోగంలో చేరిన వెంటనే జగన్నాథం మొదటి నెల జీతం అమ్మకు సమర్పించుకున్నాడు. అదే సంవత్సరం వివాహమైంది. భార్య అనుకూలవతి. జిల్లెళ్ళమూడికి ఏమి సమర్పించుకున్నా అడ్డు పెట్టకపోవటమే కాక, తగినంత ప్రోత్సాహాన్ని కలుగ చేస్తోంది. అమ్మ అనురాగానికి అవధులు లేవని , అమ్మ యొక్క జగన్మాతృత్వానికి కైమోడ్పులర్పించాడు.

ఫిబ్రవరి 17 ధాన్యాభిషేకంకు కాని మే 5న అమ్మ కళ్యాణ మహోత్సవంనాడు కాని పూర్వ విద్యార్థులు సమావేశమై వారి వారి భావాలను కలబోసుకుంటారు. పరిస్థితులను అర్థం చేసుకొని అమ్మ యిచ్చిన ఈ జీవితాన్ని సార్థకం చేసుకోవడం ఎలా అని బహు విధాలుగా చింతించి "నీ కిచ్చినది తృప్తిగా తిని ఇతరులకు ఆదరణగా పెట్టుకో" అనే అమ్మ సూక్తిని వేదోపనిషత్ అను శాసనమైన "శ్రద్ధయా దేయం, అశ్రద్ధయాదేయం, శ్రియాదేయం, హ్రియాదేయం, భియాదేయం, సంవిధాదేయం" అను సూక్తిని మనస్సు నందు నింపుకొన్న వాడై ప్రతి సంవత్సరం ధాన్యాభిషేకానికి అతని బాధ్యతను గుర్తించి ఒక విద్యార్థికి సంవత్సరానికి అయ్యే ఖర్చు యివ్వాలని నిశ్చయించుకుని పంపుతున్నాడు. ఈ విషయాన్ని అతను గర్వంతో కాక వినమ్రతతో చెప్పటంలో గల పరమార్థం తనలాగా ఎందరో విద్యార్థినీ విద్యార్థులు జీవితంలో "అమ్మ దయ" వల్ల స్థిరపడ్డారు. వారు వారి బాధ్యతను విస్మరించకుండా వారు కూడా ఇతోధికంగా సహాయం చేయాలని ప్రార్థిస్తున్నా"నని తెలియజేసాడు. ఎంత హృద్యంగమైన భావన. ఇది చదివిన తరువాతైనా అందరిలో కాకపోయినా కొందరిలోనైనా మార్పు వస్తుందని ఆశించటంలో తప్పు లేదనుకుంటాను.

విద్యార్థులే కాదు అమ్మ చేతి గోరుముద్దలు తిన్న మనందరమూ కూడా ఈ విషయాన్ని మరువకూడదు. అమ్మ "మిమ్మల్ని కని మీ తల్లులకు పెంపుడిచ్చాను" అంటుంది. మరి అమ్మ మనకిచ్చిన చిన్న అవకాశమే ఈ

తరుణం. అమ్మ పెడుతున్న అన్నంలో ఒక ముద్ద పాపడు తన చేతితో అమ్మ నోటికి అందిస్తే ఆ తల్లి ఎంత ఆనందాన్ని పొందుతుందో ఆ ఆనందాన్ని అమ్మకు యివ్వాలనే ఈ పాపడి తపన, ఆత్రం, ఆశయం, జీవిత లక్ష్యం. "అందరమూ అవుదామా అమ్మ అన్నదానంలో సభ్యులం" అంటూ రాసాడు. ఆ ఉదాత్త భావనే మిగిలిన వారిలో మార్పు తెస్తుందని ఆశిస్తున్నాను.

జిల్లెళ్ళమూడిలో పాదుచేసి సంస్కృత భాషేరాని జగన్నాధం అనే విత్తును అమ్మ నాటింది. ఆ విత్తు మొలకెత్తి మొక్కై వృక్షమై, వూడలూనింది. ఆ వట వృక్ష ఛాయన ఎందరు సేద తీరాలో అట్టి వృక్షాలను చూచుకొని అమ్మ ఎంత గర్వపడుతుందో కదా!

+ + +

బందర్ లో మునిసిపల్ కమిషనర్ గారైన మల్లాప్రగడ సీతారామాంజనేయులు గారి కుమార్తె విజయ. అమ్మ దగ్గరకు వెళ్ళినపుడు (రామకృష్ణ అన్నయ్య మేనల్లుడు మోహన్ విజయ భర్త, భట్టిప్రోలులో వుండే బావగారి కొడుకు)

"జగమును అర్కపురమ్మును చేయ
జనులను ఏకోదరులను చేయ
విశ్వరూప సందర్శన మీయ
విన్నవించు కొందునే అనసూయ"

అని పాడేది. ఆ చరణాన్ని మళ్ళీ మళ్ళీ పాడమని అమ్మ చేతితో సైగ చేసేది.

అమ్మ ఆరాధనోత్సవంలో పాటలు పాడటానికి విజయను పంపించమని గోపాలన్నయ్య జాబు వ్రాసారు. ఆరోగ్యం సరిగా లేనందున వెళ్ళలేదు. అందరిలో తనకు అవకాశం ఇచ్చినా వెళ్ళలేక పోయానని కలత చెందింది.

అనసూయేశ్వరాలయంలో పెద్ద శివలింగంగా కనిపించి అది అదృశ్యం అయిన తరువాత దత్తాత్రేయుని దర్శనం కలిగింది. "వినరో భాగ్యము విష్ణు కథ" అన్న అన్నమాచార్యుని కృతి మొత్తం పాడింది. ఇంకో పాట పాడమ్మా అన్న పి.యస్.ఆర్. అన్నయ్య గొంతు వినిపించింది."

ఆనందం పట్టలేక ప్రక్క ఇంటి వారితో చెప్పింది వారు ఎప్పుడూ గురు చరిత్ర పారాయణ చేసేవారు. "ఆమె మేము గురు చరిత్ర పారాయణ చేస్తే మీకు దత్తదర్శనం అయింది. మా గుమ్మంలో నుంచి రావాల్సిన దత్తాత్రేయుడు మీ గుమ్మం లోకి వచ్చారని" ఆమె హాస్యం చేసింది. అమ్మ ఎప్పుడూ సామాన్యురాలుగానే వుంది. తాను భగవంతుడనని ఎప్పుడూ చెప్పలేదు. "నేను కరణం గారి భార్యననే చెప్పేది."

లాసన్స్ బే లో ఒకామె మా యింటికి వచ్చి సంభాషణలో "అమ్మ గదిలోనే వుండేదాన్ని, అమ్మ కన్నెత్తి చూచేది కాదు, కానీ హైమాలయంలో పూజల్లో పాల్గోనే వాళ్ళకు అరటిపళ్ళు పెట్టి, హార్లిక్స్ కలిపి యిప్పించి ఎంతో ప్రేమగా, లాలనగా చూచేది. అప్పుడు తన దగ్గర కూర్చునే వాళ్ళ కంటే పూజలో పాల్గొనే వాళ్ళకు ఎక్కువ ప్రాముఖ్యత నిస్తోందా అనిపించేది అని చెప్పింది.

+ + +

1979 నవంబరు 10వ తారీఖున జిల్లెళ్ళమూడిలో అమ్మ లలితా కోటి నామ పారాయణ జరిపించింది. అందులో పాల్గొనటానికి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారి శిష్యులు విశాఖపట్టణం నుంచి జిల్లెళ్ళమూడి వచ్చారు. తిరుగు ప్రయాణంలో జిల్లెళ్ళమూడి నుండి బాపట్లకు వచ్చినపుడు, వారితో వచ్చిన కంతేటి ప్రభావతి గారు బాపట్లలో మా బంధువులు ఉన్నారు, వారిని చూచి వస్తానని చెప్పారు. రాత్రిపూట ఒక్కరూ వెళ్ళగలరా? అని అడిగితే ఫరవాలేదు, వెళ్ళగలను అంటే మిగిలిన వారు వెళ్ళి పోయారు. ఆవిడ

బస్స్టాండులో రిక్షావాడికి తాను వెళ్ళవలసిన అడ్రస్ చెప్తూంటే "నాకు తెలుసండీ నేను తీసుకు వెళ్తాను" అని10 ఏళ్ళ పిల్ల వచ్చింది.

సరే అని ఆమె ఆ అమ్మాయితో పాటు రిక్షా ఎక్కి తమ బంధువుల ఇంటికి వెళ్ళారు. ఇంత రాత్రిపూట నువ్వు ఎక్కడికి వెళ్తావు చిన్న పిల్లవు, నాదగ్గరే పడుకోమని ప్రభావతి గారు తన ప్రక్కలోనే పడుకోబెట్టుకున్నారు. రాత్రి నిద్ర పట్టటం లేదని ఒక సంచి వుంటే యివ్వండని ఆ ఇంటి వారిని అడిగి తెల్లవారు ఝామున 4గం॥ లకే వెళ్ళిపోయింది.

అంత చిన్న పిల్ల వెళ్ళిందో లేదో అని ప్రభావతి గారు దిగులు పడుతూ ప్రొద్దున్నే బస్సుస్టాండులో వాకబు చేసారు. అమ్మో! ఆ అమ్మాయి అందరినీ ఇలాగే మాయ చేసి వాళ్ళ వాళ్ళ దగ్గరకు తీసుకు వెళ్ళి నగలు అన్నీ దోచేస్తుంది. ఆ అమ్మాయి నక్సలైట్ తాలూకు, అది చిచ్చర పిడుగు అని చెప్పటంతో ఈమెకు కంగారు ఎక్కువైంది. ఆ అమ్మాయి సంచి కూడా అడిగి తీసుకుంది. బంధువుల ఇంట్లో వస్తువులు ఏమైనా మాయం చేసిందేమోనని తిరిగి బంధువుల ఇళ్ళకు వెళ్ళి చూస్తే వాళ్ళ సామానులన్నీ ఎక్కడ పెట్టినవి అక్కడే వున్నాయి. ఒక్కటి కూడా పోలేదు. ప్రభావతి గారికి ఒంటి నిండా నగలు ఉన్నా ఈమె పక్కలోనే పడుకుంది కానీ ఒక్కటి కూడా పోలేదు. అందుకు మీరు చాలా అదృష్టవంతులు. ఆ అమ్మాయి ఎంతో ఒడుపుగా చాలామంది నగలు మాయం చేసింది. అలాంటిది మీ దగ్గర అంత సేపువున్నా ఏ ఒక్కటీ పోలేదని ఆశ్చర్య చకితులయ్యారు. ప్రభావతి గారికి అమ్మ దగ్గర కోటి పారాయణలో పాల్గొని వస్తున్నందువల్లే ఆ పిల్లకు అటువంటి బుద్ధి పుట్టలేదు. అమ్మే తనను ఆవిధంగా కాపాడి, రక్షించిందని ఆమె పరిపూర్ణ విశ్వాసం. తనని రిక్షాలో ఎక్కడికో తీసుకెళ్ళ కుండా సరాసరి వారి బంధువుల ఇంటికే తీసుకు వెళ్ళటం అక్కడ ఆ అమ్మాయి ఏమీ మాయం చేయక పోవటం అంతా అమ్మ కరుణకు తార్కాణం అని పరమానంద భరితులయ్యారు.

+ + +

వల్లూరి పాండురంగారావన్నయ్య తమ్ముడు వల్లూరి రమేష్. అతనికి తరుచూ పార్శ్వపునెప్పి వస్తుండేది. ఒకమారు నొప్పి ఎక్కువగా వుండటంతో రెండురోజులు అమ్మ దర్శనానికి వెళ్ళలేదు. ఆ తరువాత వెళ్ళినప్పుడు అమ్మ "ఎందుకు రాలేదు?" అని రమేష్‌ని అడిగింది అమ్మ. తనకు పార్శ్వపునొప్పి ఎక్కువగా వుండటంతో రాలేకపోయానని" చెప్పాడు. అమ్మ దర్శనంకు వెళితే వసుంధరక్కయ్య "అమ్మకు పార్శ్వపునొప్పిగా వుందని" చెప్పింది. ఆ తరువాత రమేష్‌కు ఆ నొప్పి రావటం పూర్తిగా తగ్గిపోయింది. నా బాధను అమ్మ స్వీకరించి, నన్ను బాధ నుండీ విముక్తుడ్ని చేసిందని" అతని నమ్మకం.

అమ్మకు పూజ చేసుకోవాలని కనకాండరంపూలు, బిస్కెట్‌ప్యాకెట్ పట్టుకు వెళ్ళి ఒక పక్కగా కూర్చున్నాడు శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రుల వారు అమ్మతో ఈ రోజు నా జన్మదినం. పూజ చేసుకోవటానికి ఏమీ తెచ్చుకోలేదని" అన్నారు. పక్కనే ఉన్న రమేష్ వంక చూచింది అమ్మ. వెంటనే రమేష్ తన దగ్గర ఉన్న కనకాంబరం పూలు, బిస్కెట్‌ప్యాకెట్ ఇచ్చాడు. అవి తీసుకొని శ్రీయతీంద్రుల వారు "అమ్మకు కనకంతో పూజ చేసుకుంటున్నాను. ఇంతకంటే కావాల్సింది ఏముంటుంది అని మురిసిపోయారు. జన్మదిన వేడుకకు తగినట్లుగా అమ్మకు బిస్కెట్లనివేదన అని పరవశించిపోయారు.

హనుంబాబుగారు జిల్లెళ్ళమూడి వాస్తవ్యులు. మొదటిసారిగా తెనాలిలో అమ్మ గురించి వినటం జరిగింది. జిల్లెళ్ళమూడి అమ్మ దగ్గరకు శ్రీనాన్నగారు 1959 సం॥ ప్రాంతంలో వచ్చినప్పుడు అమ్మ పొట్ట మీద సర్పం కనిపించిందని, అప్పటి నుండీ ఆయన అమ్మను భార్యగాకాక అమ్మగా చూచుకునే వారిని విన్నారు.

గుంటూరులో చదువుకుంటున్నప్పుడు అన్నయ్య స్నేహితుడు జిల్లెళ్ళమూడిలో ఆడపిల్లలు బాగుంటారని, ఆడవాళ్ళను అక్కయ్య అని, మొగవాళ్ళను అన్నయ్య అనిపిలుచుకుంటారని చెప్పాడు. ఆడ తోబుట్టువులు

లేనందున లోటుగా వుండేది. వారి తల్లిదండ్రులకు ఇద్దరూ మొగబిడ్డలే హనుంబాబు సత్యం.

1965 సం॥ ప్రాంతంలో వేసవికాలంలో నండూరు, పూండ్ల మీదగా జిల్లెళ్ళమూడి వెళ్ళారు. ఆశ్రమంలో ప్రవేశించగానే మందిరం వేరుతో పెద్ద పాకలో అమ్మ దర్శనమిచ్చేది. అమ్మను దర్శించిన తరువాత తాను తరించే ప్రదేశం ఇదేనని, తరుణోపాయం చూపే దేవత అమ్మేనని, జిల్లెళ్ళమూడి అన్నయ్య స్వస్థలమనే భావన చోటు చేసుకుంది.

1968 అనంత పద్మనాభ చతుర్థినాడు ఆయన తల్లి భాగ్యమ్మక్కయ్య అన్నపూర్ణాలయంలో ఉండేందుకు వచ్చింది. హనుంబాబు అప్పుడు జిల్లాపరిషత్ స్కూలులో పనిచేస్తున్నాడు. ఎప్పుడు శెలవు దొరికినా కుటుంబంతో సహా వచ్చి అన్నపూర్ణాలయంలో అమ్మ సేవగా భావించి చేసుకునేవారు. అక్కడ చిన్నపని, పెద్దపని అని బేధం లేకుండా ప్రతి పనిలో పాల్గొనేవాళ్ళు. ఆరోజుల్లో వంటగాడి పొయ్యిల మీద చేసేవారు. రాత్రింబవళ్ళు అన్న తేడా లేకుండా జనం వస్తుండేవారు. వారందరినీ ముందుడా భోజనం చేసి రమ్మనేది అమ్మ.

వారందరి భోజనాలకు తగిన ఏర్పాట్లు జరగాలి కదా! "నా జీవితంలో ఇంత అన్నదానం చేసుకోలేను కాబట్టి ఈ అన్నదాన పవిత్రమైనదనే భావన ఆయనలో బలంగా నాటుకుంది. అమ్మకు రెండు పూటలి మహా నివేదనను అన్నయ్యే తీసుకు వెళ్ళేవాడు. ఆ పనిని ఏదో డ్యూటిమాదిరి కాక అత్యంత పవిత్రంగా ప్రత్యక్షదేవతామూర్తికి నివేదన ఇస్తునట్లుగా చేసేవాడు.

1975లో వాళ్ళ కుటుంబం జిల్లెళ్ళమూడిలో స్థిరనివాన మేర్పరుచుకున్నారు. అంత వరకూ వస్తూపోతుండేవాళ్ళు 1977 ఉగాదికి అమ్మ ఆ దంపతులకు బట్టలు పెట్టి అన్నపూర్ణాలయంలో శాశ్వతంగా ఉండమన్నది. మే 5న అమ్మ ఉత్సవం అయిన తరువాత హనుంబాబు భార్య

స్వరాజ్యలక్ష్మి అమ్మ దగ్గరకు వెళ్ళారు. ఆ అక్కయ్యనే కుసుమ అని కూడా అంటారు.

"నాకు ఆదాయం వుంది కదా! అన్నపూర్ణాలయంలో భోజనం చేస్తున్నాము మా సంగతి ఏమిటి?" అని అమ్మను అడిగారు. అప్పుడు అమ్మ "నీ జీతమెంత?" అని అడిగింది. 500/- అన్నాడు. ఈ నెల నుంచీ 250/ – ఆఫీసులో కట్టమంది. సంస్థ సోమ్ము తినకుండా అమ్మ సేవ చేసుకోవాలనేదే వారి అభిప్రాయం. అక్కయ్య కూడా మారుమాట చెప్పకుండా నిజమైన సహధర్మచారిణిలా అన్నయ్యతో పాటు పాలుపంచుకునేది.

అమ్మకు నివేదన ఇచ్చినప్పుడు అమ్మ తన చేతిని అన్నయ్య నోటికి తగలకుండా, అన్నం క్రిందపడకుండా నోట్లో పేట్టేది. ఆ సమయంలో "నాన్నా నీ కోసం ఏం చేయమంటావు? నీ పేరు మీద బ్యాంకులో డబ్బు వేయమంటావా? ఇల్లు కట్టించమంటావా? పిల్లల పెళ్ళిళ్ళు చేయమంటావా? ఏమి చేయమంటావని" అడిగింది. అమ్మా "నాకేం చేయాలో తెలియదు నా బాగు, నా కన్నా, నీకే బాగా తెలుసు. మీకు తోచినట్లు చేయండి" అన్న అమ్మతో చెప్పాడు.

హైస్కూలులో పనిచేస్తున్న రోజుల్లో "ఏరా! నీవు కూడా కాలేజీకి వస్తావా?" అన్నది. "క్లాసులేదమ్మా" అన్నాడు బాగా చదివి క్లాసు తెచ్చుకో కాలేజీకి తీసుకుంటామన్నది. అదే సమయంలో కోన సత్యం మరదలు సుగుణకు కూడా అమ్మ ఉద్యోగమిస్తామన్నది. ఉన్నది ఒకే పోష్టు ఏమిటి? అమ్మా ఇలా చెప్తోందని"పించింది. చాలా చిత్రమైన పరిస్థితి. వారి చదువు అయ్యేటప్పటికి కాలేజీలో ఒక అధ్యాపకులు రాజీనామా చేయటంతో అమ్మ అన్నట్లుగా ఇద్దరికీ ఉద్యోగాలు వచ్చాయి. అమ్మ సంకల్పసిద్ధ కదా! దానితో శాశ్వతంగా జిల్లెళ్ళమూడి అమ్మ సేవలో ఉండే అవకాశం కల్గింది.

అన్నపూర్ణాలయంలో ఎవరితో ఎలా మెలగాలో నేర్పేందుకు అమ్మ అందరినీ ఒకమారు అమ్మ భక్తుల ఇండ్లకు వెళ్ళిరమ్మంది. ముందుగా హనుంబాబు అడవులదీవి మధు అన్నయ్య ఇంటికి వెళ్ళాడు. అక్కడ ఆ కుటుంబసభ్యులు అందులోనూ సుశీలక్కయ్య ఆత్మీయత రంగరించి ఆదరించారు. ఆ తరువాత గుంటూరు రాచర్లలక్ష్మీనారాయణ గారింటికి వెళ్ళాడు. కమలక్కయ్య చూపిన అభిమానం పదేపదే వారింటికి వెళ్ళాలనిపించేలా వుంది దాని ఫలితంగా అన్నపూర్ణాలయంలో వుండేవాళ్ళు బయటకు వెళ్ళేవాళ్ళను అమ్మ బిడ్డలు ఎలా చూస్తారో అవగతమైంది.

అమ్మ హనుంబాబుని "హనుమాన్‌బాబు" అని పిలిచేది. ఆ పిలుపు ఎంతో ఆత్మీయంగా, హాయిగా వుండేది. అమ్మను మీరు అనేవాడు అన్నయ్య. ఎవరితో నన్నా చెప్పాల్సి వచ్చినా మాతృశ్రీ ఇలా అన్నారనే చెప్పేవాడు. అన్నపూర్ణాలయంలో బి.పి. వున్న వాళ్ళు, షుగర్ వున్నవాళ్ళు అలా అనేక రకాల వాళ్ళు భోజనం చేసేవారు. వాళ్ళందరినీ దృష్టిలో వుంచుకొని అమ్మ "ఉప్పు వేయని మజ్జిగ, ఉప్పు వేసిన మజ్జిగ రెండు రకములుగా వడ్డించమనేది. పులుపు, కారం తక్కువగా వేసిన వంట చేస్తే ఎవరికి వీలుగా వారు భోజనం చేస్తారని" అమ్మ చెప్పింది.

కారంబూందీలో కారం పిండిలో కలిపితే కారంమంట పుట్ట కుండా వుండటమే కాక, జీర్ణకోశం మీద దాని ప్రభావం చాలా తక్కువగా ఉంటుందని" అమ్మ చెప్పటం చూస్తే ఎవరైనా ఆశ్చర్యపోక మానరు. అన్నం పెట్టటమేకాక పిల్లలకు మేలు కలిగే విధంగా పెట్టాలనే మాతృత్వం మనం ఇంక ఎక్కడా చూడం.

హనుంబాబు తల్లి భాగ్యమ్మక్కయ్యను "అన్నపూర్ణాలయంకు తల్లి అని, ఆమెది సహజమైన ఓర్పు, నేర్చుకున్న ఓర్పు కాదని" తెలియచేసింది. వంట

ఎలా చేయాలో ఎవరెవరు వేటికి బాధ్యత వహించాలో సూక్ష్మాంశాలను సైతం వివరంగా చెప్పేది.

హనుంబాబు పెద్ద కూతురి పెండ్లి విషయంలో సర్వాత్మగా తానేయై వివాహం జరిపించింది అమ్మ. శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రుల వారిని హనుంబాబు గారింట్లో ఉండమనటం, అమ్మ తనకొసగిన వరంగా భావిస్తాడు. అన్నయ్య అవతారమూర్తులు ఎప్పుడు ఏది చేస్తారో? ఎలా చేస్తారో? దేనికేది పరిష్కారమో? ఏది ఎందుకు జరుగుతుందో తెలియదు.

అన్నపూర్ణాలయంలో పనిచేస్తున్నప్పుడు మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీలో ఉపన్యాసకునిగా కూడా వుండేవారు. ఆ సమయంలో ప్రత్యేకంగా జపం చేసుకోవటానికి వీలు కుదిరేది కాదు. స్నానం చేస్తూ మాలమంత్రం మననం చేసుకునేవాడు. అమ్మ దగ్గరకు వెళ్ళి "జపం చేసుకోవటానికి సమయం కుదరటం లేదని" చాలాసార్లు అన్నాడు.

అటువంటి పరిస్థితుల్లో "ఎమ్.ఎ. తెలుగు పరిక్షకు వెళ్ళాలని ఏ సెంటర్లో వ్రాయమంటారని" అమ్మను అడిగాడు. ఆ సెంటర్లు 1. విజయవాడ 2. ఏలూరు 3. రాజమండ్రి 4. విశాఖపట్టణము. అమ్మ నాలుగు వేళ్ళు జాపి ఒక వేలు పట్టుకోమంది. అది ఏలూరుకు సంబంధించిన వేలు. "సరే ఏలూరు వెళ్ళి వ్రాయమన్నది అమ్మ. పరిక్షల మధ్యలో అవకాశం వస్తే అమ్మ దగ్గరకు వచ్చాడు అన్నయ్య" యతీంద్రుల వారిని చూశావా?" అని అమ్మ ప్రశ్నించింది. "చూడలేదన్నాడు" అన్నయ్య. ఏలూరులో వుంటారు చూడు అన్నది.

ఏలూరు వాస్తవ్యులు టి.టి. అప్పారావన్నయ్యతో కలిసి యతీంద్రుల వారి దగ్గరకు వెళ్ళాడు. యతీంద్రులవారు అన్నయ్యను చూస్తూనే "నాకో సహాయం చేస్తావా?" అన్నరు. "నేను మీకు ఏమి చేయగలను? అయినా

చెప్పండి అన్నాడు. ఎదురుగా ఉన్న సోఫా చూపిస్తూ దానిపై కూర్చోండి అన్నారు. భారతంలో సంజయుడు రాయబార నిమిత్తం శ్రీకృష్ణునిలో వున్న పాండవుల దగ్గరకు వెళ్ళి లోపల స్త్రీలున్నట్లుగా తెలుసుకొని, చొక్కాపై ఉత్తరీయం సరిచేసుకొని వెళ్ళాడు.

ఆలయంలో భగవత్సాన్నిధ్యానికి వెళ్ళినప్పుడు పురుషులకు ఛాతిపై ఆచ్ఛాదన ఉండగూడదని, అన్యస్త్రీల వద్ద వున్నప్పుడు ఆచ్ఛాదన వుండాలని పెద్దలు అంటారు. శ్రీకృష్ణుడు శయనించి వుండగా అర్జునుడు ఆయన పాదాల వద్ద, తల వద్ద సత్యభామా, ద్రౌపదులు కూర్చుని యున్నారు. సంజయుని రాక చూచిన శ్రీకృష్ణుడుసాభిప్రాయంగా అర్జునిని వైపు చూస్తాడు. అర్జునుడు తన పాదాలుపైకి తీసాడు. అర్జునిని పాద పీఠాన్ని సంజయానికి ఆసనముగా చేశాడు. సంజయుడు వానికి నమస్కారం చేసి క్రింద కూర్చున్నాడు. అనగా ఉత్తములగు పెద్దల ముందు ఉన్నతాసనముపై కూర్చోకూడదు. అది అపచారమౌతుంది. అని ఈ కథ చెప్పి మీరు ఉన్నతాసనంపై కూర్చోవాలి. నేను దిగువనే కూర్చోవాలి అన్నాడు. "ఆయన అనందంతో, ప్రేమతో, లాలనతో వీపు మీద దెబ్బ వేసి సెబాస్" అన్నారు.

అనంతరం జరిగిన గోష్ఠిలో అన్నయ్యకు సమాధానం అడగకుండానే వచ్చింది. ఆ సమాధానం వచ్చిన తరువాత అన్నయ్య అంతర్మధనం గురించి చెప్పారు. అన్నపూర్ణాలయంలో పనిచేయటం ఇష్టం, అమ్మ సేవ చేసుకోవటం ఇష్టం. జపం చేసుకోవటం ఇష్టం. ఇవి అన్నీ కలియటం ఎట్లా సాధ్యపడుతుంది? అని యతీంద్రుల వారిని అడిగాడు. వారు దానికి సమాధానందగా మంత్రానికి అక్షర సముదాయంతో బాటుగా అర్థం కూడా వుంటుంది. అర్థాన్ని భావన చేయటమే అనుష్టానం అని అన్నారు. మీరు వంట చేయాలి, వంట చేయాలి అనుకోవటం మంత్రజపం చేయటం, వంట చేయటం, వడ్డన చేయటం ఇవి అన్నీ మంత్రార్థాన్ని భావన చేయటం, మీరు

ప్రస్తుతం మంత్రార్థమును భావన చేసే పనిలో ఉన్నారు. అంటే అనుష్ఠానంలోనున్నారు. ఇది చాలా ఉత్తమమైన పద్ధతి అయితే ఈ భావన నిలబడాలంటే జపం తప్పనిసరిగా అవసరం కనుక ఏ మాత్రం అవకాశం దొరికినా వ్యాసాలతో సహాజపం చేయవలసిందేనని" చెప్పారు. దానితో అన్నయ్య మనస్సులోని ఆందోళన తగ్గింది. మనస్సుకు సరియైన సమాధానం దొరికిన తరువాత ఉపదేశాలతో పని లేదు కదా!.

అమ్మ మహా చైతన్యంలో కలిసిపోయే ముందు ఆవరణలోని అందరిళ్ళకు వెళ్ళింది. ఒకనెల ముందుగా హనుంబాబు వాళ్ళింటికి కూడా వస్తానని 1985 మే 20వ తేదీని గాయత్రీ భవనంపై భాగాలకు వచ్చి చివరగా సాయంకాలం 4 గంటలకు వీళ్ళ ఇంటికి వచ్చి ఆ రాత్రి అక్కడే నిద్ర చేసింది. మర్నాడు ఉదయం 10 గంటల వరకు ఉన్నది. ఆ తల్లి ఇచ్చిన శక్తితో యథాశక్తి అమ్మను అర్చించుకున్నారు. అప్పటి నుంచీ ప్రతి సం॥ అమ్మ వచ్చిన గుర్తుగా లలితా సహస్రనామ పారాయణ శ్రీ పిల్లలమర్రి సుబ్రహ్మణ్యం శ్రీమతి పద్మావతి దంపతులచే మహాసంకీర్తన చేసుకుంటున్నారు.

+ + +

శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారు మచిలీపట్నం వాస్తవ్యులు. ఆర్ష విద్యాభూషణ, మధురభారతి, పౌరాణికసార్వభౌమ భాగవత సుధాసింధు, మొదలయిన బిరుదులు కలవు. అష్టాదశ పురాణాలను, భారత భాగవతాది ఇతిహాస గ్రంథాలను, ప్రస్తాన త్రయాన్ని సాకల్యంగా అధ్యయనం చేసిన ఋషి పుంగవులు, ఆంధ్రదేశంలోను తమిళనాడు ఒరిస్సా ప్రాంతంలో ఆర్ష విద్యావ్యాప్తికై వేనకు వేలు ప్రసంగాలు చేసిన మహామనీషి శ్రీ రంగారావుగారు.

రంగారావుగారు మచిలీపట్నంలో అయ్యగారి రామూర్తి పంతులుగారు నెలకొల్పిన జైహిందు హైస్కూలులో ఉపన్యాసకులుగా పనిచేశారు. 18 సంవత్సరముల వయస్సులో వారు ఇంటర్వ్యూకి వెళ్ళారు. అప్పటి ఫౌండర్

సెక్రటరీ అయిన డా॥ ఎ.ఎన్. రావుగారు, మిగిలిన సభ్యులు శ్రీ రంగారావు గారి వాగ్ధాటికి, కంఠ మాధుర్యానికి పరవశించారు. పిట్ట కొంచెం – కూత ఘనం అన్నట్లుగా అంత చిన్న వయస్సులోనే ఆయన విధ్వత్తు వారిని ఆకట్టుకుంది. ఆయన చేత మరి రెండు శ్లోకాలు పద్యాలు చెప్పించుకొని విని ఆనందించారు.

ప్రతిరోజు సాయంత్రం మచిలీపట్నంలోనా నాగేశ్వరస్వామి ఆలయంలో ప్రవచనం చేసేవారు. ఆ నాగేశ్వరస్వామి ఆలయంలో చెప్పటం వలనే శ్రీ లలితా పరమేశ్వరి అయిన జిల్లెళ్ళమూడి అమ్మ అనసూయాదేవి అనురాగానికి, ప్రీతిపాత్రులయ్యారేమో!

లలితాకోటి నామపారాయణ అనంతరం విశాఖ సోదరులకు లలితా సహస్రనామాలకు వ్యాఖ్యాణం చెప్పించుకోవాలన్న కోరికను కలుగచేసింది అమ్మ.

కేశవన్నయ్య మరికొందరు సోదరులు జిల్లెళ్ళమూడి వెళ్ళి "విశాఖపట్టణంలో సహస్రనామ భాష్యం చెప్పించుకోవాలని ఉందమ్మా" అని అన్నారు. దానికి అమ్మ "బందరులో శ్రీరంగారావుగారని ఒకాయన ఉండాలి. ఒకసారి ఇక్కడికి వచ్చారు. చాలా చక్కగా మాట్లాడతారు. వారి చేత చెప్పించుకోండి" అని సూచించింది.

అది రహస్య నామం కాబట్టి బయటకు చెప్పవచ్చోలేదో అనే సంశయంతో శ్రీరంగారావుగారు సాహిత్యంలో తమ గురువుగారైన శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మగారితో ప్రస్తావించారు. దానికి వారు "సాక్షాత్తు రాజరాజేశ్వరి అనుమతిచ్చినప్పుడు ఆలోచించవలసిన పనిలేదు." మాకెవరికి లేని భాగ్యం నీకు కలిగిందని ప్రోత్సహించారు. శ్రీ మాధవరామశర్మగారు అమ్మయందు ఎనలేని భక్తిప్రభక్తులు కలవారు. గుంటూరు మాతృశ్రీ అధ్యయన పరిషత్ స్వర్ణోత్సవ వేడుకలలో అమ్మ గురించి అద్భుతోపన్యాసం చేశారు.

ఆ విధంగా లలితా సహస్రనామ భాష్యం మొట్టమొదటి సారిగా వినే భాగ్యం అమ్మ విశాఖపుర వాసులకు కలిగించింది. 24 రోజులు ఆయన అనర్గళంగా, విపులంగా, సుమధురంగా, సులభరీతిలో అమ్మ రహస్య నామాలను వివరించారు. ఆ 24 రోజులు ఒక జ్ఞానయజ్ఞంగా రోజూ ఆధ్యంతాలలో అమ్మకు అర్చనాధులతో ఉపాసన జన హృదయంగమంగా కార్యక్రమం కొనసాగింది.

దానిని టేపు చేయటం జరిగింది. తరువాత జిల్లెళ్ళమూడి అమ్మ సన్నిధిలో వారి ప్రవచనాన్ని వినిపించారు. జగన్మాత అయిన అమ్మ విని పరవశించింది. జిల్లెళ్ళమూడిలో శ్రీ విశ్వజననీ పరిషత్ ప్రచురణ విభాగం ఉన్నా, "ఈ గ్రంథాన్ని మీరు ప్రకాశింప చేయండి నాన్నా" అని ఈ మహదవకాశాన్ని మాకు ప్రసాదించింది అవ్యాస కరుణామూర్తి అమ్మ.

శ్రీ దేవ్యపనిషత్, బహ్వృచోపనిషత్, భావనోపనిషత్తులు మూడింటికి అర్కపురిలో అమ్మ శ్రీరంగారావుగారి ద్వారా లఘువివరణను పరికించింది. దేవీ నవరాత్రులలో జిల్లెళ్ళమూడి మాతృశ్రీ చరణ సన్నిధిలో సభావేదిక ఏర్పాటు చేయించి వారిని ప్రోత్సహించి, ఆ కార్యక్రమమును జయప్రదం గావించింది. దానిని త్రయీవిద్య అన్న పేర గ్రంథరూపమున మాతృశ్రీ అధ్యయన పరిషత్ వారే అచ్చువేయించడం జరిగినది.

వారి అబ్బాయి మల్లాప్రగడ శ్రీమన్నారాయణ జిల్లెళ్ళమూడి మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీలో చరిత్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు. వారికి తండ్రివలె మధుర కంఠం మంచి విమర్శనా చాతుర్యం అలవడింది. ఆయన రామాయణం చెప్పే తీరు శ్రోతలను ముగ్ధులను గావిస్తుంది. జిల్లెళ్ళమూడిలో ఏ సభలు జరిగినా వ్యాఖ్యాతగా శ్రీమన్నారాయణ వ్యవహరించడం అందరికీ తెలిసిన విషయమే.

అమ్మ సమక్షంలో కలాశాల అధ్యాపకులందరూ ఉండగా శ్రీమన్నారాయణను పిలిచి "శంకరాచార్యుల వారు రచనలు చదివావా నాన్నా" అని అడిగింది. "చదివానమ్మా" అన్నాడు. "శంకరులు లలితా సహస్ర నామానికి భాష్యం రాయలేదా" అన్నది. "లేదమ్మా అని లలితామ్మవారిని వర్ణిస్తూ వంద శ్లోకాలతో సౌందర్య లహరిని" రాశారు. దానికి ఎందుకు రాయలేదు? అని అడిగింది అమ్మ. తెలియదమ్మా అన్నాడు. దానికి అమ్మ "మీ నాన్న వ్రాస్తాడని శంకరుడు వదిలేశాడని" అమ్మ చమత్కరించింది.

చమత్కారంగా అన్నా శ్రీరంగారావుగారి రచనా శక్తిని సామర్థ్యాన్ని ప్రజ్ఞాదురీణుడని శంకరాచార్యుల వారు దగ్గరగా అమ్మ తీసుకువెళ్ళిందంటే ఆయన ఎంతటి పాండిత్య ప్రకర్ష కలవారో విధితమౌతుంది.

లలితా సహస్ర నామ భాష్యంతో పాటు దేవీ భాగవతం 24 రోజులు, లలితా ప్రాభవం 10 రోజులు శ్రీరంగారావుగారు చెప్తుండగా వినే అదృష్టాన్ని మాతృశ్రీ అధ్యయన పరిషత్ వారు విశాఖ వాసులకు కలుగచేసారు. లలితా ప్రభావాన్ని లాసెన్స్‌బే లోని శాంతి ఆశ్రమంలో చెప్పించడం జరిగింది. కమనీయమైన, ఎటువంటి చప్పుళ్ళు మోతలు వినిపించని ఆశ్రమ వాతావరణంలో చాలా అనువుగా ఉంది అనిపించింది. అక్కడ వారు ప్రవచనాలు చేస్తున్నప్పుడు అమ్మ ఫోటోలోంచి ముందుకు వంగి చెవియొగ్గి వింటున్నట్లుగా అనేకులకు దృశ్యమానమైంది.

"కలువ కన్నుల వెన్నెల కన్నతల్లి
కామితార్థముల నొసగెడు కల్పవల్లి
భక్తజన చాతకాంబుద భాగ్యవల్లి
ముక్తిదాయిని 'జిల్లెళ్ళమూడి తల్లి"

\+ + +

కొండముది రామూర్తిగారు రైల్వే ఉద్యోగి. వారి స్నేహితులు వల్లూరి రామ్మోహనరావుగారి ద్వారా అమ్మ అమ్మ దర్శనంకు వెళ్ళారు. గజేంద్రమక్కయ్య ఇంటి సందులో రామూర్తిగారు, రవి అన్నయ్య ఏదో విషయంపై చర్చించుకున్నారు. అమ్మ దర్శనార్థం వెళ్ళినప్పుడు అమ్మ ఆ విషయాన్ని ప్రస్తావించి రవి చెప్పాడన్నది. దానితో ఆశ్చర్యపోవటం అన్నయ్య వంతయ్యింది. ఎందుకంటే అంతమటుకు ఆయన రవి అన్నయ్య కలిసే ఉన్నారు. రవి అన్నయ్య చెప్పడానికి అవకాశమే లేదు. దానితో అన్నయ్యకు అమ్మ సర్వజ్ఞత బోధపడింది.

ఉద్యోగ విరమణానంతరం అమ్మ సన్నిధిలో నివాసమేర్పరచుకున్నారు. అమ్మ ఆనతి మేరకు ఆయన విశ్వజననీ పరిషత్ కార్యదర్శిగా ఉండి తమ సేవలను అందించారు. అన్నయ్య అనారోగ్యం పాలౌతాడని అమ్మ ముందుగానే సూచించింది. కానీ అన్నయ్య దానిని అంతగా పట్టించుకోలేదు. తరువాత ఆయనకు పెరాస్సిస్ రావటం వలన హైదరాబాద్‌లో పిల్లల దగ్గర నివాసమేర్పరచుకున్నారు. ఆయన మంచంలో ఉన్నా కూడా అమ్మ సంస్థకు ఎనలేని సేవ చేస్తున్నారు. ఫోన్ తన ప్రక్కనే పెట్టుకొని గోపాలన్నయ్యకు, లక్ష్మణరావుగారికి, పూర్ణచంద్రరావుగారికి, సలహా సంప్రదింపుల రూపంలో ఆయన చేతనైన సహాయం చేస్తున్నారు.

ఎమ్.కె.ఎల్. రావు రామూర్తిగారి అల్లుడు. వారి మార్గంలోనే అతనూ నడుస్తూ "మదర్ ఆఫ్ ఆల్" అను పత్రికకు చేతనైన సహాయాన్ని చేస్తూ విశ్వజనని సేవ చేసుకుంటున్నారు.

+ + +

అపార కరుణామయి అమ్మ గుండెల్లో స్థానం సంపాదించుకున్న బిడ్డలలో అమెరికా దేశస్థుడైన గార్డెన్ వెష్టర్‌లండ్. తన చుట్టూవున్న ప్రకృతిలో అమ్మను దర్శించుకోగలగటం ఎందరికి సాధ్యం అవుతుంది. తన వెంట కుక్క వస్తుంటే

అమ్మే ఆ రూపంలో వచ్చిందని తన కోసం ఉంచుకున్న ఆహారాన్ని నివేదన చేసి ఉత్తచేతులతో ఎందరు ఇంటికి చేరుకోగలరు? పిచ్చుకల కిలకిలలో అమ్మ గొంతులోని శబ్దాన్ని మిణుకు మిణుకు మనే నక్షత్రాలలో అమ్మ కన్నులలోని మిళమిళలను చూడగలిగిన ధన్యజీవులెంతమంది ఉన్నారు.

"గార్డెన్ ఆఫ్ ఫ్లవర్స్" అను గ్రంథంలో తన అనుభూతులను అతి రమ్యంగా, అందంగా వర్ణించాడు.

వెష్టర్‌లండ్ క్రీష్ట్రటూత్ ఫౌండేషన్ డైరెక్టరై ఉండి క్రీస్తు దేవుని బిడ్డ అయితే అమ్మ దేవుడే అని ప్రకటించటం అతనిలోని పరిణితికి నిదర్శనం. అతను అమ్మను భౌతికంగా చూడలేదు. ఈ దేశం వచ్చి ఒక్కసారి కూడా చూడకుండానే అంత ప్రభావితుడైన అతన్ని అమ్మని చూడడానికి భారతదేశం రావలసిందిగా ఆహ్వానించారు. అమ్మ రూపాన్ని చూసి ఇంకా ఎంత ఆనందిస్తాడో అని వీళ్ళ ఆలోచన. "అమ్మను ఇక్కడి నుంచి నేను కూడకపోతే గదా! అక్కడికి రావలసింది అని సమాధానం ఇచ్చాడు. ఆ విషయం అమ్మకు చెబితే "ఔనురా వెష్టర్‌లండ్ జిల్లెళ్ళమూడిలో ఉన్నాడు వీరే అమెరికాలో వున్నారని మందలించింది. అతను అమ్మ భౌతిక దేహానంతరం జిల్లెళ్ళమూడి వచ్చారు. కష్టంలో, సుఖంలో కూడా క్రుంగు పొంగులు లేకుండా ఉండటం ఎంతమందికి సాధ్యం అవుతుంది. అతను స్థితప్రజ్ఞుడు. అతన్ని అమెరికాలో జాతివిద్వేషంగల నీగ్రోలు కొందరు వచ్చి చావబాది పోయారు. ఈరోజు అమ్మ ఇలా ఆగ్రహించిందని అనుకున్నాడు. మర్నాడు వాళ్ళే ఇంటికి వస్తే ఏమీ జరగనట్లే వాళ్ళను ప్రేమతో పలుకరించాడు. అతని ప్రవర్తనకు ఆశ్చర్యచకితులై క్షమాపణ కోరుకున్నారు.

ప్రతి పనిలోను సర్వకాలాల్లోను అమ్మ తన ముందు నడుస్తూ త్రోవ చూపిస్తుంటే ఆ వెలుగులో, ఆ త్రోవలో తాను నడిచి పోతున్నానని వెష్టర్‌లండ్ చెప్పాడు. తన అనుభవంలోని అమ్మ తత్వాన్ని అర్థం చేసుకొని అమ్మ చెప్పినట్లు

నడుస్తున్న ఏకైక వ్యక్తి వెష్టర్‌లండ్ అని సోదరుడు జేమ్సు ప్రసంశించాడు.

అతను కష్టించి పనిచేసి కూడపెట్టిన పైసా పైసా మొత్తంను సంవత్సరానికి అమ్మకు పంపుతూ అందులో ఒక డాలరు మాత్రం అమ్మ ప్రసాదంగా తను ఉంచుకోవటం ఎంతమందికి సాధ్యపడుతుంది. 15 రోజులు జ్వరంతో మంచం దిగని పరిస్థితి వస్తే ఇన్నాళ్ళకు అమ్మ నాకు విశ్రాంతి ప్రసాదించిందని ఎవరు భావించగలరు?.

వాత్సల్యపూర్ణమైన వీక్షణతో ప్రసన్నదరహాస భాసురమైన వదనంతో కోటి సూర్యకాంతులీను కిరీటంతో అనసూయేశ్వరాలంలో వెలుగొందుతున్న అమ్మను చూచిన వెష్టర్‌లండ్ ఆనందపారవశ్యం మునిగాడు. ఆ తపస్సు హృదయంలో భగవతి సాక్షాత్కారానుభూతి కలిగింది. ఆ తల్లీబిడ్డల అనుబంధం అటువంటిది. అన్నాళ్ళకైనా ఈ పవిత్ర భారతదేశంలో అర్కపురిలో అడుగుపెట్టి అమ్మని చూచి పరవశించాడు. ఆదరణీయ పూర్వక వ్యక్తిత్వంతో చెరగని ముద్రవేసిన సోదరుడు వెష్టర్‌లండ్. భక్తునికి భగవంతునికి ఉన్న ఆత్మీయతకు అతను ఒక ఉదాహరణ.

+ + +

విశాఖపట్టణం నుంచీ అమ్మ జన్మదినాన్ని పురస్కరించుకొని జిల్లెళ్ళమూడి వెళ్ళాం. మాతోపాటు కోరమండల్‌లో పనిచేసే సత్యనారాయణ గారి భార్య మొదటిసారిగా వచ్చింది. అందరం తిరిగి వచ్చినా సరళ అమ్మ దగ్గరే వున్నది. అక్కడ బి.హెచ్.ఇ.యల్. పనిచేస్తున్న సూరన్నయ్య అనుభవాలు విని పరవశించిపోయింది.

ఆ తరువాత జిల్లెళ్ళమూడిలో వైజాగ్‌వాళ్ళు కట్టించిన బిల్డింగ్‌కు అమ్మ 'శ్రీ మాతా' అని నామకరణం చేసింది. అది కట్టే సమయంలో సత్యనారాయణ గారు తరచూ జిల్లెళ్ళమూడి వెళ్ళేవారు. సరళకు ఆయనతో పాటూ తనకు వెళ్ళాలని వున్నా పిల్లల చదువులతో వీలు అవలేదు. ఒకమారు అమ్మ దగ్గరకు

వెళ్ళాలన్న ఆర్తితో భోరున ఏడ్చేసింది. "అమ్మ నన్ను రానీయటం లేదని". అమ్మ తాను ఎంతైనా మనకోసం బాధ పడ్తుంది కానీ మన బాధను చూడలేదు. అందుకే సత్యనారాయణగారితో పాటుగా సరళ వాళ్ళ పిల్లలు మాధవి, కృష్ణ, గీత, జ్యోతి, అఖిలేష్‌లను కూడా అమ్మ తన సన్నిధికి పిలిపించుకుంది.

అమ్మ దర్శనానికి వెళ్ళగానే సరళ బావురుమని ఏడ్చేసింది. అమ్మ అక్కయ్య వీపు నిమురుతూ "నాలుగు రోజులు నా దగ్గర వుందువుగాని" అని ఓదార్చింది. ఆ సమయంలోనే చాగంటి శరభలింగం గారు, సువర్చల, పిల్లలు ఇందు, రాజేష్ లను తీసుకువెళ్ళారు. వీళ్ళందరికీ కలిపి ఒక రూమ్ ఇచ్చారు. దానికి బాత్‌రూమ్ లేకపోవటంతో చాలా ఇబ్బంది పడవలసి వచ్చింది. అమ్మ సర్వజ్ఞ కదా! వెంటనే వాళ్ళ మకాం హైమాలయం ఆఫీసు పక్కకు మార్పించింది.

ఆ సమయంలో అమ్మ నోట వెలువడిన ఆణిముత్యాలను సరళక్కయ్య ఏరుకున్నవి. "అందం యంత్రం, మనస్సు మంత్రం". అందం వుంటే సంవత్సరాలో, నెలలో, రోజులో ఎప్పుడైనాపోవచ్చు. ఎంత అందమైన వాళ్ళకైనా ఆటలమ్మ, స్ఫోటకం లాంటివి వస్తే అందం అంతా పోతుంది. మానసికమైన అందం ఎప్పటికీ నిలిచేవుంటుంది.

"వ్యక్తులు కాదు. మనసే రాజకీయం" అని అమ్మ అన్నది. ఇన్‌కంటాక్సు ఆఫీసర్ సకుటుంబంగా అమ్మను దర్శించారు. ఆయన సత్యసాయిబాబా యూనివర్సిటీ గురించి ప్రస్తావించారు. అప్పుడు అమ్మ "ఆంధ్రాయూనివర్సిటీ, ఉస్మానియా యూనివర్సిటీల్లా కాకుండా వ్యక్తి పేరున యూనివర్సిటీ వుండ వచ్చా? అని ఆయన్ని ప్రశ్నించింది. దేశం మొత్తం మీద ఉన్న సాయిబాబా కాలేజీలన్నింటినీ కలిపి ఎడ్మినిస్ట్రేషన్ కోసం సాయిబాబా ఎడ్యుకేషనల్ ట్రష్టు" పెట్టారని తెలియచేసారు.

అమ్మ మాధవిని చూపించి "ఎప్పుడూ దీనికి నా ధ్యాసే, అందరి పిల్లల్లా

ఆడుకోవాలనిపించదు దానికి. ఎప్పుడూ నా దగ్గరే దీని మనస్సని" పార్థసారథి అయ్యంగారితో చెప్పింది.

హైమాలయంలో పూజ చేసే రంగారావు గారు అమ్మకు గులాబీ పూలు పెట్టి పూజచేసుకున్నారు. అందులోని గులాబి రేకులను తీసుకొని గోటితో కన్ను, ముక్కు, నోరు చేసి ఈ ముఖం ఏ అమ్మాయిది? "అంటూ నేనే" అని చెప్పి ఆ రేకులను ప్రక్కనే ఉన్న మాధవికి ఇచ్చింది.

ఒక సాయంత్రం అమ్మ, పార్థసారధి గారు, రవి అన్నయ్య, రమాదేవి కూర్చుని ఉండగా వీళ్ళు వెళ్ళి కూర్చున్నారు. సంభాషణలో "చెట్టుముందా, విత్తుముందా? అనే ప్రశ్న ఉదయించింది. దానికి అమ్మ విత్తు మొలకెత్తడానికి అనగా మొలక రావటానికి, పంచభూతాలు కలిసే ఒకానొక అనుకూల పరిస్థితి కావాలి. అట్టి పరిస్థితి ఏర్పడినప్పుడు మొలక దానంతట అదే మొలకెత్తుతుందని" చెప్పింది.

రంగారావు గారు అమ్మకు పారిజాతాలతో పూజ చేసుకున్నారు. అమ్మ అలా మాట్లాడుతుండగానే, ఆపూలు వాడిపోయాయి. ఆ పూలను మానవజీవితాలతో పోలుస్తూ "కొద్దిసేపు క్రిందట ఆ పూలు తాజాగా వున్నాయి. ఇప్పుడు వాడిపోయాయి. మళ్ళీ తాజా పూలు పూయటం వాడిపోవటం జరుగుతూనే వుంటుంది. చెట్టు మాత్రం అలాగే వుంటుంది. మనుషులు అంతే పుడ్తుంటారు, మరణిస్తుంటారు. కానీ ప్రపంచం దేని కోసమూ ఎవరి కోసమూ ఆగదు" అన్నది అమ్మ. వెంటనే పార్థసారధి గారు "ఈ అమ్మపోతే మరో అమ్మ వస్తుందా? అని అమ్మను అడిగారు. అమ్మ బదులివ్వలేదు. అలా సంభాషణ కొనసాగుతూనే వుంది. అమ్మ వీరిని వుండమని పక్క గదిలోకి వెళ్ళింది.

పార్థసారధి గారు తల మీద పాదుకలు పెట్టుకున్నట్లు అభినయించి "రాముడి దగ్గరకు భరతుడు వెళ్ళి పాదుకలను తీసుకువెళ్తూ, తిరిగి రాముడ్ని

వదలి భరతుడు వెళ్ళలేదని గ్రహించి తానే పర్ణశాలలోకి వెళ్ళిపోయాడు. అలాగే అమ్మ కూడా మనని వెళ్ళమని చెప్పలేక, మనం కూర్చుని వుండగా మనం లోపలికి తానే ముందు వెళ్ళిపోయింది"అని చమత్కరించారు. అది నిజమే అయింది. తరువాత అమ్మ బయటకు రాలేదు. ఆ గదిలోనే వుండిపోయింది.

పరిణామ సిద్ధాంతాన్ని అమ్మ వివరించిన తీరు అద్భుతం, అనూహ్యం. "నేను కచ్చికతో ముఖం కడుక్కుంటే పంటపొలాలు గుర్తుకు వస్తాయిరా!" అని చెప్పింది. అమ్మ సన్నిధిలో వున్న శ్రీ రంగారావు గారికి ఆ మాట అర్థం కాలేదు. దానికి అమ్మే "పంట పొలాల్లో ధాన్యం పండితే, ఆ గడ్డి పశువులు తినివేసిన పేడతో పిడకలు తయారుచేస్తారు కదా! ఆ పిడకల్ని కాలుస్తే కచ్చిక వస్తుంది అని మనకు అర్థం గాని పరిణామ సిద్ధాంతాన్ని చిన్న విషయం ద్వారా బోధపరచింది.

వీరంతా కూర్చుని వుండగా అమ్మ దగ్గరకు బాపట్ల నుంచీ ఇద్దరు వచ్చారు. అందులో ఒకరిని పిలిచి విసరమంది. దానికి ఇంత చల్లగా వుండి పిల్లగాలులు వీస్తుంటే ఇప్పుడు అమ్మ విసరమన్నదని ఆశ్చర్యపోయారు. ఎవరైన సరే అమ్మకు పూజ చేసుకోవాలంటే వారికి అమ్మ ఇవ్వవలసిన అవకాశమే. ఒక గంట సేపు విసిరి వెళ్ళిపోతూ "ఎన్నో రోజులగా నాకు చెయ్యి నొప్పిగా వుంది. ఆ నొప్పి మాయమయిందని" మహదానంద భరితుడయ్యాడు. "నా చేతి నొప్పి పోగొట్టటానికే అమ్మ ఆవిధంగా తన చేత విసిరించుకుందని" మురిసిపోయారు.

పిల్లలంతా కింద ఆడుకుంటున్నారు. మాధవి మాత్రం అమ్మని వదిలి పెట్టి వెళ్ళలేదు. ఎప్పుడూ ఎవరికీ వెళ్ళమని చెప్పని అమ్మ ఆ రోజు వీరిని క్రిందకు వెళ్ళమంది. ఆశ్చర్యంతో క్రిందకు దిగి వచ్చారు. అన్నపూర్ణాలయంలోని ఇనప స్థంభం కొట్టుకోవటంతో గీతకు నుదిటి మీద దెబ్బ తగిలి రక్తం స్రవిస్తోంది. సర్వాంతర్యామియైన అమ్మకు తెలియంది

ఏముంటుంది. అందుకనే వీళ్ళను సమయానికి అక్కడికి పంపించింది. ఆ సాయంత్రం గీతను తీసుకువెళ్ళి చూపిస్తే అమ్మ చాలా బాధపడింది. "పిల్లలు ఆడుకోవటానికి సరియైన స్థలం లేదని, బళ్ళతో ఇసుక తెప్పించి గ్రౌండ్‌లో పోయిస్తే బాగుంటుందని సూచించింది. గీత దెబ్బకు "కసిందాకు" పిండి రసం దెబ్బమీద వేస్తే వెంటనే దెబ్బ తగ్గిపోతుందని" చెప్పింది అమ్మ. మన ఇళ్ళల్లో పిల్లలకు దెబ్బలు తగిలితే ఎంత కంగారు పడతామో దానికి వందరెట్లు బాధపడింది అమ్మ.

సత్యనారాయణగారి కుటుంబానికి, శరభలింగంగారి కుటుంబానికి తాను అన్నం పెడ్తానని వసుంధరక్కయ్యచేత కబురు పెట్టింది. యథా విధిగా పప్పు, కూర, పచ్చడి కలిపి పెట్టింది. సరళా పచ్చడి అన్నం అయనకు పెట్టు. ఆ కారం నువ్వు తినలేవు" అని చెప్పింది. సరళకు రెండు మార్లు పెరుగు అన్నం పెట్టింది. అంత మధురాతి మధుర పదార్థం జీవితంలో రుచి చూడలేదని, మామూలుగా తినే దాని కంటే 3,4, రెట్లు ఎక్కువ తిన్నారు.

నామ పారాయణ చేసే విషయంలోని నియమనిబంధనల గురించి అందరూ చర్చిస్తున్నారు. అది విన్న "అమ్మ నామం అరుచి కాకుండా వుంటే చాలు, ఆశుచి కాదు" అని చెప్పింది. అంత మటుకూ తర్జన భర్జనలు పడ్తున్న వారంతా నోట మాట రాక వుండిపోయారు. వీళ్ళునవరాత్రులకు ముందు 12 రోజులున్నారు. వైజాగ్ వెళ్దామని అమ్మతో చెప్పారు. "పాడ్యమి పూజ చేసుకొని" వెళ్ళమంది. తీరా పాడ్యమి ముందు రోజు దర్శనానికి వెళితే "ఈ రోజేగా మీరు వెళ్ళేదని" అడిగింది. వీళ్ళు తెల్లబోయి అలాగే వెళ్తామమ్మా అన్నారు.

ఆ ఉదయమే సరళ వాళ్ళ అబ్బాయిని, సువర్చల వాళ్ళ అబ్బాయినీ ఆవరణలో మల విసర్జన, వాంతి చేసుకున్నారని కొట్టారు. వీళ్ళు దర్శనానికి వెళ్ళగానే "ఎవరి పిల్లల మలమూత్రాలను వాళ్ళు శుభ్రం చేయడమే ఈనాటి

తల్లులకు కష్టంగా వుంది. అలాంటిది అందరి మలవిసర్జనను శుభ్రం చేసే పాకీ మనిషి సంఘమాత కదా!" అని వీరి వంక చూచింది. దానితో వీరిద్దరూ తల దించుకున్నారు. జగజ్జనని అయిన అమ్మకు ఎక్కడ ఏమి జరుగుతోందో తెలియంది లేదు కదా!

శ్రీ మల్లాప్రెగడ శ్రీరంగారావుగారు తామర తాడులోని సన్నని దారం తీస్తూ "బిసతంతు తనీయసీ" అని అన్నారు. అమ్మ వెంటనే "మహా ప్రళయ సాక్షిణి" కూడా వుంది అన్నది. ఇదేమిటి అమ్మ ఇలా అన్నదని భయపడ్డారు. వైజాగ్ వీళ్ళు చేరిన తరువాత తెల్సింది ఏమిటంటే "మూడు రోజులుగా భారీ వర్షాల కారణంగా బస్సులు ఆగిపోయాయి. వీళ్ళు వచ్చిన రైలేచివరిది. రైల్వేట్రాక్ దెబ్బతినటంతో అటునుంచీ వచ్చే రైళ్ళను నిలిపేసారు. వారం రోజులుదాకా రైళ్ళను కాన్సిల్ చేసారు. "సర్వ ప్రళయ సాక్షిణి" అయిన అమ్మకు తెలియంది ఏముంది? పాడ్యమి పూజ చేసుకోకుండా అమ్మ పంపించేసిందని ముందు బాధపడ్డా, అర్థాంతరంగా ఏ మధ్యలోనో నిలిచిపోయి ఇబ్బంది పడకుండా ఇంటికి చేర్చిన అవ్యాజకరుణామయి అయిన అమ్మకు మనస్సు లోనే ధన్యవాదాలర్పించారు.

సత్యనారాయణగారు పదవీ విరమణానంతరం వారి సొంత వూరిలో డైరీఫామ్ పెట్టుకున్నారు. ఆ వూరి వారందరినీ సత్సంగానికి ఆహ్వానించి అమ్మ గురించి తెలియచేస్తూ దసరాల్లో వారందరి చేత లలితాసహస్రనామార్చనలు చేయించారు. దుర్గాష్టమికి 400 మందికి ఆ పల్లెటూర్లో అమ్మ ప్రసాదం వినియోగం జరిగింది. రోజు సాయంత్రం సత్సంగం జరుపుతూ అమ్మ జీవిత చరిత్రతో పాటు రామాయణ భారత భాగవతాలను చదివి వినిపిస్తున్నారు. ఆయన వెళ్ళిన తరువాత ఆ వూరు తీరే మారిపోయిందని అనుకుంటున్నారు. అందరూ ఆయన ఒరవడిలో కొంతలో కొంతైనా అలవరచుకుంటే దేశమే స్వర్గసీమ అవుతుంది.

వారి కుటుంబంలోని వారందరూ అమ్మ ధ్యాస, మననాలతోనే కాలం గడుపుతారు. ప్రతి ఒక్కరూ జీతం రాగానే అమ్మకు కొంత అర్పించిన తరువాతే వారి ఖర్చులకు తీసుకుంటారు. అమ్మ పిల్లలంతా వారిని అనుసరిస్తే వసుధైక కుటుంబం అంటూ వేరెక్కడా వుండదు. అమ్మ పిల్లలే దానికి మార్గదర్శకులౌతాం.

మన పిల్లలందరూ కూడా వారి పిల్లలను అనుసరిస్తే అన్న భావనతోనే కడుపు నిండిపోతున్నది. దానిని అమ్మ ఎప్పటికి సానుకూల పరుస్తుందో!. ప్రతి నిమిషం అమ్మ మన మధ్యనే ఉన్నదన్న భావన బలీయమౌతోంది. శ్రీ విశ్వంజీ చెప్పినట్లుగా ఒక్కోరు ఒక్కరూపాయి ఇచ్చినా కోటి రూపాయలకు తక్కువ అవ్వదు. సంస్థకు డబ్బు లేకపోవుటమనేది లేదని చెప్పారు కదా!

సత్యనారాయణగారి పెద్ద అమ్మాయి మాధవీలత. వైజాగ్‌లో జూనియర్ ఇంజనీర్‌గా పనిచేస్తోంది. మొదటిసారి అమ్మను దర్శించినప్పుడు చీకటిలో అమ్మ నవ్వు, బులాకీ తప్ప అమ్మ స్పష్టంగా కనిపించలేదు. తిరిగి వచ్చేటప్పుడు అమ్మ వుండమన్నా, పని వుందని వచ్చేసారు. దాని పర్యవసానంగా రైలుకిక్కిరిసి వుండటంతో బాపట్ల నుంచీ కొంతదూరం ఫుట్‌స్టెప్పు మీద నిలబడి రావాల్సి వచ్చింది. అమ్మ వుండమన్నప్పుడు బయలుదేరటం మన అవివేకమే అవుతుంది. ఈ విషయం అమ్మ పిల్లలందరికీ విదితమే.

దసరాల్లో వెళ్ళినప్పుడు చాలామంది పెద్దలు కూర్చుని వున్నారు. వెళ్ళటమా, మానటమా అని అనుకుంటోంది. అమ్మే పిలచి పాలు తాగిరమ్మంది. మాధవికి ఊహతెల్సినప్పటి నుంచీ ఎప్పుడూ పాలు తాగలేదు. ఆ వాసనే గిట్టదు. అలాంటిది అమ్మ మీద కల భక్తిభావంతో వసుంధరక్కయ్యను అడిగి పాలు తాగింది.

వైజాగ్‌లో వాళ్ళ పక్కవాళ్ళు బాపట్ల నుంచీ వచ్చారని, అమ్మ గురించి

తెలుసుకోవాలన్న తపనతో అమ్మ గురించి చెప్పమని అడిగింది. దానికి అతను "అమ్మ పాదాల క్రింద డబ్బు ముద్రించే మిషన్ వుందని" చెప్పారు. ఆ మాట విని చిన్న పిల్ల అయిన మాధవి తట్టుకోలేకపోయింది. మళ్ళీ అతని ముఖం చూడటానికి కానీ మాట్లాడటానికి కానీ ఇష్టపడలేదు.

జిల్లెళ్ళమూడి అమ్మ దర్శనానికి వెళ్ళినప్పుడు మాధవి చెప్పాలనుకుంటే వాళ్ళ నాన్న గారు చెప్పనీయకుండా ఆపేసారు. అది చూచి అమ్మ "దాని బాధ ఏమిటో దాని చెప్పనివ్వరా?" అన్నది. వెంటనే తాను విన్న విషయాన్ని అమ్మకు నివేదించింది. దానికి అమ్మ "నేను హైద్రాబాద్ వెళ్ళినప్పుడు మా కారు పక్కనుంచే మైకులో అమ్మ చెడ్డదని చెప్పారు. అది విని అసలు ఈ అమ్మ ఎవరో, ఎలా వుంటుందో చూడాలని ఇంకా ఎక్కువ జనం వచ్చేవారు నాన్నా!" అని చెప్పింది.

జిల్లెళ్ళమూడి నుంచి తిరిగిరావాలంటే చాలా బాధగా వుండేది. అమ్మ దర్శనానికి వెళ్ళినప్పుడు అమ్మ పాదాలు పట్టుకొని మాధవి "నేను నిన్ను వదిలి వెళ్ళనమ్మా! ఇక్కడే వుంటానని" ఏడ్చింది. మాధవిని ఓదారుస్తూ అమ్మ తన మంచం మీద దుప్పటి ఇచ్చి గౌను అయితే కుట్టించుకో, లేకపోతే కప్పుకోమని" చెప్పింది. అయినా అమ్మను వదిలి రావటానికి మాధవికి మనసొప్పలేదు. వెళ్ళననే ఏడ్చింది. అది చూచిన 'అమ్మ' కళ్ళల్లోంచి నీరు చిమ్మింది. అమ్మ చింతపిక్క కలర్ చీరె కట్టుకుంది. అమ్మ కళ్ళు కూడా ఆ రంగులోకి వచ్చాయి. అమ్మ దుఃఖించటం చూచి గదిలో వారంతా ఏడ్చారు.

అమ్మ "అది ఏం కావాలన్నా ఇచ్చేదాన్ని కానీ అది ఏమీ అడగటం లేదని" అన్నది. అక్కడే వున్న మల్లాప్రెగడ రంగారావు గారు "ఆ అమ్మాయికి నీవు వినా వేరే అక్ఖరలేదు" అని అన్నారు. సత్యనారాయణ గారితో "దాన్ని ఇక్కడ వుంచి వెళ్ళరా'' అన్నది అమ్మ. మళ్ళీ దుర్గాష్టమికి వచ్చి తీసుకువెళ్ళమంది. సరే అని మాధవిని, కృష్ణను అక్కడే వదలి వీళ్ళు వచ్చేసారు.

ఆ పది రోజులు వారి జీవితాల్లో స్వర్ణయుగమే. సాక్షాత్తు రాజరాజేశ్వరి సేవ చేసుకునే అదృష్టం వారికి కలిగింది. చిన్నతనంలోనే జీవితంలో మరుపురాని మధుర ఘట్టాలను చవి చూచినవారు ఎంత అదృష్టవంతులు కదా!

అమ్మ సన్నిధిలో వుండగా అమ్మ మాధవితో "వర్షం పడుతోంది దారంతా బురదగా వుంటుంది. హైమాలయానికి వద్దులే నాదగ్గరే కూర్చోమన్నది". మాధవికి అమ్మ సన్నిధే పెన్నిధి. వాళ్ళ తమ్ముడు కృష్ణాని హైమాలయానికి వెళ్ళి పూజచేసుకోమంది. అతనికి పూజలు చేయటం ఇష్టం. అమ్మవారివారి ఇష్టప్రకారమే చేయిస్తూ తన దోవలోకి తెచ్చుకుంటుంది. చిన్నతనం వల్ల కృష్ణకు అమ్మ మీద కోపం వచ్చింది. "నిన్ను బురదగా, వర్షంగా వుంది వద్దని తన దగ్గర కూర్చోబెట్టుకుంటుంది. నీ కంటే చిన్నవాడిని నన్ను బురదలో వెళ్ళమన్నద"ని అనుకున్నాడు.

హైమాలయం మైక్‌లో నుంచీ అష్టోత్తరం వినిపించింది. "ఎవరు చదువుతున్నారు?" అని అమ్మ అడిగింది. దానికి పక్కనే వున్న రవి అన్నయ్య మాధవిని చూపించి వీళ్ళ తమ్ముడు చదువుతున్నాడని" చెప్పాడు. "బాగా చదువుతున్నాడని" అన్నది. అది అన్యోపదేశంగా నన్ను నేర్చుకోమని అమ్మ చెప్పిందని మాధవికి అనిపించింది. కృష్ణ హైమాలయం నుంచి వచ్చాక అమ్మ కృష్ణను బాగా చదువుతున్నాడని మెచ్చుకున్న విషయం చెపితే ఆనందడోలికలలో ఊగులాడాడు. ఆ విధంగా అతని బాధను దూరం చేసింది. ఎవరిలో ఏ కొంచెం టాలెంట్ వున్నా దానిని అందరికీ తెలియచేసే విశ్వజనని అమ్మ.

మాధవికి పెళ్ళి నిశ్చయమయిన తరువాత వాళ్ళ నాన్నగారు ముహూర్తం పెట్టించటానికి వెళ్ళారు. మాధవి తన పెళ్ళి మే 5 న జరగాలని అమ్మను కోరుకుంది. ముహర్తం మే 4 అర్ధరాత్రి 12.05 ని॥లకు నిశ్చయమైంది. 12 గం॥లు దాటితే 5వ తారీకే కదా! అమ్మ తన కోరిక మన్నించి తన్ని

ఆశీర్వదించిందని పొంగిపోయింది. తన పెళ్ళి జిల్లెళ్ళమూడిలో జరగాలని అనుకుంది. ఆ కోరిక తీరకపోయినా అమ్మ పెళ్ళి జరిపించినట్లు కలవచ్చింది. దానితో తన కోరిక తీరలేదన్న వ్యధ దూరం అయింది.

సత్యనారాయణగారు పెళ్ళికి ముందు జిల్లెళ్ళమూడికి వెళ్ళి 'అమ్మకు నాన్నగారికి హైమక్కకు బట్టలు పెట్టి వచ్చారు. పెళ్ళి అయిన నాలుగోరోజు అనగా మే 8వ తేదీన కొత్త దంపతులు అమ్మ దర్శనానికి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. ఆ రోజువీళ్ళు వెళ్తునట్లు కబురు చేయులేదు. అమ్మ వీళ్ళను ఆశీర్వదించటానికాఅన్నట్లుగా పెళ్ళికి ముందు అమ్మకు వీళ్ళు పెట్టిన చీరె కట్టివుండటం మహిమ కాక మరేమవుతుంది. దానితో వారి ఆనందానికి అవధులు లేవు.

ఆ అమ్మాయి హైమక్క పుట్టినరోజుకు వెళ్ళారు. బాగా రష్‌గా వుందని మిగిలినవారు వెళ్ళిపోయినా మాధవి చిన్నపిల్ల అక్కడే వుండిపోయి ఆ వేడుకలన్నీ చూస్తోంది ఈలోగా సరస్వతక్కయ్య "అమ్మ నీకు చీరె పెడ్తుంది" అనిచెప్పింది. అమ్మ చీరెపెడ్తుందన్న ఆనందంతో ఎలాగో వారందర్ని తప్పించుకొని అమ్మ దగ్గరకు వెళ్ళింది. ముందుగా కూర్చుంది అప్పటికి మాధవి గౌన్లు తొడుక్కొంటున్నది. అయ్యో పరికిణీ కానీ, చీరెగాని కట్టుకుంటే అమ్మ ఇచ్చేదేమో అని ఆలోచిస్తోంది.

ఇంతలో అమ్మ "చీరె కట్టుకుంటావా?" అని అడిగింది. చిన్నపిల్ల చీరె ఏం కట్టుకుంటుందని రామకృష్ణఅన్నయ్య ఆలోచిస్తుంటే మాధవికి అన్నయ్య మీద చాలా కోపం వచ్చింది. అమ్మ మాధవిని పిలిచి బొట్టుపెట్టి చీరె ఇచ్చింది. హైమక్కకు ఎలా తినిపించిందో అలాగే ప్రతిఒక్కరికీ తినిపించింది అమ్మ. అమ్మ దగ్గర నుంచీ తిరిగివచ్చేయాలంటే చాలా బాధగా వుండేది.

మాధవిని "ఏం చదువుకుంటావమ్మా?" అని అమ్మ అడిగింది ఇంజనీరింగ్ చదువుతానని చెప్పింది. అంతమటుకు చదువులో ఏవరేజి

స్టూడెంటు అయిన మాధవి కోరిక తీర్చటానికా అన్నట్లుగా మంచిమార్కులు రాసాగాయి. మాధవి కోరిక ఫలించి ఇంజనీరింగ్‌లో చేరింది. 2వసం॥లో ఒకసబ్జెక్టు అర్థంకాక అమ్మను, హైమను అడిగింది. అయినా తెలియలేదనుకుంటూ పడుకుంది. నిద్రలేచిన తరువాత అరటిపండు ఒలిచి నోట్లో పెట్టినంత తేలికగా అర్థమయింది. అది అంతా అమ్మ హైమక్కల అనుగ్రహమే అని మాధవి నమ్మకం. ప్రస్తుతం వైజాగ్‌లో జూనియర్ ఇంజనీర్‌గా ఉద్యోగబాధ్యతల నిర్వహిస్తూ అమ్మహైమలను ఎల్లవేళలా స్మరిస్తున్నది మాధవి.

+ + +

ఆర్ శ్రీ రామరాజు గారు జీవితంలో ఎదురైన సమస్యలకు అమ్మ ఏవిధంగా పరిష్కారాన్ని సూచిస్తుందో తెలియచేసారు. "బాధ్యత తెలిసినా, చాలీచాలని జీతంతో జీవితాన్ని గడిపే ఒక సహోపాధ్యాయుని బోధ చూచి, చూచీచూడకుండా సంతకం పెట్టేవారు. ఇప్పటికి ఈ విధంగా చాలా ఖర్చు అయింది. పది నెలలకుపైగా అయింది. ప్రభుత్వ నిబంధనల ప్రకారం పెద్ద మొత్తాలు ఖర్చు పెట్టినప్పుడు వారం తిరగక ముందే లెక్కలు తేల్చాలి కదా!" అని అడిగారు!

అంతే అతను త్రాచుపాములా బుసకొడుతూ "నేనేం తిన్నాననుకున్నారా? నాకలాంటి దొంగబుద్ధులు లేవు పైకి వ్రాసి నిన్నే ఇరికిస్తానని" అన్నాడు. ఇదేమిటి? పుణ్యానికి పోతే పాపం ఎదురైందని అమ్మా నీవే శరణ్యం" అని ప్రార్థించాడు. వారం తిరగక ముందే అతనే కాళ్ళ బేరానికి రావటానికి అమ్మదయే కారణమని అన్నయ్య ఉద్దేశం.

ఈ అగ్ని పరిక్షలో ప్రతి నిమిషం అన్నయ్యను రక్షిస్తున్న ఆప్తమిత్రుడు చాలా విస్మయం చెంది దీని ఆంతర్యమేమిటి? అని అడిగాడు. దానికి "ఉన్నదిలే ఒక అమ్మ, అమ్మలగన్నయమ్మ, తన బిడ్డలను రక్షించుకోవడం ఆమెకు వెన్నతో

పెట్టిన విద్యని" అన్నయ్య చెప్పాడు. "మీకు అంఆ అనే మహామంత్రాన్నిచ్చిన ఆ అమ్మేనా" ఆ వ్యాసాన్ని ప్రచురించిన మాతృశ్రీ పత్రికను ఒక మారిమ్మని" అడిగాడు దాని కోసం ఎంత వెతికినా కనిపించలేదు, సరి చేసేదేమీ లేక పడుకున్నాడు.

అర్ధరాత్రి దాటిన తరువాత కిటకిటమని శబ్దం ప్రారంభమయింది. ఏ ఎలుకో వుండి వుంటుందనుకొని లైటువేసి బట్టల పెట్టంతా ఖాళీ చేసాడు. పక్కనే వున్న ఇంకో పెట్టెలో నుంచి శబ్దం మొదలైయింది. తాళం కూడా వేసిన పెట్టెలోంచి శబ్దం ఏమిటా అని భయపడ్తూ తెరిచాడు. దానిలో పైనే ఆదిశేషువు పవ్వళించిన విధంగా నవంబరు మాసపత్రికపై అమ్మ దరహాసంతో దర్శనమిచ్చింది. అన్నయ్య ఆనందానికి అవధులు లేవు. కిటికీలోంచి చిట్టెలుక ఎక్కిరిస్తూ ఎగిరిమీద పడింది. అమ్మే ఆ రూపంలో వచ్చి పత్రికను కనపరిచిందని అన్నయ్య విశ్వాసం.

అమ్మ దర్శనానికి వెళ్ళినప్పుడు "నాన్నా సప్త సప్తాహం మొదలౌతుంది. ఉగాదికి ముగుస్తుంది. చివరివారం వచ్చి నా దగ్గరే వుండి 1-4-85న నా పుట్టినరోజు వేడుక చూసి వెళ్ళమని" అమ్మ చెప్పింది. అన్నయ్య ఆనందానికి అవధులు లేవు. అమ్మ చెప్పినట్లుగానే జిల్లెళ్ళమూడి వచ్చాడు. అమ్మ దర్శనానికి వెళ్ళటానికి జనసమర్ధం ఎక్కువగా వుండటంతో, తగ్గిన తరువాత వెళ్ళవచ్చని పార్కులో కూర్చుని ఉత్తరాలు రాసుకుంటున్నాడు. ఇంతలో అమ్మ రమ్మంటున్నారన్న పిలుపు వచ్చింది. "నేను ఇక్కడ వున్నట్లు ఎలా తెలసిందని" అడిగాడు. "ఏమో మీరిక్కడ వుంటారని అమ్మ పిల్చుకురమ్మనదని" చెప్పారు.

వెంటనే అమ్మపాదాల చెంతకు వెళ్ళారు. ప్రక్కనే శ్రీ వీరయ్యగారు అవధూత స్థితిలో వాలియున్నారు, అర్ధనిమిలిత నేత్రులై, ఆనందభాష్పాలు రాలుస్తున్నారు. అప్యాయంగా శ్రీరామరాజుగారిని ముద్దాడి "ఒరేయ్ నేను చస్తానురా" అన్నారు. దానికి అమ్మ "నీవు చావవు. నేను చస్తాననేది చస్తుంది"

అన్నది. "నిజంగా చంపేశామ్మా! అది చావడానికే నీ చెంత చేరింది. నీ చలువ వల్ల, చేవదేరి శాశ్వతస్థితిని పొందుతాను" అని మనస్సులో అనుకొని ఆనంద పారవశ్యాన్ని పొందాడు అన్నయ్య.

శ్రీ వీరయ్య గారు అంతటితో ఆగక "వీడు నావాడు" అంటూ అన్నయ్యను తన హృదయానికి హత్తుకున్నారు. "అంతా నీ వారమే" అంటూ అమ్మ చిరునవ్వు నవ్వింది. అమ్మ ఎందుకు అంతనొక్కి చెప్పిందని ఆలోచిస్తే అమ్మ మాటలోని శ్లేష అర్థమైంది. నీ వారము అంటే మన కృషి లేకుండా పండే (వెదురు ధాన్యం) అనే ఇంకొక అర్థముంది. అమ్మను నమ్ముకుంటే శ్రమలేకుండా హృదయక్షేత్రాల్లో జ్ఞానబీజాలు మొలకెత్తి, మోక్షపు పంట పండుతుంది. శ్రీ వీరయ్యగారు "నేను వీడి దగ్గరే వుంటాను" అన్నారు. అమ్మ తన అమృత హస్తంతో హృదయం వైపు చూపిస్తూ "అక్కడా వుంటావు, ఇక్కడా ఉంటావు" అన్నది. అమ్మ పిల్లలందరం అమ్మ హృదయస్థులమే కదా! ఆమె గర్భస్తులమే కదా! శ్రీ వీరయ్యగారు తన్మయస్థితిలో తన కాళ్ళు శ్రీ రామరాజు అన్నయ్య మీద ఉంచారు. అమ్మ తాను కూర్చున్న మంచం వైపు చూపించి "ఆ కాళ్ళు ఇక్కడఉంచు, నేను వత్తుతాను" అన్నది. అందరినీ, వత్తులను చేసి అనురాగపు నూనె పోసి అనుగ్రహ దివ్వెలో జ్ఞానజ్యోతులను వెలిగించటమే గదా అమ్మ అనునిత్యం చేసేపని.

ఆంఆ మహామంత్రంపై అన్నయ్య వ్రాసిన వ్యాసమును చదవమంది అమ్మ. అమ్మ పాదాలకు నమస్కరించి "తన్ను తాను గుర్తించినవాడు. సర్వాన్నీ గుర్తిస్తాడు." అని చదవగానే అమ్మ "దాని పక్కనే తాను ఇతరులను విమర్శించడం అవివేకం, తన్నుతాను విమర్శించుకొనడం వివేకం" అన్న వాక్యాన్ని చేర్చమన్నది. అప్పుడు అన్నయ్యకు నిజంగా వివేకోదయమైంది. "Know that talking ill of others in private is a sin" అనే వివేకానందుని సూక్తి గుర్తు కొచ్చింది. అమ్మ స్వరం ఆగలేదు. అన్నంతో కడుపునింపి

ఆకలితీర్చే అమ్మ నోటి వెంటవచ్చే ప్రతిమాట, మన మనస్సులను విజ్ఞానంతో నింపి, అజ్ఞానాన్ని హరింపచేసే హరివిల్లు. "సర్వం సర్వానికి ఆధారం" అన్నది. అర్థం కాక అన్నయ్య చూస్తుంటే" అది సర్వమూ అయినది. అది సర్వానికీ ఆధారం" అని ఆ సర్వేశ్వరుని కొరకు తపించడమే తపస్సు, అది సర్వవేళలా వుండాలి అన్నది అమ్మ. "మనస్సు నిలవదుగదమ్మా" అన్నాడు అన్నయ్య." తప్పదునాన్నా! సాధనచేసి సాధించాలి. సాధనకు సాధ్యానికి బేధంలేదు. నీకు సాధ్యమైనదే సాధన. సాధ్యమైనది కాబట్టే సాధన చేయగల్గుతున్నాము". అన్నది. అంఆ లోని పూర్ణానుస్వారాన్ని సూచిస్తూ తన నొసట వున్న గుండ్రని బొట్టును చూపించింది. పక్కనే వున్న వీరయ్య గారు "అందులోనే స్పష్టంగా వుందిరా, మఱ్ఱి విత్తనంలో మహావృక్షంవలే" అని ఆ బొట్టులోని కుంకుమను వేలితో తీసికొని వీరయ్యగారు తన ముఖాన పెట్టుకున్నారు.

శ్రీరామరాజు అన్నయ్య "నాకు వైరాగ్యం వైపు మనస్సు పోతున్నదని" చెప్పాలనుకున్నాడు. సర్వాంతర్గతవ్యాపిని అయిన అమ్మకు తెలియంది లేదు కదా! అమ్మే "వైరాగ్యం అంటే అంతా వదిలిపోవడం కాదు, అనురాగం పెంచుకోవడమే. సర్వత్రా అనురాగం కలిగి వుండటమే విరాగమని" తెలియచెప్పింది.

శ్రీపాదగోపాలకృష్ణమూర్తిగారు "భగవంతుడున్నాడని తెలుసుకుండేదెట్లు?" అని అమ్మను అడిగారు. దానికి అమ్మ "భగవంతుడులేడని తెలుసుకోవడమే" అన్నది. శ్రీ పాద వారికి అర్థం కాక తలబాదుకొని "లేనివాడు ఉండటమేమిటి? తేట తెల్లమయ్యేట్లు చెప్పుతల్లీ" అన్నారట. "భగవంతుడని ప్రత్యేకంగా లేడు. అన్నీ అయి ఉన్నాడు." అని అమ్మ చెపితే అమ్మయ్య బ్రతికించావమ్మా" అని ఆనందించారట.

శ్రీ మూల్పూరి సుబ్రమణ్య శాస్త్రులవారు వచ్చి "సంసారం నుంచీ బయటపడేదెట్లు?" అని ఈ గంపెడంత సంసారి అయిన అమ్మను అడిగారట".

సంకల్పమే సంసారం, సంకల్పమే దైవం" అని అమ్మ చెప్పింది, ఈ రెండు వాక్యాలసారం, సంసారం కూడా దైవమే అని తేలిందని శాస్త్రుల వారు ఆనందించారు.

అం,ఆలు బీజాక్షరాలని అన్నయ్య వ్రాసిన దానిని వ్యాఖ్యానిస్తూ "ఏ మంత్రంలోనివైనా బీజాక్షరాలే. మనస్సే మంత్రం. మననం చేత మంత్రమౌతుందని" అమ్మ చెప్పింది. నిజమైన నాస్తికుడు ఆస్తికుడే. అసలైన కమ్యూనిష్టు అద్వైతే. అర్థం చేసుకుంటే ఏవీ వ్యర్థంకాదు. చరాచర జగత్తులో జడమనేదిలేదు. అంతా చెతన్యమే. మనం అనుకునే జడంలో నుంచే చైతన్యం వస్తుంది. పేడలో నుంచీ పురుగులు రావడంలేదా? కాగితంలోంచీ కాగితాల పురుగులు రావడంలేదా? ఇలా ఒకదాని నుంచీ ఇంకొకటి పుడుతుంది. రాయి, రప్పాలో కూడా చైతన్యం ఉంది నాన్నా?" అని విశదీకరించింది అమ్మ.

"పరిస్థితులకు మించిన గురువులేడు" రవి అన్నయ్య ఇంటి ముందు ఉన్న బ్యానర్ చూసావా?" అని అడిగింది అమ్మ. చూచాననగానే నేను నీవైన స్థితి పరిస్థితిగా మారుతుంది. నీవు, నేనూ అని వైకల్యం లేనిదే (రెండు లేనిది) కైవల్యం, గుర్తు చెప్పినవాడే గురువు" అని విపులీకరించిది అమ్మ. వర ప్రదాయిని అయిన అమ్మ సమక్షంలో ఆధ్యాత్మిక గంగా భవాని పొంగి పొరలి వరదయై ప్రవహించింది. అన్నయ్య వెళ్తానని చెప్పటానికి వెళ్తే ఒక భక్తుడు "భగవద్గీతను అమ్మ తత్వపరంగా ఆంగ్లములో రచించాడు. దానిని రేపు వినిపిస్తానని చెప్పాడు. నీవు పక్కనే వుండి నాకు తెలుగులో తర్జుమా చేసి చెప్పమని" అమ్మ ఆదేశించింది.

"వీరయ్య గారికి పూల్మాలు చేయించమని" చెప్పింది. అదే అమ్మ ప్రత్యేకత. ఎవరికి, ఏసమయానికి, ఏమి కావాలో అమ్మకు తెలిసినట్లుగా మరెవ్వరికీ తెలియదు. అక్కడ నుండి లేవబోయే ముందు వీరయ్యగారు అన్నయ్యను "రారా" అని దగ్గరకు లాక్కుని "నీవెంత అదృష్టవంతుడివిరా?" అన్నారు.

అంతమటుకు ఆయన్ని చూడటమేగాని ఎవ్వరో తెలియదు. వారి గురించి రామకృష్ణ అన్నయ్యను అడిగారు. దానికి రామకృష్ణ అన్నయ్య "శ్రీ వీరయ్యగారు జ్ఞాన సంపన్నులు, అమ్మకు సన్నిహితులు" అని చెప్పాడు. అంతటి వారు "నీ వెంత అదృష్టవంతుడివి" అన్నందుకు అన్నయ్య ఆనందానికి అవధులు లేవు. అన్నపూర్ణేశ్వరికి, అన్నయ్య మీద అనుగ్రహం కల్గటం అదృష్టం కాక మరి ఏమిటి?

అంతకు పూర్వం అమ్మను తలచుకుంటూ నిద్రపోయాడు, మధ్యలో మెలకు వచ్చింది. తరువాత నిద్రరాలేదు. మామూలుగా అలాంటి సమయంలో అమ్మ గురించి వ్యాసమో, పద్యమో, పాటో రాసే అలవాటు. కాని ఆ రాత్రి చక్రాకారంలో ఒక చిత్రం తయారైనది, అది చూచిన అన్నయ్యకే చిత్రం అనిపించింది. అది ఎటు చూసినా శ్రీకారం ఉన్నది. దానిని అమ్మకు చూపించాడు. అమ్మ చేతితో తీసుకొని అటూ,ఇటూ చూచి చక్రాల గురించి నాకేమీ తెలియదు అని, ప్రక్కనే వున్న వీరయ్యగారికి చూపించమన్నది.

అన్నయ్య అమ్మతో, "తెలిసినది, తెలియనిది కూడా నీవే గదమ్మా" అన్నాడు. చిఱునవ్వుతో అమ్మ "విద్య అవిద్యా కూడా" అని "చక్రమంటే ప్రపంచం-జగచ్చక్రము. అంతేకాదు మన శరీరము కూడా చక్రమే నాన్నా" అంటూ వ్యాఖ్యానించింది. అమ్మ అంతటితో ఆగక "శరీరం కూడా ఆత్మే నాన్నా!" అన్నది. పక్కనే వున్న రామకృష్ణ అన్నయ్య "శరీరం ఆత్మఎట్లా అవుతుంది?" అని ప్రశ్నించాడు. దానికి అమ్మ, "ఆత్మఏమిటో అర్థమైతే అది కూడా అర్థమవుతుంది" అని అన్నది. శరీరం కూడా ఆత్మేనని సంస్కృత, భాగవతంలో ఉన్న విషయం చెప్పింది. అన్నయ్యకు ఆశ్చర్యం వేసింది. ఈ అమ్మ నేనేమీ చదవలేదంటుంది. భారత భాగవతాదుల్లో ఉన్నాయంటుంది. అమ్మ చదవనవసరం లేదు. అమ్మ కానిదేముంది? అమ్మకు తెలియనిదేముంది? కాని ఎవ్వరే మడిగిన నాకేమీ తెలియదంటుంది. అన్నీ గుర్తించే అమ్మ, మన

ఆకలి కూడా గుర్తిస్తుంది. కడుపులో ఆకలిగా ఉంటే ఆధ్యాత్మికత తల లోనికెక్కదుగదా? అందుకే తన దగ్గరకు వచ్చిన వారందరినీ "భోంచేసారా అంటుంది. లేకపోతే భోంచేసిరండి" అంటుంది.

వెంకట్రావుగారు, వాళ్ళ అబ్బాయి పంపిన కలర్ కెమేరాతో ఫోటోలు తీస్తున్నారు. అమ్మ ఆ కెమేరాను చేతికి తీసుకొని అటూ ఇటూ తిప్పి, ఎదురుగా వున్న అన్నయ్య వాళ్ళవైపు తిప్పి లెన్సుగుండా చూస్తూ క్లిక్ చేసింది. రామకృష్ణ అన్నయ్య "మేమంతా పడ్డామా అమ్మా" అన్నాడు. "పడకుండా ఎక్కడకు పోతారు" అని అమ్మ అన్నది. అవును, అంతా ఆజగన్మాత బుట్టలో, పొట్టలో పడినవారే, పడుతున్నవారే, పడబోయేవారే, శరీరం పోయినా అంతటానిండి వున్న అమ్మ పోయేదెక్కడికి?

మరుసటి రోజు, గీత తత్వాన్ని, అమ్మతత్వాన్ని సమన్వయించి రాసిన రచయిత కన్పించారు. ఇప్పుడు కాదు మరొకమారు వింటామని అమ్మ చెప్పిందిట. ఆ వంకన అన్నయ్యను మరొకరోజు వుంచి ఆధ్యాత్మిక ప్రసంగాలతో కడుపు నింపిన అమ్మ యొక్క అనురాగానికి ఏమిచ్చి ఋణం తీర్చుకోగలడు. వెళ్తానని చెప్పటానికి వెళ్ళినప్పుడు "వుండు నాన్నా?" అనిధోవతులు, ఉత్తరీయం తెప్పించి మెడమీద వేసింది. అప్పుడే ఒకవింత జరిగింది. అంతవరుకూ కూర్చుని ఉన్న అమ్మ పడుకుని "కూర్చుండలేకపోతున్నాను ఓపిక తగ్గిపోయింది. పడుకుంటాను" అని కరుణార్ద్రదృష్టిని ప్రసరిస్తూ అన్నయ్యను సాగనంపింది. ఆమాటలు అన్నయ్యకు ప్రతిరోజూ గుర్తుకు వచ్చేవి. అమ్మ అలా ఎందుకు అన్నది. అసలు ప్రత్యేకించి అన్నయ్యతో చెప్పవలసిన అవసరమేముందని తలుచుకొని మధనపడేవాడు. జూన్ 13 వ తేదీ ఉదయం రేడియోలో అమ్మ అంతకు ముందు రాత్రే భౌతికకాయాన్ని వదిలేసిందన్న పిడుగులాంటి వార్త విన్నప్పుడు ఆ మాటలకు అర్థం తెలిసింది. అమ్మ మన ఎదురుగా ఇక మీదట కూర్చుండలేకపోయినా ఉన్నాను, అని కూర్చుండ లేక ఉన్నాను.

శరీరంతో అవతరించి చేయువలసిన పని అయిపోయింది. కాబట్టి పండుటాకువలే పడవేస్తాను. అని ఓపిక పోయిందంటూ మెల్లగా పడుకోవటంలో తేటతెల్లమైంది. సర్వత్రా వ్యాపించి విశ్వజనని అయిన అమ్మకు మనసారా ప్రణామములర్పించి అమ్మ తెలియచేసిన పంథాలో నడవటం మనవిధి.

అమ్మను దర్శించాలన్న ఆవేదనే ఆరాధనగా తపనే తపస్సుగా మలుచుకోవాలి. అవసరమైనప్పుడు కనిపిస్తానని అమ్మ హామీ ఇచ్చింది కాదా! ఇంక మనకు దిగులెందుకు. అమ్మకు కావాల్సింది ఆడంబరం కాదు. నిర్మలమైన మనస్సుతో ఆరాధించాలి. చేసే ఆరాధనలో వైవిధ్యం వుండవచ్చుగాని వైరుధ్యం వుండకూడదు. మన ఆరాధనలోని ఎగుడు దిగుడులను సరిచూసుకోవాలి. బడుగు మానవుడ్ని అన్న ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సును విడనాడి మనలో సుపీరియారిటీ పల్లంగా వున్న ప్రదేశాన్ని పూడ్చి చదును చేయాలి. అలాగే గొప్పవాడినన్న భ్రాంతి వదిలించుకుని వున్న మెట్ట భాగాన్ని చదును చేసుకోవాలి. నిర్మలమైన మనస్సే భగవంతునికి కేంద్రస్థానమవుతుంది.

క్షణక్షణానికి మన ఆలోచనలు మారుతుంటాయి. ముందు యజ్ఞం చేయాలని అనుకుంటాడు. మానవుడు. మరుక్షణంలో దాని కంటే తపస్సు చేస్తే మంచిదన్న ఆలోచన వస్తుంది. అది కాదు వ్రతం మనకు అందుబాటులోవుంది చేయాలనుకుంటాడు. అదే కాదు యోగం చేద్దామనుకుంటాడు. అది కాదు ఇది అనుకుంటూ కాలం గడిపేస్తాడు. ఏది చేయాలన్నా ముందు యోగము వుండాలి. ఏడురంగులు ఒకే సూర్యకిరణంలో వున్నాయి. అన్ని రంగులూ ఒకే గమ్యాన్ని చేరుస్తాయి. చేసే సాధన విశ్రాంతిగా చేయాలి. దైవశక్తి తట్టుకోవడానికి కావలసిన ఆహారాన్ని స్వీకరించాలి. జ్ఞానమార్గం యోగమార్గం వున్నా రెంటికీ మధ్య వారధి నిర్మించుకోవాలి. మనిషికి మనిషికి నిచ్చెనవుండాలి.

అమ్మ మాట్లాడకపోయినా అమ్మ సన్నిధిలో మనకు ఎన్నెన్నో పాఠాలు అవగతమవుతూనే వుంటాయి. అమ్మ సన్నిధే మనకు పెన్నిధి. అమ్మ సన్నిధిలో వైరాగ్యశిఖరాలనధిరోహిస్తున్నట్లు ఆనందం, సంతృప్తి కలిగేది. ఎన్నెన్నో మనలో మనకే తెలియని సద్భావాలు మనలో చోటు చేసుకునేవి ఇప్పటికీ తలచినంత మాత్రానే ఏవేవో మధురోహాలు మనల్ని ముంచెత్తుతూనే వుంటాయి.

+ + +

డిసెంబరు 30వ తేదీ అర్ధరాత్రి హఠాత్తుగా జిల్లెళ్ళమూడిలోని హైమాలయంపై అందరింటిపై నక్సలైట్లు దాడి, దోపిడీ చేసారు. వారు సుమారుగా 20 మంది మాత్రమే ఉన్నా దాదాపు వందమందిదాకా ఉన్నట్లు వారి వద్ద అసంఖ్యాకంగా మారణాయుధాలు ఉన్నట్లు భ్రమ కల్పించి, భయపెట్టి ఆ ప్రాంగణమంతా స్వేచ్ఛగా వీరవిహారం చేసి, బాంబులు పేల్చి, కారుకూతలు కూసి అందరింటి ప్రశాంత వాతావరణాన్ని కలుషితము, కల్లోలితము చేసి పశువుల కంటే హీనంగా రాక్షసుల కంటే నీచంగా అతి క్రూరంగా అమానుషంగా ప్రవర్తించారు.

నక్సలిజానికి ప్రధాన లక్షణం సాంఘిక దురన్యాయానికి ఆధార భూతమైన వ్యక్తులను రూపుమాపి సమసమాజాన్ని నిర్మించటం. మరి జిల్లెళ్ళమూడిలో సాంఘిక దురన్యాయం ఏం జరుగుతోంది? అక్కడ ఏ రాజకీయ పక్షానికి, ఏ వర్గానికి, ఏ మత ప్రచారానికీ సంబంధంలేని సర్వమత సమ్మతమైన ఆదర్శమైన పవిత్రమైన వాతావరణంలో అందరిల్లు అలరారు తున్నది. పగలతో పట్టుదలలతో అసూయలతో, ద్వేషాలతో అనేక విధాల కుళ్ళిపోయినను సమాజానికి ప్రేమమృతం అందించటానికి భూమిపై అవతరించిన ప్రేమమూర్తి అమ్మ అక్కడ అందరికీ ఆరాధ్యమూర్తి. అమ్మకు వర్గ వర్ణ మత కులాలతోనే కాక గుణంతో కూడా ప్రమేయం లేదు. తల్లికి తప్పుదు కాదు. తప్పే కనిపించదని అసందిగ్ధంగా ప్రకటించింది. అమ్మ దృష్టిలో మంచిచెడుల విచక్షణే లేదు.

పతితులు, పాపులు కూడా అమ్మ ఒడిలో పసిపాపలే. ఎవరిని చూచినా అమ్మకు తన బిడ్డే అనిపిస్తుంది. ఈ నగ్నసత్యాలు ఎవరు పరిశీలించినా అవగతమవుతాయి. మరి నక్సలైట్సుకూడా ఈ దాడికి ముందు అనేక మార్లు అన్నపూర్ణాలయంలో ప్రసాదం స్వీకరించినవారే.

+ + +

ధర్మసూరిని రాచర్ల లక్ష్మీనారాయణ అన్నయ్య కూతురు భగవతిని వివాహం చేసుకోమని అమ్మ సూచించింది. భగవతికి అమ్మ వినా దైవం లేదు. ఎంతసేపు అమ్మ ధ్యాసలో అమ్మని అలంకరించటంలో ఎంతో తృప్తిని అనుభవిస్తుంది. మనసా, వాచా, కర్మణా అమ్మను నమ్మిన వ్యక్తి ధర్మసూరి. హైమాలయంలో అభిషేకాలు, పూజలు, మండల దీక్షలు సల్పిన వ్యక్తి ధర్మసూరి.

"అమ్మ బిడ్డలకు శ్రీ అనసూయేశ్వరాలయం ఒక మామూలు గుడి కాదు. అమ్మ భౌతికంగా కనుమరుగైన తరువాత అమ్మ దర్శనం కావాలనిపించినప్పుడు ముందుగా మనస్సుకు తట్టేది అనసూయేశ్వరాలయం" అని ధర్మసూరి చెప్పింది నిత్యసత్యం.

"శ్రీశైల శిఖర దర్శనం మోక్షాన్ని ప్రసాదిస్తుందని ప్రతీతి. భావనామాత్ర సంతుష్టహృదయ అయిన మన అమ్మని తలుచుకున్నట్లే, అమ్మ ఆలయాన్ని తలుచుకున్న మోక్షసామ్రాజ్యాన్ని చేరుకోగలమనిపిస్తుంది." అంటాడు ధర్మసూరి.

ఆంధ్రదేశంలోని అనేక దేవాలయాలను ధర్మసూరి దర్శించి వచ్చాడు. ర్యాలీ, పట్టిసీమ, ముక్తేశ్వరం, అన్నవరం, సింహాచలం, ద్రాక్షారామం ఎన్నెన్నో దేవాలయాలు. అన్ని దేవాలయాలను చూచి అందరి దేవుళ్ళకు తల్లియైన అందరమ్మ దగ్గరకు వచ్చి కూర్చున్నాడు. అమ్మ నవ్వుతూ "శ్రీ అనసూయేశ్వరాలయం గురించి ప్రస్తావిస్తూ" మన దేవాలయంలోని గర్భగుడి కంటే పెద్దది ఎక్కడైనా చూశావా? అని అడిగింది. దానికి ధర్మసూరి ద్రాక్షారామంలో ఉందేమో" అన్నాడు. క్షణం కూడా ఆలస్యం చేయకుండా

"ఎక్కడా లేదు" అన్నది అమ్మ. బ్రహ్మాండభాండోదరి అయిన అమ్మ గుడిలోని గర్భాలయం అన్ని దేవాలయాల గర్భగుడుల కన్నా పెద్దదిగా వున్నదన్న సంగతి విదితమైనది.

మన సాంప్రదాయం ప్రకారం దేవాలయాల శక్తి, విగ్రహాల క్రింది ఉంచిన యంత్రాల మీద ఆధారపడి వుంటుంది. అమ్మ చాలాసార్లు "శరీరమే శ్రీచక్రం" అన్నది. శ్రీ అనసూయేశ్వరాలయంలోని యంత్రం అమ్మ నాన్నగార్ల భౌతిక శరీరాలే. "శ్రీ చక్రం శివయోశ్వపుః" అని గదాశాక్తేయోపనిషత్సూక్తి? సర్వయంత్రాత్మిక, ప్రజ్ఞానఘనరూపిణి అయిన అమ్మ పార్థివ శరీరం మహాయంత్రమై విరాజిల్లుతున్న ఈ దేవాలయం దేవతలు కూడా శిరస్సు వంచి నమస్కరించే పుణ్యస్థలం. బ్రహ్మరుద్రాదులు ఏశక్తి పాదాలపై వ్రాలి శిరస్సులను వంచి నమస్కరిస్తారో, ఆ ఆదిశక్తి ధరించిన అతి పవిత్రమైన మానవశరీరం మన అమ్మ ఆలయంలోని మహాయంత్రం. ఈ గుడి ప్రపంచంలోని అన్ని ఆధ్యాత్మిక కేంద్రాలకు మూలబిందువు అనటంలో ఆశ్చర్యం లేదు.

రామాలయలెన్నో చూస్తాం. రాముడే పర్యవేక్షణ చేసి కట్టించుకున్న గుడిని మనం చూడలేదు. భౌతికంగా మూలవిరాట్టే స్వయంగా నిలబడి కట్టించుకున్న గుడి శ్రీ అనసూయేశ్వరాలయమే! అందులోని ప్రతిరాయిని అమ్మ స్వయంగా తాకింది. ఆ పునాదుల మీద అమ్మ పడుకుంది. దేవాలయ శిఖరం మీద ప్రతి కళ్యాణదినం మే 5వ తేదీన ఎక్కి అమ్మ గుమ్మడికాయలు, కొబ్బరికాయలు పగలకొట్టేది. పసుపు కుంకుమలు వెదజల్లేది. చెడును నాశనం చేసి మంచిని పంచేది. గర్భాలయంలో అనేక మార్లు ముద్రలతో నిలబడేది. శివరాత్రినాడు జోన్నభట్ల వీరభద్రశాస్త్రిని అడిగి తీర్థం వేయించుకునేది. దేవాసురలందరూ నమస్కరించే అమ్మ కూడా తీర్థం తీసుకున్న ఆ పుణ్యతీర్థ సందర్శనమే అభీష్టసిద్ధికి రాచబాట.

+ + +

అమ్మ మద్రాసు పర్యటనకు వెళ్ళినప్పుడు శ్రీపద్మనాభంగారు, వారి శ్రీమతి రాజ్యలక్ష్మిగారు అమ్మను మొదటిసారి దర్శించుకున్నారు. మొదటి చూపులోనే వారికి ఎనలేని నమ్మకం గురి కుదిరింది. అమ్మను వారింటికి ఆహ్వానించారు. అమ్మ 31-3-1925లో వారింటికి విచ్చేసింది. అది మహాద్భాగ్యంగా భావించారు. సాక్షాత్తూ రాజరాజేశ్వరి వారింటికి విచ్చేయటమనేది పూర్వజన్మసుకృతమే కదా!

అమ్మకు 80 బిందెల నీళ్ళు నాలుగు నూతుల నుంచీ సేకరించారు. 40 మంది దాకా వారింట్లో అమ్మను అభిషేకించుకునే భాగ్యం కలిగింది. అభిషేకించినప్పుడు అమ్మ కంచి కామాక్షి అమ్మవారులా భాసించిందని ఎనలేని ఆనందంతో తెలియచేసారు. మామూలుగా వారింట్లో నాలుగు బిందెల నీళ్ళు పోవటానికి కూడా సరియైన మార్గం లేదు. అటువంటిది 80 బిందెల నీళ్ళు ఎటువంటి ఇబ్బందీ లేకుండా పోవటం అమ్మ యొక్క కృపాకటాక్షమే కారణమంటారు.

మే నెలలో వారంరోజులకు కొడైకెనాల్ వెళ్దామనుకున్నారు. ముందుగా రెండు రోజులకు జిల్లెళ్ళమూడికి వెళ్ళి అటున్నుంచి వెళ్ళాలన్న ఆలోచన మనసులో చోటుచేసుకుంది. అమ్మ దర్శనానికి వెళ్ళినప్పుడు వారికి అమ్మ అన్నం కలిపి పసిపిల్లలకు తినిపించేటట్లుగా ముద్దలు పెట్టింది. అటువంటి భక్ష్యాలు ఎప్పుడూ తిననంత మధురంగా ఉన్నాయి. వారి జన్మధన్యమైనదని భావించారు. మార్చిలో వారింటికి వెళ్ళి స్నానానంతరం కట్టుకున్న చీరెను రెండు నెలల తరువాత రాజ్యలక్ష్మి గారికి ఇచ్చింది అమ్మ. వీరు ముందుగా వస్తున్నట్లు గూడా తెలియచేయలేదు. వారి ఆశ్చర్యానందాలకు అవధులు లేవు. సర్వాంతర్యామి అయిన అమ్మకు తెలియంది ఏముంది?

పద్మనాభంగారు. రాజ్యలక్ష్మిగారు అమ్మను సందర్శించినప్పుడు, ఆమె అమ్మ మీద ఐదు పాటలు తాను స్వయంగా రాసి, తానే స్వర పరిచి అమ్మ

దగ్గర అత్యంతభక్తి భావంతో పాడటం గొప్ప విశేషం. అమ్మ ఆ పాటలు విని ఆనందించిన తీరు మరీ అద్భుతంగా వున్నదనిపించింది.

1977లో ఒంగోలు నుంచీ విశ్వజనని పరిషత్ మాజీ ప్రెసిడెంట్ గారయిన రావినూతల రామచంద్రరావు ప్లీడరుగారు టూరిష్టు బస్సు వేసుకు వచ్చారు. వారంతా అమ్మతో ఫోటోలు తీయుంచుకుంటున్నారు. అమ్మతో మనం కూడా ఫోటో తీయించుకుంటే బాగుండునని మనసుపడ్డారు. కాని దానిని వారు పైకి వ్యక్తం చేయలేదు. ఆ సాయంత్రం అమ్మ దగ్గర వాళ్ళు కూర్చున్నారు. అమ్మ ఫోటో గ్రాఫర్‌ను పిలిపించి వారితో ఫోటో తీయించుకొని వారి కామితము నీ డేర్చిన కామితార్థ ప్రదాయిని అమ్మ. అమ్మ అనురాగానికి, ఆత్మీయతకు అవధులు వుండవుకదా!

రాజ్యలక్ష్మి గారికి అమ్మను దర్శించిన నాటి నుంచీ అమ్మ వినాదైవం లేదు. 24 గం॥లు అమ్మ ధ్యాసలో మనగలగటం ఆవిడ చేసుకున్న అదృష్టమే. ఆవిడ గంధుపు వుండలతో 3 వరసల దండ స్వయంగా తయారు చేసి అమ్మ కోసం తీసుకువచ్చారు. రోజుకు 4,5 గంటలు చొప్పున 3 నెలలు అమ్మ నామం చేస్తూ గంధం సానమీద అరగదీసి వుండలు చేసారు. "ప్రతి సెంటీమీటర్‌లో అమ్మనామం చోటు చేసుకుందని కొన్ని లక్షల జపంతో ఆ దండ పూర్తి అయిందని స్వయంగా చెప్పింది" అమ్మ. ఆమె ఎంత ధన్యురాలో ఇప్పటికి ప్రతి నిమిషం అమ్మ స్మరణతోనే కాలం గడుపుతున్న భాగ్యశాలి. ఆమె పాటలు పాడుతూ తన్మయత్వం చెందుతుంది. తన పాట ఎవరైనా వింటున్నారా లేదా! అన్న వేరే ఆలోచన లేకుండా అమ్మ కోసమే అన్నట్లుగా పాడే తీరు ఆశ్చర్యమనిపించింది.

అమ్మకు స్వయంగా సేవ చేసుకోవాలని డిసెంబరు 31కి అమ్మ దర్శనంకు వెళ్ళారు. ఆఫంక్షన్‌కు చాలా మంది రావడంతో చాలా రద్దీగా వుంది. అంతమందిలో వారికి వీలు అవ్వదని బాధపడ్డారు. ఆ మర్నాడు

"అమ్మ వీళ్ళను పిలుస్తోందని" వసుంధరక్కయ్య చెప్పింది. దంపతులు ఆనందంతో అమ్మ దగ్గరకు వెళ్ళారు. పద్మనాభం గారిని విసరమని, రాజ్యలక్ష్మి గారిని కాళ్ళు పిసకమని వారి కోరికకు తగినట్లుగా అవకాశాన్ని కలుగచేసింది అమ్మ.

1991లో అమ్మకు క్షీరాభిషేకం చేసుకొని తీర్థప్రసాదాలు తీసుకు వెళ్ళారు. ఆయన వెళ్ళే సమయానికి వాళ్ళ అమ్మ గారికి సీరియస్‌గా వుందని ఆసుపత్రిలో చేర్చారు. తీర్థం ఆమె నోట్లో వేసి ప్రసాదం ఇచ్చేటప్పటికి ఆమె తేరుకొని డాక్టర్లనే ఆశ్చర్యపరిచింది. ఆమె కులాసాగానే వుందని ఆక్సిజన్ సిలెండర్, సెలైన్ తీసి ఇంటికి వెళ్ళటానికి అనుమతి ఇచ్చేరు. వాళ్ళ అమ్మగారు పడుకున్నప్పుడు ఆమె తల దగ్గరే అమ్మ ఫోటో వుండటంతో అమ్మే కాచి రక్షించిందని వారి విశ్వాసం.

పద్మనాభంగారు, రాజ్యలక్ష్మిగారు, సుబ్రమణ్యం దంపతులు వారి అమ్మాయి ప్రియంవద అమ్మ దర్శనం చేసుకొని తిరిగి వెళ్తున్నారు. రిజర్వేషన్ లేనందున జనరల్ బోగీలో ఎక్కారు. బిట్రగుంట స్టేషన్ వచ్చేటప్పటికి వారికి చాలా ఆకలి వేసింది. జనరల్ బోగీలో ఆరద్దీలో నుంచి ఇవతలకు వచ్చి ఆహార పొట్లాల కోసం అడిగితే ఇప్పుడే అయిపోయాయని షాపు అతను చెప్పాడు. ఇంతలో లోపల నుంచీ ఎవరో ఐదు ప్యాకెట్లు ఉన్నాయని ఇచ్చారు. వీళ్ళూ సరిగా ఐదుగురే వున్నారు. అన్నపూర్ణేశ్వరి అయిన అమ్మకు బిడ్డలు ఆకలితో వుంటే సహించలేదు కదా! అక్కడ లేకపోయినా ఆ పొట్లాలు అమ్మ సృష్టే అనటానికి ఎటువంటి సంశయం లేదు.

పద్మనాభంగారు జిల్లెళ్ళమూడిలో గురువాయుర్‌లో మాదిరిగా తులాభారం పెట్టించారు. నాన్నగారి ఆరాధనోత్సవంనాడు వారు ధాన్యంతో, వారి అబ్బాయి పటిక బెల్లంతో తూయించుకున్నారు. ఆరోజు మరికొందరు తూయించుకున్నట్లుగా తెలిసింది. అది వున్నట్లుగా కూడా చాలామందికి

తెలియదు. దానిని బయటపెట్టించి వినియోగానికి తీసుకువస్తే అన్నపూర్ణాలయంకు అవసరమైన వస్తువులను ఎవరి మొక్కుబడి ప్రకారం వాళ్ళు తీర్చుకోవటానికి వీలు కలుగుతుంది. సోమేశ్వరరావు గారి భార్య ద్వారా వీరికి పాదుకలను పంపించింది అమ్మ.

నెలగళ్ళ రామచంద్రన్ జనరల్ మేనేజర్ తంజావూరు దగ్గరలో వున్నవూళ్ళో అమ్మ పిక్చర్ వేయించటం జరిగింది. 1995లో అమ్మ సిద్ధి పొందిన 10 సం॥ల తరువాత రాజ్యలక్ష్మి గారికి 10×10 గర్భగుడి కొలతలతో గుడి కట్టించవలసిందిగా అమ్మ చెప్పినట్లు కల వచ్చింది. అంత మటుకూ ఆ ఆలోచనే లేదు. వీరికి మహాబలిపురంకు వెళ్ళేతోవలో కొంతస్థలం వున్నది. దానిలో 15 వేలతో గుడి కట్టమని రాజ్యలక్ష్మిగారు పద్మనాభం గారికి చెప్పారు. ఎవరి దగ్గరైతే స్థలం కొన్నారో ఆయన్ని గుడి కట్టటానికి ఎవరి అనుమతి తీసుకోవాలో అడిగారు. దానికి శ్రీ నరసింహారెడ్డి గారు మెయిన్‌రోడ్‌కు దగ్గరలో 1500 గజాల స్థలం తానే విరాళంగా ఇస్తానని ముందుకు రావటం ముదావహం. ఆయన అమ్మని చూడకపోయినా అమ్మ ఆయనకు ఆ అవకాశం కలిగించింది.

ఆ తరువాతే పద్మనాభంగారు, వెంకటేశ్వర్లుగారు, నరసింహారెడ్డిగారు కలిసి విశ్వజనని జిల్లెళ్ళమూడి అమ్మ సేవా ట్రష్టును ప్రారంభించారు. గుడి నిర్మాణానికి కూడా అమ్మను చూడని వారు, అమ్మ గురించి వినని వారు కూడా ముందుకు రావటం అమ్మ వారికి కల్పించిన సువర్ణావకాశమే.

1997లో పద్మనాభంగారికి బ్రైన్‌హెమరేజి వచ్చి 15 రోజులు ఆసుపత్రిలో వున్నారు. మాట, కాలు పడిపోయింది. ఒక నెలరోజుల తరువాత ముద్దగా మాటరావటం, నాలుగు నెలలకు నడవగల్గటం అమ్మ పరిపూర్ణ కటాక్షమే. పెద్దతనంలో అంత సివియార్‌గా వచ్చినా తిప్పుకోగలగటం కష్టం. వేలల్లో ఏ కొద్దిమందో కోలుకోగలుగుతారు. అమ్మ దయ అపారం. అనుగ్రహప్రదాయిని

అమ్మ కరుణా కటాక్షాలతో ఆయన తిప్పుకొని మామూలు మనిషి అయ్యారు.

విగ్రహానికి శ్రీ కొండా లక్ష్మీనారాయణ గారు 40 వేలరూపాయలు విరాళంగా ఇచ్చారు. అమ్మ గుడి సుందరంగా తయారయింది. దానికి అనుబంధంగా విఘ్నేశ్వరుడు, సుబ్రమణ్యస్వామి, సీతారామలక్ష్మణులు, సత్యనారాయణ స్వామి, లక్ష్మీదేవి, అయ్యప్ప, నవగ్రహాలు ప్రతిష్టించి తిరిపుల్ కాంప్లెక్సులా విరాజిల్లుతోంది. తమిళనాడు ప్రాంతంలో అమ్మ గురించి ఎక్కువ తెలియదు కాబట్టి మిగిలిన దేవతా విగ్రహాలను ప్రతిష్ఠించారు వాటిని దర్శించటానికి వచ్చి అమ్మ గురించి తెలుసుకుంటారని నిర్వాహకుల ఆలోచన ఆమోఘంగా వుంది.

మద్రాసులో అమ్మ గుడి రావటానికి మూలపురుషుడు శ్రీ పద్మనాభంగారు. శ్రీమతి రాజ్యలక్ష్మిగారి ప్రేరణతో అమ్మ ఆలయం కట్టాలన్న సంకల్పం కలిగించింది. అమ్మ ముందుగా అమ్మకు చిన్న ఆలయం నిర్మించాలనుకున్న వారు వారి ఆలోచనలు తారుమారై అమ్మకు విశిష్ట దేవాలయం 4 1/2 అడుగుల అమ్మ విగ్రహం శైవ సాంప్రదాయపద్ధతిలో ఈశ్వర లింగం, నవగ్రహమండపం, వైష్ణవ సాంప్రదాయపద్ధతిగా కృష్ణుడు, ఆంజనేయస్వామి సీతాసమేత రామలక్ష్మణలుచ సత్యనారాయణస్వామి, వెంకటేశ్వరస్వామి, లక్ష్మిదేవి, విఘ్నేశ్వరుడు, సుబ్రమణ్యస్వామి అయ్యప్పస్వామిని నెలకొల్పారు. వీటన్నింటితో టెంపుల్ కాంప్లక్సులా విరాజిల్లుతోంది.

+ + +

పి.వెంకటేశ్వర్లుగారు మద్రాసు నివాసులు. శ్రీ అవధూతేంద్రస్వామివారు మద్రాసు విచ్చేసినప్పుడు "జిల్లెళ్ళమూడి అమ్మ అంటారు కాదా! ఆమె ఎవరు? " అని విచారించారు. దానికి వారు "అమ్మ సాక్షాత్తు రాజరాజేశ్వరి అవతారం" అని తెలియచేసారు. శ్రీ వి.ఎం.మన్నారు చెట్టిగారు అమ్మ ఫొటో ఉన్న కార్డు వెంకటేశ్వర్లు గారికి పంపించారు. "అమ్మ మద్రాసు వస్తోందని, వారింటికి

వస్తే ఏ విధమైన ఏర్పాట్లు చేయాలో వాటి గురించి చర్చించుదామని" వ్రాసారు. అమ్మ ఫొటో వున్న కార్డు చూడగానే "అమ్మ తన సేవచేయటానికి నాకు అవకాశమిస్తోందని" తోచింది. సరిగా ఆ సమయంలో వెంకటేశ్వర్లు గారు చాలా ఆందోళనలో వున్నారు. ఉత్తరం అమ్మ కార్డు వున్నది సరిగా 11 గం॥లకు వచ్చింది. సుమారు 12.30గం॥లకు వారి పని సానుకూలపడినట్లుగా లండన్ నుండీ తంతీ వచ్చింది.

శ్రీ వి.ఎం.మన్నారు చెట్టిగారు ఆహ్వాన సంఘమును ఏర్పాటుచేసి అమ్మ దర్శన మొసగు 7 రోజులు అమ్మకొరకు వచ్చు అమ్మ భక్తులకు భోజన సదుపాయములు చూచే బాధ్యత వెంకటేశ్వర్లు గారికి ఒప్పగించినారు. అమ్మ అనుగ్రహం ఉంటుందన్న ధైర్యంతో కష్టమైన పనియైనా ఒప్పుకున్నారు. వారం రోజులు అందరికీ భోజన సదుపాయములు, ఆఖరిరోజు ఆరువేల మందికి అమ్మ ప్రసాదంగా పులుసు అన్నం, పెరుగన్నం పంచి బెట్టారు. స్వయంగా వీరు అమ్మను ఆహ్వానించకపోయినా, అమ్మే వారింటికి వేంచేసి వారందరినీ ఆశీర్వదించి తన కృపావృష్టిలో వారందరినీ ఓలలాడించింది.

వెంకటేశ్వర్లు గారి చిన్న అబ్బాయికి అమ్మ స్వహస్తముతో ప్రసాదము తినిపించి డాక్టరు అవుతాడని దీవించింది. అమ్మ దివ్యదీవెనతో దిగ్విజయముగా డాక్టరు కోర్సు పూర్తి చేసాడు. అటు పిమ్మట మూడు సంవత్సరములు ప్రాక్టీసు చేసి, అమెరికా వెళ్ళి పి.జి. సర్జరీలో చేసి విజయవంతంగా ప్రాక్టీసు చేయుచున్నాడు.

1975 మే 5వ తేదీ అమ్మ కళ్యాణమునకు మద్రాసు నుండీ 36 మంది స్పెషల్ బస్సు వేసుకువెళ్ళారు. 5వ తేదీ అమ్మ కళ్యాణదినోత్సవమును తిలకించి భోజనాలు అయిన పిమ్మట మద్రాసుకు బయలుదేరుతామని అమ్మకు విన్నవించుకున్నారు. అమ్మ వారిని 6వ తేదీ వెళ్ళటానికి అనుజ్ఞ ఇచ్చింది. 6వ తేదీ వెంకటేశ్వర్లు గారి పెళ్ళిరోజు. అందుకని వారి స్నేహితులు వడలు,

పాయసం, పులిహోర మొ॥గునవి కావాలని అన్నారు. అన్న పూర్ణాలయంలో మనం ఇంతమందికి అవి కోరటం భావ్యం కాదని వెంకటేశ్వర్లుగారు అన్నారు. 6వ తేదీ ఉదయం అమ్మ వారితో 11గం॥లకు భోజనాలు చేసి కొంతసేపు విశ్రాంతి తీసుకొని బయలుదేరమని చెప్పింది. భోజనానికి కూర్చునగా ముందు రోజు సాయంత్రంవారి మిత్రులు కోరినవన్నీ వడ్డన చేయడంతో వారు ఆశ్చర్యచకితులైనారు. అన్నపూర్ణాలయంలో వారిని అడిగితే "మాకు తెలియదు ఇవన్నీ అమ్మే చెప్పి చేయించారని" చెప్పారు. అమ్మ ప్రేమకు ఇంతకంటే నిదర్శనం ఏమికావాలి? వారితో పాటు చీరాలదాకా బస్సులో వెళ్ళివారిని సాగనంపి వచ్చింది.

పద్మనాభం గారితో హైద్రాబాద్ వాళ్ళు గెస్ట్‌హౌస్ కొరకు శంకుస్థాపన చేసారని చెప్పమన్నది అమ్మ. అది విన్న మద్రాసు సోదరులు కూడా గెష్టుహౌస్ కట్టుకుంటామని శంకుస్థాపనకు మంచిరోజు చెప్పమని కోరారు. దానికి అమ్మ అన్ని రోజులు మంచి రోజులేనన్నది. అలా కాదమ్మా! మీరు నిర్ణయించిన రోజే మాకు మంచిరోజు కాబట్టి తేదీ చెప్పమన్నారు. అందుకు అమ్మ ఫిబ్రవరి 5 వతేదీ శంఖుస్థాపన, మే 5వ తేదీ 1985 గెష్టుహౌస్ ప్రారంబోత్సవము అని తన నిర్ణయాన్ని తెలియచేసింది. అది విన్న మద్రాసు సోదరులు అవాక్కయినారు. "90 రోజులలో పని సాధ్యపడుతుందా?" అని అనుకున్నారు. ఏప్రిల్‌లో రామకృష్ణ అన్నయ్యను పిలచి ఆ నెలఖరుకు పనులు అన్నీపూర్తి చేయమని, వారి దగ్గరనుండీ డబ్బుకు ఎదురు చూడవద్దని చెప్పింది అమ్మ. మే 3వ తేదీకి బిల్డింగ్ పూర్తి అయింది. మద్రాసు నుండీ 50 మంది ప్రారంభోత్సవానికి వచ్చారు. అమ్మ అనారోగ్యంతో వుండి కదలలేని పరిస్థితిలో కూడా వారియందలి ప్రేమచే క్రిందకు దిగి వచ్చి ప్రారంభోత్సవం చేసి, స్వయంగా పాలపొంగలి చేసి అందరికీ ప్రసాదం పంచింది.

వెంకటేశ్వర్లు గారి బావమరిది హిమాచలంగారిని టెంపుల్ కాంప్లక్సుకు

మూల స్థంబాలుగా అమ్మ మలుచుకుంది. ఎన్నోనష్టాల కోర్చి మహాబలిపురంకు చెన్నైకు మధ్యన అమ్మ ఆలయ నిర్మాణం కావించుకున్న తీరు అత్యద్భుతం అమోఘం.

ఈ పనులన్నీ చేయటానికి తగిన ఆరోగ్యమును, శక్తిని అమ్మ వెంకటేశ్వర్లు గారికి ఇచ్చింది. అమ్మ 1975లోనే మద్రాసు దక్షిణ జిల్లెళ్ళమూడి అవుతుందని సెలవిచ్చింది. ఆ మాట నిజము చేయుటకు, అన్నపూర్ణాలయం నెలకొల్పుటకు నాందిగా వంటసాలను నిర్మించారు. అమ్మ వారిమీద అపార కరుణావృష్టిని కురిపించింది. అన్నపూర్ణాలయ నిర్వహించుట, అమ్మ మాట సార్థక మగుట నిత్య సత్యం.

+ + +

శ్రీ రామన్ గారు అమ్మ భక్తులు. వారు నాగపూర్‌లో పనిచేసారు. ఆయన కవీశ్వర్‌గారికి అమ్మ గురించి తెలియజేసారు. వారింట్లో జరిగే పూజలకు కవీశ్వర్‌గారిని పిలిచేవారు. ఆ పూజలను వీక్షించిన శ్రీ కవీశ్వర్‌గారికి అమ్మను దర్శించుకోవాలన్న కోరిక ఉదయించింది. వెంటనే జిల్లెళ్ళమూడికి విచ్చేసారు. రిచెర్డు రాసిన 'Mother of All' అన్న పుస్తకాన్ని మరాఠీ భాషలో తర్జుమా చేసి ప్రచురించారు.

శ్రీ రామన్‌గారు నాగపూర్ నుండి కరైకల్ దగ్గర 'Indian Steel Rolling Mills' నెడుంగాడిలో లో శ్రీరామన్ గారు జనరల్ మేనేజర్‌గా ఉన్నారు. ఆ ఫాక్టరీ ఆవరణలో విఘ్నేశ్వరుడు, సుబ్రమణ్యస్వామి, అమ్మ విగ్రహాలను 1988లో ఆగమశాస్త్రపద్ధతిలో ప్రతిష్ఠించి కుంభాభిషేకం జరిపించారు.

నెడుంగాడిలో జరిగిన కుంభాభిషేకానికి శ్రీమతి&శ్రీ పద్మనాభం గారు, వారి తల్లి, శ్రీమతి&శ్రీ వెంకటేశ్వర్లుగారు, హాజరైనారు. శ్రీ రామన్‌గారు స్వర్గస్థులైన తరువాత వారి శ్రీమతి చెన్నై వచ్చేసారు. అటుపిమ్మట 2,3 సంవత్సరాలలో ఆ ఫాక్టరీని ముస్లిమ్స్ కొనుక్కోవటం జరిగింది. ఆ ఫాక్టరీని

పూర్తిగా డిమాలిష్ చేసారు. కానీ అమ్మ ఆలయాన్ని మాత్రం అలాగే వుంచేయటం విశేషం. అక్కడ ఆ కాలనీలోని ఒక అక్కయ్య నిత్యనైవేద్య దీపారాధనలను చేయుచున్నారు.

+ + +

ఫిబ్రవరి 15,16,17 తేదీల్లో శ్రీ అనసూయేశ్వరాలయోత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. 17వ తేదీన స్త్రీ, పురుష విచక్షణ లేకుండా కులమత బేధ రహితంగా అమ్మ అందరికీ గాయత్రీ జపదీక్షను అనుగ్రహించింది. జిల్లెళ్ళమూడిలో జరిగిన గాయత్రీ జపదీక్షా కార్యక్రమమని "ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురించారు. పంచభూతాల సమ్మేళనమే గాయత్రి అని మాతృశ్రీ నిర్వచించారు. జాతి, మత, కుల, వర్గ, వర్ణ బేధాలు లేకుండా వేలాది మందికి నిత్యాన్నదానం చేస్తున్న 'అమ్మ' సాంప్రదాయపు సంకెళ్ళలో బంధింపబడిన గాయత్రికి బంధ విముక్తి కలిగించి, దాని వెలుగును పదిమందికీ పంచుతున్నారని, ఆ ప్రక్రియలో అభివ్యక్తమైన 'అమ్మ' సమానదృష్టిని ఔదార్యాన్ని రామకృష్ణ శ్లాఘించారని" వివరించబడినది.

అమ్మ సామూహిక ఒడుగులు చేస్తుంటే ఒక అన్నయ్య తనకు ఇద్దరూ ఆడపిల్లలేనని మొగపిల్లలు వుంటే అమ్మచేత బ్రహ్మోపదేశం చేయించి ఒడుగుచేయించేవాడినని బాధపడ్డాడు. దీనికి అమ్మ స్త్రీకీ ఆ హక్కు వున్నదని ఆయన ఇద్దరి కూతుర్లకు ఉపదేశం చేసి జంధ్యమును రెండు వరసల గొలుసు మాదిరిగా వారి మెడలో వేసిన అమ్మను చూచి ఆశ్చర్యానందాలు పొందాము. ఇంక ఆ తండ్రి ఆనందం వర్ణనాతీతం. వైజాగ్ నుంచీ వెళ్ళిన భవానీ ప్రసాద్ గారు తనకు గాయత్రీ మంత్ర దీక్ష పుచ్చుకోవాలని వున్నా, ఎన్నడూ పూజలు చేసి ఎరుగను, మడి, దడి తెలియని వాడిని అని అమ్మ సమక్షంలో మనసులో అనుకున్నారు. అందరం కూర్చుని వుంటే ముందుగా అమ్మ ఆయన్ని పిలిచి "నాన్నా గాయత్రీ మంత్రోపదేశం చేస్తాననటంతో నోట మాట రాక వుండిపోయారు.

గాయత్రీయాగాన్ని గురించి మాట్లాడుతూ "పంచభూతాల సమ్మేళనమే "సృష్టియే గాయత్రి "అని గాయత్రి స్వరూపం కానిది ఏమీ లేదు. వినేది, కనేది, సర్వశక్తి గాయత్రి, హోమంలో వేయటానికి కేవలం ఆవునెయ్యే కాదు, ప్రొద్దు తిరుగుడు నూనె, గడ్డి నూనె కూడా పనికి వస్తాయి. గేదెలు గడ్డి తినే కదా! అమృతాన్ని మనకు ఇస్తున్నాయి. నాకు సృష్టిలో ప్రతీదీ కావాలనిపిస్తుంది. బ్రాహ్మలకు కొన్ని హద్దులుంటాయి కదా! ఆగీత దాటాలంటే వారికి భయం" అని తన సర్వాధికారాన్ని వ్యక్తం చేసింది. గాయత్రీ దీక్ష తీసుకోవటానికి గల అర్హతను గురించి మాట్లాడుతూ "ఆర్తి గలవారికే అర్హత అని ఆసక్తి గల వారికే అర్హత" అన్నది. భగవంతుడ్ని సేవించటానికి ఆడ, మగ ఏమిటి? అన్నది. కులమత విచక్షణలను గురించి "మేము వైదీకులం అంటారు. కానీ ఒక్కరికీ వైదీకంరాదు. ఈ రోజుల్లో ఉపనయనాలు ఆడంబరం కోసం చేసుకుంటున్నారు." అన్నది అమ్మ.

విదేశీ సోదరుడు టెర్రీ వచ్చి అమ్మను జపదీక్షను ప్రసాదించమని అడిగిన వెంటనే అమ్మ అతనికి ఉపనయనం చేసి, బ్రహ్మోపదేశం చేసి, బిక్షపెట్టి, దీక్ష ఇచ్చింది. ఆ సన్నివేశాన్ని చూచిన అశేష జనావళికి ఆశ్చర్యానందాలు ముప్పిరిగొన్నవి. కొందరు కరతాళధ్వనులు చేసారు. మరికొందరికి విభ్రాంతి, కొందరికి భయభ్రాంతులు కలిగాయి. కొందరి గుండెకుదుటబడింది. మరికొందరిలో ఆనందతరంగాలు ఉవ్వెత్తున ఎగసిపడినాయి. విశ్వేశ్వరి, విశ్వకుటుంబిని అయిన అమ్మకు మాత్రమే అది సాధ్యం.

గాయత్రీ దీక్ష తీసుకున్న విదేశీ సోదరుడు గాయత్రీ చేయలేదు కాబట్టి కాఫీ ఇప్పుడు తాగను" అన్నాడు అని అమ్మ చెపుతూ సామ్యవాదాన్ని బోధించింది.

గాయత్రీ యాగానికి గాయత్రీ జపదీక్ష తీసుకున్న 400 మందికి పైగా సోదర సోదరీ మణులు కోటి ఇరవై రెండు లక్షల గాయత్రి జపం చేసారు.

లక్ష గాయత్రి యజ్ఞ కుండంలో హోమంలో సమర్పితమైంది. "తెలియనిది తెలియ చెప్పటానికే నా రాక" అన్నది అమ్మ. "పంచభూతాల సమ్మేళనమే సృష్టి. తాను వేరు సృష్టి వేరు కాదు అని, విశ్వచైతన్యంలో తానొక భాగమని మానవుడు గుర్తించటానికే గాయత్రీ దేవతారాధన అవసరమని, ఉపాసనకు బలీయమైన ప్రక్రియ యాగమని" రామకృష్ణ అన్నయ్య తెలియజేసాడు. అందరూ తన బిడ్డకాలేక తన అవయవాలుగా అమ్మ ప్రకటించిన తీరు ఇంత మటుకు చరిత్రలో కనీ వినీ ఎరుగం.

ముముక్ష జనపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ లక్షణయతీంద్రులు గాయత్రీ యాగాన్ని ప్రారంభిస్తూ గానం చేసేవారిని రక్షించేదే గాయత్రీ అని విశ్వవ్యాప్తమైన అమ్మతత్వాన్ని గాయత్రీ మంత్రం ద్వారా ఉపాసించడానికే ఈ యాగమని పేర్కొన్నారు. ఈ యాగం ద్వారా అమ్మలోని విశ్వప్రేమతత్వాన్ని మనం అలవరచుకోవాలని ప్రభోదించారు. పూర్వం గాయత్రీ కొందరి సొత్తుగా ప్రాచీన భారతీయ ధర్మశాస్త్రం కొన్ని నిషేదాలను ఏర్పరచింది. మహాత్ముల సన్నిధిలో కొన్ని సంప్రదాయాలు సంస్కరణను పొందుతాయి. కొత్త వెలుగుల్లో ప్రకాశిస్తాయి. విశ్వకుటుంబిని అయిన అమ్మ "విచక్షణలేని వీక్షణే" తన అనుగ్రహంగా మనపై ప్రసరిస్తోంది. అందుకే ఏ తేడాలు లేకుండా అందరికీ గాయత్రీ జపదీక్షను ప్రసాదించింది. అవతారమూర్తి అయిన అమ్మ ఆదేశాన్ననుసరించి ఏ విభేదాలు లేకుండా అన్ని కులాల వారు, అన్ని మతాల వారు, స్త్రీలు, పురుషులు అందరూ గాయత్రీ యాగంలో పాల్గొని తరించవచ్చుని యతీంద్రులవారు ప్రకటించారు.

గాయత్రీగానంతరం మాతృయాగానికి నాంది పలికింది. మాతృయాగమంటే అందరికీ తిండీ బట్టపెట్టటమే అని అమ్మ చెప్పింది. అక్కడ కూర్చుని వున్న అందరి మనసుల్లో చిరుజల్లులు కురిసాయి. అమ్మకు ఎప్పుడూ మన గురించి, మనతిండి గురించే కదా తపన. మాతృయాగంలో గ్రామంలోని

ప్రజలందరినీ కుల, మత, వర్ణ, వర్గ బేధాలు లేకుండా అందరినీ అందరింటికి ఆహ్వానించింది.

గాయత్రీయాగం కొరకు ఋత్విక్కులకు ఒక యాగగుండం, అమ్మ దగ్గర దీక్ష తీసుకున్న వారికి ఒక గుండం ఏర్పాటు చేసారు. అమ్మ పైనుంచీ ఆ యాగాన్ని చూస్తూ "నాపిల్లలకున్న కళవారికి" లేదంది.

గాయత్రీ యాగానంతరం అమ్మా "నీవు ఏవివక్షతా చూపించక అందరికీ దీక్షనిచ్చి, గాయత్రీ యాగం చేయించటం, అందులో అన్నికులాల, వర్గాల, మతాల వారు పాల్గొనటం" ఎంతో ఆనందంగా వున్నదని అన్నాను. గాయత్రి అందరికీ చెప్పకూడదని శోత్రీయులు అమ్మను విమర్శించటం జరిగింది. ఆ విషయం అమ్మ దగ్గర ప్రస్తావిస్తే "శాస్త్రాలు చెప్పవద్దంటున్నాయని కొన్నింటిని అందరికీ అందుబాటులోకి తేవటం లేదు. ఏ శాస్త్రాల ఆధారంగా చెప్పకూడదంటున్నారో, ఆశాస్త్రాలతోనే ఖండిద్దామని కూర్చున్నాను. కానీ, అక్కడా, అక్కడా విమర్శిస్తున్నారే కానీ నా దగ్గరకు ఎవ్వరూ రాలేదని" అన్నది.

శ్రీశ్రీలక్ష్మణయతీంద్రుల వారు 108 ఉపనిషత్తులలో ఒకటైన 'వజ్రసూచి' ఉపనిషత్తులో కులమత విచక్షణ లేకుండా అందరికీ గాయత్రీ మంత్రార్హత ఉన్నట్లుగా వ్రాయబడిందని శాస్త్రసమ్మతమేనని" తెలిపారు.

"శాస్త్రాలు చాతుర్వర్ణాలకు, వారి వారి పనుల బట్టి వర్ణాశ్రమాలను నిర్ణయించాయి. బ్రాహ్మణులు వారికి విధించిన నిత్యాగ్నిహోత్రాన్ని పాటిస్తున్నారా? ఎంతమంది క్షత్రియులు బలహీనులకు రక్షణ కల్పిస్తున్నారు. వైశ్యుల్ని సరుకుల్ని పంపిణీ చేయమంటే ఎంతమంది సక్రమంగా వ్యాపారం చేస్తున్నారు. ఎంతమంది తమ కులవృత్తులను నిర్వర్తిస్తున్నారని చాతుర్వర్ణాలకు పైన నిలబడి నిర్భీతిగా, నిర్ద్వంద్వంగా ఖండించింది. తాను బ్రాహ్మణ స్త్రీయైనా ఎప్పుడు మన బ్రాహ్మలు అనకపోవటం గమనార్హం. అమ్మ వీటన్నింటికీ అతీతమై తన విశ్వజనీనతను తెలియచేసింది.

వసుంధరక్కయ్య, డాక్టర్ ఇనజ కుమారి, లతిక, బ్రహ్మాండం శేషు, కోన రాజ్యం, రమాదేవి, వనజ ఆవరణలోని స్త్రీలు అంతా కలిసి ఊళ్ళోని స్త్రీలను సాదరంగా ఆహ్వానించి వాళ్ళ పాదాలకు పసుపు, పారాణీలు పెట్టి ముఖాన కుంకుమ దిద్ది, మెడకు గంధం రాసి, చేతులకు గాజులు వేసి, జడలో మల్లెపూలు తురిమి అందరినీ అలంకరించారు. గ్రామంలో అన్ని కులాలు, అన్ని జాతులవారూ ఉన్నారు. హరిజనులు, యాదవులు, బోయలు, ముస్లిమ్స్, పూటకూలీకి వెళితే కానీ రోజు జరగని వాళ్ళు వున్నారు. వసుంధరక్కయ్య, శేషు వాళ్ళ కాళ్ళకు పసుపు రాస్తుంటే వారు మొదట అంగీకరించలేదు. కానీ అది 'అమ్మ ఆదేశం' అని చెప్పి పట్టు బట్టి రాయటంతో గ్రామస్థులకు అంగీకరించక తప్పలేదు.

కుంటుంబపెద్ద పేరు మైకులో చదవగానే అతనితో పాటు వారి కుంటుంబ సభ్యులందర్నీ స్టేజీ మీదకు పిలిచి మొగవారికి ధోవతులు, ఉత్తరీయాలు, స్త్రీలకు చీరె, రెవికల బట్ట, ఆడ పిల్లలకు లంగా, జాకెట్టు మొగ పిల్లలకు నిక్కరు, చొక్కా గుడ్డలు అమ్మ చేతుల మీదుగా స్వయంగా ఇచ్చింది. చంకలో పసిపిల్లలను మర్చిపోతే ఆ పిల్లలకు జాకెట్టు గుడ్డ ఇవ్వండి నేను కుట్టిస్తానని పేరు పేరునా ఇచ్చింది. అట్టి అమ్మను చూచిన నరనారీ జన సందోహాల ఆనందహేల దిక్కుల పిక్కటిల్లింది. ఎవరి మొహాన జూచినా పరమానందం, బ్రహ్మానందమే. వారి ముఖంలో వెలిగిన సంతృప్తి, ఆ ఆనందం దీప్తిని చూడవలిసిందే కాని వర్ణించశక్యం కాదు.

వారికి విందు భోజనం పెట్టించి తాను అక్కడే కుర్చీలో ఆశీనురాలైంది. వడ్డన సరిగా వుండాలని అందర్నీ కనుక్కొని మరీ వడ్డించాలని, మామిడి ముక్కలు కొసిరి కొసిరి అడిగి మరీ వడ్డించమన్నది. కొందరు కొనుక్కొని తినలేరు. అని చెప్తుంటే అమ్మ మాతృవాత్సల్యం కార్తీక పూర్ణిమనాటి వెన్నెల వలె అందర్నీ ఆహ్లాదపరచింది. గ్రామస్థులందరికీ దగ్గర వుండి తాంబూలాలు ఇప్పించింది.

మర్నాడు సాయంత్రం గ్రామంలో వున్న పశువులన్నింటికీ సంగం జాగర్ల మూడి నుంచి ప్రత్యేకించి తెప్పించిన దాణా వాటన్నింటికీ పెట్టించింది. గ్రామంలోని గేదెలు, దున్నలు, ఆవులు, ఎడ్లు, మేకలు, గొఱ్ఱెలు అన్నీ వెయ్యికి పైగా అక్కడ చేరాయి. అదృశ్యం ఎంతో మనోహరంగా వుంది. అమ్మ పశువుల వద్దకు వచ్చి, పశువుల స్వంతదారులందరినీ మీ పశువులు ఎట్లా వున్నాయీ, అని వాని ఆరోగ్యం, వాటి మేత గురించి కనుక్కొన్నది.

పశువుల వద్ద సన్నాయి మేళం పెట్టించమంది. వాటికెందుకమ్మా! సన్నాయి మేళం అన్న వాళ్ళతో మన కంటే సంగీతం అవే ఎక్కువగావిని ఆనందిస్తాయి. "శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసః ఫణిః" అని వినలేదా అని జ్ఞాపకం చేసింది. విందు మనుష్యులకేనా? అన్నింటికీ జరగాలన్నప్పుడు అమ్మ సర్వమాతృత్వం మరోసారి మనకు విదితమైంది. అమ్మ యెడల మన భక్తి భావం మరింత పెరిగింది.

+ + +

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి ఏకైక కుమార్తె గాయత్రి. ఆమె దృష్టిలో అమ్మ సంప్రదాయాలను గుడ్డిగా ఆచరించదు. సంప్రదాయాన్ని విమర్శనాత్మకంగా, ముఖ్యంగా మానవత్వం దృష్టిలో పెట్టుకొని ఆచరింపచేస్తుందని ఆమె అభిప్రాయం. తద్దినం పోయినవాడి కోసం కాదు. ఉన్నవాడి తృప్తికోసం అనే వాక్యం అమ్మ అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తుంది.

వాళ్ళ బామ్మగారికి కొడుకుకి పుత్రులు లేరని కించ. తక్కిన పెద్ద నాన్న గారి పిల్లలతో గాయిత్రిని పోల్చి "ఆడపిల్లవి. నాన్న పేరు నీవేం నిలబడతావు? మొగుడు పంపిస్తే వస్తావు. పరాధీనం బ్రతుకే కదా! అమ్మా నాన్నలను చివరి కాలంలో ఏంచూస్తావు? కొడుకు గొంతులో నీళ్ళు పోస్తాడు. కొమ్ము (చనిపోయినప్పుడు పట్టే పాడె కొమ్ము) పట్టినవాడే కొడుకు. కొరివి పెట్టినవాడే కొడుకు" అని ఎప్పుడూ సాధిస్తుండేది.

ఈ మాటలతో గాయిత్రికి తన తండ్రికి కొడుకులులేని లోటు తీర్చాలన్న ఊహ చిన్నతనంలో మనస్సులో బలంగా నాటుకుంది. శ్రీపాదఅన్నయ్య ఫిజిక్సు ప్రొఫెసర్ అయినా తెలుగు భాషాభిమానం మెండు. వ్యాసరచన ఆయన జీవితంలో ఒక భాగమైపోయింది. ఆయన పేరు నిలబెట్టాలన్న తపనతో గాయత్రి తెలుగు ఎమ్.ఎ. చదివింది. వారింట్లో కాలేజీ చదివిన మొదటి ఆడపిల్ల తానే. మా కుటుంబంలో కూడా మొదటిగా కాలేజీలో చేరిందినేనే. అక్కయ్యకు కుటుంబ బాధ్యతల వల్ల రచనావ్యాసంగానికి ఎక్కువ కాలంకేటాయించ లేకపోయింది. శ్రీ పాద అన్నయ్యకు కూతురు ఒకర్తే కాబట్టి అన్నయ్య వీళ్ళ ఇంటి పక్కనే ఇల్లు కట్టుకొని సెటిల్ అయ్యారు. దానితో ఆమె నాన్నగారితో సాన్నిహిత్యం బాగా పెరిగింది. జిల్లెళ్ళమూడి అమ్మ విమర్శనాత్మక వేదాంతానికి సంతృప్తులైన అన్నయ్య అమ్మకు భక్తులై తన జిజ్ఞాసతో మూఢనమ్మకాలను ఖండించారు. అమ్మ గురించి వ్రాయడమే తపస్సుగా మారి పది సంవత్సరాలు అమ్మ అమ్మ వాక్యాలు, అమ్మ గురించి, అమ్మ చెప్పేది, అమ్మ చూపించే కొత్తదారి మొదలగు గ్రంధాలనెన్నింటినో వెలుగులోకి తెచ్చారు. అమ్మ సన్నిధిలో వసుంధర, మంగ, కుమారి, బాల, సుభాషిణి, గరుడాద్రి మొ॥వారి డైరీల నుంచీ గ్రహించి, సంగ్రహపరిచి అమ్మతో సంభాషణలు మూడు భాగాలుగా వెలువరించి అమ్మ బిడ్డలకు మహోపకారం చేసారు. ఆ సంభాషణలు చదువుతుంటే మనమే ఎదురుగుండా అమ్మతో సంభాషిస్తున్న అనుభూతి కలుగుతుంది. ఇది నా ఒక్కదాని అభిప్రాయమే కాదు! అనేక మంది అమ్మ బిడ్డల అభిప్రాయముకూడా. ఆర్షవిద్యను ఔపోసనం పట్టిన వేదవ్యాసులు, శ్రీ శంకరాచార్యుల కోవలో లెక్కింపదగినవారు శ్రీపాద అన్నయ్య. అమ్మను గురించిన వివరాలను, అమ్మ సూక్తి మౌక్తికములను అన్నయ్య మనకు అందజేయటం మన అదృష్టం.

ఆయన వ్రాసే ప్రతీ వ్యాసానికి గాయత్రి ప్రధమ పాఠకురాలు,

విమర్శకురాలు అర్థంకానిచోట పెన్సిల్ తో గుర్తు పెట్టుకొని ఆయనతో వాదించేది. ఆ విధంగా తండ్రీ కూతుళ్ళ స్నేహితుల మాదిరిగా కలిసిపోయారు. మా నాన్నగారు శ్రీ అన్నంరాజు మాధవరావుగారితో నాకూ అటువంటి సాన్నిహిత్యమే వుండేది. అందుకేనేమో గాయత్రిని చూడకపోయినా నాకు అభిమానమేర్పడిందని పిస్తుంది.

గాయత్రి అమ్మను నాలుగుసార్లు దర్శించింది. ఒకమారు అతిసాధారణంగాను, మరొకసారి ఆత్మీయిరాలిగా అమ్మతో మాట్లాడింది.

గాయత్రి వాళ్ళ మామయ్య మరణించినప్పుడు సోదరుని పరామర్శించటానికి వెళ్ళిన శ్రీపాద అన్నయ్య దారిలో రాజమండ్రిలో దిగి స్వంత ఇంట్లో నిద్రలో మరణించారన్న టెలిగ్రామ్ గాయత్రికి చేరింది. ఏప్రిల్ 2, 1977లో అన్నయ్య రాజమండ్రి నుంచి జిల్లెళ్ళమూడి వెళ్ళాలని అనుకున్నారు. ఆ టెలిగ్రామ్ గాయత్రికి పిడుగుపాటు మాదిరిగా అనిపించింది. కానీ అన్నయ్య కోరిక జిల్లెళ్ళమూడి వెళ్ళాలని కదా! అందుకని అమ్మ పాదాల చెంతకు ఆయన్ని తీసుకువెళ్ళింది.

మంచితనం వారి మరణంలో తెలుస్తుందంటారు పెద్దలు. అదేవిధంగా శ్రీ పాద అన్నయ్య మరణం ద్వారా ఆయిన మంచితనం మరొకమారు లోకానికి విదితమైంది. అర్కపురి విశేషాలు అన్న గ్రంథంలో పోతుకూచి రవికి అంత్యక్రియలు అమ్మే నిర్వహించిన సంగతి జ్ఞాపక మొచ్చింది. అంతలో హైమక్క సిద్ధిపొందిననంతరం అమ్మ అటువంటివి చేయటం లేదన్న సంగతీ గుర్తుకు వచ్చింది.

అప్పుడే వచ్చింది ఆలోచన, అమ్మ ప్రేరణ. "మా నాన్న గారికి నేనే అంతిమ సంస్కారం చేయాలని, నేనే తలకొరివి పెట్టి కొడుకులు లేని లోటు తీర్చాలని", ముందుగానే వాళ్ళ నాన్నగారి శరీరాన్ని హైమాలయంలో పడుకోబెట్టారు. రోగిష్టి తల్లిని, వృద్ధురాలైన అమ్మమ్మనూ నడిపించుకొంటూ

అక్కడికి వచ్చింది. గుండె బరువెక్కి ఏడుపు రాలేదు. తల్లి అధైర్యపడుతుందని లేని గాంభీర్యాన్ని తెచ్చుకుంది.

ఇంతలో అమ్మ పిలుస్తున్నారంటే గాయత్రి, వాళ్ళ ఆయన అమ్మ దగ్గరకు వెళ్ళారు. అమ్మ రెండు చేతులు చాచి గాయత్రిని తన ఒడిలోకి తీసుకుంది. గుండె బరువు తీరేటట్లు భోరున ఏడ్చింది.

సాయంత్రం 5 గం॥ల వరకూ శ్రీపాద అన్నయ్య అన్నదమ్ముల కోసం వేచివుంచారు. రామకృష్ణ అన్నయ్య స్నానంచేసి వచ్చాడు. అమ్మ శ్రీపాద అన్నయ్యకు నీళ్ళు పోసింది. గాయత్రి దోసిలి పట్టి "నన్ను కొడుకును చేసేయండమ్మ నేను మా నాన్నగారికి అంత్యక్రియలు చేస్తాను. మీరు ఇదివరలో చేసారు కదమ్మా! ఈ భిక్ష కోసమే ఇంత దూరం ఆయన పార్థివ శరీరాన్ని, తీసుకువచ్చాను" అని అర్థించింది. "సరే చెయ్యి" అంది అమ్మ. అంతే ఎక్కడలేని ధైర్యం శక్తి వచ్చాయి. అమ్మ ఆజ్ఞ తిరుగులేనిది. పురోహితులు, సనాతనులు ఎవ్వరూ ఏమీ అనలేదు.

రామకృష్ణ అన్నయ్య జంధ్యం మారుస్తూ గాయత్రికి సోదరునిగా నిలచాడు. గాయత్రి వాళ్ళ నాన్న గారి చితికి తన కోరిక ప్రకారం తానే తల కొరివిపెట్టింది. అస్తికలను సంచయనంచేసి ఓంకారనదిలో కలిపింది. ఇదంతా చూచిన ఆమె తల్లి తనకు అలాగే జరపమని కోరింది. వాళ్ళ నాన్న గారు పోయిన రెండేళ్ళకు వాళ్ళ అమ్మ చనిపోయింది. హైద్రాబాద్‌లో వాళ్ళ అమ్మ అంత్యక్రియలు తనే చేసింది. జిల్లెళ్ళమూడి అమ్మ తనకు ఆ అధికారాన్నిచ్చిందని చెప్పటంతో కర్మ చేసే బ్రాహ్మలు, పెద్దలు ఎవ్వరూ అడ్డు చెప్పలేదు. వాళ్ళ పెద్దనాన్నగారు తనకు సోదరులుగా నిలబడి ప్రక్కన చేసారు. బాగా చేశావమ్మా అని మెచ్చుకున్నారు గాయత్రి పెద్దనాన్నగారు.

వాళ్ళది సాంప్రదాయకమైన కుటుంబం. వాళ్ళ అత్త మామలు వాళ్ళింటి

కోడలు ఇటువంటివి చేయరాదని ఆంక్షలు పెట్టలేదు. భర్త కూడా ఎటువంటి అభ్యంతరం చెప్పకుండా తనకు తోడుగా నిలచారు.

"ఎవరు ముందుకు రాకపోయినా నాకేం ఫరవాలేదన్నట్లు మా నాన్న గారికి, అమ్మకు ఏ లోటు లేకుండా జిల్లెళ్ళమూడి అమ్మ దయ వల్ల నిర్విఘ్నంగా నిర్వర్తించానని" తెలియచేసింది.

సొంత అన్నదమ్ములే ప్రాణంలేని కట్టెను తమ ఇంటిముందు వుంచడానికి ఇష్టపడరు. అలాంటిది వాళ్ళ నాన్నగారిని అమ్మ దగ్గరకు తీసుకువెళ్ళవచ్చో లేదో అన్న ఆలోచన కూడా రాలేదు. "ఇంత మాటకు ఎవరూ ఈ విధంగా తీసుకురాలేదు. " మీ నాన్న, నీవు ఏవిధంగా ప్రవర్తించి ఉండాలని ఇష్టపడేవారో ఆ విధంగానే ప్రవర్తించావని" అమ్మ అన్నది.

"ఈ ఆలోచనా, ప్రేరణా, ఆచరణా తనవి కావని, అమ్మే తన మనోవాంఛకు తగినట్లుగా ఉపకరణాన్ని చేసి నడిపించింది" అని గాయత్రి ఉద్దేశం.

జిల్లెళ్ళమూడిలో లెక్చరర్ ఇ.వి.సత్యనారాయణమూర్తిగారు వారణాసి వెళ్ళారు. ఆ సమయంలో వాళ్ళ నాన్న గారు మరణించటం సంభవించింది. సత్యనారాయణగారి తమ్ముడికి అప్పటికప్పుడు ఒడుగు చేసి జంధ్యంవేసి, ఉపదేశం చేసి అతని చేత తండ్రి కర్మకాండను జరిపించింది అమ్మ. అమ్మకు అడ్డేముంటుంది. ఒకప్రక్క సనాతన సంప్రదాయాలను గౌరవిస్తూనే, అందులోని మూఢాచారాలకు అమ్మ తిలోదికాలిచ్చింది.

+ + +

ఢిల్లీ సుభాష్‌నగర్‌లో ఉండే కిషన్ కుమార్ అనే ఆతను ఉద్యోగరీత్యా బాపట్ల వచ్చాడు. అక్కడ టెలిఫోన్ ఆపరేటర్ వెంకటేశ్వర్లుగారి ద్వారా అమ్మను గురించి తెలుసుకున్నాడు. అప్పటి నుంచి అమ్మను చూడాలని మనసు ఉరకలు

వేయసాగింది. ఉద్యోగ బాధ్యత వల్ల వీలు పడలేదు. కానీ ఆయనలో అమ్మను చూడాలన్న ఆకాంక్ష బలంగా నాటుకుంది.

సరిగా ఆ సమయంలోనే ఆయన భార్య ఢిల్లీలో వుంది. ఆమెకు బ్రెస్టు కాన్సర్ అని డాక్టర్లు నిర్ధారించారు. చిన్న పిల్లల్ని కనిపెట్టుకుని చూడటానికి కూడా ఎవరూలేరు. అప్పటికే ఆ సంవత్సరం సెలవంతా వాడేసుకున్నాడు. ఏమీ పాలుపోక వెంకటేశ్వర్లన్నయ్య దగ్గర తన బాధ వెళ్ళగక్కుకున్నాడు. అమ్మ దగ్గరకు వెళ్ళి అమ్మ సలహాను, ఆశీర్వచనం పొందుదామని అన్నాడు.

మర్నాడే జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మకు తన కష్టభారాన్ని నివేదించుకున్నాడు. "డాక్టర్లు ఎలా చెబితే అలా చేయినాన్నా! దైవ నిర్ణయం నీకు అనుకూలంగా ఉంటుంది. తప్పక మేలు జరుగు తుంది. నా ఆశీర్వాదం ఎప్పుడూ నీకు తోడుగా వుంటుంది" అని చెప్పింది అమ్మ.

మర్నాడు ఆఫీసుకి వెళ్ళినప్పుడు పై ఉద్యోగి అన్నయ్యను పిలిచి "నీకేమైనా ఇబ్బందులున్నాయా? అలా వున్నావేమిటి?" అని అడిగారు అప్పటికి అన్నయ్య తన స్నేహితులతో కాని ఇంకెవరితో కూడా తన భార్య అనారోగ్యం గురించి తెలియచేయలేదు. ఆ అధికారికి తాను చెప్పకుండానే ఎలా తెలిసిందా అని విస్తుబోయాడు. "ఆ క్రిందటిరాత్రి పెద్దబొట్టు పెట్టుకున్న ఒకామె కలలోకి వచ్చి చెప్పారని" ఆ అధికారి తనంతట తానే చెప్పిసెలవు దరఖాస్తు పెట్టమన్నారు. హెడ్డాఫీసుకు ఫోన్ చేసి టెంపరరీ డ్యూటీ మీద మూడు నెలలు ఢీల్లీకి పంపవలసిందిగా గట్టిగా చెప్పి స్వయంగా ఏర్పాటు చేశారు. పైగా ఇంకో ఆఫీసర్‌ను ఢిల్లీకి పంపి అక్కడ ఏ అభ్యంతరాలు లేకుండా సాఫీగా పని జరిపించారు. ఢిల్లీ నుంచీ ముంబయి తీసుకుని వెళ్ళి అక్కడ పరీక్షలు చేయించాడు. కాన్సర్ ప్రారంభ దశలోనే ఉందని ఆపరేషన్ అవసరం లేదని చెప్పారు. ఆరు నెలల తరువాత మళ్ళీ చూపించమన్నారు. అప్పటి పరీక్షలో కాన్సర్ చిహ్నాలు లేకుండా సమసిపోయాయి.

మళ్ళీ యధావిధిగా బాపట్లలో తన డ్యూటీలో జాయిన్ అయ్యాడు. ఆరోజుల్లోనే ముంబయి బదిలీ అయినట్టుగా ఆర్డర్సు వచ్చాయి. భార్యకు తగ్గినప్పటి నుంచి అమ్మ అన్నయ్యకు పరదేవతయే అయింది. ఎలాగైనా అమ్మను దర్శించుకు వెళ్ళాలన్నా వ్యవధి తక్కువగా ఉండటం వల్ల ఏమీ చేయటానికి పాలుపోక "అమ్మా! నీ దర్శన భాగ్యం ఎలా దొరుకుతుందమ్మా!" అని ఆర్తి ఆవేదనతో కాలం గడిపాడు. తన దురదృష్టానికి ఎంతగానో వగచాడు.

ఇంతలో అమ్మ బాపట్ల సముద్రపు ఒడ్డుకు వస్తున్నదని టెలిఫోనులో ఒక సందేశం వచ్చింది. అప్పటి నుంచి మనసు ఉరకలు వేయసాగింది, కానీ ఆఫీసు విడిచి వెళ్ళకూడని అతి ప్రధానమైన పనిలో ఇరుక్కుపోయాడు. కొన్ని పండ్లు పూలు తెప్పించి ఒక స్నేహితునికిచ్చి "నా బదులుగా అమ్మ పాదాల మీద ఇవి ఉంచి నా చేతులుగా అనుకుని నీ చేతులతో ఒక్కసారి నమస్కరించమని" చెప్పాడు. కానీ అన్నయ్య మనస్సులో అమ్మ దర్శనాభిలాష అతి తీవ్రంగా అగ్నివలె ప్రజ్వలించ సాగింది. అన్నయ్య మెయిన్ గేటు దాకా డ్యూటీ మీదనే వెళ్ళవలసి వచ్చింది. "ఆశ్చర్యం! ఎవరూ నమ్మరు కారులో స్వయంగా అమ్మే వచ్చి గేటులో సాక్షాత్కరించింది. నా తపన, ఆర్తి, ఆవేదన కనిపెట్టి అమ్మే స్వయంగా నాదగ్గరకు వచ్చిందన్న ఆనందం పెనవేసుకు పోయింది. అమ్మ దర్శన భాగ్యమే లేదనుకున్న నాకు అంత సమీపంలో అమ్మతో వుండ గలిగినందుకు నా జన్మధన్యమైనదని పరవశించాను. నా అంతర్వాణిని విని నన్ను అనుగ్రహించడానికి అమ్మ వచ్చిందని గ్రహించి ఉప్పొంగి పోయాను" అని స్వయంగా తెలియచేసాడు.

+ + +

రాఘవరావు మామయ్య అమ్మ అన్నగారు. బాల్యం నుంచీ విలక్షణమైన వ్యక్తిత్వమే ఆయనది చాలా తెలివి గలవాడు. మంచి పట్టుదలతో ఏ పని ప్రారంభించినా దానిలో అనితర సాధ్యమైన నైపుణ్యం చూపేవాడు. మామయ్య బాగా పాడగలడు, గొప్పనటుడు.

మామయ్య గజ ఈతగాడు. మైళ్ళకొద్దీ దూరం గంటల తరబడి ఈదేవాడు. ఆయన ఎంత చురుకైన వాడో చిన్నతనం నుంచీ అంత అల్లరి చేసేవాడు. తల్లి చనిపోయే నాటికి మామయ్యకు పదేళ్ళు, అమ్మకు నాలుగేళ్ళు. అప్పటికే మామయ్య అల్లరి జనాన్ని ఆశ్చర్యపరిచేది. భయపెట్టేది.

ఆయన మంచి మాటకారి, చమత్కారంగా మాట్లాడేవాడు. వ్యవసాయంలో మంచి ప్రజ్ఞ కలిగి తోటి రైతులలో సాటిలేని వాడనిపించుకున్నాడు. పశువులను మేపడంలో కూడా అసాధారణ ప్రతిభ కనపరచేవాడు. పశువులను ఎంతో ప్రేమగా దయగా చూచేవాడు, మామయ్య మాట్లాడితే అవి అర్థం చేసుకోగలిగేవి. ఒక దూడ నెలలు నిండకుండానే పుట్టింది. అది చనిపోయిందనే అందరూ అనుకున్నారు. తల్లిపాలు తాగే స్థితి కూడా దానికి లేదు. ఆ దూడకు పాలసీసాతో పసిపిల్లలకు వలె పాలుపట్టి పెద్దచేసాడు. మామయ్య తఖిలి వడకటంలో కడునేర్పరి. ముతగ్గా దారం తీయడంలో నాజూగ్గా దారం తీయడంలో, తక్కువ సమయంలో ఎక్కువ దారం తీయడంలో అసమాన ప్రతిభ కలవాడు.

వంశ పారంపర్యంగా వచ్చిన గ్రామ కరణీకం చేసి ఉద్యోగంలో వేలుపెట్టి చూపడానికి వీలులేకుండా ప్రవర్తించాడు. గ్రామంలో అందరికీ తనకు చేతనైనంత సహాయం చేసేవాడు. తన డబ్బు ఖర్చుపెట్టి బీదలకు ఉపకారం చేసేవాడు. జాతీయోద్యమంలో పాల్గొని అరెస్ట్ అయి లాఠీదెబ్బలు తిన్నాడు. మామయ్యకు బంధుప్రీతి ఎక్కువ. జాలి గుండె ఎవరు కష్టంలో ఉన్నా చూడలేకపోయేవాడు.

మామయ్యకు దైవం పైన నమ్మకం లేదు. అమ్మను దేవతగా అందరూ కొలుస్తున్నా, ఆయనకు చాలా కాలం వరకూ విశ్వాసం కలగలేదు. 1958 లో అమ్మ మన్నవ వెళ్ళినపుడు వారింటికి వెళ్ళింది. వాళ్ళు పూజచేసుకునే సమయంలో పూజా కుంకుమ వారి నట్టింట పడింది. ఎంత తుడిచినా అది పోకపోవటంతో మామయ్యకు కొంత ఆలోచన కలిగింది.

మొదటి సంతానం కలిగిన 20 సం॥ల తరువాత ఒక ఆడపిల్ల పుట్టింది. తరువాత ఆ కుంకుమ మాయమైంది. ఆ రెండు సంఘటనలు అమ్మ అనుగ్రహ ఫలితాలే అని వారి నమ్మకం. మామయ్యకు డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారితో పరిచయం కలిగింది. వారితో సంభాషణలు, సంవాదాలు చేసిన ఫలితంగా మామయ్యలో విశ్వాసం పెరిగి పెరిగి మహావట వృక్షం అయింది. క్రమంగా అమ్మను గురించిన సాహిత్యమంతా సావధానంగా అధ్యయనం చేసాడు. అమ్మ ప్రబోధించిన అద్వైత సిద్ధాంతం ఆయనను బాగా ఆకర్షించింది. ఈ లోకానికి జ్ఞానభిక్ష పెట్టడం కోసమే అమ్మ అవతరించింది అన్న విశ్వాసం ఏర్పడింది.

తరచుగా అమ్మను చూచేందుకు మన్నవ నుంచి జిల్లెళ్ళమూడి వచ్చి ఎక్కువ రోజులు అమ్మ సన్నిధిలో ఉండి అనేక వేదాంత విషయాలు జిజ్ఞాసతో అడిగి తెలుసుకునేవాడు. అమ్మను అంతకు ముందు అమ్మాయి అనే పిలిచేవాడు, తరువాత అమ్మగా మార్చుకున్నాడు. అమ్మ ఫోటో ఒకటి మన్నవ తీసుకువెళ్ళి నిత్యం పూజించుకునేవాడు. అంతకు ముందు వారింట పూజచేసే సాంప్రదాయమే లేదు. ఎవరైనా దైవ పూజ చేస్తున్నా, హారతి ఇస్తున్నా మామయ్య ఆగ్రహంతో మండిపడేవాడు.

1980 జనవరి 1వ తేదీన అమ్మకు నమస్కరించి అమ్మ చేత "అంఆ" అని వ్రాయించుకున్నాడు. ఆనాటి నుంచీ దానినే మహామంత్రంగా జపించటం మొదలు పెట్టాడు. క్రమేణా ఆయనకు ఏకాగ్రత సిద్ధించింది. కానీ కోరుకున్నప్పుడు రూపదర్శనం అయ్యేదికాదు. ఆ వరము కావాలని అమ్మను అర్థించాడు. తరువాత ఆయనకు అదీ ప్రాప్తించింది.

ఆయనకు గుండెజబ్బు వచ్చి మన్నవలో ఉన్నప్పుడు అమ్మ దర్శనం పొందగలిగాడు. అదే సమయంలో అమ్మకు ఆరోగ్యం సరిగాలేక హైద్రాబాద్‌లో ఉంది. రాత్రింబవళ్ళు అమ్మను చూడాలని ఆరాటపడేవాడు. అమ్మ హైద్రాబాద్

నుంచి తిరిగి వచ్చిన తరువాత మామయ్య జిల్లెళ్ళమూడి వచ్చి ఎక్కువ కాలం అమ్మ సన్నిధిలో గడిపేవాడు. అమ్మ కూడా ఆయనను అత్యంత ప్రేమతో చూసేది.

డిసెంబర్ 25వ తేదీన అనేక విషయాలు అమ్మతో మాట్లాడాడు. అమ్మను గుర్తించిన తరువాత తనకెంతో హాయిగా ఉందన్నాడు. గతం తలుచుకుంటే మాత్రం బాధగా ఉంటుందన్నాడు. దానికి అమ్మ ''గతాన్ని తలుచుకోవడమెందుకు? ప్రస్తుతానికి హాయిగా ఉందిగా అట్లాగే ఉండు" అన్నది. "నన్ను నీ బిడ్డగా చూసుకో అని అమ్మను అర్థించాడు." "నేను ఎప్పుడూ అట్లాగే చూసుకుంటున్నాను. నీవు ప్రత్యేకించి అడగనవసరం లేదని" అమ్మ చెప్పింది.

"నాకిక్కడే స్థిరపడిపోవాలని ఉన్నది" అని అన్నాడు. అందుకు అమ్మ అంగీకరించింది. డిసెంబర్ 27వ తేదీ ఉదయం అమ్మ వద్దకు వచ్చి చాలా సేపు కూర్చున్నాడు. అమ్మ ఆయనకు పసిపిల్లవాని వలె ఇడ్లీ తినిపించింది. ఆ మధ్యాహ్నం హఠాత్తుగా గుండెజబ్బుతో జిల్లెళ్లమూడిలో సునాయాసంగా అంతిమ శ్వాస వదిలాడు.

+ + +

లోకంలో అప్పుడప్పుడు వింతలు జరుగుతుంటాయి. ప్రకృతి వైపరిత్యాలూ జరుగుతుంటా౹ ు. ప్రళయాలు ప్రభవిస్తుంటాయి. ఫిబ్రవరి 16వ తేదీ తెల్లవారుజామున సుమారు 3 గం॥లకు అటువంటి దుర్ఘటన జిల్లెళ్ళమూడిలో జరిగింది

సర్వసృష్టి స్థితి లయకారిణి, నిత్య సుమంగళి, నిత్యసువాసిని, పతివ్రతా శిరోమణి, పాతివ్రత్య స్వరూపిణి అయిన అమ్మకు పతిదేవులు మన అందరికీ ప్రియతమమైన నాన్నగారు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు అశువులు వీడారు. వైద్యులు చికిత్సా ప్రయత్నం చేసే లోగా సర్వం ముగిసింది. ఒక

మెరుపు మెరిసినట్లు, ఒక పిడుగు పడ్డట్టు అంతా క్షణాల్లో జరిగిపోయింది. గుండెపోటు వచ్చి ప్రాణాన్ని హరించింది.

సర్వశుభంకరి అయిన అమ్మకు ఈ దుర్వార్తనుతెలియజేయటం ఎలా? అమ్మ ఆనారోగ్యం నుంచి పూర్తిగా స్వస్థత పొందలేదు. అమ్మ గుండె కూడా చాలా బలహీనంగా ఉందని వైద్యులు చెప్పారు. అయినా అమ్మకు చెప్పకుండా ఎంతకాలం దాచగలం అయినా అమ్మకి తెలియనిది ఏముంది? గుండెరాయి చేసుకొని దుఃఖాన్ని దిగమ్రింగి అమ్మ పాదాలు పట్టుకుని ఈ హాలాహలాన్ని అమ్మ చెవిలో పోసారు. అమ్మ ఒక లిప్తపాటు నిశ్చేష్ట అయినట్టు కనిపించింది. కానీ వెంటనే నాన్నగారిని పైకి తీసుకురమ్మని ఆదేశించింది. నాన్నగారిని పైకి తీసుకువచ్చి అమ్మ మంచం పక్కనే మంచం వేసి పడుకోబెట్టారు. అమ్మ నాన్నగారి వైపు తిరిగి తన కుడిచేతిని నాన్నగారి గుండెలపై ఉంచింది. అప్పుడు 3.15 ని॥లు అయింది. అప్పటినుండీ మరునాటి ఉదయం 11 గం॥ల వరకు అమ్మ అలాగే పడుకుంది. చూసిన వాళ్ళకు నాన్నగారు నిద్రపోతున్నట్టే ఉన్నది. ముఖం తేజోవంతమై అతి ప్రశాంతంగా ఉన్నది. ప్రాణోత్క్రమణం జరిగిందని డా॥ ఇనజకుమారి ప్రకటించినప్పటికీ దానిని నమ్మటానికి మనస్సంగీకరించలేదు. అమ్మను చూడటానికే మనస్సు ఒప్పటం లేదు. ఇంతమందిని ఇన్ని కష్టాలనుంచీ గట్టెక్కించిన అమ్మకే ఇంత కష్టమా! ఎందరి మంగళ సూత్రాలనో కాపాడిన సర్వమంగళకే అమంగళమా? అపదుద్ధారిణి ఐదవ తనానికే ఆపదా ఎందరి కన్నీటినో తుడిచిన కన్నతల్లియే కన్నీటి కడలిలో మునిగి పోతున్నదా! పరమేశ్వరి అయిన అమ్మ పసుపుకుంకుమలకే లోపమా!

ఇలా జరగడానికి వీల్లేదు. ఈ అగాధం నుండి అమ్మ తనను తానే ఉద్ధరించుకోవాలి. ఈ సందేహ విశ్వాసాల ఉత్తుంగ తరంగాలతో సంక్షోభితమయ్యే కాసారం వలె మనస్సులు కల్లోలితంగా ఉండగానే తెల్లవారింది. అమ్మలో, నాన్నగారిలో కదలిక లేదు. సర్వప్రకృతి స్థంభించినట్లు అంతా

నిశ్శబ్దంగాను, నిర్జీవంగాను ఉంది. ఎవరికీ బుద్ధి పనిచేయడం లేదు. ఎవరిని చూసినా కదలని బొమ్మలవలె కూలబడిపోయారు. బంధువులకు, భక్తులకు అనుబంధము ఉన్నవారందరికీ టెలిఫోన్లుపై ఈ వార్తను అందచేసారు. అమ్మలో ఉలుకు, పలుకు లేదు. అలాగే పడుకున్నది. అంతా చైతన్యమే. జడమే లేదు అనే అమ్మకు నాన్నగారిలో ప్రాణరాహిత్యం ఏమీ కనిపించలేదేమో. జడానికి చైతన్యానికి భేదం చూసే మనలో క్షణ క్షణానికి అసహనం ప్రబలిపోతుంది. దుఃఖం పెరిగిపోతున్నది. అమ్మను చూస్తుంటే ఒక క్షణంలో జాలి కలుగుతున్నది. మరోక్షణంలో కోపం వస్తున్నది. ఏమిటి ఈ అమ్మ తత్త్వం. తన సంగతే తాను తెలుసుకోలేకున్నదా? మనపై రవ్వంత కరుణకూడా లేదా? లేదా మన మొర వినిపించలేదా? మన దుఃఖాగ్ని అమ్మ హృదయాన్ని కరిగించలేకపోతున్నదా?

ఉదయం 10 గంటలయ్యే సరికి ఈ వార్త తెలిసి జనం రావడం మొదలుపెట్టారు. 12 గం॥ చాలా మంది వచ్చారు. ఆవరణమంతా శోకంలో మునిగిపోయింది. అంతా మౌనరోదనమే. ప్రతిగుండె దుఃఖాగ్ని గుండమైపోయింది. అన్నపూర్ణేశ్వరి అయిన అమ్మ సన్నిధిలో జనానికి పస్తులా? అది అమ్మ సహించగలదా? అన్నపూర్ణాలయంలో యధావిధిగా గాడి పొయ్యిమండింది. దుఃఖాగ్నితో మరింతగా మండింది. వంటలయినాయి. గంటలు మ్రోగాయి. అయితే ఎవరికి అన్నం సహిస్తుంది? ఎవరు తింటారు? వేదనాగ్నిని జయించిన జఠరాగ్ని ప్రజ్వరిల్లినవారు అన్నం తిని ఒక మంట అయినా చల్లార్చు కొనగలిగారు.

గ్రామస్థులంతా వారి ప్రియతమ నాయకుని కడసారి చూడడానికి తహతహలాడిపోయారు. అమ్మ నాన్నగారి పక్కనుండీ లేస్తే తలుపులు తీసి అందరికీ నాన్నగారిని చూసే ఏర్పాటు చేయాలనుకున్నారు. సాయంకాలం మూడుగంటలయింది. అమ్మ నాన్నగారు నిర్లిప్తంగా పడుకుని వున్నారు.

ఎవరిలో ప్రాణముందో ఎవరిలో లేదో గూడా తెలీడం లేదు. నాన్నగారి ముఖంలో నిర్జీవకళ లేదు. అమ్మ ముఖంలో దుఃఖోద్విగ్నతా లేదు. ఇద్దరి ముఖాలు అలాగే ఉంచి తలుపు తీసారు.

దేవాలయానికి వెళ్ళి నమస్కారం చేసుకుని వచ్చినట్లు ఒక్కొక్కరూ నమస్కారం చేసుకుని తిరిగి వచ్చారు. అందరిలోనూ విచిత్రంగా ఒక రకమైన నిర్లిప్తత ఆవరించింది. నాన్నగారు ఎక్కడకుపోలేదు. మనతోనే ఉన్నారన్న భావం బలపడటం మొదలైంది. మర్నాడు హైద్రాబాద్, మద్రాస్, విశాఖపట్టణం, గుంటూరు, విజయవాడ, మచిలీపట్నం, నెల్లూరు పలు పట్నాల నుండీ, పల్లెల నుండీ అనేకులు నాన్నగారి అంతిమ సందర్శనం కోసం వచ్చారు.

అమ్మ మాత్రం నాన్నగారిని వదిలి పెట్టలేదు. అమ్మ ఎప్పుడు వదిలిపెట్టింది కనుక ఒకసారి అమ్మ "వారు నన్ను వదిలిపెట్టినా, నేను వారిని వదిలిపెట్టనని"అన్నది. అమ్మ జీవితాన్ని పరిశీలిస్తే అమ్మే నాన్నగారిని ఏరి కోరి పెండ్లి చేసుకున్నది. 1936 మే 5 వ తేదీన నాన్నగారిని పెండ్లి చేసుకున్నది. అమ్మ తన గళంలోని మంగళసూత్రాలను నాన్నగారి పవిత్రపాదాలుగానే సంభావన చేసి నిత్యమూ అభిషేకించేది. ఆ మంగళ సూత్రాలే తనకు అన్ని సూత్రాలనూ అవగతం చేశాయట. అనుదినం ఆ మంగళ సూత్రాలను అభిషేకించిన తీర్థం స్వీకరిస్తుంది. ఆ తీర్థమే అందరికీ తీర్థం వేసే అర్హతను తనకు ప్రసాదించిందని చెప్పేది అమ్మ.

నిత్యజీవితంలో కూడా అమ్మ నాన్నగారిని అంటిపెట్టుకునే ఉన్నది. వెన్నంటే వున్నది. నాన్నగారు ఏదైనా పనిమీద గ్రామాంతరం వెళ్ళినా అదృశ్యంగా నాన్నగారి వెంటే ఉండేదిట. కొన్ని సమయాల్లో అమ్మ కంఠం వినిపించటం కూడా గోచరించింది. అమ్మ నాన్నగారిని అనేక ప్రమాదాల నుండి ప్రాణాపాయ స్థితుల నుండి కూడా కాపాడింది. ప్రమాదం ఒకసారి బస్సు ప్రమాదం నుండి తప్పించింది.

రవి అమ్మ వద్దకు వెళ్ళి ఏంచేయాలని అడిగాడు. అప్పుడు అమ్మ తన సంకల్పాన్ని వివరించింది. "1956లో శంకుస్థాపన జరిగి నిర్మాణం కొంతవరకు అయి, ఆగిపోయిన దేవాలయంలో నాన్నగారిని భూస్థాపనకు అవసరమైన ఏర్పాటు చేయమని" అమ్మ ఆదేశించింది.

నాన్నగారు ఎక్కడికీ వెళ్ళలేదు, వెళ్ళరు, మనతోనే మనమధ్యనే వుంటారని చెప్పటంతో చాలామందికి దుఃఖోపశమనం కలిగింది. "సృష్టిలో సహజమైన పరిణామం జరిగింది. ఎవరూ దుఃఖపడవలసిన పని లేదని" ప్రకటించింది. దానితో అందరి కన్నీళ్ళూ ఎడారిలో వానవలే ఇంకిపోయాయి.

17వ తేదీ ఉదయం 11గంటలకు అమ్మ నాన్నగారి వద్దనుండి లేచి స్నానం చేసి వస్తానన్నది. ఈ లోగా నాన్నగారి భూస్థాపనకు అవసరమైన ఏర్పాట్లను చేయమన్నది. అప్పటికే అవసరమైన ఉప్పు విభూతి తెప్పించి దేవాలయ గర్భంలో అమ్మ చెప్పినట్లుగా వామభాగంలో భూగృహాన్ని నిర్మించారు. మధ్యాహ్నం 12 గం॥లకు అమ్మ హైమాలయ వేదిక పైకి విచ్చేసింది. ఆప్రదేశమంతా షామియానాలతో రంగుకాయితాలతో, మామిడి తోరణాలతో శోభాయమానంగా అలంకరించబడింది. మంగళవాయిధ్యాలు మ్రోగుచున్నాయి. అమ్మ సర్వాభరణ సంశోభితయై దివ్యదీధితులతో వెలుగొందుతోంది. విశాఖపట్టణం సోదరులు అమ్మను పుష్పమాలాంకృతను చేసి లలితా సహస్రనామావళితో పూజించుకుని కొత్తగా ప్రచురించిన శ్రీ మల్లాప్రగడ రంగారావుగారు రచించిన లలితా సహస్రనామ వాఖ్యానమైన భారతీ వ్యాఖ్య అను పుస్తకమును అమ్మకు సమర్పించారు. తన పాదాలు పూజించే సమయంలో అమ్మ తన మంగళ సూత్రాలను ఎడమచేతిలో పెట్టుకుని కుడిచేతితో పూజించింది. ఒక గ్లాసుతో నీళ్ళు తెప్పించి మంగళసూత్రాలను ఆ నీటిలో కడిగి ఆ తీర్థాన్ని తాగింది.

నాన్నగారి పార్థివ దేహాన్ని మంచంపైనే పడుకోబెట్టి తీసికొని వచ్చారు. అమ్మ ఆదేశంతో నాన్నగారిని హైమాలయ గోడకు ఆనించి తూర్పుదిశకు అభిముఖులను చేసి ఆసీనులను చేశారు. ఋత్విక్కులు అభిషేక రుద్రాలు పఠిస్తుండుగా గుమిగూడిన జనం కనులింత చేసుకొని చూశారు. అమ్మ నాన్నగారి తలకు నూనె రాచి శీకాయితో తలరుద్ది క్షీరాభిషేకం చేసింది. తరువాత అందరూ క్షీరనీరాలతో నాన్నగారిని అభిషేకించారు. పిమ్మట అమ్మ నాన్నగారిని మళ్ళీ పంచామృతాలతో అభిషేకించి శుద్ధోదకంతో స్నానం చేయించి నూతన వస్త్రాలు కట్టింది. నాన్నగారి నుదుట శైవ, వైష్ణవ, శాక్తేయ సంప్రదాయాలు ప్రతిఫలించే విధంగా విభూతితో కుంకుమతో అలంకరించింది. నూతన యజ్ఞోపవీతం వేసింది. తాను కట్టుకునే పీతాంబరం కప్పింది. మెడలో పూలమాలలు వేసి దోసిళ్ళతో రంగురంగుల, రకరకాల పూలు నాన్నగారి తలపై కుమ్మరించింది. ఆ దృశ్యం చూస్తుంటే అమ్మ పెండ్లి పీటలపై వుండి నాన్నగారికి తలంబ్రాలు పోస్తున్నట్లే భాసించింది.

అమ్మ నాన్నగారికి అభిషేకం చేస్తుండగా నాసికా రంధ్రాలనుండి ఎర్రని రక్తం స్రవించింది. ఆ రక్తస్రావం చూసిన వారు అమ్మ నాన్నగారికి పునః ప్రాణ ప్రతిష్ఠ చేసినట్లే భావించారు. మధ్యాహ్నం 3 గం॥లకు నాన్నగారి దేహంతో పాటు గర్భాలయ ప్రవేశం చేసింది. ఋత్విక్కులు శ్రీ సూక్త పురుష సూక్తాలూ, పృథ్వీ సూక్తము, లలితా సహస్రనామావళి పఠించారు.

నాన్నగారి దేహం రబ్బరు బొమ్మవలె ఒంగగా పద్మాసనంలో నాన్నగారిని భూగృహంలో కూర్చోబెట్టారు. క్రమేణా లవణ, భస్మరాసులతో నాన్నగారిని అమ్మ ముంచేసింది. తన కాలివేలి, చేతి వేలి ఉంగరాలు, చేతి బంగారు గాజులు, చెవుల దిద్దులు, బులాకీ, చివరకు తాను కట్టుకున్న చీర, రవిక కూడా సమర్పించింది. ఈ కార్యక్రమం జరిగేసరికి 3 గం॥ల 40 ని॥లు అయింది. ఈ విషయం తెలిసిన బిడ్డలందరూ భయాందోళిత మనస్కులైనారు.

అమ్మను అలంకార రహితంగా దర్శించడమెలాగా అని బాధపడ్డారు. కానీ మనందరి అదృష్టం కొద్ది అమ్మ మళ్ళీ సర్వాభరణ భూషితయై, పట్టుచీర కట్టుకుని దరస్మిత వదనంతో బైటికి వచ్చి అందరి హృదయాలలో శాంతి సుధలను నింపింది.

అదొక విచిత్రమైన ఆశక్తికరమైన విషయం ఏమిటంటే తన జన్మ నక్షత్రం పునర్వసులో నాన్నగారు మానవదేహాన్ని వదిలి అమ్మ జన్మ నక్షత్రమైన ఆశ్లేష నక్షత్రంలో అనసూయేశ్వరులై ఆవిర్భవించారు. ఆ ఆలయానికి అమ్మ "అనసూయేశ్వరాలయం" అని నామకరణం చేసింది. ఆ 11 రోజులు ఆలయంలో ఉదయం 11 మంది ఋత్త్విక్కులతో మహన్యాస పూర్వకంగా మహారుద్రాభిషేకమూ, సాయంకాలం లలితా లక్షనామ పూజ చేయటం జరిగింది.

18 వ తేదీ ఉదయం ఆలయంలో నిత్యపూజను అమ్మ స్వయంగా ప్రారంభించి, అఖండ దీపారాధన చేసి అభిషేకాన్ని మొదలు పెట్టింది. సాయంకాలం కూడా పూజలో స్వయంగా పాల్గొని నివేదన, నివాళి తానే యిచ్చింది. ఈ విధంగా అమ్మ పూజ చేయటం అదే మొదటిసారి కావచ్చు.

28 వ తేదీ వరకు ఆలయంలో నిత్యాభిషేకాలు పూజలు, సుబ్బారావు, రవి చేసుకున్నారు. శ్రీ అనపర్తి కృష్ణశర్మ ప్రధాన ఋత్త్విక్కుగా వ్యవహరించి అత్యంత సమర్థంగా క్రతువును నిర్వహించారు. వారికి స్థానిక కళాశాల అధ్యాపకులు, విద్యార్థులు పూర్తిగా సహకరించారు. 28 వ తేదీ గ్రామంలో నాన్నగారి చిత్రపటాన్ని ఊరేగించారు. ఉదయం 5 గం॥ల నుండి 9 గం॥ల వరకూ మహారుద్రాభిషేకం జరిగింది. 9 గం॥ల నుండి సాయంత్రం 7 గం॥ల వరకు లలితాలక నామ పారాయణ జరిగింది. దానిలో మొత్తం 250 మంది పాల్గొన్నారు. నాన్నగారి వయస్సు 68 సంవత్సరాలు. 13 రోజులలోనూ 68 లక్షల లలితా నామ పారాయణ జరగటం విశేషం. ఆ సాయంకాలం

సభ జరిగింది. ప్రధాన కర్త శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రుల వారు అమ్మ నాన్నగారు ఒకేశక్తి అని, ఆ శక్తి లోకంలో నష్టమై, భ్రష్టమై పోతున్న దాంపత్య ధర్మాన్ని పునరుద్ధరించటం కోసం భార్య యెడల భర్త, భర్త యెడల భార్య ఎలా నడుచుకోవాలో లోకానికి చెప్పటం కోసమే దిగివచ్చిందని వివరించారు.

నాన్నగారు ఏ పని చేస్తున్నా అమ్మకు చెప్పి అనుమతి పొందేవారు. ఎక్కడికి వెళుతున్నా అమ్మ చేత బొట్టు పెట్టించుకునేవారు. నాన్నగారికి నిరంతరం అమ్మధ్యాసే. అమ్మ ఆరోగ్యాన్ని గురించి ఆందోళనే. అమ్మ మాటల ప్రకారం "ధ్యాస అంటే ధ్యానము, ఆందోళన అంటే ఆరాధనేగా! అమ్మ నాన్నగారు పరస్పర అవగాహనతో, అనురాగంతో, ఆరాధనతో లోకంలో ఆదర్శ దంపతులైనారు. భర్త అంటే శరీరం కాదు భావన అన్నది అమ్మ. నాన్నగారి స్మరణ ఎప్పుడూ ఉన్నది అమ్మకు. ఒకసారి ఏదో ఆలోచిస్తున్న అమ్మతో "పరధ్యాసగా ఉన్నావమ్మా" అని రామకృష్ణ అన్నయ్య అన్నాడు. "పరధ్యాస కాదు నాన్నా పతిధ్యాస అన్నది అమ్మ". భర్త గురించిన సజీవ భావన, నిరంతర స్మరణ ఉన్న స్త్రీ ఏనాటికీ భర్తృ విహీన కాదని అమ్మ అభిప్రాయం. అందుకే అమ్మ సుమంగళీ చిహ్నాలను వేటినీ విసర్జించలేదు. ఈ విధంగా అమ్మ మహిళా లోకంలో ఒక మహా విప్లవానికి ఒరవడి పెట్టింది.

పూర్వం స్త్రీకి సహగమనం సంప్రదాయం. ఎలాగో స్త్రీ ఆ అగ్నిగుండం నుండి బైట పడింది. స్త్రీకి మరణం కంటే కూడా బాధాకరమైనది మంగళ చిహ్నాలను విసర్జించటం. స్త్రీకి ఆ అవస్థను తప్పించదలచుకుందేమో! ఉత్తమమైన భార్యగా, తల్లిగా ఎలా నడుచుకోవాలో స్త్రీ లోకానికి చాటి చెప్పింది. మహాత్ములు ఏమి చేసినా లోక సంగ్రహార్థమే కదా! అందుకు వారు విమర్శలకు, హింసలకు గురి కావచ్చును.

హైమ విషయంలో "నేనే కన్నాను, నేనే పెంచాను, నేనే చంపాను, నేనే దైవత్వం ఇచ్చాను" అని ప్రకటించిన అమ్మ వాక్యాలే నాన్నగారి విషయంలోనూ స్ఫురణకు వస్తున్నాయి.

నాన్నగారిని ఆధారం చేసుకునే అమ్మ పాతివ్రత్య శిఖరాగ్రం అదిరోహించినప్పటికి అమ్మలోని మాతృత్వముతో, దైవత్వమూర్తులైనారు. నాన్నగారు కన్నీటి ధారలనుండి దివ్య విద్యుత్తును సృష్టించి అఖండ జ్యోతిని వెలిగించింది. శోక సముద్రం నుండి అమృత కలశాన్ని వెలికి తీసింది. వైపరీత్యం నుండి అనంత వైభవానికి శ్రీకారం చుట్టింది. రాలిన పువ్వునుండి ఒక దివ్య ఫలాన్ని రూపొందించింది. ప్రళయం నుంచి నూతన సృష్టిని చేసింది. హాహాకారం నుండి ఓంకారాన్ని వినిపింపచేసింది అమ్మ.

అదే అమ్మ అఖిల లోకానికి అందచేసిన అసాధారణ ప్రాసాదమూ అనితర సాధ్యమైన ప్రసాదమూ "అనసూయేశ్వరాలయం".

తమ బ్రతుకు తాము బ్రతకలేని అనేక విధాల బలహీనులున్నారు. వారికి తోడ్పడండి. అది వారిపై జాలితో చేసే సహాయమని అనుకోక వారిని భగవత్ స్వరూపులుగా భావించి సేవ చేయండి. కనిపించని దేవునిపై మనస్సు నిలవడం లేదనీ, ఏకాగ్రత కుదరడం లేదని బాధపడక మానవరూపంలో కనిపించే దేవుళ్ళను ప్రేమతో ఆరాధించండి. ఆ సేవలో కలిగే తృప్తే ముక్తి. బాధితుల ఎడ కలిగే కరుణారసభరిత హృదయస్పందనమే దైవత్వం. ఎదుటి వానిలో మంచిని చూస్తున్నంత సేపూ నీలో దైవత్వం కలుగుతుంది" అని అమ్మ మనకు సందేశాన్ని ఇచ్చింది.

+ + +

1977 నవంబరు 19వతేదీ కాలం కసిగా తెలుగు ప్రజలను కబళించినరోజు ప్రకృతి పగబట్టి విజృంభించిన రోజు తీరప్రాంతంలోని అన్ని గ్రామాలవలె జిల్లెళ్ళమూడి కూడా ఆ విలయతాండవంతో విలవిలలాడి పోయింది. జిల్లెళ్ళమూడిలోని పూరిళ్ళన్నీ నేలమట్టమయినాయి. అందరింటిలోని పర్ణశాలలన్నీ పతనమయినాయి. కళాశాలపాకలు, అధ్యాపకుల ఇళ్ళు కూలిపోయాయి. వూరిలో వున్న పదిపెంకుటిళ్ళ కప్పులు లేచిపోయాయి. భోజనశాల సిమెంటురేకులు వాయువేగానికి ఎక్కడికో ఎగిరిపోయాయి.

మిగిలిందల్లా అమ్మ నివసించే భవనం, అన్నపూర్ణాలయం అందుకే గ్రామస్థులు, అందరింటి బిడ్డలు, కళాశాల అధ్యాపకులూ, విద్యార్థినీ విద్యార్థులూ అందరూ "అమ్మా! అమ్మా!" అని ఆర్తనాదాలు హాహాకారాలతో కట్టుబట్టలతో, కడబట్టిన ప్రాణాలతో అమ్మ పాదాలనాశ్రయించినట్లుగా అమ్మ నివసించే భవనంలో సర్దుకున్నారు.

బయట వాయువు కాలనాగై బుసలు కొట్టినప్పటికీ, వరుణుడు కాలరుద్రుడై విలయతాండవం చేసినప్పటికీ, కరుణామయి అమ్మసాన్నిధ్యంలో ఆ రాత్రి అందరూ సురక్షితంగా కాలం గడిపారు. తెల్లవారి చూస్తే గ్రామము మరు భూమివలె కళావిహీనమై ఉన్నది. చెట్లన్నీ కూలిపోయాయి. విద్యుత్‌స్తంభాలు మెలికలు తిరిగిపోయాయి. ఆనాడు అమ్మ అన్నపూర్ణాలయంలోనే వంటచేయించి అందరికీ అన్నం పెట్టించింది.

ఏడాది పొడుగునా కడుపు నింపే పంట నీటిపాలైతే ఇళ్ళన్నీ నేలకూలిపోగా గ్రామస్థులు నిర్వాసులై, నిరాశ్రయులై ప్రాణం కడబట్టి ఉండగా మరు నాటి రాత్రి కసితీరనట్లుగా కాలం మరోసారి గర్జించింది. అంబరం చిల్లుపడ్డట్లుగా వర్షం కురిసింది. జిల్లెళ్ళమూడి చుట్టూ ఉన్న వాగులు పొంగిపొర్లాయి. చుట్టూ నీటితో జిల్లెళ్లమూడి ద్వీపమే అయింది. అమ్మ భవనం మినహా అంతా జలమయమే. అందువల్ల ఆభవనమే అందరికీ రక్షణ ఇచ్చింది.

ఆ విపత్సమయంలో ఆపద్బాంధవి అమ్మనేనున్నాను. అని వరద తగ్గే వరకూ అందరికీ ఆశ్రయం కలుగచేసింది. ఆనాడు ఆ భవనమే లేకపోతే ఎన్ని వందల మంది చనిపోయేవారో. 1969లో వచ్చిన వరదలో కూడా ఈ భవనమే వేలాది మందికి ఆశ్రయమయింది. ఆ వారం రోజులు దాదాపు మూడువేలమంది ఆ ఒక్క భవనంలోనే నివాసం. భవనం చుట్టూ వరద. ఆ వరదలో కొట్టుకు వచ్చిన కళేబరాలు, కుళ్ళిపోయిన గడ్డీ గాదము. అక్కడే

సర్వజనులు మలమూత్ర విసర్జన అంతా దుర్వాసన. అసహ్యకర వాతావరణం. ఆ నీళ్ళే త్రాగాలి. ఆ నీళ్ళే స్నానానికి, అవే నీళ్ళు వంటకూ. అమ్మకు తాగటానికి స్నానం చేయటానికీ అవేనీళ్ళు. అందుకని అన్నయ్య వాళ్ళెవరికీ అమ్మ అక్కడ వుండటం ఇష్టంలేకపోయింది. అమ్మ హైద్రాబాద్, కానీ, మద్రాసు నరసాపురం కానీ వెళితే మంచిదని సూచించారు.

"నన్నయితే ఎవరైనా ఆహ్వానిస్తారు. తీసుకువెళ్తారు. సర్వసౌకర్యాలూ చేస్తారు. కానీ ఈ వేలాది జనం మాటేమిటి? వీళ్ళందర్నీ ఎవరు భరిస్తారు? నా చుట్టూ వున్న నా బిడ్డలను వదిలి నా సుఖం నేను చూసుకోనా? అది నా వల్లకాదు. మీ అందరికీ పనికి వచ్చిన నీళ్ళు నాకు పనికిరావా? ఈ పరిస్థితుల్లో నేను లేకపోతే వీళ్ళంతా ఇక్కడ వుండగలరా? నే నుండి ఏదో చేస్తానని కాదు. నా ఉనికే కొంత ఊరట. కొండంత ధైర్యం. కష్టమో సుఖమో మీతో నేను అని తన సర్వసమాన స్థితిని తెలియజేసింది. దానికి నిర్వాహకులు బదులు చెప్పలేక మౌనందాల్చారు.

మనందరితో పాటువుండాలనుకునే, సుఖదుఃఖాల మిళితమైన మానవ జీవితం మీద మమకారంతో అమ్మ దివి నుండి భువికి ఏతెంచింది. ఆ సత్యాన్ని అనేకమార్లు అనేక రీతుల్లో ఉద్ఘాటిచ్చింది. అట్లా కాకపోతే అవతారవ్యక్తులనే వారే వుండరు.

వరద తగ్గినా విద్యుత్ సరఫరా లేనందున అధ్యాపకులు విద్యార్థులూ ఎద్దులబండీ మీద నీళ్ళుతోలటం అమ్మకు భరించరానిది అయింది. బిడ్డల అవస్థలను చూడలేక అమ్మ జిల్లెళ్ళమూడి నుంచీ నెల్లూరుకు వెళ్ళింది. తన మనస్సు మాత్రం జిల్లెళ్ళమూడిలోనే వుంది.

+ + +

చెఱుకూరి శ్రీశైలం బాపట్ల నివాసి. 26 సం॥ల క్రితం అమ్మ దగ్గరకు వచ్చాడు. శేషయ్య గారి ద్వారా రామకృష్ణ అన్నయ్య అమ్మ దగ్గర మేళం

వాయించడానికి శ్రీశైలాన్ని పిలిపించాడు. అక్కడ జరిగే ప్రతి ఫంక్షన్‌లో మేళం అతనే ఈనాటికీ వాయిస్తున్నాడు. జగన్మాత అయిన అమ్మ దగ్గర వాయించగలిగితే తన జన్మధన్యత చెందుతుందన్న విశ్వాసం కలవాడు. తన విద్యకూడా బాగా అభివృద్ధి చెందుతుందన్న నమ్మకంతో ఏ వేడుకైనా తప్పక వచ్చేవాడు.

మొట్టమొదటిసారి అమ్మ అతని వాద్యం వినగానే "శ్రీ శైలం నీ తనువు వున్నంతవరకూ ఇక్కడి ఆస్థానమేళగాడిగా వుండాలని" చెప్పింది. అప్పటి నుంచి అలాగే వున్నారు. అమ్మకు వినిపిస్తున్నప్పుడు తన తనువును మార్చి వాయించేవాడు. అమ్మ తన సంగీతాన్ని వింటున్నదన్న ఉత్సాహంతో అమ్మ దగ్గర ఎంతసేపైనా అలా వాయిస్తూనే వుండేవాడు. "శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసఃపణిః" అన్నట్లుగా అమ్మ తల ఆడిస్తూ ఆనందించే తీరు తన జన్మలో మరువలేనని శ్రీశైలం తెలియజేసాడు. అమ్మనేకాక, అమ్మను చూస్తున్న అందర్నీ ఆనంద సాగరంలో ముంచేసేది. ఇన్నాళ్ళూ జరగటం అమ్మ అనుగ్రహకారణమని అతని ఉద్దేశం.

ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మొగపిల్లలు జీవితంలో సెటిల్ అవ్వడానికి అమ్మదయే కారణమని అతని విశ్వాసం. భార్య మరణించింది. పెద్ద అల్లుడు మతి స్థిమితంలేక ఎటో వెళ్ళిపోయాడు. వారికి ఒక కూతురు. వారిద్దర్నీ పెట్టుకొని అతను శేష జీవితాన్ని గడుపుతున్నాడు. ఏది జరిగినా అమ్మ అనుగ్రహమే అన్న స్థిర చిత్తం కలిగిన స్థితప్రజ్ఞుడు.

అమ్మ దగ్గరకు రావడం వల్లే పెద్దపెద్ద వాళ్ళ దగ్గర తను వాయించగలగటం, వారందరి చేత మన్ననలను పొందగలగుతున్నానని ఎంతో పరవశంతో చెప్పాడు. నాదస్వర కళారాధకుడు, నాదస్వర శిరోమణి, నాదస్వర చక్రవర్తి అన్న బిరుదులతో అతనిని సన్మానించారు. మచిలీపట్నంలో ఘంటసాల స్మారక ఎవార్డును శ్రీశైలంకు బహుకరించారు. పదకొండు సంవత్సరములు

వేణుగోపాలస్వామి దేవస్థాన విద్వాంసుడిగా కొత్త వంగలూరులో ఉన్నప్పుడు ఆ దేవస్థాన ధర్మకర్తలు, గ్రామస్థులు సింహాతలాటం ఇచ్చి గౌరవించారు. బలరామయ్యగారు సత్కరించారు. దేవస్థానంలో వుండమని మరీ మరీ కోరారు. చెఱుకూరి దేవస్థానంలో 11 సం॥లు వాయించారు. అక్కడా ఘనంగా సత్కారం జరిగింది. "అభాసుపాలవుతామేమో" అని అమ్మ దగ్గర అన్నారు "శెభాష్ అంటారు నాన్నా!" అని చెప్పింది.

+ + +

1985 మే నెల ఆరంభం నుంచే అమ్మకు అనారోగ్యం మొదలైంది. మూత్రకోశం దెబ్బతిన్నది. గుండె జబ్బు మదుమేహం, రక్తపోటూ విజృంభించింది. రక్తమంతా ఈశ్వరతత్వమే అని ప్రవచించిన ఈశ్వరిలో రక్తక్షీణత కలిగింది. నాడీ మండలం మొత్తం క్రమక్రమంగా బలహీనపడసాగింది. ఫలితంగా శరీరంలో నీరు చేరడంతో శరీరం నీటి కుండ అయింది.

డా॥ విద్యాసాగర్, డా॥ఇనజకుమారి చికిత్స చేశారు. చాలా పవర్‌ఫుల్ మందులు వాడారు. కానీ ఏవీ పని చేయలేదు. వ్యాధులు కూడా ఎదురు తిరిగాయి. అమ్మ అజేయమైన శక్తి ముందు అంతా ఓడిపోవలసిందే. మెడికల్ సైన్సు కూడా ఓడిపోయింది. ఈ ఘర్షణలో అమ్మ శరీరం అమితమైన బాధకు గురి అయింది. సహన స్వరూపిణి అమ్మ "బాధ భరించలేను, శరీరం తట్టుకోలేకపోయింది. శిథిలమయ్యే శరీరానికి ఎన్నాళ్ళని పోటీ పెట్టమంటారు. సహనం చచ్చిపోయిన తరువాత బతక్కూడదు. అని చమత్కరిస్తూ "నేను వచ్చిన పని అయిపోయింది. ఇంక నన్ను పోనీయండి. మీరంతా నవ్వుతూ నన్ను పంపించండి" అన్నది.

అమ్మ శరీరంలో నీరు బాగా తగ్గింది. పర్యవసానంగా శరీరానికి అవసరమైన లవణాలు, నీరు ఒకటేమిటి? రక్తపోటు బాగా పడిపోయింది.

జూన్ 2వ తేదీ ప్రాణాపాయస్థితి ఏర్పడింది. డాక్టర్లు సెలైన్ ఎక్కించారు. ఆస్థితిలో అమ్మ ఆవరణలోని అనేకులకు అంతిమ సందేశం ఇచ్చింది. చూడటానికి వచ్చిన వారందరికీ నమస్కరించింది. ఆ నమస్కారాలకు గతుక్కుమంటే "మీరందరూ మహానుభావులు, దైవస్వరూపులు. అందుకే అందరికీ వందనాలు" అన్నది.

అమ్మకు సెలైన్ ఇవ్వటానికి ప్రయత్నాలు జరుగుతూంటే వాళ్ళను వారిస్తూ అమ్మ "ప్రయాణానికి సిద్ధంగా వున్న నాకెందుకూ ఈ సెలైన్ అన్నపూర్ణాలయంకు ఇవ్వండి. అన్నపూర్ణాలయ గంట వినిపించలేదని తహతహలాడింది. తాను ఉన్నా లేకపోయినా అన్నపూర్ణాలయం గంటనిత్యం వినిపించాలన్నది. అన్నపూర్ణాలయం తన గుండె అని, ఆ గంటే తన గుండె కొట్టుకోవటమని, అది ఆగిపోతే తన గుండె ఆగిపోతుందని, ఆఘంటానాదంలోనే సర్వవేదసారం ఉన్నదని" చెప్పింది.

అందర్నీ చూడాలని పిలిపించింది. ఆవరణలోని అనేకులు వచ్చి అమ్మ పరిస్థితిని విలపించారు. అమ్మ కూడా కన్నీరు కార్చింది. కలగబోయే వియోగబాధకు బిడ్డలు ఎట్లా తట్టుకుంటూరన్న ఆలోచనే అమ్మ దుఃఖానికి కారణం కావచ్చును.

రాజమండ్రినుంచి డా॥ జస్వంత కుమార్, నెల్లూరు డా॥ శిష్లా సుబ్బారావు గారు వచ్చి అమ్మను పరిక్ష చేసి ప్రమాదం తప్పినట్లు ప్రకటించారు. అంతా ఎంతగానో ఆనందపడ్డారు. జూన్ 3వ తేదీ ఉదయం అమ్మ స్నానం చేసిచీరె కట్టుకొని నుదుట పెద్దబొట్టు పెట్టుకొని మంచంపై కూర్చుని దర్శనమివ్వటం డాక్టర్లకే దిగ్భ్రాంతి కలిగించింది.

11వ తేదీ రాత్రి రామకృష్ణ అన్నయ్యతో అనేక విషయాలు చర్చించింది. "నేను వచ్చిన పని అయిపోయింది. కాబట్టి బ్రతకటం అనవసరం" అని అన్నయ్యతో చెప్పింది. అది విన్న అన్నయ్యకు దుఃఖం కట్టలు తెంచుకు

వచ్చింది. "సంస్థను యధాతథంగా కొనసాగించమని" ఆదేశించింది. ఎప్పటి మాదిరిగా తానే అన్నీ చూచుకుంటానని వాగ్దానం చేసింది. జూన్ 12వ తేదీ ఉదయానికి వ్యాధులు అన్నీ నయమయ్యాయి.

బృందావనం నుంచీ వచ్చిన డా॥ జానకీదేవి అమ్మకు సంపూర్ణ ఆరోగ్యం చేకూరిందని ప్రకటించింది. ఆ మధ్యాహ్నం అమ్మ కొందరికి దర్శనం అనుగ్రహించి స్వయంగా ప్రసాదం ఇచ్చింది.

సాయంకాలం స్నానం చేసి నామసంకీర్తన విన్నది. రాత్రి 8 గం॥కు తాడేపల్లి గూడెం నుంచీ వచ్చిన దంపతులకు దర్శన మొసగి ఆశీర్వదించి "నాకు పని అంటూ వుంటే మీకు కనిపించటమే" అని ప్రకటించిన అమ్మలో తుది శ్వాస వరకూ తన బిడ్డలకు ప్రేమగా దర్శనం ప్రసాదించింది." నన్ను చూడటమే పుణ్యం అన్న అమ్మ ఎంతమందిని పుణ్యాత్ములను చేసిందో!

హఠాత్తుగా శ్వాసలో మార్పు వచ్చింది. ప్రాణవాయువు చాలక బాధపడింది. బాపట్లకు ఆఘమేఘాల మీద కబురువెళ్ళింది. డా॥ ఇనజకుమారి వచ్చి అవసరమైన ఏర్పాట్లను చేసింది. అమ్మ తల రామకృష్ణ అన్నయ్య చేతుల్లోనే ఉంది. డాక్టర్లు, కొడుకులు, కోడళ్ళు వసుంధరక్కయ్య అంతా చూస్తూనే వున్నారు. అమ్మ సునాయాసంగా, అతి ప్రశాంతంగా ప్రాణాలు వదిలింది. "మీ ఇష్టప్రకారం నడుస్తున్నట్లు కనిపిస్తాను కానీ నా ఇష్ట ప్రకారమే మిమ్మల్ని నడుపుకుంటాను" అని ప్రవచించిన అమ్మ తన నిర్ణయాన్ని అమలు పరిచింది. "నేనేం చేసినా మీకోసమే, నేను స్నానం చేసినా, చీరె కట్టుకున్నా మీకోసమే" అని వివరించిన అమ్మ అసువులు విడనాడటం కూడా మనమేలు కోసమేనేమో! మరి అమ్మ అవతరించింది మనకోసం, జీవించింది మనకోసమే అయినప్పుడు ఈ ఉపసంహారం మాత్రం మనకోసం ఎందుకు కాదు. మీ అవసరాలు మీకు తెలియవు. మీ అవసరాలు నాకు తెలుసు అని అమ్మ ఘంటాపథంగా చెప్పింది కదా!

రాత్రి 10.35 ని॥లకు అమ్మ చెప్పినట్లు వైద్య విజ్ఞానం అమ్మ పాదాల మ్రోల అవనతమైపోయింది. అమ్మ తుదిశ్వాస వదిలింది. అందుకు కారణం మాత్రం వైద్యులకు అంతుపట్టలేదు. దివ్య ప్రక్రియ అంతరార్థం, దివ్యప్రణాళిక పరమార్థమూ ఐనప్పటికీ ఆ దివ్యశక్తిని మనం అర్థం చేసుకునేందుకు, ప్రేమను పొందేందుకు, ఉపకరణంగా చేసుకున్న పార్థివ శరీరం కనిపించదని తెలిసేసరికి అంతా నిర్వీర్యులు, నిస్తేజులూ అయ్యారు. ఆవరణలోని వారు, గ్రామస్థులు అంతా అమ్మ నివాసానికి వచ్చారు. వాతావరణమంతా ఉత్తుంగ తరంగిక దుఃఖసాగరమైంది.

ముఖ్యవ్యక్తులకు, పత్రికల వాళ్ళకు, రేడియో వారికి వార్తలు వెళ్ళాయి. అంతకు ముందు ఆరునెలలుగా పనిచేయని ఫోను ఆక్షణాల్లో విచిత్రంగా పనిచేసి అమ్మకు విధేయతను ప్రకటించింది.

ఆ శరీరాన్ని ఏమి చేయాల్సిందీ ముందుగానే అమ్మ తెలయచేసింది. అమ్మ ఆదేశానుసారమే అనసూయేశ్వరాలయంలో లోగడ నాన్న గారిని ప్రతిష్ఠించిన విధంగానే, ఆగర్భాలయంలో అమ్మ కోసం నిర్ణీతమైన స్థలంలో అమ్మను ప్రతిష్ఠించటానికి నిర్ణయమైనది.

అమ్మ 10.35 కు ప్రాణం వదిలితే ఆక్షణం నుంచీ క్షణం. క్షణం ముఖంలో దీప్తి అధికమౌతూ 11.30 అయ్యే సరికి పున్నమినాటి చంద్రబింబంలా భాసించింది అమ్మ ముఖము. ఆ వెలుగు చివరికంటూ వుండిచూచే వారికి ఆశ్చర్యాన్ని ఆనందాన్ని కలిగించింది.

13వ తా॥ ఈ విషాదవార్త దేశమంతా తెలిసింది. అమ్మ బిడ్డలంతా వేలసంఖ్యలో తరలి వచ్చి చివరిసారిగా అమ్మ పార్థివ శరీరాన్ని దర్శించుకున్నారు. ఆరోజంతా అమ్మ సన్నిధిలో లలితా సహస్రనామ పారాయణ, అమ్మ సంకీర్తన జరిగాయి. సుప్రభాత సంధ్యావందనాలు యధావిధిగా జరిగాయి. అన్నపూర్ణాలయ గంట మామూలుగానే మ్రోగింది.

14వ తేది ఉదయం మహాయాత్ర ప్రారంభమైంది. ఆగదిలోనే అమ్మకు స్నానం చేయించి, బిన్నీసిల్కుచీరె, సర్వాభరణాలు అలంకరించారు. గది బయట పడుకోబెడితే ప్రాణంలేనట్లు ఏ మాత్రం లేదు. రోజూ అమ్మ పడుకునే విధంగానే వుండటం ఆశ్చర్యం. అతి ప్రశాంతంగా, దీప్తిమంతంగా వున్నది అమ్మ ముఖం. సుమారు 7 గం॥లకు అమ్మ మంచం బయటకు తీసుకువచ్చి అలంకరించిన బండిపై వుంచారు. గ్రామస్థుల కోరికపై హాహాకారాలతో జయజయ ధ్వానాలతో, మంగళవాద్యాలతో, అమ్మ నామసంకీర్తనతో ఊరేగింపు జరిగింది.

మామూలుగా పూజావేళల్లో కూర్చునే సింహాసనంపై అమ్మను ఆశన చేసి వేయి లీటర్ల పాలతో, అభిషేకం, పుట్టి పూలతో పూజ జరిగాయి. అక్కడికి వేంచేసిన ప్రతి ఒక్కరూ అమ్మను అభిషేకించుకొని, అర్చించుకున్నారు. ఆ సమయంలో అమ్మ విగత జీవిలా అనిపించనే లేదు. అది అమ్మ అన్నంత, శోభతో ఆవరణ మొత్తం కళకళలాడింది.

మధ్యాహ్నం 1.30 లకు అమ్మ అనసూయేశ్వరాలయ ప్రవేశం చేసింది. 1.58 ని॥లకు గర్భాలయంలో ప్రతిష్ఠ జరిగింది. భూగృహంలో సర్వాభరణ భూషిత అయిన అమ్మతో పాటు, అమ్మ స్వయంగా వాడుకునే వస్తువులు, అమ్మ జీవిత చరిత్ర 3 భాగాలు, భారతీయ వ్యాఖ్యా, త్రయీ విద్య గ్రంథాలు నిక్షిప్తం చేయబడ్డాయి. ఆభూగృహాన్ని, ఆచింతామణి గృహాన్ని, లవణం, విభూతి, కుంకుమలతో నింపేటప్పటికి సాయంత్రం అయింది. ఆసనం వేయంచటానికి ప్రతిష్ఠించటానికి అమ్మ శరీరం రబ్బరు బొమ్మవలే సహకరించింది.

ఆ మర్నాటి నుంచీ 11 రోజులు అనసూయేశ్వరాలయంలో అభిషేకాలు, పారాయణలు, లక్షనామార్చనలు అధికంగా జరిగాయి. పూర్ణాహుతి నాటి సాయంకాలం అమ్మ నివాసాన్ని "వాత్సల్యాలయం" గా నామకరణ చేసి అమ్మ ఫోటోలు, వస్తువులు, అందరూ దర్శించేందుకు వీలుగా మార్చబడింది శ్రీశ్రీశ్రీ లక్షణయతీంద్రుల వారు దానిని ప్రారంభించారు.

శ్రీ విశ్వజననీ పరిషత్ యధావిధిగా పనిచేస్తుందని "నేను ఇకముందు కనపడనని ఎవరూ బాధపడవద్దని, అభయమిస్తూ, ఎప్పటిలాగే బిడ్డలందరినీ నేను కనిపెట్టి వుంటానని అమ్మ ఇచ్చిన హామీని సభాముఖంగా తెలియపర్చారు. అప్పటిదాకా పీకలోతు నీటిలో మునిగి ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అయినట్లు ఆ రోజు స్వర్ణోత్సవమొ, వజ్రోత్సవమో అన్నంత శోభతో ఆవరణ మొత్తం కళకళలాడింది.

తలలున్న వారి నీటి నుంచీ బయటకు వచ్చినట్లు కొద్దిగా గాలి పీల్చుకున్నారు. గుండె బరువు తగ్గినట్లయింది. కారుచీకటిలో ఆశాజ్యోతి వెలిగింది. ఇప్పుడు అమ్మ కనపడకపోయినా అంతా తానైన అమ్మ ఎప్పుడూ ఉంది.

"నాన్నగారి పక్కనే నాస్థానం. ఎప్పటికైనా నా నివాసం అనసూయేశ్వరాలయమే" నని స్పష్టీకరించింది. యీ అనంతశక్తి సాగరానికి రేవు, మానవాళికి శాశ్వత తీర్థయాత్రా స్థలం జిల్లెళ్ళమూడి అయింది. సర్వప్రజానీకానికీ అభయప్రదాయనియై, ఆశాజ్యోతియై అనంత దీప్తితో వెలుగొందుతున్నది అనసూయేశ్వరాలయం.

+ + +

మిమ్మల్ని వదిలి నేను మాత్రం ఎక్కడకు పోతానురా?

నేను మీతోనే ఉంటాను, మీకు కనపడకపోవచ్చునుగానీ.

ఎప్పుడులాగే మిమ్మల్ని నేను చూసుకోనూ? బిడ్డల యోగక్షేమాలు చూసుకోవడం తల్లి ధర్మం.

అన్నపూర్ణాలయం, విద్యాలయాలు, వైద్యాలయాలు, దేవాలయాలు అన్నింటినీ యధావిధిగా కొనసాగించండి.

ఎట్లానడపడం? అని భయపడవద్దు. ఇప్పుడు మాత్రం ఇదంతా (ఈ సంస్థను

నడపటం) మీరు చేస్తున్నారా? మీ ద్వారా జరుగుతున్నది. మీరు నిమిత్తమాత్రులు. ఇప్పుడు ఏ శక్తి జరుపుతున్నదో ఒక ముందు కూడా అదే శక్తి జరుపుకుంటుంది.

ఈ సంస్థ ముందు ముందు మహోజ్వలంగా ఉంటుంది. సాధకులకు, యోగులకు, తపస్వులకు ఈ నేల నిలయమవుతుంది. యాత్రికులకు జిల్లెళ్ళమూడి మహాక్షేత్రం అవుతుంది.

నేను కనపడను - అని దుఃఖపడకండి.

అవసరమైనప్పుడల్లా కనిపిస్తాను. (11-6-85) రాత్రి రామకృష్ణ అన్నయ్యతో చెప్పిన మాటలు.

# దేవుడి గెలుపు

శ్రీ కొండముది రామకృష్ణ

అమ్మా !

ఇది నీ దర్శన ఫలమా? ఇది నీ మాటలు బలమా?

మృతి చెందిన నా తనువునకేదో సంజీవని సంస్పర్శ కలిగినట్లున్నది

గతి తప్పిన నామనసునకేదో సంబోధన సంగీతమై వినిపిస్తున్నది

అమ్మా! నిన్ను చాశాకనే... ఇందాకా

ముళ్ళపొదయై ముసిరిన లోకం ముద్దుమల్లెతోటలా మురిపిస్తున్నది

శుష్కమై శూన్యమై నిద్రాణమై నీరసించిన జీవితం

రమణీయమై రసబంధురమై రాగరంజితమై రాజిల్లుతున్నది.

అమ్మా! నీ జీవితం విన్నాకనే.... ఇందాకా

అపార సాగరంవలె అంతులేని ఎడారి వలె భయపెట్టిన సంసారం

అమృత కాసారమై అద్భుత కేదారమై తరగల కరములనెత్తి పిలుస్తున్నది

తరగని పంటలు పండిస్తున్నది.

అమ్మా ! నీ కరుణ కురిశాకనే .... ఇందాకా

మృత్యంగన ఆలింగనమే వాంఛించిన హృదయ తటాకంలో

జీవితేచ్ఛ శతపత్రమై ప్రఫుల్లమై పరిమళాల ప్రసరిస్తున్నది.

అమ్మా ! నీ సందేశం అందుకున్నాకనే ..... ఇందాకా

పద్మవ్యూహంలా తికమక పెట్టిన వేదాంతం

పద్మ సరోవరమై తృప్తిని హాయినీ ప్రసాదిస్తున్నది.

అమ్మా ! నీ ప్రేమను చవిచూశాకనే .... ఇందాకా

ఆకులు రాల్చిన నా మమతాను బంధం ఆనంద రసవృష్టిలో

సంశిక్తమై సంఫుల్లమై సమగ్రమై సుందరమై సుమసంపన్నమై సుధాపూర్ణమై దిగంతాల చుంబిస్తున్నది.
ఇంకిపోయిన రాగ తరంగం వెల్లవలై జగత్తు నంతనూ ముంచెత్తు తున్నది.
క్రుంగిపోయిన నాభావ విహంగం హిమాలయోత్తుంగ శిఖరాగ్రాలపైకి ఎగురుతున్నది.
ఇందాకా
అంతచేదుగా అనిపించిన ఫలతతులే అణువణవూ తీయగామారి ఆనంద పరుస్తున్నాయి.
కఠోరంగా అనిపించిన సంగతులే కలకూజితాల్లై కర్ణపేయమై ఆహ్లాద పరుస్తున్నాయి.
వికారమై కందోయి కలతపెట్టిన విషయాలే
విమలమై సుందరమై నేత్ర పర్వమౌతున్నాయి
అమ్మా ! నీపాదాలు స్పృశించాకనే .... ఇందాకా
దానవులుగా కనులెర్ర చేసిన మానవులు దయాపూర్ణ దేవతలై దీపిస్తున్నారు, దీవిస్తున్నారు.
అమ్మా ! నీసన్నిధి చేరాకనే ..... ఇందాకా
దేవులాడినా దొరకక ఎక్కడో దాగిన పరమాత్మ
పరమాప్తుడై సన్నిహితుడై హితుడై ఆత్మబంధువై అనురాగ సింధువైపోయాడు.
అమ్మా ! ఇది నా దర్శన ఫలమా?
ఇది నీ మాటల బలమా?
ఇది నా జీవితంలో అణుమాత్రమూ ఆశించని మలపు
ఇది ఏదో లోకం నుండి అవనీస్థలి జారిన ప్రేముడి పిలుపు
ఇది అహంకరించిన మానవునిపై అనురాగాంబుధి అయిన దేవుని గెలుపు

* * *